# చివరకు మిగిలేది

గ్రూప్ II
మొదలగు
పోటీ పరీక్షలకు
ఎంపికైన నవల

## బుచ్చిబాబు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

CHIVARAKU MIGILEDI – *by: Butchibabu*

ప్రచురణ నెం. : 2331 ప్రథమ ముద్రణ : 1952

ప్రతులు : 1000

వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ : జనవరి, 2000

" ద్వితీయ ముద్రణ : అక్టోబరు, 2001

" తృతీయ ముద్రణ : సెప్టెంబర్, 2002



ముఖచిత్రం : చంద్ర

లోపలి బుచ్చిబాబు చిత్రం : బాపు

వెల: రూ.70-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, (సుల్తాన్‌బజార్, అబిడ్స్),
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

Printed at Visalaandhra Press, Hyderabad

# సమర్పణ

## (ప్రథమ ముద్రణకు రచయిత ఉపోద్ఘాతం)

ఈ నవల 1942 లో తలపెట్టినా, రచన 1946 లో 'నవోదయ'లో సీరియల్‌గా ప్రారంభమై పదహారు మాసాల తరువాత పూర్తయింది.

నవల ముగియగానే శ్రీ పిలకా గణపతి శాస్త్రి, శ్రీమతి అచంట శారదాదేవి 'నవోదయ'లో విపులంగా, లోతుగా పరిశీలిస్తూ, విమర్శలు ప్రచురించారు, వారికి నా కృతజ్ఞత.

పాశ్చాత్య దేశాలలో నవల జీవితం మూడు మాసాలుట. మన దేశంలో మూడు సంవత్సరాలనుకున్నా, యీ నవల మరుగునపడి నాలుగేండ్లు కావస్తోంది. 'దేశికవితా మండలి' వారి సాహసంవల్ల ఈ నాటికి పుస్తకరూపంగా వెలువడుతోందని విని, కొందరు స్నేహితులు ఇందుల్లో విశేషమేమిటని ప్రశ్నించారు. నిజంగా నాకు ఏం సమాధానం చెప్పాలో తెలీదు. ఈ ప్రశ్ననే నేను వేసుకుని మరొకరి పుస్తకాన్ని చదివినట్లుగా తిర్గి చదివితే కొన్ని విషయాలు తెల్లమైనై. కాలం గడిచిన తర్వాత, రచయితకి తన రచనపై నొక రకం ఏవగింపు పుడుతుంది. ఈ రకం రోత వల్లనే కాబోలు కొన్ని జంతువులు తమ సంతానాన్ని, పుట్టగానే తినేస్తుంటాయి. ఇన్ని పుటల గ్రంథంతో విడవక, యింకా కొంత వ్యాఖ్యానంతో పాఠకుణ్నే యిబ్బంది పెట్టడం అన్యాయంగా తోచినా ఏవగింపుని కాసేపు దిగమింగుకుని, నవల పుట్టు పూర్వోత్తరాలని పరిచయం చేద్దామని, ఈ ఉపోద్ఘాతం సాగిస్తున్నాను.

1943లో రాయలసీమ ప్రజల్ని పరిశీలించే అవకాశం కలిగింది నాకు, వార్ని పూర్తిగా అర్థం చేసుకున్నానని కాదు. చాలాకాలం దగ్గర పరిచయం వల్ల, వ్యక్తుల్ని అర్థం చేసుకోవడం సులభమన్నది నా అనుభవం కాదు. దూరంగా, అప్పుడప్పుడు లభ్యమయ్యే తాత్కాలిక పరిచయంవల్ల, చెత్తా చెదారం లేకుండా వ్యక్తుల ప్రధాన మనస్తత్వాలు, లక్షణాలు, ప్రస్ఫుట మవుతాయనుకుంటాను. ఈ పరిచయంవల్ల, రాయలసీమ ప్రజలకీ, సర్కారుజిల్లాల ప్రజలకీ పరస్పర వైముఖ్యాలున్నాయన్న సంగతి నాకు స్పష్టమైంది. వారినిగాని, వీరినిగాని విమర్శించాలన్న వుద్దేశం నాకు లేదు. ఆర్థిక స్థితిగతులు; చరిత్రా ఈ విముఖత్వానికి కొంతవరకూ కారణాలైనా కేవలం అవే కారణాలనలేము. అసలు జనం ఎందుకు పరస్పరం ద్వేషించుకుంటారు? ఇరుగు పొరుగు ప్రాంతాలవారి స్నేహ భావానికి ఆటంకాలేవి? పరస్పర ద్వేషం, అసహనం – యివి ఆ రోజుల్లో నన్ను కలవరపెట్టినై. భాష, ఆర్థిక పరిస్థితులు, రాకపోకల సౌకర్యాలు – ఇవన్నీ సంతృప్తిగా ఏర్పాటైనా, యిరుగు పొరుగు ప్రాంతాల ప్రజలల్లో, ద్వేష చిహ్నాలుంటూనే ఉంటాయి. ఒకవేళ సర్కారు జిల్లాల వారు, రాయలసీమ వారు ఏకమై ఆంధ్రరాష్ట్రం సిద్ధించినప్పటికీ, వీరిరువురూ కలిసి ద్వేషించేటందుకు

మరో ప్రాంతం ప్రజ–ఏ తమిళులో, మహారాష్ట్రులో, కన్నడులో – ఎవరో వొకరు కనిపిస్తూనే వుంటారనుకుంటాను. ప్రాంతీయ వైరాలు, అంతర్జాతీయ రంగంలో కూడా ఉంటున్న విషయం మన మందరమూ గమనిస్తూనే ఉన్నాము.

ఇందులో నాయకుడు సర్కారు జిల్లాల వాతావరణంలో యిమడలేదు. అనేక అనుభవాలు అతన్ని ఏకాకిని చేస్తాయి. రాయలసీమలో మరో జీవితం ప్రారంభిస్తాడు. అదృష్టవశాత్తు అతనికి భాగ్యం లభిస్తుంది. స్థిమితపడుతుండగానే మళ్ళా పూర్వపు అనుభవాలు, శక్తులు అతన్ని చుట్టుముట్టుతాయి. ప్రేమ రాహిత్య ప్రవాహంలో పడిపోతాడు. ప్రాణాలతో బయటపడి, మరోచోట, మరో జీవితం సాగించడానికి వెళ్ళిపోతాడు. ఇదీ యిందులో కథ. అతనేమీ సాధించలేదు. కాని సాధించలేకపొయ్యాానన్న జిజ్ఞాస అతన్ని జీవితానికి కట్టిపడేసినా కూడా, నిస్పృహుణ్ణి చెయ్యలేదు.

గతించిపోయిన యౌవనం, జాడ్యం, బీదతనం, మృత్యువు – ఇవి జీవితంలోని చెడుగు. ఈ చెడుగులో, మానవుడు గుండె బాదుకోవాల్సిన విషాదం ఏమీ లేదు. జీవితంలో నిజమైన విషాదం ద్వేషించడం కూడా కాదు, నిజమైన విషాదం ప్రేమించలేకపోవడం. ద్వేషించడంలో కొంత పట్టుదల, కార్యసాధన కూడా వుండొచ్చు; కాని ప్రేమించలేక పోవడంలో అట్లా సమాధాన పడేటందు కేమీలేదు.* "నా కొరకు చెమ్మగిల నయనమ్ములేదు." – కంటె విషాదకరమైన గీతం ఏదుంది? ఈ సమస్య నన్ను బాధించింది. దీన్నిబట్టి ఈ సమస్యని నవలలో చర్చించి, వొక సమాధానం కనుక్కున్నానని కాదు. ఈ వస్తువుని వ్రాసేస్తే విషయం నాకు విశదపడుతుందనీ, నలుగురితో పంచుకుంటే బాధనుండి విముక్తి లభిస్తుందనీ తోచింది. వ్యక్తిగతమైన విముక్తి ఈ నవలకి ప్రేరణ.

ప్రేమించలేకపోవడం వొకటే కాదు ఈ నవలలో వస్తువు. జీవితంలో 'చెడుగు'... 'పాపం'... ముఖ్యంగా పెద్దలు చేసిన తప్పిదాలు పిన్నలపై బడి వారి జీవితాల్ని ఏ విధంగా వికసించనీయకుండా, పాడుచేసింది... యిది కూడా వొక ప్రధానమైన అంశమే. ఒకరు చేసిన అపచారాలకి మరియొకరు బాధ్యులై బాధపడటంవల్ల సమాజంలో వ్యక్తిగతమైన నైతిక విలువలకి తావులేకుండా పోతుంది. ఒక వ్యక్తికి కంటి మెల్ల ఉన్నప్పుడు, అతన్ని హింసించ దలచుకున్నప్పుడు సంఘం, అతని గుడ్డితనాన్ని వేలెత్తి చూపుతుంది. ఈ కథలో నాయకుడి "తల్లి" పాత్ర చిత్రించబడలేదు. కాని ఆమె చేసిన అపచారాల ఫలితం, నీడలా అతన్ని వెంటాడి, సంఘ విమర్శ ద్వారా, జీవితాన్ని కలుషితం చేస్తుంది. ఈ దౌర్జన్యాన్ని ఎదుర్కోడంలో అతను కొన్ని విలువల్ని సాధిస్తాడు. ఆ విలువలతో ఈ నవలకి నిమిత్తం వుంది.

ఈ సమస్యని కథావస్తువుగా తీసుకొని, యిదివరలో అనేకులు వ్రాశారు. మన ప్రాచీన వాఙ్మయంలో రేణుక, జమదగ్నుల కథ ఎన్నదగ్గది. తల్లి అపచారం చేసింది గనుక ఆమెని సంహరించమని, ఆ ఋషి తన పుత్రుల నడుగుతాడు. ఎవ్వరూ అంగీకరించరు. ఒక్క కుమారుడు మాత్రం సిద్ధపడి, ఆ కార్యం నెరవేరుస్తాడు. తండ్రి దానికి సంతోషించి, ప్రసాదించిన వరంవల్ల, తన తల్లిని బ్రతికించుకుంటాడు. తల్లిని

---

* కృష్ణశాస్త్రి

బ్రతికించుకోగలనన్న ధైర్యం వల్లనే, అతనీ పని చెయ్యగలిగాడని నాకు స్ఫురిస్తుంది. ఇందులో ధ్వని కేవలం మాతృప్రేమ కాదు; అసలు మానవత్వం యొక్క ప్రేమ ప్రకర్ష.

షేక్స్పియర్ తన "హామ్లెట్" నాటకంలో యీ వస్తువునే కళానుగుణంగా ప్రదర్శించ యత్నించాడు. ఈ యత్నంలో షేక్స్పియర్ విఫలుడయ్యాడని తీర్మానంచేస్తూ, T.S. Eliot యిలా విమర్శిస్తున్నాడు.

* కళద్వారా ఉద్రేకాన్ని ప్రదర్శించాలంటే, ఆ ఉద్రేకంతో సమంగాతూగే పరిస్థితులనుగాని, వస్తువులనుగాని సృష్టించాలి; భౌతికానుభవంలో అంతమయ్యే ఆ పరిస్థితులను, వస్తువులను చిత్రించగానే, ఆ ఉద్రేకం ఉద్భవిస్తుంది. బాహ్య స్థితిగతులకు, ఆంతరంగిక ఉద్రేకానికి సమత్వం కుదిరినప్పుడే రసానుభూతి కలుగుతుంది. "హామ్లెట్"లో ఇది లేదు. స్థూల జగత్తులో కనపడే వాటికి మించిపోయిన వుద్రేకానికతను లొంగిపొయ్యాడు. తల్లిచర్య అతనికి రోత పుట్టిస్తుంది. కాని ఆ రోత తీవ్రతకి "తల్లి ప్రతిమ" సరిపడలేదు. అతని ఏవగింపు ఆమెని కమ్మివేసి అతీతమైంది. ఆ బాధకి సరిపడ్డ వస్తువు బాహ్యజగత్తులో లేకపోవడంవల్ల అతను విముఖుడయ్యాడు.

నాయకుని బాధకి, స్పృశించగల శక్తులకూ సమత్వం కుదర్చడాని కీనవల యత్నిస్తుంది.

తరువాత 1887 లో గైడిమొపాసా ఈ సంఘటననే, తన 'పెర్రి అండ్ జీన్' (Pierre and Jean) అనే పెద్ద కథలో చిత్రించాడు. ఇందులో తల్లి చేసిన అపచారాలు ఆమె జీవించి వుండగానే తన సంతానంపై కురిపించిన అరిష్టాలని అందంగా చూపించాడనిపిస్తుంది. మొపాసా తన కథకు వ్రాసిన ఉపోద్ఘాతంలో "చిత్రపటం గీయించుకున్న చిత్రకారుడు, ఎముకల సొంపుని గురించి పట్టించుకోడు" అని వ్రాశాడు. ఫ్రెంచి విమర్శకులు – ఈ రచన చదివినవాడు బాధపడతాడు గాని, రంజితుడు కాలేడన్నారు. ఎముకల అమరికతో నిమిత్తం లేకుండా చిత్రపటం గీయటానికి పూనుకోడం సాహసమే మరి.

తల్లిదండ్రుల గుణాలుగాని, అవగుణాలుగాని రక్తం ద్వారా పిల్లలకు ఏ విధంగా సంక్రమిస్తాయో వివరించడం "చివరకు మిగిలేది" తలపెట్టదు. తన తల్లిని గురించి సమాజంలో చాటుచాటుగా నీతికీ, అవినీతికీ సంబంధంలేని కథలేవో ప్రచారమవుతుండగా వింటున్న కొడుకు జీవితం ఎన్ని విధాల కుంటుబడిపోతుందో చిత్రించడమే ఈ నవల లక్ష్యం. అంచేత ఈ ప్రచారాలకి తావునిచ్చిన తల్లి జీవితంలోని ఘట్టాలలోని సంఘర్షణ తొలగించి, వాటిని మరుగుపరచడం జరిగింది.

ఈ సంకల్పం దోషభూయిష్టమైందని పాఠకులకి తోస్తే యీ వస్తువే సారస్వతంలో కళానుగుణంగా ప్రదర్శించడానికి అర్హత లేనిదని అనుకోవాల్సి వొస్తుంది. ఈ విషయం పాఠకునికే వొదిలేస్తున్నాను. ఇవన్నీ అనవసరమని తోచినవారు "చీకటి సమస్య" అన్న అధ్యాయాన్ని వొదిలెయ్యవచ్చును.

---

* T.S. Eliot "Selected Essays" (Essay on Hamlet)

సమాజాల మధ్య వున్న ద్వేషాలకీ, వ్యక్తులు ప్రేమించలేక పోవడానికీ ఏదో సంబంధం వుండివుండాలని నా నమ్మకం. అదేమిటో, ఎల్లా ఉంటుందో కనుక్కుందామని ఈ నవలా రచన సాగిందనిపిస్తుంది. ఇదంతా చదివి ఈ నవల సమస్యలతో ప్రమేయం వున్న ప్రచారక గ్రంధం అనుకోవద్దని విన్నపం. తిరిగి చదివి, వెదికితే స్ఫురించే వ్యాఖ్యానాలివన్నీను. సమస్యల చర్చే ప్రధాన విషయమైతే ఈ నవలే వ్రాయను. ఏ ఒక్క విలువతోనూ ఈ నవలకి ప్రమేయం లేదు? అంతమాత్రంచేత, దీనిలో ఏ విలువా లేదనుకోకూడదు.

కొందరు రచయితలవలె గ్రంథంలో ఉపయోగించే నిమిత్తమైన అనుభవాన్ని నేను అన్వేషించను. సంస్కృతిని సంస్కృతి కోసమే ఆరాధించేవాడ్ని కాను. ప్రవర్తనపైన శీలంపైన వున్న, ప్రభావంలోనే సంస్కృతి, కళల ప్రయోజనం ఉందనుకుంటాను. ఇది నేను ప్రగల్భంగా చెప్పడంకాదు. ఇందులో నాయకుడు, చివరలో జీవితానికి అర్థంలేదన్న నిర్ణయానికొస్తాడు. తనని గురించిన నిజం తెలుసుకోవాలని బయలుదేరిన వొక యువకుని అభిప్రాయంగాని, అది రచయిత నేర్చుకున్న పారం అనుకోవద్దని కోరుతున్నాను.

నిజంగా కూడా, పారకునికి రచయిత ఉద్దేశాలతోనూ, నమ్మకాలతోనూ, "స్వీయ" గాధతోనూ నిమిత్తం ఉండదు. ఇవి అతనికి జీవితంపై ఉన్న జిజ్ఞాసని, సమగ్రంగా, నిజాయితీతో, అనుభవించగలిగేటట్టుగా చిత్రమైనవా లేవా, అన్నదే పారకునికి కావాల్సింది.

ప్రధమ రచనలో కొంత పాండిత్య ప్రకర్ష ఉంటుంది. తాను తెలుసుకున్న విజ్ఞానాన్ని పాఠకుడికి తెలియచెయ్యాలని రచయిత ఉబలాటపడతాడు కాబోలు ఇది లోపమే. ఇట్లాంటిది అక్కడక్కడ ఈ నవలలో కూడా కనిపించింది. కాని అది కథాసంవిధానంలో యిమిడిపోయింది. దాన్ని విడదీసి సంక్షిప్తం చెయ్యడం నావల్ల కాలేదు. ఆధ్యాత్మిక, సాంఘిక విషయాలను గురించిన తర్కం, జీవిత సమస్యలపై నిర్వచనాలు, కొందరికి విసుగు పుట్టించవచ్చు; మరి కొందరికి కథ, పాత్రకంటె ఈ నిర్వచనాలే ప్రధానంగా తోచొచ్చు. ఇప్పుడు ఆ విషయమై నవలలో శిల్పం గురించి నిర్వచనాలు చెయ్యపూనుకోడంలేదు. నవలను గురించిన రచయిత అభిప్రాయాలు, తాను రచించే నవలల్ని సమర్థించేవిగా ఉంటాయనుకుంటాను.

ఏ వ్యక్తి జీవితంలోనూ అన్నీ రసవత్తరమైన ఘట్టాలుండవు. చాలాకాలం మామూలుగా జీవించి, వొక్క క్షణంలో మహత్తరమైన అనుభవాలకి గురికావొచ్చు.* "అల్లాగే పెద్ద గ్రంధంలో కొన్ని విసుగు పుట్టించే ఘట్టాలుంటాయి... మొదటి పుటనుండి, చివర పుట దాకా, చమత్కారంగా అద్భుతంగా, విసుగులేకుండా నడచిన గ్రంధం, గొప్ప గ్రంధం అవదు" అన్నాడు బెర్ట్రండ్ రసెల్. ఈ కారణంగా, ఈ ఘట్టాలని భరాయించమనడం లేదు నేను. రెండు మహా సంగ్రామాల మధ్యకాలంలో, తెలుగునాట కొందరి యువతీ యువకులు జీవితం చిత్రితమైంది ఈ

---

* The Conquest of Happiness

నవలలో, ఆ అల్లికలో యివన్నీ పోగులు వాటిని తొలగిస్తే మందం తగ్గొచ్చు కాని ఆకృతి పోతుందనుకుంటాను.

అంతేకాదు రచయితకి ముఖ్యమని తోచిన విషయాలే పాఠకుడికి కూడా ముఖ్యంగా తోస్తే, ఈ ఘట్టాలని హర్షించడం తేలిక. అల్లా కొందరు సాహితీప్రియులు ఈ గ్రంథం కుతూహలంతో చదివారనడానికి యిందు పొందుపరచిన కొన్ని అభిప్రాయాలు తార్కాణం. తన విముక్తి కోసం రచన సాగించినా, తన అంతరంగికాన్ని నలుగురితోనూ పంచుకున్నప్పుడే రచయితకి నిజమైన సంతృప్తి కలుగుతుంది. అట్లా పంచుకోడంలో దానికొక మూల్యం, సామాజిక ప్రయోజనం ఏర్పడుతుంది. ఇందుకుగాను ఈ అభిప్రాయాలు తోడ్పడతాయని తోచినప్పుడు వాటిని పొందుపరచడంలో ఆక్షేపణేమీ కనబడలేదు.

"నా ఆనందం కోసం నేను వ్రాసుకున్నాను, ఎవరి కర్థంకాక పోయినా, ఎవరు బాగులేదన్నా నాకు లెక్కలేదు" అని నేననుకోలేను. ఏ రచయితైనా, అట్లా అన్నా అది నేను నమ్మను. నా సమకాలికులలో కొందరు పిన్నలకీ పెద్దలకీ కూడా నే చెప్పదలచుకున్నవి అవగాహన కావడం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించగలగడం నాకు ఉత్సాహాన్నీ, సంతృప్తినీ కలిగించింది. ఇది నా అదృష్టం.

ఈ గాథకి నేను మొదట అనుకున్న పేరు "ఏకాంతం." కథంతా చెప్పగా విని "చివరకు మిగిలేది" అని నామకరణం చేసింది శ్రీ ఆచంట జానకీరామ్. ఈ పేరు, గాథకి సమగ్రత నివ్వడమే కాకుండా, సరిహద్దుల్ని కూడా నిర్ణయించింది. ముఖచిత్ర నిర్మాణంలో సూచనలు చేసి, రచన సాగుతున్నప్పుడు తన విమర్శతో ఎక్కువ ప్రోత్సాహం కూడా యిచ్చారాయన. ఇట్లాంటివి ఆయనకి నచ్చకపోయినా, కృతజ్ఞత చెప్పడం నా కర్తవ్యంగా తోచింది.

ఈ నవలలో పాత్రలు, ఎవర్నీ ఉద్దేశించినవి కావని రచయిత చెప్పకోడం, తప్పకుండా అవి ఫలానా వార్ని ఉద్దేశించినవి అని చదువరి అనుకోడం పరిపాటి. అందుచేత ఆ విషయం కూడా చెప్పడం లేదు.

పుస్తకాలపై కాస్తో కూస్తో గౌరవం, అభిమానం వుండి, సారస్వతాన్ని నమ్మి, దానికొక స్థానం ఇవ్వడానికి అలవాటుపడ్డవారు, ఎందరు చదివి అనుభవం పొందితే అంతటి సంతృప్తి. ఎందుకంటే జీవితంపై ఒక దృక్పథాన్ని కలగచెయ్యాలన్న ఉద్దేశంతోనే యీ రచన సాగింది. ఆర్థిక సాంఘిక చారిత్రక వ్యత్యాసాల కతీతమై – మనిషినీ, మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు, ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈ జీవిత రహస్యం – దాన్ని తెలుసుకోవడానికి మానవుడు చేసే యత్నం – ఏ గొప్ప గ్రంథానికైనా ఇవి పునాది. ఈ నవలకీ అదే పునాది.

ఇది చదివినవారు, విషయం ఏమిటో తెలిసిపోయిందికదా అనుకుని విరమించకుండానే ఈ ప్రస్తావన ముగించి. నవల సమర్పించుకుంటున్నాను.

విజయవాడ, — బుచ్చిబాబు
1–7–1952.

# అధ్యాయాలు



★ ★ ★

# గడ్డిపోచ విలువెంత?

చివరికి మిగిలేదేమిటి? దీనికి సమాధానం తెలిస్తే జీవిత రహస్యం తెలుసుకున్నట్లే. అసలు జీవితానికర్థమేమై వుంటుంది? మానవుడు యీ ప్రశ్నని వేసే అవసరం రావడమే జీవితానికేదో అర్థం ఉందనుకోడానికి తార్కాణం. అర్థం లేదని ఇతరులు రుజువుచేస్తే మనం అంగీకరించలేము. ఆ నిరూపణ మన తార్కిక జ్ఞానాన్ని వెక్కిరించి, ధ్వంసం చేస్తుంది. అది మానవుడు సహించలేడు. జీవితాని కర్థం లేదన్న నిర్వచనానికి అసలే అర్థం లేదు. కాని దాన్ని మనంతటమనమే రుజువు చేసుకుంటే, సృష్టి అంత భయంకరంగా వుండకపోవచ్చు. సృష్టికి ఇతరులు కలిగించిన అర్థాలని మనం అంగీకరించలేము. మనం కనుక్కొని, ఎముకలలో జీర్ణించుకున్న అర్థాలని ఇతరులకి చెప్పలేము. ఇతరులతో సంపర్కము వొదులుకొని, ఏకాంతంగా మనం తెలుసుకున్న జీవిత రహస్యాన్ని యదార్థం అని నమ్మి సమాధాన పరచుకోవడం, సంఘంతో నిమిత్తం ఉన్న మనిషికి చేతకాదు కాబోలు. చరిత్ర కట్టుకున్న ప్రాచీన పునాదులు, సంఘం పాతుకున్న మట్టి విత్తనాలు, వాటిని మినహాయిస్తే మానవుడిలో చివరికి మిగిలే దేమిటి?

చివరికి మిగలడం! పడమటి ఆకాశంలో సూర్యుడు ఎర్రగా ఆవులించి మరో ప్రపంచంలో మూర్ఛిల్లిపోతే మిగిలినవి, పగటిని వదల లేక రాత్రిని వెతుక్కునే మత్తు మేఘాలు, నక్షత్రాలు భయంతో మెరుస్తున్నాయి. కాలవ తోకని త్రిప్పుకుంటున్న నల్లత్రాచులా వంకర తిరిగి దూరంగా అంతర్థానమైంది. ఆకాశం కేసి చూస్తూ ఒడ్డున గడ్డిపోచల మధ్య దయానిధి నవ్వుకున్నాడు. గడ్డపోచని తెంపి, చిటికెన వ్రేలికి చుట్టుకున్నాడు. గాలికి భయపడుతూ దగ్గరగా జరిగి తలకాయ లొంచుకొన్న గడ్డిపోచలపై అతడు పడుకున్నాడు. గాలికి చొక్కా కాలర్ కదిలిచెవులో చక్కిలిగింత పెడుతోంది. శరీరాన్ని ఆవరించుకున్న గాలి అందమయిన అల్పానుభవం. శరీరం దాహంతో వికసిస్తుంది. రక్తాన్ని లేపి కొత్త దోవలు తీయిస్తుంది. గాలి, ఇంద్రియాలు మైకం చెందుతాయి. చర్మం, లోపలి భాగాన్ని పైకి తెచ్చుకుంటుంది. గుండెలు లయ తప్పి మళ్ళా తేరుకుంటాయి. కళ్ళు చూడడం మానుకుని దర్శిస్తాయి. పడమటి ఆకాశంలో పూడుకుంటున్న పుందు రాత్రి వెదకటం విరమించుకున్న మేఘాలు, భయం లేకుండా మెరుస్తున్న నక్షత్రాలు, తోకని త్రిప్పడం మానుకున్న నల్లత్రాచులా నిశ్చలత్వం పొందిన కాలువ, పవిత్రంగా కదులుతున్న గడ్డపోచలు, మూగ భక్తితో ప్రశాంతం చెందిన ప్రకృతి, తనూ— అన్ని ఏకమై పోయి, ఒక్కసారి చైతన్యం పోగొట్టుకొని, ప్రపంచంతో నిమిత్తం లేకుండా ఉండిపోయాయి. "కాలం", "స్థలం", "ఉనికి", "లేమి", "అంతం", "అనంతం" ఈ ద్వంద్వాలిక లేవు.

"పొద్దోయిందండి ఇంటికి రాండి బాబుగోరు"కాలం, పొద్దు, స్థలం యిల్లు ఈ ద్వంద్వాలెక్కడికి పోతాయి? లేచి కూర్చున్నాడు దయానిధి.

"ఇల్లా ఎక్కడ నుంచి నారయ్యా."

"అవుని ఇంటికి తోలుకెడుతుండానండి, లెగండి పోదాం అమ్మగారు మీకోసం చూస్తాంటారండి"

దయానిధి లేచి చొక్కా దులుపుకున్నాడు. గడ్డి పోచని త్రెంచి కాలువలో పారేసాడు.

"మధ్యాహ్నం మీరొచ్చేసిం తర్వాత, యింటికాడ పెద్దకొడవ జరిగిందండి. అయ్యగారు, అన్నయ్యగారు తగువులాడుకున్నారండి. అమ్మగారుంటె నేవుండను. అమ్మగారన్నా ఉండాలి. నేనన్నా ఉండాలి ఈ కొంపలో అన్నారండి అన్నయ్యగారు. అమ్మగార్ని అయ్యగారు కూకలేసారండి అన్నయ్యగారు, భూలక్షమ్మగారు ఐదుగంటల బండి కెళ్ళిపోయారండి. భూలక్షమ్మగారొచ్చింతర్వాత అన్నయ్యగారు మరీ తొందర పడుతున్నారండి."

దయానిధి మాట్లాడలేదు....నారయ్య నమ్మకస్తుడే! తన చిన్నప్పటినుంచీ అతను వాళ్లింటిలో పనిచేస్తాండడం వల్ల ఇంటి గొడవలు అతనికి తెలిసినా ఫరవాలేదు కాని, అతనితో ఇవన్నీ ముచ్చటించటం, చిన్నతనంగా తోస్తుంది.

"నారయ్యా నువ్వింటికెళ్ళు నే కాసేపుండి వస్తాగా."

"అమ్మగారు మీరు మధ్యాహ్నం కాఫీ కూడా తాగలేదని, కంటతడిపెట్టుకొని, ఎక్కడున్నారో కొంచెం చూసి తొందరగా ఇంటికి తీసుకు రమ్మని చెప్పారండి. మీరు మద్దినాళే ఎందుకొచ్చారండి. కామాక్షి కూతురు వూర్నించి ఇంకా రాలేదు గదాండి?"

అతని కీవిషయం ఎట్లా తెలిసిందో దయానిధికి అర్థం కాలేదు, ఆలోచించడం మొదలు పెట్టాడు. కామాక్షి చెప్పి వుండొచ్చు. లేకపోతే అమ్మే చెప్పిందో....

"నారయ్యా...ఐతే వూర్నించి ఎప్పుడొస్తుందిట?.. సరేలే నువ్వెళ్ళు నేనలా షికారెళ్ళి వో గంటలో వొస్తానని చెప్పు"

నారయ్య దూడ పలుపు నడుంకి చుట్టి, పాగాలోంచి చుట్ట తీసి ముట్టించాడు.

"అయితే అబ్బాయిగారు– మీకు కోపం రాదు గదాండి వో సంగతి చెబుతాను, మీరు దబ్బుని పెండ్లి చేసుకోరాదంటండి."

నారయ్య నవ్వే శక్తి పోగొట్టుకోలేదు. అతని జీవితంలో కష్టసుఖాలంటూ విడివిడిగా కేటాయించిన అనుభవాలేవీ లేవు. పెండ్లాం చంద్రన్నతో లేచి వెళ్ళిన గాత్రి పదిమందిని పోగుచేసి చెరువు గట్టున చెడుగుడి ఆడి తెల్లారగట్ల వేడినీళ్ళు పొయ్యమని చంద్రన్న ఇంటికెళ్ళాడు. మాధవయ్య గుర్రానికి వాతం కమ్మితే బెంగెట్టుకొని రెండు పూట్ల సరిగా తిండికూడా తినలేదు. లాలా సాహెబు మేకకి కాలు బరువేస్తే తనింటిలో మంచం క్రింద పడుకోబెట్టుకొని తెల్లవార్లూ తోమేడు. తనకి ప్రాప్తించిన వాటికి నవ్వుకుంటాడు. ఇతరులకి ప్రాప్తించిన వాటికి ఏడుస్తాడు, నారయ్య స్వభావం అది. ధశరధరామయ్యగారి ఇంటి వ్యవహారాలు నారయ్య మనశ్శాంతిని భంగం చేసినా అతను నవ్వుకునేందుకు కనపడ్డ బోలెడు కారణాలలో కామాక్షి కూతురు కోసం అబ్బాయిగారు కాలవగట్టుకి రావడం.

దయానిధి లోపల నవ్వుకున్నాడు. ఈ నారయ్య కన్నీ తెలుసు. పెద్దవాడై పోయ్యాడు. తెలీనట్లు వూరుకోరాదూ.

"రండి బాబుగోరు– సీకటిలో పురుగు, పుట్రా ఉంటుంది, బేగిరం రండి."

నారయ్య అవును తోలుతూ ప్రయాణమయ్యాడు. కొంగలగుంపు పిగ్గుపడే వెన్నెట్లో మెరుస్తూ పోతున్నాయి. ఏదో పిట్ట కాలువ నీళ్ళని కదిపింది. గడ్డిపోచలు కామంతో వొణికి పోతున్నాయి. దూరంగా చెట్లు చీకటి ముసుగుల్ని కప్పుకుని గుసగుసలు మొదలు పెట్టాయి. నారయ్య చుట్ట తాలూకా పొగ చంద్రుడు దగ్గరకు పోయింది. వేసంగి పగటి నిద్ర మత్తుతో బరువెక్కిన మొహంలోని కాంతితో చంద్రుడు. చుట్టూ వొళ్లు విరుచుకుంది వెన్నెల. అప్రయత్నంగా వూళ్ళోకి నడిచి కామాక్షిగారి దొడ్లోకి చేరుకొన్నాడు దయానిధి. ఆ సందులో జనం ఎవ్వరూ లేరు మూడు గుడిసెలూ, పెంకుటిళ్లు రెండున్నాయి. మెట్లదగ్గర నీడల్లో మంచుని తలుపు కేసి చూశాడు. తలుపుమీద అతని నీడని చూసుకున్నాడు.

అతని నీడ ఎంతో బాగుంది. నీడలో అంత అందంగా కనిపించే వ్యక్తి అద్దంలో అల్లా వుంటుందేం? ఆ తలుపు మీద ఎన్నిసార్లు కోమలి నీడపడింద్– అదే చోట తలలో వేళ్ళుపెట్టి జుత్తుని కదుపుతున్నాడు. మెట్లమీద నుంచే కోమలి ఎన్నిసార్లు నడిచిందో, తను మెట్టుగా మారిపోకూడదు! నవ్వుకున్నాడు నీడ నవ్వితే అతనికి భయమేసి ఉలిక్కిపడ్డాడు. ఏదో ధ్వని అతని కంఠంలోంచి వొచ్చింది.

లోపల్నించి "ఎవరది? మంగమ్మా, చింతపండు తెచ్చావా– ఉండు తలంటు పోసుకుంటున్నా"ఒకడుగు వెనక్కి వేశాడు. ఊర్నుంచి సాయంత్రం వొచ్చారన్నమాట తలుపు బీటలోనుంచి తొంగి చూశాడు. ఏదో నేరం చేసినవాడిలా చిన్నబుచ్చుకున్నాడు. అతని వెనకాల మరో తలుపు సందులోనుంచి అతను యిల్లా చూడడం మరోరు చూస్తే ఎల్లా ఉంటుంది? మనల్ని ఎవ్వరూ చూడడం లేదన్న ధైర్యం ఉన్నప్పుడు ఎన్నో పనులు చేస్తాం. ఎవరన్నా చూస్తే ఎల్లా ఉంటుందో వూహించుకుని, అవకాశం వున్నా ఆపనులు చెయ్యడానికి జంకుతాం. తలుపుసందు నీతి మనది, అనుకున్నాడు.

సందు చివర ఏదో మెదిలింది. తిండి యత్నం విరమించుకుని, కాలక్షేపానికి ఫారా చేస్తున్న– గాడిద చేస్తున్న అలజడి, అతనల్లా చూడటం చూసి ఆ గాడిద ఏమను కుంటుందో, ఎనాటమీ ప్రొఫెసర్ మొహం అచ్చంగా దానిలా వుంటుంది. ఎండిపోయిన ఇస్తరాకుల్ని పరామర్శ చేసి వోండ్రించడానికి విఫలయత్నం చేసి గాడిద నిష్క్రమించింది. కొంచెం ధైర్యం చేసుకుని తలుపు సందులోంచి తొంగి చూశాడు. లోపల ఎవ్వరూ కనబడ్డంలేదు. నేలమీద నీళ్ళు పడుతున్న చప్పుడు. అవిగో చెంబు, చెయ్యి, మోకాలుచిప్ప వ్వూగిసలాడడం, తలుపులో బీట కొంచెం పక్కగా కుడివేపున వుండగూడదూ! గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. అరిచేయి తలుపుమీద ఆనించిన చోట, చెమట మరకపడింది. వెదుక్కుంటూ నారయ్య తనకోసం రాడు కదా కొంపతీసి! వొస్తే మాత్రం ఏం? నారయ్యకి తెలుసు. "దబ్బుని పెండ్లి చేసుకోరాదంటండి?"అని అనగలిగేటందుకు అవసరమైన ధీమా వుండాలంటే ఎంతవరకూ తెలియాలో అంతవరకు తెలుసు. చెయ్యి తలుపుమీద నుంచి తీసేశాడు. ఇదివరకెన్నడూ చూడని మోకాలు చూశాడు. అమావాస్య

వెళ్ళిన మూడోనాటి చందమామలా మోకాలు తడితో తళుక్కుమంది. ఎనాటమీ ప్రొఫెసర్ ఏమంటాడో ఈ మోకాలు చూసి.

చెమట డాగుపడ్డచోట తలుపుని ఉఫ్‌మని వూదాడు. మళ్ళా ఎడమ చెయ్యి ఆనించాడు లోపల చెంబుజారి బిందిలో పడిన చప్పుడు.

"అబ్బా, సొట్ట చెంబమ్మా"అన్న కంఠం వినిపించింది. ఏదో ఆకృతి కదిలింది. గంగాళం— వూగిసలాట నిలిచిపోయింది. తలుపుమీద నుంచి చెయ్యి తటాలున తీసేశాడు. ఉంగరం రాపిడి "కిర్"మంటూ ధ్వనించింది.

"ఎవరూ పలకరేం? మంగమ్మేనా? వొస్తున్నా— అమ్మ గుళ్ళో కెళ్ళింది..."

తలుపు తెరచింది. తలుపు తీసిన వ్యక్తి లోపలే వుంది. దయానిధి లోపలికి నడిచి, తలుపు దగ్గరాగా మూసి నిలబడ్డాడు. తెల్లబట్ట సగం వొంటికి చుట్టుకుని పీటమీద కూర్చుని జుట్టు సవరించుకుంటున్న కోమలి వెన్నెల నగ్నంగా కూర్చుని తల్లో ఎర్రటి పిచ్చి పువ్వుని అమర్చుకుంటున్నట్లుగా వుంది.

"ఎవరూ— ఇదేమిటి— మీరా!"అని చీరకొంగుని కుడి భుజం మీద నించి లాక్కుని, మెడచుట్టూ తిప్పింది! దయానిధి ఆమెని పరకాయించి చూశాడు. క్రితం వేసవి సెలవుల్లో మొట్టమొదటిసారి ఆమెను చూశాడు. తరువాత క్రిస్‌మస్‌లో— మొత్తం అంతవరకూ నూట పందొమ్మిది మార్లు చూడడం అతనికి గుర్తుంది. ఆమె నిజమైన సౌందర్యం యీనాడు చూశాననుకున్నాడు.

కోమలిది అన్ని సమయాలలోనూ, అన్ని చోట్లా, ఒకే మాదిరిగా కనబడే చక్కదనం కాదనుకుని కొంచెం విచారించాడు. పెట్టుపోతలు, సంరక్షణ, సింగారింపు, యివన్నీ బాగా జరిగితేనే గాని ఆమెలో నిజమైన అందం బహిర్గతం కాదు. వాళ్ళమ్మ మాఅమ్మాయి మొన్ననే రజస్వలైందంటుంది. కాని కోమలికి పదహారేండ్లు నిండాయి. ఐనా ఆమె ఎదగడం పూర్తి కానట్లుగానే వుంటుంది. సన్నటి పొడుగాటి చేతులు, మొనలన్నీ సద్దుకోని భుజాలు, మరో శరీరానికి ఉద్దేశింపబడినదానిలా కనబడే సన్నటి నడుం! సన్నగిలటం మానుకుని వ్యాపించిన చోట, ఏచీర పడేసినా చిలక్కొయ్యిలా పట్టుకునే వొంకర వికసించటం ప్రారంభించినట్లుగా వుండి, స్ఫుటమైన ఆకృతి తెచ్చుకుని మొగపిల్లాడి రొమ్ములు, పూర్ణచంద్రుడికి అడ్డం వొచ్చిన పల్చటి మేఘంలాంటి మెత్తటి శరీరచ్ఛాయ, యీ కొమల్ని చూస్తూ కూర్చోడం, దయానిధికి ఒక ఉత్కృష్టమైన అనుభవం. అన్నీ ఆకర్షణీయమైన శరీర అవయవాలున్నప్పుడు, ప్రత్యేకం దేనికేసి చూడాలో అతను నిర్ణయించుకోలేదు. అంగనిర్మాణం సగంసగం చేసి దైవం వూరుకున్నట్లుగా వుంటుంది. యవ్వనం బైటపడి దర్శనం యివ్వడానికి భయపడుతున్నట్లుగా వుండే ఆమె అమాయకపు మొహాన్ని చూస్తున్నాడు. ఆ చింపిరి జుట్టు యిష్టంవొచ్చినట్లుగా అరణ్యంలో సహజత్వాన్ని అనుకరిస్తున్నట్లు పెరిగిపోయి, ఎక్కడ పాపిడి తీసినా లొంగదు. ఆ ముంగుర్లు నుదుటిని గట్టిగా పట్టుకుని ఏ దువ్వెనకి సందివ్వదు సౌందర్యం. నిద్రలో మూర్ఛపోయి, ఏదో స్మరణకు వొచ్చి లేచినట్లుగా వెర్రిచూపులు చూసే నేత్రాలు అతనికి అమాయకంగా ఉండొచ్చు— లేకపోతే బుద్ధి మాంద్యమేమో!

"ఊఁ" అంది కోమలి ప్రశ్నార్ధకంగా, కనుబొమ్మలు వొక్కసారి వొంకరతిరిగాయి. రెండు పెదవులు ముడుచుకుని, చెక్కిళ్ళచర్మాన్ని లాక్కుని సున్నా చుట్టాయి.

"నీ కోసం వొచ్చా" అన్నాడు.

"నాతో ఏంటె పని మా అమ్మతో గాని ఎల్లండి" కూర్చున్న మనిషి లేచి, రెండు చేతులు తలుపులకు ఆనించి నిలబడింది. కంఠానికి చుట్టుకున్న కొంగు కిందికి జారింది. రొమ్ముల్లో పట్టుదొరక్క, తడిని పట్టుకుని నడుం మీద నిలిచిపోయింది ఆనాటి దృశ్యం. అతనికి కొత్త చొరవ నిచ్చింది. ఆమె అతనికి అర్థం ఐపోయినట్లు తోచింది. స్త్రీ త్వంలోని "మాయ"శరీరాన్ని తాకి శోధించినవాళ్ళకి కాని ఛేదించటం సాధ్యంకాదు. ప్రపంచంలోనో, ఏ జన్మలోనో వారిద్దరూ వొకర్ని వొకరు వెదుకుతూ, యీ నాటికి కలుసుకుని గుర్తించుకున్నట్లు అతనికి అనిపించింది.

"నాకు మీ అమ్మతో ఏం పనుంటుంది?"

"నాతో సీకట్లో ఏం పని మీకు? రాత్రి మా యింటికి రాకండి ఎప్పుడూ– మా అమ్మ సూసిందంటే తన్నుద్ది"

"నీ కిష్టం లేకపోతే రాత్రుళ్ళు ఎప్పుడూ రాను. ఇంట్లో గొడవగా వుంటే ఏమీ తోచక నిన్ను చూద్దామని వొచ్చాను."అని కొంచెం నిదానించి మళ్లా మొదలెట్టాడు.

"ఐతే కోమలి, ఎవ్వరూ లేరు కాబట్టి, ధైర్యం చేసి అడుగుతున్నాను. నిజం చెప్పు నేనంటే నీకిష్టమేనా?"

ఈ ప్రశ్న అతను పగలు వేసి వుండడు. కోమలి వొకడుగు ముందుకు వేసి వెన్నెట్లో నిలబడింది. తెల్లటి చీర ఆమెకి బాగా తగిందని నిర్ణయించుకున్నాడు. శిధిలావస్థలో వున్న తులసి దిమ్మమీద కూర్చుంది. అతను చీర మడతలు లెక్క పెడుతున్నాడు. శరీరంలో వొంపు వున్న చోటులో పదిహేను మడతలు జమకొచ్చాయి. అల్పమైన మనిషి వొంటిని తడినికూడా ఆర్పుకోలేని నీరసించిన శరీరం.

"ఊఁ" అంటూ పెదవుల్ని సున్నా చుట్టింది

"ఇష్టమంటే?"

అతను ఆమెవైపు నడిచాడు, లేచి దూరంగా వెళ్ళింది.

"అమ్మో, దగ్గరగా రాకండి మా అమ్మచూస్తే తన్నుద్ది."

"ఇష్టమంటే నీకు తీలీదూ? నాతో వుండాలని వుంటుందీ?"

"ఉండదు"

"పోనీ, నేను నీతో వుంటే నీకు సరదాగా వుంటుందీ?"

"అంటే"

కోలగా నవ్వింది. చందమామ సిగ్గుపడి మేఘాన్ని ముసుగేసుకుంది. వేళ్ళు లేకుండానే వుద్భవించి, వృద్ధి పొందిన లతలా, పల్చగా నవ్వింది.

"ఏది మళ్ళా నవ్వు."

"నాతో నవ్వుతాలేమిటె? మీరు బ్రామ్మలు– పెద్దవాళ్ళు.."

"పెద్దవాళ్లతో స్నేహం నీకిష్టమేగా.."

"భయం"

"ఎందుకు?"

"మీరు గొప్పోరు. ఇన్నిసార్లు మాయింటికొచ్చారు. నాకోసరం ఏమన్నా తెచ్చారా? "

"మీ అమ్మ అడగమందా?"

"ఛీ, పాడు— మా కట్లాంటి వృత్తి లేదు. అట్లాంటివన్నీ మీవోళ్ళల్లోనే—"

"అట్లాంటి మాట్లనొచ్చా?"

"మీరనొచ్చు నేం?"

"అవును మరి, లేకపోతే డబ్బు విషయం ఎందుకు? డబ్బిస్తే నన్ను వుండనిస్తావా?"

"ఏమ్మాటలవి? ఊరుకుంటున్నాననా? వెళ్ళండి. మా అమ్మొచ్చిందంటే మాట దక్కదు. మీ ఎదవడబ్బు మాకేమీ అక్కరలేదు."

"అప్పుడే కోపమే— పోనీ రేపు సర్కస్‌కి తీసుకెడతా వాస్తావా?"

"ఎందుకు లంచం—మీనాన్నగారిలా మేం లంచాలు తీసుకోము"

"మా నాన్న లంచం విషయం నీకెల్లా తెలుసు?"

"సెప్పకుంటారు. కృష్ణమాచారి అన్నాడు."

"అవన్నీ నువ్వు నమ్మకూడదు. సరదాగా మనిద్దరం కలిసి సర్కస్ చూసివద్దాం, రేపు వాస్తావా?"

"నేను రాను సర్‌కస్‌లో పుల్లు, సింహాలు వుంటాయి. నాకు భయం— నన్ను తీసుకెళ్ళేందుకు మీదగ్గర డబ్బెక్కడిదీ? మీనాన్న యిస్తేగా? "

అతని దగ్గరగా వెళ్ళి "చూపించు జేబు"అని చొక్కాలో చెయ్యి పెట్టి గాలించి, బైటికి తీసింది గడ్డిపోచని.

"ఇదేంటి—ఛీ పాడు—గడ్డి దాచుకో"అని అతని వొంటిమీద పారేసింది.

దాన్ని తీసుకుని ఆమె చేతిని గట్టిగా పట్టుకుని, గడ్డిపోచని తల్లో పెట్టబోయాడు ఆమె శరీరాన్ని అతనుముట్టుకోవడం అదే మొదటి సారి. అతనికోసం సృష్టించబడిందని, యింద్రియాలు ఋజువు చేస్తున్నాయి. స్పర్శతో అతని శరీరం కంపించిపోయింది. సముద్ర కెరటాలపై నురుగు మంటలుగా లేచి ఆకాశాన్ని ఆవరించుకుంటే మళ్ళా ఆ జ్వాలని ఆర్పేటందుకు ఆమె శరీరాన్నే తాకాలేమో అనిపించింది. అతని చేతిని విదిలించి పారేసింది. గడ్డిపోచని రెండు ముక్కలు చేసి అతని మొహాన్ని కొట్టింది.

"గడ్డినోట్లో పెట్టాలి. కాని తల్లో కాదు" అంది. ఆ వాక్యంలో వున్న అర్థం అతనికి బోధపడలేదు. అర్థపూరితమైన భాష ప్రయోగించే సంస్కారం ఆమెకి లేదని అతనికి తెలుసు. అందులో ఎంతో " వెక్కిరింపు, కసి" యిమడ్చ గలిగింది. అతనికి కోపం వచ్చింది. నరాలు లాగేస్తున్నాయి. రక్తం మార్గాలు తప్పి, పొర్లి పొంగిపోతుంది. ఏమీ జరగదు— ఏమీ జరగదు— భయపడి పోయింది అతని శరీరం. దేనికీ కదలకుండా రివ్వున కదిలిపోయే బాణంలా యింద్రియాలన్నీ సాగిపోతున్నాయి— ఎక్కడికి? అన్నీ నీటి కాలువలు, నదులు కష్టసుఖాలలోంచి ప్రవహించి మహాసముద్రంలోకి చేరుకుని నిశ్చలత్వంలో పరిపూర్ణతని పొందుతాయి. వాటికి విముక్తి వుంది. అతనికి శరీరంపై యవ్వనం దౌర్జన్యం చేసి అధికారం చలాయించగల్దు కాని, విముక్తి నివ్వలేదు. రెండు ఆకుపచ్చ గాజులు కలుక్కుమన్నాయి. ఎవరో తలుపు కొట్టిన చప్పుడు

తలుపు సందులోంచి  ఎవరో రహస్యంగా చూస్తోన్నట్లు. ఎవరో అతన్ని చూస్తే ఏ భయం? ఈప్రపంచం లోని జనమంతా వాకరివెనుక  వాకరు క్యూ లో మాదిరిగా నిలబడి మనిషి మనిషికి మధ్య తలుపుల్ని అమర్చి, ప్రతివాళ్ళూ, తలుపు సందులో నుంచి చూస్తూ నిలబడితే, ఎంతమంది సృష్టి రహస్యాన్ని తలుపు సందులోంచి శోధించడం మానేస్తారు? ఏ ఒక్కడో  చూడడం మానేసి, వెనక్కి తిరిగి నిలిచిపోతే ఏమౌతుంది? అర్థంకాక కొందరు విసుగెత్తి కొందరు చూడ్డం  మానేస్తారేమో కాని చూస్తే ఏమీ లేదనుకుని ఎవ్వరూ మానెయ్యరు.

"కోమలి వెళ్ళి తలుపు తీసింది ఎవరూ లేరు."

"వెళ్ళండి, నాకు పనుంది. ఎప్పుడూ రాకండి"

"అంటే? ఊరికే వొచ్చి చూసి పోకూడదూ?"

"చూసేందుకు ఏముంది? ఉత్తుత్త చూపులేగా!"

"నా కవే చాలు. అంతకంటే ఏమీ అక్కరలేదు."

ఇంతలో మరో వ్యక్తి లోపలికి కొచ్చాడు. తలకి చుట్టుకున్న టర్కీస్ తువ్వాలు విప్పి దులిపి భుజాన  వేసుకున్నాడు. రేగిపోయిన మధ్య పాపిడి సరిచేసుకుని అగ్గిపెట్టి కోసం జేబు తడుముకుంటున్నాడు.

"రాండి ఆచారిగారూ— నుప్పు తెచ్చేదా..."అంటూ కోమలి అతని దగ్గరగా వెళ్ళి ఆహ్వానించింది.

"మధ్యాహ్నం వొచ్చారుగదా. కబురేనా చెయ్యలేదేమీ?"

"మా అమ్మ మీ యింటికాడికి రాలేదూ? గుడికాడ్నించి అట్లా వెడతానంది."

"అబ్బే, రాందే.. యేమిటి ఈ పూట వొంట నువ్వేనా యేమిటి?"

"అన్నం వార్చా, ఇంకా సారెట్టాలి... మీరు తింటానంటే గుడ్లు పులసొండుతా..."

"ఛ, ఛా, కోడిగుడ్లులా మొహం నువ్వూనూ, ఏ మాటలివి." దయానిధి వాళ్ళకేసి చూస్తూ నిలబడిపోయాడు.

"సరే నేను వెడుతున్నా కోమలీ..." అన్నాడు ఆకాశం కేసి చూస్తూ. ఆ వ్యక్తులు వినిపించుకున్నట్లు లేదు, తులసి దిమ్మమీద ఆచారి కూర్చోబోతున్నాడు.

"ఉండండి— బట్టలు పాడవుతాయి.  మంచం వేస్తాగా.."అంటూ కోమలి దూరంగా నూతి పళ్లానికి ఆనించి వున్న  నులక మంచాన్ని తెచ్చి వాల్చింది. దానికి వున్న దుష్టచతుష్టయంలాంటి నాలుగు కాళ్ళలోనూ, వొకటి భూమిమీద  ఆనదు. భారతదేశంలో ఐకమత్యం లేదనడానికి ఆ మంచం ఋజువు.

"ఐతే కృష్ణ మాచారిగారూ, నా మొహం కోడిగుడ్డన్నారు గదా. మరి మీదో."

"కోడి పుంజు... ఏం?"

"కోమలి విరగబడినవ్వింది. "లెగండి" అని అతని చెయ్యి పట్టుకు లేవదీసి మంచం మీద కూర్చోబెట్టింది."

"మంచినీళ్ళు కావాలా?"

"ఆహా! అతిథిని నులకమంచం మీద కుదేసి సత్కరించావు. భక్తితో పుష్ప, పత్ర, ఫలతోయము లొసంగిన.."

నవ్వుకుంటూ లోపలికెళ్ళింది. నీళ్ళు తీసుకుని మళ్ళీ వొచ్చింది.

"మరి నే వెడుతున్నాను." అన్నాడు దయానిధి.

"వెళ్ళండి సర్కస్‌కు మీరు తీసుకెళ్ళేదేమిటి? కృష్ణమాచారీ, నేనూ వెడతాం...."

"అవును. అసలందుకనే వచ్చాను కూడా, లే, లే, దబ్బున తిండితిని పోదాం" అన్నాడు కృష్ణమాచారి. దయానిధి వెళ్ళిపోయాడు. బయట మెట్లమీద నుంచుని అప్రయత్నంగా రెండు తలుపులూ దగ్గరగా జేరవేశాడు. సందువేపు చూశాడు. కుక్క దూరంగా మొరిగింది. ఎండిపోయిన ఆకులు రెపరెపమన్నాయి.

కోమలి తలుపులు తీసి అటూ ఇటూ చూసి మళ్లీ భళ్లుమని వేసేసింది. అతనేదో అడుగుదామనుకున్నాడు. వీపు చరిచినట్లు తలుపు చప్పుడైంది. వెళ్ళిపోయాడు. అతనికి కోమలి ప్రవర్తన అర్థంకాలేదు. తను ఆమెకోసం ఎంత ప్రాకులాడుతున్నా ఆమె సమాధానం ఇవ్వదు సరికదా, అతన్ని వెటకారం చేసి ఏడిపిస్తుంది. అతని యవ్వనం కాని చక్కదనం కాని, హోదాకాని ఏదీ ఆమెని ఆకర్షించలేదు. అసలట్లా ఆకర్షింపబడేటందుకు తగినంతగా ఆమె శరీరం పక్వానికి రాలేదేమో. అదొక మందుగుండు సామాగ్రి వేసిన పెట్టి. దానికి ఎవరో నిప్పుముట్టించాలి, అప్పుడు కాని అది బ్రద్దలై బైటపడదు. నిప్పుపుల్ల – నవ్వుకున్నాడు కృష్ణమాచారికి తానే నిప్పుపుల్ల వేస్తానంది నూనెలో ముంచని కాగడా కోమలి, ఆమె చేతిని తాకినప్పుడు వేడితో తన శరీరం కాలిపోయినట్లు అనిపించింది. కాని యిప్పుడు ఆలోచించి చూస్తే ఆ వేడి తనలోదే ననుకొన్నాడు. రాత్రంతా మంచు పీల్చుకుని వికసించలేని పుష్పంలాంటి కోమలిని, ఉదయభానుడి కిరణాలు మాత్రం ఏం చేస్తాయి. యవ్వనం యింకా గృహప్రవేశం చెయ్యలేదు. నిలయం వెతుక్కుంటూ ఆమె శరీరంలో విహారం చేస్తోంది. ఈ ఉపమానాల సారాంశం ఏమిటి? "ఫ్రిజిడిటీ" పాపం! ఆమెపై కోపగిస్తే ఏమిటి ప్రయోజనం? మంచుకొండ అగ్నిపర్వతం కాగూడదూ!

"ఉత్తుత్త చూపుల్లో ఏముంది?"అని అన్న మాటల్లో ఎంతో అర్థం వుంది. ఆకర్షణ అర్థం కాని అమాయకురాలను కోకూడదు. స్త్రీ పురుషుడ్ని అప్రయత్నంగా వేటకి రగల్చడం, అందకపోవడం మరింత కోరదగింది కావడం – యిది అనాదినుంచీ వున్నదే– దాన్నే వ్యక్త పరుస్తోంది. ఆ కృష్ణమాచారెవడూ?

అతన్ని వేటకి రగల్చడానికి, వాడితోనా సరసాలు? వాడితో సర్కస్కి వెడుతుందిట! ఎంత ధైర్యం, ఎంత తెగింపు తనంటే ఎంత నిర్లక్ష్యం, నిరాదరణ! కాని అదంతా సహజమైన చర్యా, లేకపోతే నటనా? నటనైతే అతను క్షమించలేడు. ఏమిటో వెర్రి, క్షమించక చేసేదేముంది? అతను వేట మానుకోలేడు. ఇంద్రియాలు పీకేస్తున్నాయి. పల్చటి ఎముకలు చల్లటి మాంసం – వీటికి తన యవ్వనం దాస్యం చేయక తప్పదు. అతనికి ఏం కావాలి విమర్శించి తేల్చుకున్నాడు. సంస్కారం? ఆమెకు లేదు తనకి అక్కర్లేదు. యవ్వనం వొక ప్రాచీన శక్తి – తరతరాల వ్యక్తులను కాల్చి మట్టి చేసిన బలంతో సృష్టినే వేధించిన ఆ మహత్తర శక్తికి, సంస్కారం, వన్నెచిన్నెలు, నగిషీలు. వంకర తిరిగి, హరిగి బైల్దేరిన స్థానానికి తెచ్చే మానసిక మెట్లు– వీట్లతో ఏ సంబంధం? తర్కాంతారతమ్యం, మంచిచెడ్డలు, నాది, నీది– యివి సంస్కారం కట్టుకున్న పరిమాణాలు. వీటన్నిటినీ వొక్కతాపు

తన్ని తడబడే దృష్టితో చీకట్లో చూసి, మట్టిలో కలసి పోయి– నిశీధి తెరచుకున్న ద్వారాలమధ్య ఆత్మహత్య చేసుకున్న యవ్వనపు శక్తి, సంస్కారాన్ని కోరదు.

పోనీ, చదువు, తెలివితేటలు? ఏ చదువు ఈ అస్థిపంజరపు నిర్మాణాన్ని మార్చగలదు? బుర్ర, మెదడు, యివి దాస్యానికి అంతరాయాలే. అతనికి చదువక్కర్లేదు. సిపాయి విప్లవానికి కారణాలతో ఆ ఎముకలకు నిమిత్తమేమిటి. అవే విప్లవం చేసీ, దాస్యం అనుభవిస్తాయి.

కుటుంబం, మర్యాద, కులం, గౌరవం యివి కావాలా? మొదలే అక్కర్లేదు. కోమలి వాళ్ళ వాళ్ళల్లో పుట్టి వుండకూడదూ? అదేం కర్మమో వాళ్ళ వాళ్ళల్లో ఎందరో స్త్రీలున్నారు పెళ్లికి సిద్ధంగా. వాళ్ళల్లో వొక్కళ్ళు నచ్చకూడదూ? అది అతని దౌర్భాగ్యం మరో దేశపు ముగ్ధ సౌందర్యంలో వున్న ఆకరర్షణ కోమలిలో వుంది. గట్టిగా ఎముకల్ని పట్టుకునే చర్మం – పదునైన మాంసం, ఆ కొత్తదనం మరొకర్లో వుండి వుంటే ఎంత బాగుండును? కోమలి కుటుంబం మర్యాద, కులం, గౌరవం – యివన్నీ వేరు ఇవి కూడా తన ఆకర్షణకి కారణాలే కాబోలు ఖర్మ.

కోమలే కావాలి – యింకెవ్వరూ పనికిరారు. ఆమె శరీరానికి అతను దాస్యం చెయ్యవలసి వొచ్చినందుకు తిట్టుకున్నాడు. కోమల్ని మరచి పోవాలి. యవ్వనానికి ఏస్త్రీ ఐతే ఏం? భారతదేశంలో ఎందరు స్త్రీలు లేరు. కోమలికంటే అందమైనవారు, తెలివైనవారు, గౌరవమైనవారు. తనే ఎరుగున్న వాళ్ళు ఆరుగురుదాకా వున్నారు. అతనితో కాలేజీలో చదువుకున్న మళయాళీపిల్ల శోభ లేదు? భాస్కరరావుగారి చెల్లెలు రమణి లేదు? అప్పారావుగారి అఖరమ్మాయి శకుంతల? అందాకా ఎందుకు ప్లీడరు గుమాస్తా కుటుంబయ్యగారి కూతురు శ్యామల? కొంచెం మెల్లకన్ను వున్నా ఎంత బాగుంటుంది? ఎంత అందమైన మెల్ల?

వీళ్ళందర్నీ వొక్కసారి ఊహా ప్రపంచంలో తిప్పి చూశాడు దయానిధి. ఆ మధ్య సంబంధాలు మూడు చూసి వొచ్చాడు. ఒకమ్మాయి తండ్రి అతన్ని ఇంగ్లాండు పంపడానికి సిద్ధపడ్డాడు కూడాను. వాళ్ళని కూడా, సర్కస్ గుర్రాలలా తిప్పి చూశాడు. కోమలి సర్కస్‌కి వెడుతుంది కాబోలు, కాని ఏం లాభం? అతని దృష్టి వాళ్ళల్లో ఎవ్వరిమీదా కేంద్రీకరించటంలేదు. వాళ్లని వాంఛించలేదు. వాళ్ళంతా మహా పతివ్రతలు. వాళ్ళెవరూ అక్కరలేదు. వాళ్లతో మాట్లాడొచ్చు, చీట్లాడొచ్చు, బజారెళ్ళొచ్చు కాపురం కూడా చెయ్యొచ్చు. కాని బాబో, వాళ్ళని తాకడం ఎట్లా? హరామీ చేస్తున్న గుర్రంలా, ఇంద్రియాలు వెనక్కి నడుస్తున్నాయి. వెలిగి పోతున్న కాగడాని ఐస్‌టబ్‌లో ముంచినట్లు ఛీ ఛీ ఏమి ఆలోచన్లు. తప్పదు కోమలికి దాస్యం. పోనీ కోమల్ని చంపివేస్తే! ఒక ప్రాణికి ఒక ప్రతిభతో కొట్టుకుంటున్న హృదయానికిదొక సృష్టి కోసం నిశీధి తలుపులు పగలగొట్టిన శరీరానికి, ఆమె కలిగించిన బాధకి అదే ప్రాయశ్చిత్తం! అట్లాంటి వాళ్ళని చంపడం అపచారం కాదు, సంఘసేవ. ప్రపంచానికి పరమార్థం.

పాపం. అవులించడం కూడా చేతగాని అమాయకురాలు. కోమల్ని అని ఏ లాభం! కోమలితో యీ ప్రపంచానికి నిమిత్తం వుంది. ఆమె తల్లిగా అయి, స్త్రీ త్వాన్ని నిలబెట్టి, సృష్టికి ఒక పుష్పం అర్పిస్తుంది. తనెందుకు? డాక్టరై తను

ప్రపంచాన్ని వుద్ధరించేదేముంది. తనే చచ్చిపోతే యీ బాధ వుండదుగదా! నిజంగా స్కూలు మేష్టర్లు, డాక్టర్లు మరణించిన తర్వాతే సంఘానికి వుపయోగపడతారు. మేష్టారు చచ్చిపోయారంటే స్కూలుకు సెలవు. డాక్టరు పోయాడంటే ఫీజ్ ఎగేసిన పేషెంటుకు విశ్రాంతి!

కోమల్ని ఎనాటమీ బల్లమీద వూహించాడు. అబ్బ డోకొస్తుంది. ప్రతి అవయవాన్నీ, కోసి చీల్చి పారేశాడు. అన్నీ వొచ్చి అతుక్కుని కదిలి అతన్ని వెక్కిరించాయి. ఛీ, ఛీ, ఏమిటీ ఆలోచనలు!

అప్పుడే యింటికొచ్చేశాడు. ఇంటిముందు జాతర జరుగుతుంది. ఏవో నెత్తిన పెట్టుకుని ముగ్గురు ఎగురుతున్నారు. చెవులు బ్రద్దలయ్యేటట్లు కఠోరమైన డప్పుల ధ్వనులు, గుంపులో తన్మయుడైన నారయ్య. కుటుంబయ్యగారి శ్యామల ఎత్తు అరుగుమీద మంచుని చోద్యం చూస్తోంది. అతను దూరంగా తూము దగ్గర నిలబడి గుంపుని చూస్తున్నాడు. ఇప్పుడు ఇంట్లోకి వెడితే, నాన్నగారు కేకలేస్తాడు. ఎక్కడికి వెళ్ళిందీ ఆరా తీస్తారు. ఈ నారయ్య వాగేసి వుంటాడు. అందరూ నిద్రపోయింతర్వాత, మెల్లగా యింట్లో దూరి అరుగుమీద మంచం వాల్చుకు పడుకుంటే, రాత్రి గడిచిపోతుంది. ఉదయం మనస్తత్వాలు మారతాయి. అప్పటికి యెనిమిది కావొస్తుంది. అంతా నిద్ర పొయ్యేవరకూ ఏం చెయ్యడం? కోమలి, కృష్ణమాచారి సర్కస్ కెడతామన్నారు. తనూ వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

కోమల్ని ఆ సర్కస్ గుంపులో దూరాన్నుంచి, రహస్యంగా చూడాలి. వాళ్ళమ్మ కూడా వొస్తుంది కాబోలు. అట్లాంటప్పుడు కృష్ణమాచారి అంత చనువు తీసుకోడు. ఐనా చూడాలి. ఏం చేస్తారో, నాలుగు నెల్ల క్రితం, మధ్యాహ్నం నిద్రించి లేచిన కోమలి మొహం జ్ఞాపకానికొచ్చింది. ప్రపంచంలో అసంతృప్తిలోని బరువు నంతటినీ మోస్తున్నట్లుగా వుండే కనురెప్పలు, లోకాన్ని చూసి జాలిపడుతూ చప్పరించుకునేటందుకు సున్నాలా ముడుచుకున్న పెదవులు, నిద్రలో గుండ్రటనాన్ని పోగొట్టుకుని చదరంగా మారిన పిల్లాడి భుజాలు – అన్నీ జ్ఞాపకానికొచ్చాయి. వేడి , వాంఛ, చలించటం యివేమీ లేవు ఆమెలో! ఫ్రిజిడిటీ! ఏ ఒక్క దృశ్యం నిశ్చలంగా మనస్సులో వుండిపోదు. కావలసిన వ్యక్తిని ఊహించ యత్నించిన కొద్దీ అది మరింత దూరమై, మసకై మరింత అతీతమైపోతుంది. అప్రయత్నంగా ఏదో చూస్తున్నప్పుడూ, ఏదో వింటున్నప్పుడూ, ఏదో వాసన చూస్తున్నప్పుడూ ఆకస్మికంగా కోరుకున్న వ్యక్తి ఊహలో చొరబడి రంగుల కుంచెతో తన ప్రతిమని తనే చిత్రించుకుంటుంది. ఆ ప్రతిమని వుంచుకోవడం, రప్పించడం, త్రోసి వెయ్యడం మనకి సాధ్యం కావు.

జేబు చూసుకున్నాడు. కొద్దిగా చిల్లర వుంది. సర్కస్ కెళ్ళాలంటే డబ్బు కావాలి. ఎట్లా? పర్స్ జేబులో వేసుకురానందుకు తిట్టుకున్నాడు.

వైకుంఠంగారింటికి వెళ్ళాడు– వైకుంఠంగారు హెడ్‌మాష్టర్ కాకుండానే, అసిస్టెంటుగా వుండగా రిటైరయ్యాడు. ఆయనకి ముగ్గురు మొగపిల్లలు, నలుగురు ఆడపిల్లలు; ఐదుగురుకి పెళ్ళిళ్ళు చేశాడు. ఇంకా పెళ్ళిళ్ళు కావలసిన వాళ్లు ఇద్దరాడపిల్లలున్నారు. దయానిధి ఫిఫ్తుఫారమ్ ఆయన దగ్గరే చదువుకున్నాడు.

సైన్సులో ఫస్టుగా వుండే వాడని యితనంటే ఆయనకి ఎంతో యిష్టం. ఆలస్యంగా వచ్చినా అసలు క్లాసుకి రాక పొయ్యినా, యితన్ని ఆయన ఏమీ అనేవాడు కాడు. పరీక్షల్లో రాసిన వానికంటే యెక్కువమార్కులు వేసేవాడు. ఆయనకి తనంటే అంతటి అభిమానం ఎందుకుందో దయానిధికి తెలీదు. అసలు అభిమానం వున్న సంగతే అతనికి తట్టలేదు. అతనికి ఏ మేష్టరన్నా యింత వరకూ సరయిన గురుభక్తి కలగలేదు. ఎవ్వరూ అతని హృదయానికి దగ్గరగా వచ్చినవాళ్ళు లేరు. మేష్టర్లంతా ఏకమై, యేదో అతని దగ్గరనుంచి దాస్తోన్నట్లు, అతనూ అనుమానపడుతుంటాడు. "మనకేమీ తెలీదు! జీతాలెక్కువచేసేవరకూ, ఆఖరి యీ విషయం కూడా ఎవళ్లకీ తెలీనివ్వొద్దు" అని మేష్టర్లంతా కాన్ఫరెన్స్‌లో తీర్మానం చేసుకున్నారని అతని గట్టి విశ్వాసం.

"వైకుంఠంగారు మడతమంచం వాల్చుకుని పడుకున్నారు. ఏదటో నల్లకుక్క మంచం కింద నక్కింది. కాంతమ్మ చెంబులో నీళ్ళు తెచ్చి పెట్టింది. రాధ వెన్నెల్లో తన నీడతో ఆడుకుంటోంది."

"రావోయి నిధీ రా— ఏమిటి భోజనాలయ్యాయా? షికారు బైలుదేరినట్లున్నావు— గోపాలం—దీపం—లోపలికి పట్టుకుపో — గోపాలం — నూనె ఒత తమ్ము సరిచేసుకుంటూ లాంతర్ని లోపలికి పట్టుకెళ్ళాడు.

"ఇంకా లేదండి — వస్తారు. ఇంట్లో పని తోచక —"

"అవునవును— మద్రాసులో చదువుతున్న యువకులకి యీ పల్లెటూళ్ళల్లో ఏం తోస్తుంది? మీ నాన్నగారు క్లబ్బునుంచి వొచ్చేరా—"

"తొయ్యకేమండీ— పుస్తకాలు, చదువు, క్లబ్బు, స్నేహితులు, కాలవగట్టు ఎంతోహాయిగా వుంటుంది— పైగా సర్కస్ వొకటొచ్చిందిగా — పడదామని బుద్ధి పుట్టింది. మీరు చూశారా —"

"ఇద్దరి భార్యల్ని భరాయించే అప్టుడేటు భర్తలాంటిది కాదు యీ మంచం— ఒరేయ్ గోపూ. ఆ కుర్చీ యిలా లాక్కురా—"

ఆ కుర్చీ ఇద్దరు ముగ్గురు కలిసి లాక్కొస్తేకాని ఒచ్చేరకం కాదు. ఏ భాగానికా భాగం వూడనూ వూడదు— అతకనూ అతకదు. వైకుంఠంగారు దాన్ని ప్రేమతో తిలకించాడు.

"నా హెడ్‌మాష్టరీ లాంటిదే దాని బ్రతుకూను...."

"మీకేమండి కీర్తి సంపాదించారు."

"మేష్టరుకి బ్రతికుండగా కీర్తి రాదు. అమాటకొస్తే చచ్చింతర్వాత కూడా రాదు. రిటైరయింతరువాత దివంగతుడైతే కనీసం సెలవేనా ఇవ్వరు.." అని ఆయనే నవ్వుకున్నాడు.

"ఐతే, మేష్టారు, మొత్తం మీద మీరు మేష్టారుగా పని చేసినందుకు మీకు గర్వంగా వుందా?"

"అసలు జీవించినందుకే గర్వంగా వుందనుకుంటాను... ఏమిటీ? నువ్వు అందరిలోనూ అడగకూడని ప్రశ్నలడుగుతున్నావు! ఏం కథ, కొంపతీసి డాక్టరు చదువు చాలించి మేష్టరవుతావా ఏమిటి?"

దయానిధి నవ్వాడు. "లేదండి డాక్టరుగా వుంటే మేష్టరీ వృత్తి జోడించొచ్చు. పైగా యీ రెండు వృత్తులకీ ఇంకా దగ్గరగా సంబంధం ఉంది లెండి. మేష్టర్లు నేడు బోధించే బోధనవల్ల, పిల్లలందరూ పెద్దవాళ్ళు కాగానే పేషెంట్లకింద మారిపోతారు–" అని యింకా వాక్యం పూర్తి కాకుండానే వైకుంఠరంగారు అందుకుని "అవును ఆ పేషెంట్లనీ నేటి డాక్టర్లు అధమం జబ్బు పేరేనా చెప్పకుండా, పైలోకానికి రవాణా చేసేస్తారు.." పూర్తి చేశారు.

"మేష్టారూ! మీకు ఈ లోకం, పరలోకం అంటూ వున్నాయని నమ్మకం ఉందన్నమాట! ఐతే, జీవితానికి అర్థమేమిటంటారూ."

వైకుంఠరంగారు లేచి నిలబడ్డాడు. ఎవరో కొంటెపిల్లాడు ఆయన పాగా లాగేసినట్లయింది.

"చూడు, ఇట్లాంటి ప్రమాదకరమైన ప్రశ్నలు ఇంటిదగ్గర నలుగురూ వింటూండగా వెయ్యకూడదు. తెలిసిందా?" అంటూ దయానిధి బుజం మీద చెయ్యివేసి లేవదియ్యబోయ్యాడు. ఇద్దరూ రెండడుగులు ముందుకు వేశారు.

"ఇల్లాంటి ప్రశ్న వెయ్యవల్సిన అవసరం ఏమొచ్చింది నీకు ఇంత చిన్న వయస్సులో!"

"అడగడం తప్పుగా తోస్తే నన్ను క్షమించండి.."

"అది కాదు నిధీ.. సృష్టిని గురించి ఒక వ్యక్తి ప్రశ్నలు వేశాడంటే ఆ వ్యక్తి జీవితంలో ఏదో లోపం ఉందన్నమాట. గొప్ప రాజకీయ సంఘటనలు వంటింట్లో జనిస్తాయి. గొప్ప వేదాంతపు ఉద్యమం పడకటింట్లో పుడుతుంది... మరిచాను. నీకింకా పెండ్లి కాలేదుగా... మా కాంతానికి ఏదేనా సంబంధం చూడవోయి దబ్బున."

"దయానిధికి భయమేసింది. అతన్నే చేసుకోమంటాడేమోనని! మాట తప్పించడానికి ప్రయత్నించాడు."

"ఇంతకీ నాప్రశ్నకి సమాధానం చెప్పారు కారు" అన్నాడు.

"నీ పెళ్ళి కానీ, తరువాత అడుగు చెబుతాను. మా కాంతానికి మంచి కుర్రాడిని చూడాలోయ్–మీ కాలేజీలో నీతో చదువుతున్న వాళ్ళల్లో ఎవరేనా..."

తరువాత వాక్యం దయానిధి వినిపించుకోలేదు. అతన్ని చేసుకోమని అడగనందుకు ఆశ్చర్యపడ్డాడు. మంచి కుర్రాడిని చూడాలిట తను మంచివాడు కాడూ? వైకుంఠరంగార్ని గురించి తనకున్న అభిప్రాయం మార్చుకోవాలనుకున్నాడు. ఇప్పుడు తనకి కావల్సింది డబ్బు.

"నేను సర్కస్‌కి వెడదామనుకుంటున్నాను. మీరూ వొస్తారా ఏమిటి?"

"నా ఇల్లే, ఓ సర్కస్– వేరే సర్కస్ చూడటం దేనికి? మా ఆవిడ రింగ్ మాష్టర్– సారీ , మిస్ట్రెస్.."

"పోనీ, మీ గోపీని పంపండి, ఇద్దరం వెళ్ళొస్తాం."

"గోపి మొన్న వెళ్ళొచ్చాడు. ఐనా ఇప్పుడేం తొందర నువ్వింకా నెలదాకా వుంటావుకదా– యీ సర్కస్ వొచ్చింది మొన్ననేగా.. వెళ్ళొచ్చులే..." దయానిధికి కావలసిన డబ్బు ఏ విషయం మీద అడగాలో తెలీలేదు. సర్కస్ దగ్గరికి వెడితే, అక్కడ ఎరుగున్నవాళ్ళెవరేనా వుండొచ్చు పర్సుపోయిందంటే, ప్రొప్రయిటర్

తరువాత చూసుకోవచ్చునని ప్రవేశం ఇవ్వొచ్చు. అసలు టికెట్టు లేకపోతే మాత్రం ఏమొచ్చిందీ? అతను చూడదల్చుకున్నది సర్కస్ కాదుగా. ఎల్లాగా డేరాకి బోలెడు కంతలుంటాయి. వాటిల్లోంచి చూడొచ్చు– సగం ఆట అయింతర్వాత, టిక్కెట్లు, పట్టింపు వుండదు. ఏమీ లేకపోతే ఆటముగిసింతర్వాత, కోమలి బైటకొస్తుందికదా! అప్పుడే చూడొచ్చు. వైకుంఠరంగారి దగ్గర సెలవు తీసుకుని నడవడం మొదలెట్టాడు.

నడుస్తుంటే ఏవేవో ఆలోచనలొస్తుంటాయి. స్థిమితంగా కూర్చుని ఆలోచించడం చేతకాదు.

ఆలోచన సాగిస్తుంటే ఏదో బరువు తగ్గినట్లుగా వుంటుంది కాని ప్రస్తుతపు విషయాలను గురించి అతను ఆలోచించలేక పోతున్నాడు! ప్రస్తుతం అంటే– యదార్థం, ఇప్పుడే ఏదో నిర్ణయించుకోవాలి. కర్తవ్యానికి దిగాలి, దీనికి ధైర్యం లేదు! భయంకరమైన యదార్థం. ఇతరుల సలహా పనిచెయ్యదు. దీనికి సమాధానం పుస్తకాలివ్వలేవు. చరిత్ర తనని తానే అనుకరిస్తుందన్నది సత్యంకాదు. ఒక సమయంలో ఒక చోట ఏర్పడ్డ పరిస్థితులు, ఎప్పుడూ, ఎక్కడా మళ్ళా ఏర్పడవు. ప్రతి సంభవం అపూర్వమైనది, దానికదే సాటి. అల్లాంటప్పుడు చరిత్రలో మానవ సంఘాన్ని హృదయము యొక్క పరిణామాన్ని కొలుచుకొని, అందులోంచి భవిష్యత్తుకి వుపయుక్తమయ్యే సిద్ధాంతాలను, ప్రతిపాదించటం గొప్ప పొరబాటు. ప్రాకృతిక సిద్ధాంతాలను అనుకరించవచ్చు. అవి తప్పవు. వాటిని ఎవ్వరూ అతిక్రమించలేరు. సూర్యుడు ప్రతి నిత్యమూ తూర్పున ఉదయిస్తాడని అనుకొని ప్రవర్తించటంలో హాస్యాస్పదమేమీ లేదు. కాని సిపాయిల తిరుగుబాటు విజయనగర సామ్రాజ్య పతనం మళ్ళా ఆ పరిస్థితులను సృష్టిస్తే సంభవిస్తాయనుకుని, చారిత్రక సిద్ధాంతాలని ప్రతిపాదించి వాటిని తొలగించడానికి, మార్గాలు వెదకడం హాస్యాస్పదమే.

ఆలోచన, వర్తమానాన్నుంచి తప్పించుకుని పారిపోయేటందుకు ఇవ్వబడిందా?

జరిగిపోయిన విషయాలను స్మరించుకోవటం, ముందు జరగబొయ్యే విషయాలను, ఊహించుకోటం – ఇదే ఆలోచన చేసేపని వర్తమానాన్నుంచి పారిపోతుంది. ఫలితం? సగం సగం ఆలోచనలు, బుర్ర అలసిపోవడం, శరీరం బాధపడటం.

అన్నయ్య దెబ్బలాడి వెళ్ళిపోయాడు – ఆనాడు పెట్టె వీధుల్లోకి గిరవాటెట్టాడు. తక్షణం ఇంట్లో నుంచి పొమ్మన్నాడు. ఎక్కడికి పోతుంది. "మా అమ్మని మా నాన్న వదిలేస్తే, నీకభ్యంతరం వుందా? ఎంత ధైర్యంగా అడిగాడు. తను అడ్డం రాకపోతే ఏనాడో ఆ సంసారం భగ్నమైపోను. కోమలి కోసం పడే బాధ అమ్మకి తెలుసు. రక్తం చెబుతుంది. హృదయంతో అర్థం చేసుగుంటుంది. తప్పని దండించదు. సరే నంటుంది. ప్రపంచంలో అందరికీ అమ్మలా అర్థం చేసుకునే హృదయం ఉండకూడదూ! అమ్మనే సంఘం ఏమంది! హృదయం వున్న వాళ్ళని సంఘం దూషిస్తుంది సంఘం కోరేది, మానవుడి ఆనందం, క్షేమం కావు. అది కోరేది నమ్రతా, విలువలు. మనకి లేని అనుభవం, ఆనందం ఇతరులకెందుకు? అనుకొని సంఘం వాటి వినాశానికి దారితీసే ద్వారబంధాలని నిర్మాణం చేస్తుంది.

పాపం, సంఘాన్ని దూషించడం ఎందుకూ? సంఘం ఏం చేసింది? కాస్త– వాసుఖాన్ని ఆనందాన్ని, వీటిని గురించి ఆలోచించడం మానుకుని, కొంచెం వీటిని త్యాగం చేస్తేనా, ఇతరులు కూడా హాయిగా ఉంటారు– కాబట్టి, నేపెట్టిన

నియమాలని అతిక్రమించకుండా జాగ్రత్తగా నడుచుకోమంటుంది సంఘం. "నీ ఇష్టం నీతి అనుకో, సాంప్రదాయమనుకో— నీకు సంఘంలో ఉన్నంతవరకూ వీటితో నిమిత్తం తప్పదు పిచ్చివాడా"అంటుంది. నక్షత్రాలని తారామండలంలో "విధి" పడిపోకుండా నడుపుతుంది. సూర్యచంద్రాదులు వీటికి అతీతం కాలేదు. చెట్లు, నదులు, కొండలు, అట్లా ఉండిపోతాయి? సృష్టిని సైతం నోరునొక్కి కట్టి పడేసింది "విధి".

కోమలికి ఇవేమన్నా అర్థమౌతాయా? ఆమె కోసం అతని హృదయం ఎట్లా తన్నుకులాడుతోందో, తెలియచెయ్యడం ఎట్లా? ఆమె పాదాల బూడిదతీసి, ఫేస్‌పౌడరు క్రింద రాసుకుంటానంటే! "ఛీ"అని ఉమ్మేస్తుంది. మరో ప్రపంచంలో వారిద్దరూ ఒక శరీరమే! ఇక్కడెందుకో విడిపోయారు. తను మరణించి ఆమెతో ఐక్యం కావాలంటే ఇద్దరూ కైలాస పర్వతంపై నుంచి పారే మంచునది లో పడి, కొట్టుకుపోయి నాశనమవాలి. పవిత్రతతో పొంగిపొయ్యే ప్రేమ కాదు అది. కళ్ళు మురిసిపోయి పొంగిపోయేటందుకు సంకల్పించిన కలయిక కాదు. అదొక జబ్బు— జాడ్యం దాని కెవ్వరూ బాధ్యులు కారు. పెద్దలు, నీతి మర్యాద, ఔచిత్యం, సంఘం వీళ్ళెవరినీ నిందించకూడదు. ఆ శక్తి అతనిలో పుట్టి ఆమెలోనే అంతమొందాలి. కాదు కాదు. అతని శక్తి నంతటినీ ఆమె దాచుకుంది. అతని పంచప్రాణాలు అతనిలో బిగించి తాళం వేసి, తాళం చెవి బొడ్లో దోపుకుంది. మొలమట్టూ చీర తిప్పి అరటిపండులా కట్టుకుంటుంది. అమ్మమ్మ వెనక చెప్పిన కథలో ఒక రాక్షసుడి ప్రాణాలు, రామచిలుక కంఠంలో వుండేవిట. ఆ కంఠం పిసికితే వాడు చస్తాడు. తన బ్రతుకు ఆ రాక్షసుడిలాగై పోయింది.

చంద్రుడు చరాచరా కదిలిపోతున్నాడు. మేఘాలు కల్పించిన ఆటంకాలను చుట్టూ కట్టుకున్న చక్రంతో తొలగించి కదిలిపోతున్నాడు. ఇండ్లల్లో పొగి హొయ్యారంగా ఆకాశంలోకి లేస్తోంది. కీటకాలు గాలి ఒత్తిడికి తట్టుకోలేక అమాయకంగా మనుష్యుల మొఖాన్ని కొడుతున్నాయి. ఎక్కడో అసందర్భమైన కాకి అరుపు, అర్థంలేని కుక్క మొరుగు, కాళ్ళు కడుక్కునేటందుకు మనుషులు చేసే నీళ్ళ చప్పుడు, పులిస్తరాకులు పారేసిన శబ్దం అన్నీ దూరంగా వెళ్ళిపొయ్యాయి. దూరంగా సర్కస్ బాండు, గుడి గంట చప్పుడుని ముంచి వేస్తోంది. సన్నగిల్లిన దీపాలు, గుంపులు మాట్లాడుకొంటున్న చప్పుడు, మానవబృందం కులాసాకోసం గుమికూడింది. యీ సమూహంలో కోమలి కనిపించలేదు. ఆజానుబాహు కృష్ణమాచారి కూడా లేడు. లోపల ఎక్కడో ఉంటారు. కామాక్షి కూడా లేకుండా వాళ్ళిద్దర్నీ ఒంటిగా పంపుతుందా?

"లోపలికి దయచెయ్యండి బాబు.."

తనెవరైందీ ఆ ప్రొప్రయిటర్‌కి ఎట్లా తెలిసిందో.

"అబ్బే, సర్కస్‌కి వద్దామని రాలేదు— వూరికే షికారు బయలుదేరాను...."

"నాన్నగారు రాలేదు? ఇవాళ మోటార్ సైకిల్ జంప్ కూడా ఉంది. పోనీ కాసేపు కూర్చుని పొండి."

నాన్నగారికి కాంప్లిమెంటరీ వచ్చి ఉంటుంది. లేకపోతే వుచితంగా రమ్మంటాడా? లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. అరుగో డాక్టరు గోపాలరావు నాయుడు, భార్య, వాళ్ళ అబ్బాయి కూడా వచ్చారు. రెండో అబ్బాయి. ఇప్పుడు ఏం చేస్తున్నాడో....

దూరంగా పులి ఘర్జిస్తోంది — చుట్టూ చూశాడు ఎక్కడా వాళ్ళొచ్చిన జాడలేదు తనని బలే దగాచేశారు. ఇంట్లో మాత్రం ఒంటరిగా ఎందుకుంటారు? వాళ్ళమ్మ కూడా వుంటుందిగా. అబ్బ, లోపల ఉక్కగా వుంది గాలి లేదు. డేరాలో పైనున్న చిల్లులోంచి లక్షత్రాలు కలిపిస్తున్నాయి. ఈ నక్షత్రాలని కానీ కర్చులేకుండా అందరూ చూడవచ్చు కదా! కోమలి వాటికేసి చూస్తూ కూర్చుంటుంది కాబోలు! ఆమె నేత్రాలే మబ్బు మధ్య మెరిసిన నక్షత్రాలు, తెల్లచీరె చంద్రుడిపై నుంచి పచ్చగా కదిలిన మబ్బు, ఇల్లా పోల్చుకుంటూ వర్ణనలతో ఎంతకాలం తృప్తి పడటం? భాష, భావాలు, వ్యూహో ఉండబట్టిగాని, లేకపోతే మూగబాధ ఎంత పెద్దది? ఊహించుకుని తృప్తి పడకపోతే వాంఛ నునిషిని హరించేస్తుంది గాలికోసం అప్రయత్నంగా బైటకొచ్చాడు.

ఇంకా ఆట ఆరంభం కాలేదు. వాళ్ళు ఈ పాటికి వస్తూ వుంటారేమో— గేటు దగ్గరే నుంచుంటే, తప్పకుండా కనబడతారు మారువేషం వేసుకుంటే తప్ప. ఏమో వాళ్ళు ఎంతయినా తగుదురు. కృష్ణమాచారి నాటకాలలో ఆడవేషం వేసేవాడుట— ఎవరు చెప్పారు చెప్మా! కోమలికి లాగు, చొక్కా వేస్తే అచ్చంగా కుర్రాడులా వుంటుంది. కాని ఆ జుట్టుని ఎక్కడ దాచుకుంటుంది? నీకూ నాకూ మధ్య నీడలా పడిన నిశీధినీ జుట్టులా— ఎక్కడిదో ఈ భావం? భావాలు చాలా విచిత్రమైనవి. మన సొంత భావాలు, ఎవరివోలా కలిపిస్తాయి. ఎవరో చెప్పినవి మనసొంతంలా కనిపిస్తాయి. సజంగా కొత్తభావాలంటూ లేవు ఆకలి, నిద్ర, దాహం, ఆకర్షణ, అసంతృప్తి, జీవితంపై మమకారం— అందరికే ఇవి సమానమే. కొత్తవి ఎట్లా వస్తాయి? భావాలు మానవులందర్నీ ఏకం చేస్తాయి. వాటిని చెప్పడంలో ప్రయోగించే వివిధ భాషలు, మానవుల్ని విడదీస్తాయి. ప్రాణంపై తీపి తీసుకోండి, చావడానికి ఎవరూ ఇష్టపడరు. చచ్చిపోయింతర్వాత కూడా బ్రతకాలన్నంత తీపి...దానికోసం, మరో లోకం, స్వర్గం, స్వర్గానికి అధిపతి ఆత్మ అక్కడికి చక్కాపోయి, శాశ్వతంగా ఉండడమో, లేకపోతే మళ్ళా కొన్ని జన్మములు ఎత్తి — మానవ జన్మమే ఎత్తాలి. మళ్లా— ఆత్మని శుద్ధం చేసుకుని, మళ్ళా పైకి పోయి పరమాత్మలో ఐక్యం కావడం, ఇన్నిటిని కల్పించుకుంది జీవితంపై మమకారం. అంతేకాదు. ఈ జీవితం అంతా అసత్యం, శరీరం మాయ, బ్రతుకు కల, పరమాత్మలో జీవాత్మ ఐక్యం కావడం సత్యం, అని నమ్మమని చంపుకుతింటుంది ఈ మమకారం.

శరీరంపై శరీరాన్ని సైతం త్యాగం చెయ్యమని ప్రబోధించేటంతటి మమకారం ప్రాణానికి ఈ మతాలు, ఈ దేవుళ్ళు, ఈ ఆదర్శాలు, భాష కల్పించినవే కదా పాపం. ఈ భావాలే యథార్థాలని నమ్మి తృప్తి పడతారు అమాయకపు మానవులు. కోమలి శరీరం మట్టి, హృదయం భ్రమ, ఉనికి మాయ, స్థలంలో లేదు. సమయంలో లేదు. ఆమెని గురించిన భావాలే తనకి గోచరించే యదార్థం. భావాలు లేకుండా బుర్ర మాత్రం వుంటే ఎంత హాయిగా వుండును. అదుగో వస్తున్నట్లున్నారు, అబ్బే కాదు వాళ్ళెవరో— మాయ సంఘంలో సంసార కూపంలో పడి, జంతుజాలంతో, ప్రకృతితో వుండే బాంధవ్యాన్ని వొదులుకున్న ఒక మనుషులజోడా—మళ్ళా ప్రాచీనత్వాన్ని పొందడానికి సర్కస్‌కి వస్తున్న దుస్తులలో జంతువులు. ఆకలేస్తోంది. సోడా తాగాలి. ఆకలి, దాహం ఆలోచన— పూర్తికాగానే నీరసం, నాలిక పీక్కుపోవడం, బుర్ర వేడెక్కి

బ్రద్దలు కావటం— ఆకలి దాహం, ఆలోచన యుగ యుగాలుగా పెరిగి రంగు పంపించుకొని పుష్పించిన రోజా పుష్పం కోమలి అధరాలు. యుగ యుగాలుగా కొండశిఖరాలపై మంచు కురిపించి మత్తెక్కిన చంద్రబింబాలు కోమలి నేత్రాలు. అనంతం నుంచి ప్రళయంలో ఉద్భవించి మూగదైపోయిన ప్రపంచం రొద కోమలి కంఠధ్వని—ఆకలి, ఆలోచన—

"ఇక్కడున్నారంటండి, అబ్బాయిగారూ..."వెనక్కి తిరిగాడు.

"ఏం నారయ్యా? నువ్వెక్కడవేనా?"

"మీ కోసం బజారంతా వెతికానండి. కాలవకాడి కెళ్ళాను.. కామాక్షింటి కెళ్ళాను."

"కోమలి ఉందా?"

"ఉండకెక్కడికి పోద్దండి? తొంగుంది ఆఖరికి వైకుంఠంగారు చెప్పారండి. సర్కస్‌కాడకెళ్ళమని."

"అంత హడావుడి దేనికి నారయ్యా?"

"ఏం చెప్పనండీ అన్నయ్యగారెళ్ళిన కాణ్ణుంచి అమ్మగారి కొకటే ఆవేశం, గుండెదడ— మిమ్మల్ని దబ్బున తీసుకురమ్మన్నారండి."

"మళ్ళీ ఫిట్ వొచ్చిందా?"

"కావుసునండి— మాట్లాడటం లేదండి...నాన్నగారు డాక్టరు కోసం వెళ్ళి మిమ్మల్ని తొందరగా రమ్మన్నారండి.. బండిమీదెళ్ళండి. నేనల్లా గెల్లి తేనె తీసికొస్తానండి."

"నారయ్యా, అయితే కామాక్షింటికి ఎందుకెళ్ళావూ? అమ్మ వెళ్ళమందా?"

"వాటికేంలెండి ముందు తొందరగా కదలండి బాబూ..."

దయానిధి ఇంటివేపు నడవడం మొదలుపెట్టాడు. అన్నయ్య ఊరికెళ్ళటానికి, అమ్మకి ఫిట్ రావడానికి సంబంధం లేదు. ఫిట్లు అప్పుడప్పుడు వస్తూనే ఉంటాయి. రక్తం తక్కువ, నరాలకి పటుత్వం తక్కువ. ఎప్పుడూ ఏదో ఆలోచించి ఏదో ప్రమాదం తెచ్చి పెట్టే మెదడు తను స్వంతంగా తయారుచేసుకున్న మందులు తప్ప డాక్టర్లిచ్చిన మందులు పనికిరావుకాదా! ఇంట్లో గొడవలు తను తెచ్చి పెట్టుకున్నవే. వయస్సు మళ్ళింది. హాయిగా పేచీ లేకుండా సంసారం చక్కబెట్టుకోరాదూ? తండ్రి సంపాదిస్తున్నాడు. పెద్దకోడలు కాపరానికొచ్చింది. ఇప్పుడైనా తన జీవితాన్ని ఒక మార్గంలో పడేసుకొని, వొడిదుడుకులు లేకుండా నడుపుకోరాదూ? ఎన్ని వుపన్యాసాలిచ్చారు? ఎందరెందరు, ఎన్నెన్ని చెప్పి చూశారు. ఎంత బెదిరించారు తిట్టారు. ఇంట్లోంచి పంపివేస్తామన్నారు? గోవిందరావుగారు— "ఏరా, అమ్మని పంపించేస్తే నీకిష్టమేనా?"అని అడిగాడు. ఎంత తెగింపు? అన్నయ్య సరేనన్నాడుట నాన్నకి అర్థంకాక పంచెలో మొహం దాచుకున్నాడట! తను "వీల్లేదు"అనగలిగాడు. ఎక్కడికిపోతారు? కుట్రలతో, రహస్యమైన మూగవాంఛలతో, బహిర్గతం కాని ప్రవర్తనతో, కుళ్ళి సంసారంలోనే వుండి, "మేం మర్యాదస్తులం" అని చెప్పకుంటూ, గౌరవంగా నటిస్తూ అందులోనేవుండి పోవాలిగాని, హిందూ కుటుంబం, విడిపోవటమే! కుటుంబంలో ఐక్యత చూపడానికి కావల్సింది నీతి, న్యాయం, మంచి కావు. కావల్సింది నటన. భర్త దుష్ప్రవర్తనలని భార్య చూడనట్లు నటించాలి, అవసరం

వాస్తే ఆమోదించాలి. భార్య దుండగాలు భర్తకి తెలియకుండా చేసుకోవాలి. తెలిస్తే భర్త క్షమించాలి. కొడుకు చేష్టల్ని, తండ్రి తలుపు సందులోంచి చూసి ఏమీ తెలీనట్లు నటించాలి. పెద్దల యెడల వుండవల్సిన గౌరవం, వాళ్ళు చేసే పనులన్నిటినీ ఉత్తమ కార్యాలని మెచ్చుకుని, పిన్నలు కూడా ఆచరించే అవసరం రావడానికి తగినంత నటన కనపర్చాలి. "నువ్వుదారుణాలు చెయ్యొద్దు. చేస్తే పట్టుబడిపోకు సుమా"అంటుంది నేటి సంఘంలో మర్యాద. "ఎల్లాగ"అని చేతులు పైకెత్తి అడుగుతారు, నటించమంటుంది. "అందరూ నటిస్తే అది నటనగా కనపడదు"అంటుంది. గోవిందరావు గారింట్లో జరిగేపని యిదే. ఆ పెద్దమనిషి తనిల్లు చక్కబెట్టుకోకుండా, తనతల్లి విషయం అతనికెందుకో! కాలేజీ చదువుకుంటున్న గోవిందరావు కూతురి పేరు ఎన్నిసార్లు గోడలమీద వ్రాయడం, చెరపడం, వ్రాయడం మానిపించటం, చేర్పించడం జరగలేదు. ఆ పెద్దమనిషి తన ఇంటిని చక్కబెడతాడట. ఇదే ఈ దేశంలో, అసలు ప్రపంచానికి, అనర్థం తెచ్చేవాళ్లు, ఇల్లాంటి వ్యక్తులే, ఇతరులని బాగుచేద్దాం, ఉద్ధరిద్దామన్న ఉబలాటం చూపేవ్యక్తులే సంఘ పురోగమనానికి శత్రువులు. ఏ వొక్కరి పరిస్థితులూ, బుద్ధి వికాసాలూ మరొకరికి రావు, ఐనా వాళ్ళందర్నీ వొకే ఫక్కీలో, వొకడు శాసించిన ఫక్కీలో నడుచుకోమనడమే, మన దౌర్భాగ్యం. ఎవరి జీవితాన్ని వారు చక్కబెట్టుకుంటే ప్రపంచం బాగుపడుతుంది. తను మధ్యాహ్నం మూడు గంటలకి మతిపోయినవాడిలా యిల్లు ఒదిలాడు. ఇప్పుడు పదిగంటలు కావొస్తోంది. అసలు విషయం ఆలోచించడానికి తగినంత ధైర్యం లేక, కోమలి సంగతి ఆలోచిస్తూ వర్తమానాన్నుంచి తాత్కాలిక విముక్తి పొందాడు. కోమలిపై తనకున్న భ్రమంతా, తల్లి తనింట్లో అల్లిన పద్మవ్యూహంలో నుంచి పారిపోయేటందుకు ఏర్పడ్డ అవకాశమేమోననిపిస్తుంది. శరీరాన్ని అందులో నుంచి తప్పించాడు. కాని మనస్సుని తప్పించడం ఎట్లా? ఆ పాడు ఆలోచన లన్నింటినీ, బుర్రలో అమర్చబడ్డ అధోలోకంలో బంధించి, పైన కెరటంపై నురుగులాంటి కోమలి సౌందర్యపు ప్రతిబింబాన్ని కదిలించి నింపుకుని తృప్తి పడటం ఎంతటి దుస్థితి!

కోమలి ప్రపంచంలో నుంచి మళ్ళా "ఇంటి" ప్రపంచంలోకి పోవాలి. తప్పదు. ఏ ప్రపంచంలో కెళ్ళినా మనిషికి సంకెళ్ళే! సంకెళ్ళని చప్పుడు కాకుండా మాత్రం చూచుకోవాలంటే మళ్ళా "నటన" అల్లించిన ముసుగుని తగలించుకోవాలి.

దయానిధి లోకల్ ఫండ్ డిస్పెన్సరీ దాటి వంతెన దగ్గరకొచ్చాడు. డిస్పెన్సరీ తలుపులు మూస్తున్న చప్పుడవుతోంది. దూరంగా మిల్లు రోదిస్తోంది. జనం పల్చబడ్డారు. దూరంగా ఎవరో కుర్రాడు "స్థిరమైన నడవడీ" పాడుకుంటూ పోతున్నాడు. బళ్ళముందు గుర్రాల చప్పుడు తప్ప వేరే అలజడి లేదు. చెట్ల నీడలు రోడ్డుమీద మసకగా పడ్డాయి. వుండి వుండి మెరుగు పురుగు మెరుస్తోంది. వంతెన దగ్గర మలుపు తిరిగాడు.

"ఇంత రాత్రి దాకా ఎక్కడ తిరుగుతున్నావు"ఉలిక్కిపడ్డాడు. వీపు మీద ఎవరో తట్టినట్టయింది. గుండెలు జల్లుమన్నాయి. స్తంభించి పొయ్యాడు. కాసేపు మాట్లాడలేదు.

"షికార్లకి పగలు చాల్లేదు కాబోలు–"ఏమీ మాట్లాడలేదు.

"మీ అమ్మ అన్నయ్యని వూరికి సాగనంపింది.. విన్నావా? మాట్లాడవేం"

"మరేట మళ్ళా ఏమొచ్చిందీ?"

"అవును, నీకెందుకూ ఇంటి విషయం— నీ షికార్లు, నీ దీర్ఘాలోచనలు, నువ్వెందుకు పట్టించుకుంటావ్... "

"ఇంతకీ ఏమిటో చెప్పరాదు.."

"అవునవును... —అడ్డమైన కొంపలూ తిరిగి ఆ మాత్రం విసుగు కనపర్చొద్దూ మరి.."

"నేను అడ్డమైన కొంపలూ తిరగడం లేదు నాన్నా.. ఇంట్లో వుండడం భయమయిపోయింది. కాసేపు ఇవన్నీ మరచిపోదామని ఏకాంతంగా కాలవగట్టుకి షికారెళ్ళాను."

"కామాక్షి కూతురితో..."

విశృంఖలంగా ఇద్దరూ కొంత దూరం నడిచారు. " మీ అమ్మకి ఫిట్టొచ్చింది తెలుసా?.. "

"అవున్ట— నారిగాడు చెప్పాడు..."

"అంతా "టా" లతో వుంది నీ ఇదీ. ఎవళ్ళేమైపోతే నీకెందుకూ."

"లేదు నాన్నా, మధ్యాహ్నం నేను బయలుదేరేటప్పుడు బాగానే వుందే..."

"ఇల్లాంటి ఫిట్లు ఎన్ని చూళ్ళేదూ నిజం ఫిట్టయితేగా! ఇదో నాటకం. ఏదేనా పేచీ కానీ, అవాంతరం కాని ఒస్తే, ఫిట్టని మంచమెక్కుతుంది. నాకీ ఖర్చూ, డాక్టర్లంబడి తిరగడం, వాళ్ళు ఇదేమిటని లోపల నవ్వడం ఇదీ వ్యవహారం.."

"నేనట్లా అనుకోను నాన్నా, అమ్మ వొంట్లో రక్తం లేదు, రోజు రోజుకీ క్షీణించి పోతుంది...! పాపం ఆయాసం, మందు పుచ్చుకోదు! అందులో అన్నయ్య కేకలు, వొదిన రాద్ధాంతాలు, మీ ఎగురుళ్ళూ— ఫిట్టు మొగాళ్ళకే వొస్తుంది మనింట్లో.."

"ఆఁ, అట్లాగా— నీ విశ్చితాభిప్రాయం సెలవిచ్చావు. ధన్యులం. అవును మరి, అమ్మని వెనకేసుకుని రాకపోతే కామాక్షి కూతురుతో నీ ఆట్లెలా సాగుతాయి! కామాక్షింట్లో వుంటాడు, కబురంపండీ "అంటూ చిలకలా చెప్పింది మూల్గుతూ.

"నీ ఆటల్ని సాగనిస్తూ, నీకన్ని ఏర్పాట్లు అది చేసి పెడుతుంది. దాని ఆటలకి నువ్వు మద్దత్తవుతావు. "

"అబ్బ ఆపండి, నాన్నా...నే వినలేను. రోడ్డు మీద ఎవళ్ళేనా వింటారు కూడా.."

"రోడ్డు మీద ఇప్పుడు వినేదేమిటి? లోకం ఇదివరకే కోడై కూసింది. నువ్వూనేమో దాస్తే దాగుతుందా? నీకు ఇరవై రెండేళ్ళు దాటుతున్నాయి. ఇంతవరకూ నీకెందుకు సంబంధాలు రాలేదో తెలుసుకొన్నావా..?"

"నాకు సంబంధాలు రాకపోవడం వల్ల దేశానికి అనర్థం రాలేదు. నాకేమి బెంగాలేదు.."

"అవునవును, నీకు బెంగెందుకుంటుందీ... నీ ఆటలు సాగుతుంటే"

"ఏమిటి నాన్నా— మనం చదువుకున్న వాళ్ళం— యిల్లాంటి మాటలు.."

"మరి నువ్వు చేసే పనులేమిటోయ్ మాటంటే రోషమెందుకు? చదువు వెలిగించి, నువ్వూ, నీ తల్లి చేరి చేస్తున్నదేమిటీ?"

దయానిధి కంఠం పెద్దదైంది.. మాటలు తిన్నగా వుచ్ఛరించలేక పోతున్నాడు ఉద్రేకంతో...

"నాన్నగారూ, నన్నవండి పడతా— నాపాపాలు అమ్మకి చుట్టకండి. పాపం—అమ్మకేమీ తెలీదు."

"ఏమీ తెలీకపోతే కామాక్షి కోసం ఎందుకు కబురు చేస్తుంది."

"వూరికే అందేమో.."

"అనడమేమిటి? కామాక్షి, ఎవత్తో చక్కా వొచ్చి పరాయి మొగాణ్ణి ఉద్యోగస్తుణ్ణి అనేనా లేకుండా, నాతో వాదించడం మొదలెట్టింది— దాని కూతుర్ని నేను కోడలు చేసుకోవాలిట—"

"నిజంగా అలా అందా నాన్నా"

"నువ్వు రోజా వాళ్ళ కొంపచుట్టూ తిరుగుతున్నావట. పెళ్ళి చేసుకోకుండా యిట్లా తిరిగితే ఏం మర్యాదగా వుంటుంది. మాఅమ్మాయికి పెళ్ళి కావాలా— కాబట్టి ఏదో తేల్చెయ్యమని కూర్చుంది— పో,పో, అవతలికి పొమ్మన్నాను. ఎవత్తిరా అది?"

"నిజంగా కామాక్షి ఎవరో నాకు బాగా తెలీదు నాన్నా—"

"దానికి మొగుడూ మొద్దులూ ఉన్నాడా?"

"నాకది తెలీదు నాన్నా— వాళ్ళు బ్రాహ్మలు కారు—"

"కులగోత్ర నామాలు లేవు. మొగుడూ సంసారంలేదు. నలుగురూ ఎక్కేగుమ్మం, దిగే గుమ్మం— నీకు దాని కూతురు కావాల్సి వొచ్చిందా— ఇంత చదువూ చదువుకుని—"

"మీరు భ్రమపడుతున్నారు నాన్నా— రోడ్డు మీద వెడుతుంటే కోమలి కనిపిస్తుంటుంది. అంతే. కాని పెళ్ళి చేసుకోవడం కామాక్షి అనుకున్నంత సులువు కాదు—"

"ఐతే ఏమిటి నువ్వు చెప్పొచ్చేది?"

"ఏమీ లేదు. వూరికే అది అన్నంత మాత్రాన జరిగే ప్రమాదం ఏమీ లేదు. నిజంగా పెళ్ళి చేసుకోదల్చుకుంటే కులగోత్ర నామాలు, అడ్డుతగుల్తాయా—"

"అవునవును, భూములు తనకాపెట్టి చదువులు చెప్పిస్తున్నందుకు ఈ మాత్రం మామీద గౌరవం చూపించొద్దూ—"

"కులగోత్ర నామాలకీ మనుష్యుల శీలాలకీ సంబంధంలేదు నాన్నగారు, ఎందరో మర్యాదస్తులు చెడిపోవడం మనం చూడడం లేదూ? చదువు లేకపోతే చెప్పించొచ్చు, సంపర్కం వల్ల సంస్కారం తెప్పించొచ్చు, ఎల్లాపడితే అల్లా తయారుచేసుకోవచ్చు, కాని సౌందర్యం ఎక్కడనుంచి తెగలం...."

"ఏరా గుర్నాధం, ఏమన్నాడు డాక్టర్?"అన్నాడు దశరధరామయ్యగారు అరుగుమీద కూర్చుంటూ..

"ఇప్పుడే ఊర్నించి వొచ్చారటండీ భోజనం చేసి వస్తామన్నారండి కాంపౌండ రొస్తున్నారండి.."

దశరధరామయ్యగారు పొడుం డబ్బీ తీసి కాస్త పొడుం పీల్చారు.

"చాలా దూరం వెళ్ళిందన్నమాట నీ కథ– ఈ లేచొచ్చిన దాని కూతురుతో నువ్వు సరసాలాడుతుంటే మీ అమ్మ సరేనని తాళమెయ్యడమా..."

"అదే వొద్దన్నది నాన్నగారు అమ్మని యిందులో దింపకండి"

"ఈ భూప్రపంచంలో యిందరుండగా మరినువ్వు దీనితోరా–" గోవిందరావు మామయ్యగారు సుశీల నిస్తామని మొరెట్టుగుంటోంటే అది అక్కర్లేదన్నది యిందుకా...

"సుశీలని ఇస్తామని వాళ్ళు ఎప్పుడూ అనలేదు. అదంతా మీరనుకోవడం, పైగా సుశీలని చేసుకుంటే నాకు సుఖం వుండదు. మనగుట్టంతా వాళ్ళకి తెలుసు.."

"ఛీ, నోరుముయ్! తప్పుడు కూతలు కూస్తావ్! దాని కొడుకువు కాబట్టే నీకీ బుద్ధులొచ్చాయి."

"మీ కడుపున పుట్టినందుకు నేను విచారించని రోజు లేదు..."

"ఛప్, వాగుతున్నావ్...."అప్రయత్నంగా ధశరధరామయ్య గారు అతన్ని లెంపకాయ కొట్టారు.

"కాంచెం లోపలికి రావాలి–"

"అంటూ కాంపౌండరు అరుగుమీది కొచ్చాడు. వెనకాల నారయ్య నిలబడ్డాడు. గబగబా దశరధరామయ్యగారు, దయానిధి లోపలికెళ్లారు. అంతా అయిపోయింది. దశరధరామయ్యగారు పంచలో మొహం దాచేసుకుని ఏడవడం మొదలెట్టాడు."

"దయానిధి మంచం పక్కని కూర్చొని తేరిబార చూశాడు. అతని కర్థం కాలేదు. గబగబా దొడ్లోకి పరిగెత్తుకుపొయ్యాడు. దేవుళ్ళకి మొక్కాడు, బ్రతికించమని, ఇంకేమీ కోరనన్నాడు. జీవితంలో అతను కోరింది అది ఒక్కటే, కాళ్ళు చేతులు కదుల్తాయేమోనని దొంగతనంగా అటు కేసి చూశాడు. ఏ దేవుడూ అతని మొక్కు చెల్లించలేదు. ప్రొద్దున్నకి లేవకపోతుందా? లేచి "నిధీ నాబంగారం లేవరా, కాఫీ చల్లారిపోతోంది" అనకపోతుందా?

అతనికి ఏడుపు రాలేదు. కాలం ఆగిపోయినట్లనిపించింది.

జేర్‌సొప్పా నయాగరా జలపాతాలు, హిమాలయ పర్వతాలూ, సింధూ, భాగీరథీ నదులూ– వీట్లకి మల్లే తల్లి ఎప్పుడూ వుండిపోతుందనుకున్నాడు. ఇవి లేకుండా తన జీవితమే లేదు. సృష్టి వెనక్కి వెళ్లినట్లయింది. చిన్నతనంలో శవాన్ని చూసి నవ్వి ఎవరిదో, మనది కాదు అనుకునేవాడు. అతనూ, తల్లీ, తండ్రీ , అన్న శవాలు కారు. తల్లి మరణిస్తే, నక్షత్రమండలం కూలిపోతుంది. సముద్రాలు పొంగి లోకాన్ని ముంచి వేస్తాయి. భూమి విడిపోయి లోకాన్ని మింగివేస్తుంది.

అంతా అయిపోయింది.

పిచ్చివాడిలా కాలువ గట్టుకు నడిచిపోయాడు. సాయంత్రం తను పడుకొని దొర్లిన గడ్డిలో పడుకొని ఏడవలేకపొయ్యాడు. కళ్ళు ఎండి పోయాయి. నీళ్ళు రావు, రక్తం గడ్డకట్టింది. చంద్రుడు పైన వాడి పోయి మరి లేవని నిద్రకో అన్నట్లు ఆవులిస్తున్నాడు. నక్షత్రాలు తూర్పు వెలుగులో తడిసి విడిపోతున్నాయి. తూర్పు ఆకాశం తలుపులు తెరుచుకుంది. చీకటి రావద్దని గెంటేస్తోంది. కాలువ కదల్దు, పక్షులు చెట్లలో కదలలేవు ప్రాతఃకాలపు ప్రకృతి అమ్మలాగై పోయింది.

అంతా ఐపోయింది.

అమ్మమ్మ, అమ్మ బాల్యంలో ఎట్లా వుండేదీ చెప్పే కథలు స్మరణకు వొచ్చాయి. పరికిణీ కట్టుకుని కాలువ గట్టున ఆడుకునే అమ్మ, పెళ్ళి కొడుకు బావగారి పాదాలు చూచి, భర్తయే అనుకున్న పెళ్ళికూతురు అమ్మ, పల్లకీలో దాహంవేస్తే నోరెత్తి అడగలేకపోయిన అమ్మ, బాకాల మోతకి చెవుల్లో వేళ్ళు దోపుకున్న అమ్మ, తల్లిగండాన పుట్టాడు, వాడ్ని చంపేస్తాం అంటే "అమ్మో"అని భయంతో వణికిపోయి కళ్ళు పెద్దవి చేసి నిట్టూర్చిన అమ్మ, హాస్టల్లో తండ్రి కోరినప్పుడు డబ్బు పంపకపోతే, గాజులు తాకట్టు పెట్టి మనియార్డరు కట్టిన అమ్మ, తెల్లని చీరని చూసి, తను దీపావళినాడు తెల్లపట్టు చొక్కాలో మతాబా కాలుస్తుంటే మురిసిపోయిన అమ్మ, కోమలిని వర్ణిస్తుంటే అర్థమైపోయినట్లు తలపంకించిన అమ్మ.

అంతా ఐపోయింది.

తండ్రికి భార్య, సంఘానికి దిద్దుకోవటం చేతకాని సంసారి, కుటుంబానికి ఇల్లాలు, లోకానికి వకావిడ, సృష్టికి స్త్రీ, తనకి మాత్రం అమ్మ.

ఈ ప్రపంచంలో పుట్టి, యింతమందితో యిన్ని యిక్కట్లుపడి, ఏం చేసింది? మాతృత్వం పొంది తల్లిగా మారింది. తన పని అయిపోయింది, వెళ్ళిపోయింది. అందుకనే వచ్చింది. అది వ్యర్థ జీవితం కాదు.

కన్నీటితో గడ్డిపోచలు తడిసినాయి. ప్రాణానికి ఎంత విలువ వుంది. గడ్డిపోచకెంతో అంతే!.. ఆపలేకపోతున్నాడు— పొంగిపొరలి పొయ్యే కన్నీటి ధారలను, తరతరాల జీవులు ఎడబాటు కోసం దాచివుంచిన కన్నీటి ధారలు ప్రాచీన మానవులకు అర్థంకాని కన్నీరు ఎన్నో యుగాలుగా వూరుతున్న కన్నీరు ఎవరికోసమో, ఎందుకో తెలీదు, సముద్రాలని సహితం ఇముడ్చుకున్న కన్నీటి బిందు. ఆకాశాన్ని ముంచివేసే కన్నీరు ఆనందంతో వుబికిపోతోంది.

అమ్మ జబ్బు బాగు చేద్దామనే తను ఈ డాక్టరు చదువు ప్రారంభించాడు. ఆనీటి ధారలని ఆపకూడదు. తడిసిన గడ్డిపోచ సూర్యుడి తాకిడికి తేరుకుంటుంది— ఏమీ ఐపోదు.

ఇంతవరకూ అతనికి వేరే ఉనికి లేదు. ప్రతి చిన్న విషయానికి తల్లిమీద ఆధారపడ్డాడు. డబ్బు కావలిస్తే తల్లిచేత నాన్నని అడిగించవలసిందే. ఈ సంఘం వొక సముద్రం అయితే, అతను నిలబడేటందుకు అమ్మ వొక లంగరు. ఇపుడు ఆ లంగరు లేదు. ఏదో శక్తి అతన్ని వదిలి పోయింది. అతన్ని ప్రపంచానికి బంధించిన గొలుసులో గొళ్ళెం వూడింది. కోమలి అతన్ని గడ్డిపోచకింద తీసిపారేసి, గడ్డిపోచని మొహాన కొట్టింది. మృత్యువు తల్లిని గడ్డిపోచకింద తీసిపారేసింది. శక్తి, బలం, సంతోషం, ఆదర్శం అన్నింటిని అమ్మ తీసుకుపోయింది. అంతా అయిపోయింది. చివరికి మిగిలింది తను.

★ ★ ★

# అనుభవానికి హద్దులు లేవు

ఏడుమాసాలు గడిచినై, క్రిస్‌మస్ సెలవలకి, దయానిధి వాళ్ళ ఊరుచేరుకున్నాడు. బండి దిగి ఇంట్లో అడుగు పెట్టేటప్పటికి ఉదయం తొమ్మిదిన్నరైంది. గుమ్మందాటి హాల్లో కొచ్చాడు. ఏదో పరాయి ఇంట్లోకి, వచ్చినట్లనిపించింది. అమ్మ ఉండివుంటే స్టేషన్‌కి మనిషిని పంపేది. గుమ్మందాటే ముందు దిష్టితీసేది. నాన్నగారి ఆఫీస్ గదిలోకి వెళ్ళాడు. కిటికీలోంచి డోగొప్పనాయుడుగారు కొత్తగా వేసిన మేడ కనిపించింది. తను పట్నం వెళ్ళేటప్పుడు కట్టడం మొదలెట్టారు. చాలా పెద్ద విశాలమైన మేడ, ఎంతో ఖర్చువుంటుంది. రంగురంగుల అద్దాలమేడ – అన్నీ వున్నాయి. ఒక్క అందం తప్ప టేబిల్ మీద వున్న లెటర్ రాక్‌లో ఉత్తరాలు ఏమీ తోచక తీశాడు. గోడని అమ్మా నాన్నా పెళ్ళిపోటో వుంది. అన్నయ్య అమృతం, అమ్మా కలిసి తీయించుకున్న చిన్నప్పటి ఫోటో వుంది. కృష్ణాపురానికి బదిలీ అయింతరువాత, నాన్నగారికి పార్టీయిచ్చి వీడ్కోలు సందర్భంలో తీసిన ఫోటోలో తనూ వున్నాడు. డ్రాయరులో చిన్న షేవింగ్ మిర్రర్ వుంది, తీసి తన మొహం చూసుకున్నాడు. రైలు బొగ్గుకి మొహం వాడిపోయింది. వెంట్రుకలు కాడలుగా నుదుటిమీదికి జారాయి.

దయానిధివి పెద్ద విశాలమైన నేత్రాలు, నల్లటి పాపలు, కోలగా సాగిన కళ్ళు కళ్ళచుట్టూ కాటుక పెట్టుకున్నట్టుగా వుండే నలుపు, సోగగా జారిన కనురెప్పలు. ఆర్చిలా అమర్చబడ్డ కనుబొమ్మల మధ్య కత్తిరించిన వెంద్రుకల మెరుపు, చదరమైన తలకట్టు, గుండ్రటి పొడుగాటి మెడ, పల్చటి పై పెదవి నవ్వుతుంటే జాలిగా మెరిసే పళ్ళు – మూతికి కుడి వెంపున చిన్న నొక్కు, అతన్ని చూస్తే అతనికే నవ్వొచ్చింది. అకస్మాత్తుగా అమ్మని చూసినట్లనిపించింది. తనలోంచి తల్లి తొంగిచూస్తున్నట్లు, తనలో ఎవరో వుండి అతన్ని జీవింపచేస్తున్నట్లు, నిజంగా తల్లి చావలేదు అతనిలోనే వుండిపోయింది. హెచ్.జి. వెల్స్ తన అల్లుడు ఇండియాలో ఉన్నాడని వ్రాశాడు. అతని మేనమామ నార్వేలో వుండొచ్చు. ఎంత మంది రక్తమో అతనిలో ప్రవహిస్తోంది. కాళిదాసు, అరిస్టాటిల్, సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసీసి, మొల్ల, ఫ్రెంచి విప్లవంలో రాబ్స్ ప్రియర్, వేమన్న, వీరేశలింగం పంతులు వీళ్ళందరి రక్తం కోమలిలో ప్రవహిస్తోంది. ఆమె అతనిలో – అంతా, అందరూ యీ మానవరక్తంతో ఏకమైపోయారు. సృష్టి అతమొందేవరకూ వరదలై మానవ రక్తం ప్రవహిస్తూ, అందర్నీ బంధించి, ఏకం చేసిన మృత్యువుకి అతీతమైపోతుంది. అదే కాబోలు అమరత్వం అంటే! తనలో తల్లి అమరత గడించుకుంది.

తను పట్నం నుంచి రెండు నెలల క్రితం తండ్రికి రాసిన ఉత్తరం తీసి చదవడం మొదలెట్టాడు. "అన్నయ్య ఇష్టపడక పోయినందుకు విచారిస్తున్నాను. నాకు ఎట్లాంటి అభ్యంతరమూలేదు మొగాడు ఏకాంతంగా ఉండలేడు. నాకు తెలుసు, ఆధారపడి,

అదుకునేటందుకు స్త్రీ అంటూ వుండకపోతే మొగాడి జీవితం సంపూర్ణం కాదు. చుక్కానిలేని నావ..." ఉద్రేకం లేకుండా వృత్తప్పుడు అట్లాంటి ఉత్తరం నాన్నకి వ్రాయగలడా!

"ఇంట్లోకిరా బావా కాఫీతాగు. స్నానం చేద్దువుగాని లే..."

ఉత్తరం మూసేసి వులిక్కిపడి పక్కకు తిరిగాడు.

"అమృతం"

"ఏం దెయ్యం అనుకున్నావా...?"

"అమృతం—!" అంటూ గోడనున్న ఫోటోకేసి చూశాడు.

"అవును అమ్ముకలు..."

ఇద్దరూ నవ్వుకున్నారు. అమృతం నాన్న తాలూకు దూరపు చుట్టం. చిన్నప్పుడు "అమ్ముకలు" అనేవారు. ఆ అమ్మాయిని అన్నయ్య కిస్తామనుకున్నారు. ఆ సంబంధం ఎందుకు పొసగలేదో అతనికి తెలీదు. చిన్నప్పుడు కోతిలా అల్లరిచేసేది. జడ వుండేదికాదు. అందరూ ఏడిపిస్తూండేవారు. ఇప్పుడెట్లా మారిపోయింది ఎగా దిగా చూశాడు! అమృతం అతను గుర్తుపట్టలేనంతగా మారిపోయింది—ఈ పదేళ్ళల్లోనూ మిసమిసలాడే చామనఛాయ, గంభీరమైన కళ్ళు, ఉంగరాలు తిరిగి మెడంతా ఆవరించుకున్న పెద్ద జుట్టూ, బలమైన నడుం, గట్టిగా గుండ్రంగా వుండే బుజాలు, అన్నిటికంటే ఆకర్షణీయమైన వక్షస్థలం – ఇంగ్లీషు ఫేషన్ మేగజీన్‌లలో బొమ్మలలోలాగుండే రొమ్ముకలు – ఆశ్చర్యంతో, భయంతో చూశాడు ఆమెకేసి.

"కాఫీ! బావా? చల్లారిపోతుంది."

అతనికి ప్రాణం లేచి వచ్చింది; అతన్ని ఇంతవరకూ అంత ముద్దుగా బావా అన్న వాళ్ళులేరు. మామయ్యగారి సుశీల అసలతన్ని పిలవనే పిలవదు; పైగా ఆమె ధోరణి చిన్నప్పటినుంచీ ఎరుగున్న దానిమల్లే వుంటుంది. అతనేమీ మాట్లాడలేదు.

"అమ్మ చెప్పడం తప్ప నిన్ను బాగా ఎరుగను, పెద్దబావ బాగా తెలుసు. పాపం అత్తయ్యకి నేనంటే ఎంతో యిష్టం నువ్వూ నీ మొగుడూ సెలవలకి రమ్మని ఎన్నోసార్లు రాసింది. మా వారికి ఎప్పుడూ తీరుబడయ్యేది కాదు. ఏదోపాపం, జబ్బుతో బాధపడుతూ వుండటం కంటే, పోనీ పునిస్త్రీజన్మ..."

కొంగుతో కళ్ళు తుడుచుకుంది తల్లి పోయింతర్వాత పరామర్శ చేసిన వాళ్ళని చాలా మందిని చూశాడు దయానిధి. ప్రతివాళ్ళూ విధాయకంగా, తప్పనిసరిగా ఏడ్చినట్లుగా వుండేది, అమ్ముకలు కన్నీరు సహజంగా వుంది. ఇతరుల దుఃఖాన్ని పంచుకోవటం తన నైజమల్లే.

"మీ ఆయనకూడా వచ్చాడా... పేరేమిటి?"

కొంగు కళ్ళమీద నుంచి తొలగించింది. పసుప్పచ్చ పల్చటి ఖద్దరు చీర ఎందుకో అతనికి కాళిదాసు నాటకంలో శకుంతల స్ఫురణకొచ్చింది— బుజాలకి గుండ్రంగా పట్టుకున్న మొద్దు జాకెట్టు, జడలో పడిపోతూన్న మందారం లోయలో సూర్యాస్తమయం చూసినట్లుంది ఆమెకేసి చూడడం – నీళ్ళతో కళ్ళు తడిసి జాలిగా మెరుస్తున్నాయి.

"రంగు పోతుందిస్మా, తడిపితే!" అన్నాడు.

చీరకేసి చూసుకుని తడిసిన భాగాన్ని దాచేసి నవ్వడానికి యత్నించింది.

"అవును, మొన్ననే కొన్నాం, ఇంకా వుతుక్కి వెయ్యలేదు."

"ఇంతకీ మీ ఆయన పేరు చెప్పావు కాదు–"

సిగ్గుతో తలొంచుకుంది.

"అబ్బో, తెలీనట్లు–"

"నిజంగా జ్ఞాపకం లేదు"

"నాకు తెలీదు–నే చెప్పనబ్బా–సిగ్గేస్తుంది," అని దగ్గి. వచ్చే నవ్వు ఆపుకుంది.

"పోనీ, ఏం చేస్తున్నాడు–?"

"వ్యవసాయం, కరణీకం కూడా వుంది. నువ్వు నా పెళ్ళికి రాలేదు పోనీ మా వూరేనా రాకూడదా ఏమిటి?"

"నన్ను ఎవరూ రమ్మనందే–?"

"ఏమ్మాటలు బావా, నన్ను ఎవరురమ్మన్నారు. ఇష్టం వుంటేసరి"

"బాగుంది–అత్తయ్య చచ్చిపోయింది కాబట్టి చూడ్డానికొచ్చావ్, అంతేనా?"

"పో బావా, భలేవాడివే! ఇంకా మాటలురావు అమాయకుడివనుకున్నాను. నాకు మా వాళ్ళనందరినీ చూడాలనివున్నా, ఒక్కదాన్ని ఎల్లారాగలను బావా? నువ్వే చెప్పు. మావారికి పదిమందిలోకీ వెళ్ళడం, తిరగడం సరదాలేదు ఎప్పుడూ వూడ్పులో, జమాబందీలో–ఐనా బస్తీలలో వుండేవాళ్ళు మా పల్లెటూళ్ళ కెందుకొస్తారు? మాదో అడివి–"

"నీలాంటి పెళ్ళాం వుండగా అడవిలో కాపరం వుంటేనే..."

"ఫో, కొంటే..."

ఆ వాక్యం పూర్తికాకుండానే సుశీల చక్కా వచ్చింది. సుశీల కొంచెం పొట్టి మనిషి; చిన్న నుదురు? చిన్ని కళ్ళు. గుండ్రని బుగ్గలు, బాగా ఎర్రటి ఛాయ, కండ్లజోడు మొహానికి నిండిచ్చింది.

"హల్లో! డాక్టర్‌గారు కాబోలు... మీరు మెయిల్లో దిగినట్లు తెలుస్తూంది కాబట్టి ఎప్పుడొచ్చారని అడగక్కర్లేదేమో..."

"హల్లో సుశీలాదేవిగారు... మీరన్న దాన్ని ఎంతమాత్రం ఖండించను."

"మీ రాక పట్నం నుంచేగాబోలు"

"అవును, మీరు సత్యానికి దగ్గరగా వచ్చారు."

అమ్ములు నవ్వుతోంది. "ఏమిట్రా ఇదంతాను?"

సుశీల కొంటెగా నవ్వింది.

"మొగుడూ పెళ్ళాం సరసాలమధ్య నేనెందుకు..." అని వెళ్ళబోయింది అమ్ములు.

"అమ్ములూ, ఎప్పుడూ అట్లాంటి మాట్లనకు–" అంది సుశీల,

"అందులో తప్పేముంది; ఉన్నమాటంటే–"

"ఊరుకో అమృతం–నీకు మాట్లాడ్డం చేతకాదు... పల్లెటూరిపిల్ల మేనర్స్ ఎట్లా వస్తాయి–"

"తప్పు సుశీలా–నీ యింగ్లీషు కోపం అమృతం మీద చూపించ కూడదు."

"లేకపోతే ఏం మాటలవీ, ఏం మాట్లాడుకున్నా మొగుడూ పెళ్ళాలు పెళ్ళి గొడవే–తను చేసుకుందిలే వో పల్లెటూరి మొద్దుని."

అమ్మలు పెదవులు అసహాయమైన కోపంతో వొణికిపోతున్నాయి.

"ఏమిటి సుశీ! ఆ ఎత్తి పొడుపులు – ఇప్పుడు ఏమన్నాననీ! మొద్దో మహారాజో ఎవరో మొగుడంటూ వున్నాడు. పద్దెనిమిదేళ్ళొస్తున్నై నీకు అదీ లేదుగా."

"అతిగా వాక్కు!"

దయానిధి కాఫీ కప్పు బల్లమీద పెట్టి, అమ్మల్ని చెయ్యి పట్టుకుని హాల్లోకి తీసుకెళ్ళాడు ఏడుస్తూ మంచం వాల్చుకుని కూర్చుంది.

సుశీల చరచర నడిచి తన గదిలోకి వెళ్ళి చప్పుడయ్యేటట్లు గడి యేసుకుంది.

మధ్యాహ్నం భోజనాలవేళ, నరసమ్మత్తయ్య, సుశీల తల్లి అతనీ చదువుని గురించి కుశల ప్రశ్న వేసింది.

"ప్రాక్టీస్ ఎక్కడ పెడతావ్!"

"ఇప్పుడెక్కడమ్మా, ఇంక రెండేళ్ళ తరువాత మాటకదా–"

సుశీల అమృతం ఏమీ మాట్లాడకుండా తింటున్నారు.

"సుశీల చదువు సంగతి ఎల్లావుందో కనుక్కున్నావా" అంది నరసమ్మగారు.

"ఎల్లా వుండాలి? డాక్టరీ పూర్తయినప్పుడే నా ఇంటర్ మీడియట్టూ పూర్తవుతుంది–చాలు, నెయ్యి వడ్డించకు– ఇక్కడికే నా క్లాస్‌మేట్సు లావెక్కిపోతున్నానని ఏడిపిస్తున్నారు. హల్లో డాక్టర్, నెయ్యిలో విటమిన్స్ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"నీకు చెప్పేటందుకు నేనెంతవాడ నబలా! కొన్ని విటమిన్స్‌ని ఎబ్‌సార్బ్ చేసుకునేందుకు బాడీకి ప్రీ డిస్పొజిషన్ ఉంటుంది, అంటే ఏం చేస్తే లావెక్కిపోతానో అని భయపడుతూ, "లావుని" గురించి ఆలోచిస్తావు... దేన్ని ధ్యానం చేస్తే అదే ఐపోతావని హిందూ ఫిలాసఫీ చెపుతోంది కూడా. భక్తుడు ప్రార్థనవల్ల దైవత్వం పొందుతాడు. నీ కేస్‌లో ఒబీసిడే అనే అబ్‌స్ట్రాక్టు కన్‌సెప్టుని వూహించుకుని, భయపడతావు. నీ బాడీ ఇన్‌ట్యూటివ్‌గా రియాక్ట్ ఐ, నువ్వు ఏది కాకూడదనుకుంటున్నావో అదే అవుతావు–"

నరసమ్మగారు అడ్డం వొచ్చి–

"నీకేమన్నా తెలుస్తోందే అమ్మ–" అమృతం తలెత్తలేదు.

"నువ్వూ నేను చదువులేని మొద్దులం, మనకెందుకు?" అని నవ్వించబోయింది.

సుశీల అందుకుంది, "అది మొద్దం ఖర్మం. అది ఆవకాయ పెట్టినట్టు–"

"నా జోలికెందుకు? ఆవకాయే పెడతానో–"

"అండమాన్స్‌కి రాణీవే అవుతానో యక్యూస్‌డ్ మి–"

"చూశావమ్మా నరసమ్మ పిన్నీ, నా జోలి తనకెందుకు మళ్ళానే ఏమన్నా అంటే వొచ్చిరాని ఇంగ్లీషు మాటలతో–"

"అబ్బ పోనీలేవే, ఏదో నలుగురూ ఏకమైనప్పుడే అచ్చట్లూ, ముచ్చట్లు, వేళాకోళం చేస్తే నీకింత కోపమెందుకో– వాళ్ళ నాన్న తాసిల్దారు. కాలేజీకి పంపించాడు–

అందరి మొగుళ్ళూ ఐ.సి.యస్.లూ, డాక్టర్లూ అవుతారటే" అంది నరసమ్మగారు.

ఆ వాక్యం యొక్క తాత్పర్యం దయానిధికి అర్థం కాలేదు—

"అత్తయ్యా, మీ అల్లుడు ఐ.సి.యస్. కాని పక్షంలో అధమం డాక్టరేనా కావాలనా ఏమిటి నీ అభిప్రాయం— ఆ రెండింటికీ అతకదే. ఐ.సి.యస్. గవర్నమెంట్ సర్వెంటు, డాక్టర్ సిక్ పీపిల్‌కి సర్వెంటు"

"ఏమో, నా కవన్నీ తెలియవు—వాళ్ళ నాన్న తాసీల్దారై వుండి ఐ.సి.యస్.ని తీసుకురాలేరు."

"అల్లుడికి జబ్బుచేస్తే మందు నువ్వే ఇద్దుగానిలే—" అని పూర్తి చేసింది. ఆవిడ మనస్సులో వున్నదాన్ని అంత వాజాకుగా తెలియజేసినందుకు నరసమ్మ గార్ని లోలోపల అభినందించాడు నిధి, అమ్మయ్య అనుకుని నిట్టూర్పు విడిచాడు.

మధ్యలో సుశీల మొదలెట్టింది. "ఐ.సి.యస్. వాళ్ళకి గవర్నమెంటు డాక్టర్లే వుంటారు."

"యక్స్‌లెంట్, హేట్స్ ఆఫ్" అన్నాడు నిధి.

"ఇంక నేను సుశీల చదువు పరీక్ష చేసేదేం వుందమ్మా అత్తయ్యా! సుశీల సెక్రటరీ ఆఫ్ స్టేట్ సర్వీస్ భోగట్టా కూడా వల్లె వేసింది. ఇంతకీ మనదేశంలో చదువుకున్న మొగాళ్ళ ఆశయం ఐ.సి.యస్.లు కావడం చదువుకున్న స్త్రీల ఆశయం ఐ.సి.యస్.లకి పెళ్ళాలు కావడం."

"తీరా అయ్యేది తాలూకా గుమాస్తా, పెళ్ళాం—" అని అమృతము వాక్యం పూర్తి చేసింది.

"ఓస్! తాలూకా గుమాస్తా, కరణం కంటె మెరుగులే" అంది సుశీల.

"నేను నీతో అనలేదు, మా బావతో అంటున్నాను."

"నేను నీతో అనలే, మా అమ్మతో అంటున్నాను." అంది సుశీల.

"నేను కొంతవరకు అమృతంతో ఏకీభవిస్తున్నా. సుశీల చెప్పిన దాంట్లో కొంతవరకే యదార్థం లేకపోలేదని అనుకోడానికి, కొంత వరకూ సాహసిస్తున్నానని చెప్పేటందుకు సంకోచించవలసిన అవసరము ఉందని అనుకోవాల్సి ఒస్తోంది..." అన్నాడు నిధి.

నరసమ్మగారు కూడా నవ్వుకున్నారు. సుశీల ముఖం చిట్లించుకుంది.

"ఇంతకీ నా "లావుకి" మందు చెప్పలేదు" అంది సుశీల.

"నీ మొహం, నువ్వు లావని ఎవరన్నారే. ఎదిగే పిల్లలు బొద్దుగా ఉండరా ఏమిటి? అమ్ములు చూడు. గుండ్రంగా — కూజాలా జబ్బలూ అదీ—"

"కూజా గొట్టంలా అంటే బాగుంటుందేమో!" అన్నాడు నిధి.

"నన్నేం ఆక్షేపించనక్కర్లేదు. నాకు జబ్బలెక్కడున్నాయి." అంటూ అమ్ములు జాకెట్టుకేసి చూసుకుంది. పుస్తెలు గొలుసు పమిటలో సర్దుకుని — "నాకేం పేషన్లు లేవు చేతుల్లేని రెవికలూ."

"ఇక్కడెవరికీ చేతుల్లేని రెవికలు లేవులే మహా. ఇట్లాంటి మాట్లంటేనే నాకు ఒళ్ళు మండుకుని వస్తుంది."

"ఒళ్ళు మండిన వాళ్ళచేత ఆవకాయ పెట్టించాలి–" అన్నాడు నిధి. నరసమ్మగారు నవ్వింది.

"ఆవకాయ పెడితే మీ అమ్మే పెట్టాలి... పాపం"

"అప్పులు చేసిన అత్తయ్యే చెయ్యాలి" అంది సుశీల. అమ్ములు కోపంగా సుశీలకేసి చూసింది.

"అత్తయ్య చచ్చి స్వర్గాన్నుంది. ఏం మాటలత్తయ్యా!" నరసమ్మగారందుకుంది.

"అవునే మరి, బ్రతికున్నన్నాళ్ళూ మేం ఎవ్వరం నోరెత్తలేదు. మాకు దమ్మిడీ ముట్టలేదు. మరి, ఏం చేసేదో, ఎవళ్ళకి పెట్టేదో మొన్న మొన్న నగలూ, మూడెకరాలూ అమ్మితే ఆ అప్పులన్నీ తీరినై."

"వెధవ డబ్బు పోతేనే. హాయిగా రాణిలా బ్రతికింది. హాయిగా పునిస్త్రీ చావు చచ్చింది ఎవళ్ళకో ఎందుకు పెడుతుంది? తన కొడుకులికీ కోడళ్ళకీ పెడుతుంది–" అమృతం వాక్యం పూర్తి కాకుండానే సుశీల అడ్డం వచ్చింది.

"కోడళ్ళకే అని బహువచనం వద్దు, కోడలికే అను.."

"సరే, అడ్డంరాకు నువ్వు, నిధికి పెండ్లామంటూ రాదా ఏమిటి...ఏ నీ బోటిదో..."

"నా జోలెత్తద్దని ఎన్నిసార్లు చెప్పినా నీకు జ్ఞానంలేదా?"

"ఏ నీ బోటి చదువుకున్నదో అనబోయ్యాన్"

"అబ్బ వుండవే! చెప్పనీవే పోనీలేవే నీ కెందుకు అంత..." అంది నరసమ్మగారు.

"కానీమ. నేను నరసమ్మత్తయ్యతో ఏకీభవిస్తున్నాను; ప్రజా పరిపాలనా యుగంలో వాక్ స్వాతంత్ర్యానికి ప్రథమస్థానం" అన్నాడు నిధి.

లేకపోతే తన పుట్టింటారికి పెట్టుకుంది. ఉన్నవాళ్ళం – నీకూ నాకూ ఎందుకు పెట్టాలి..." అని పూర్తి చేసింది అమృతం.

"ఇంతటితోనే ముగిస్తున్నాను. అంతేనా అమ్ములు?"

"నేను మాత్రం ఏమన్నాసరే రైయ్యిమని నా మీదికి లేస్తావ్?"

"అవును పిన్నీ, చచ్చిపోయిన వాళ్ళని తిట్టడం ఎందుకన్నాను... నీ కిష్టం లేకపోతే నీ కూతుర్నిచ్చి పెళ్ళి చెయ్యకు ... అంచేత అతనికి పెళ్ళికాకనూపోదు."

"ఛ, ఛ మళ్ళా అదే వాగుడు నా జోలెత్తొద్దంటే నీకు జ్ఞానం లేదా ఏమిటి..." అంది సుశీల.

"నా యిష్టం, అంటాను నువ్వొకదానివే చదువుకోలేదు..."

"షేర్ ముయ్..."

"నువ్వే మూసుగో–" అని అమృతం కంటతడిబెట్టుకొని అన్నం తినడం పూర్తికాకుండా లేచి వెళ్ళి – చెయ్యి కడుక్కుంది.

ఇంతలో జగన్నాధం చక్కా వొచ్చాడు. జగన్నాధం అమృతం తమ్ముడు – హైదరాబాదులో అయిదోఫారం చదువుతున్నాడు జగన్నాధం ఎందులోను అమృతం తమ్ముడులా వుండడు. అమృతం దిగులుగా ఏదో మనోవ్యాధితో వున్న దానిమల్లే వుంటుంది. మొహంలో విషాదం వుంది. నవ్వుతుంటే, రాజ్య వినాశం జరిగిన తర్వాత, శిధిలాలని చూసి, వొకప్పుడు మహావైభవం అనుభవించిన రాణీ నవ్వడంలా

నిండుగా, బరువుగా, ఠీవిగా వుంటుంది. జగన్నాధం సన్నగా వుంటాడు; కొంటెగా, పళ్ళన్నీ కనబడేటట్లు నవ్వుతాడు. నవ్వేటప్పుడు కళ్ళు మూసుగుపోతాయి, తల మెడమీద వెనక్కి వాలిపోతుంది. మనుష్యులకేసి చూస్తూ మాట్లాడలేడు; ఒకరి వేపు చూస్తూ, మరొకరితో మాట్లాడుతుంటాడు. యవ్వనంలోని కాంతి దాగుడుమూత లాడుతూ, అప్పుడప్పుడు బుగ్గలలో దర్శనం యిస్తుంటుంది. ఏ దువ్వెన్నకీ లొంగని ఉంగరాలజుట్టు. చాలా చలాకీగా వుంటాడు. ఒక్క నిముషం వూరుకోలేడు దయానిధిని అతను చూడ్డం అదే మొదటిసారి.

"ఏరా జగం, యింత పొద్దుపోయిందేం? దయానిధి బావొచ్చాడు, చూశావా? వాడి మొహం, వాడే మెరుగును—" అంటూ నరసమ్మగారు, ప్రశ్నలు వేసుగుని, సమాధానం చెప్పకుంది.

"నరసమ్మగారూ, నేను కాలవలో స్నానం చేసి ఒచ్చా రేపు మీరు కూడా రండి నాతో – ఏమండోయ్ బావగారు, మా హైదరాబాద్‌లో అచ్చంగా మీలాంటాయన్నే చూశానండి. మీకు టోపీవేస్తే అల్లాగే వుంటారు—"

"ఏమిట్రా, ఆ వెర్రివాగుడు—" అంది దూరాన్నుంచి అమృతం తమ్ముడ్ని మందలిస్తూ.

"ఏమేవ్ యిది వెర్రియింగాదు, వాగుడున్‌కాదు, నీకంటే భోజనం చేస్తే మత్తుగా వుంది. నాకూ మాంచి అకలిమీదుందికధ వాగ కుండా ఎల్లా ఉండనూ – నరసమ్మగారి చేతిమీద గోంగూర పచ్చడి మనకి భగవానుడిక్కడ రాసిపెట్టిం గదా – అన్నట్లు ఏమండోయ్ నిధిగారూ, మా మేష్టారు యీ వూళ్ళో కనిపిస్తే బాగుండునండి. రేపు కాలవ స్నానానికి ఆయన్ని కూడా లాక్కుపోదును. మాంచి సుడిగుండం, యిహ తిరిగిరారు."

"అందుకనా నాయనా నన్నూ రమ్మన్నావ్ మాంచి పిల్లాడివే."

"పిన్నీ, వాడితో మీ కేమిటి, వాడిది పిచ్చివాగుడు"

"పిచ్చివాగుడనడానికి వీల్లేదు. అతని పిచ్చిలో ఫక్కీ వుంది, పద్ధతీ, క్రమం వున్నాయి."

"Well Said దయాళో—మీరు పిచ్చాస్పత్రికి సూపరెంట్‌గా వుండాల్సినవారు—"

"ఊరుకోరా, వెధవా—" అంది అమృతం.

"మొగాడు వెధవేమిటి? అది కేవలం స్త్రీలింగం"

నరసమ్మగారి వడ్డనతో జగన్నాధం కిక్కురు మనకుండా భోజనానికి వుపక్రమిం చాడు. ఒడ్డన విషయంలో తినేవాడు నరసమ్మగార్నే కనుక్కోవాల్సి వుంటుందని అనుభవం మీద అతనికి తెలుసు.

నిధికి, మొత్తం మీద తన యింటికి రావడం, అనుకున్నంత భయంగా కనబడలేదు కొత్త వ్యక్తుల్ని కలుసుగున్నాడు. వాళ్ళ వైషమ్యాలూ, వాళ్ళ చేష్టలూ; చాలా చిత్రంగా వున్నాయి. బస్తీలలో మనుష్యులు, యించుమించు అందరూ ఒకలాంటి దుస్తులే ధరించి, ఒకలాగే మాట్లాడి, ఒక మాదిరిగానే ఆలోచిస్తారు. పారిశ్రామిక నాగరికత, ఉద్యోగంలో పోటీ, అందరి మనస్తత్వాలనీ, నైతిక పద్ధతులనీ, సాఫీ చేసి, ఒకేలా వుండేటట్లు చేస్తుంది. డిమాక్రసీ జనం అంతా, భిన్నమైన, అభిరుచులు, ఆశయాలు

లేకపోవడాన్నే కోరుతుంది దాని వునికికి అది అవసరం. అంతేకాదు, నిధి పట్నంలో చెప్పుకోతగ్గ స్నేహితులు చేసుకోలేక పోయాడు. జీవితాన్ని పరిశీలించాలన్న వాడు పట్నంలో వెదుక్కోవల్సిన అనుభవాలు ఏమీ లేవేమో ననిపిస్తుంది. పల్లెటూళ్ళో వ్యక్తులు కొంచెం సహజంగా వుంటారు వెరైటీ వుంటుంది.

ప్రతి చిన్న చేష్టా, మామూలు మాటా, కొత్త అర్థాన్ని కొత్త వెలుగునీ తెచ్చుకుంటుంది అల్ప విషయాలన్నీ నూతనంగా తోస్తాయి.

దయానిధి అనుకోకుండా, మంచి రసవత్తరమైన ఘట్టం మధ్యలో వొచ్చిపడ్డాడు. ఇంట్లో నటీనటులున్నారు. నాటకానికి అవకాశం వుది. తెరవెనక చూశాడు, వ్యక్తులు వేషాలు ధరించటం. లోలోపల యుద్ధాలు జరుగుతున్నాయి. ఒక బృందం తన తల్లిని హేళనచేసి, దూషించటం మరో బృందం తన తల్లిని వెనకవేసుకుని రావటం. ఒకరు ఉద్యోగం, డబ్బు, హోదా, గొప్ప యివి చాలంటున్నారు. మరొకరు వీటిని చూసి హాస్యాస్పదంగా నవ్వుతున్నారు. ఇంగ్లీషు విద్య పేరు చెప్పి పై మెట్లమీద కొందరు నిలబడ్డారు. అది లేనివారు మరో లక్షణాన్ని ఆయుధంగా తెచ్చుకుంటున్నారు. పట్నవాసాలకీ, పల్లెలకీ, యంత్రాలకీ, హృదయాలకీ, పారిశ్రామిక నాగరికతకీ, పాడిపంటతో నిండిన నెమ్మది వ్యవసాయానికీ దేశంలో, అన్ని దేశాలలోనూ—నిరంతరం జరిగే మహాసంగ్రామం, తను, తన యింట్లో చూస్తున్నాడు. తను ప్రేక్షకుడుగా వుండలేదు. ఇందులో ఏది మంచిదో నిర్ణయించలేం. అసలీ సమస్యలు తార్కిక బుద్ధితో తీరవు. శరీరంతో తాకి, హృదయంతో అనుభవించి నాళాలపై రుజువుచేసుకోవాలి.

జగన్నాథం భోజనం చేసి చక్కా వొచ్చాడు. "నిధిగారూ"

"నిధిగా రేమిట్రా, బావగారూ అనలేవు."

"ఓ గూఢచారిణి, నువిక్కడే వున్నావు! రైటో, బావగారూ ఐతే అక్కయ్యా, మనవూళ్ళో అసలు బావనీ, యీ యన్నీ ఎట్లా, వేరే చెయ్యడం—ఏమనాలో తెలీడం లేదు—విడతియ్యడంలో What a foolish I am పిలవడంలో తేడా ఎట్లాగంటావు అఫ్‌కోర్సు. మా బావగారికి మీసాలున్నాయండోయ్. మీరు వాటికి Good-bye కొట్టారే, రైటో ఆయన్ని మీసాలు బావా అని పిలుస్తుంటాను."

"నన్ను?" అని అడిగాడు నిధి.

"మైనెస్ మీసాలు బావా—"

"తప్పురా కోతీ—" అంది అమృతం, ఆకులకి సున్నం రాస్తూ.

"కోతీ—What foolish అది కరెక్టు జగ్గూ!" నిధి అందుకున్నాడు.

"జగ్గూ—A jug the Crow and the jug దారుణం, పేరు ఫిరాయించండి—నాద్ అనండి, ఒద్దన్ను."

"రైటో నాథ్" అన్నాడు నిధి.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"ఎవరేనా పెద్ద మనుషులున్నప్పుడు, సమయానుకూలంగా నాథ్ జగ్ అనికూడా అనొచ్చు. ఇంతకీ మీరు కోతిని గురించి చెప్పబోయ్యేది కిల్లీ ముగించి చెప్పండి—"

"ఏమీలేదు జగ్గూ"

"మళ్ళీ అదే—"

"సారీ నాథ్! మీ అక్కయ్య కోతీ అనడంలో, డార్విన్ శాస్త్రజ్ఞుడు కొన్నేళ్ళు పరిశోధనలు చేసి కనుక్కున్న సత్యాన్ని యిట్టే కనుక్కుంది. నువ్వు ముందు చదువుకుంటావు—

మనుషుల పూర్వీకులు కోతులు. అంటే కోతినుండి, మొదటి మనిషి పుద్భవించాడన్న మాట. ఆ పక్షంలో నువ్వూ, నేను కోతి సంతానం Whereas మీ అక్కయ్య తోకలేని కోతి సంతానం—"

"మాకెమిస్ట్రీ మేష్టారి పాఠంలా చాలా గంద్రగోళంగా వుంది." అన్నాడు జగన్నాధం.

"బావగారికి నిద్రొస్తోంది. రాత్రంతా రైల్లో నిద్రలేదా మరి – మనం పోదాం పద—" అని అమృతం కదిలింది పసుప్పచ్చని ఖద్దరు చీరని మెడచుట్టూ గుండ్రంగా కప్పుకుని పెదవులను తమలపాకులతో ఎర్రబుచ్చుకుంటూ కదిలింది మాట్లాడేవెన్ను. మెడని కౌగలించుకున్న జడా—ఎందుకో పిల్లలతల్లిలా కనిపించింది విధికి. పిల్లలున్నట్లులేరు వుంటే కనబడరూ!

"రైటో—పోవుచున్నాడే. ఇంతకీ చెప్పదల్చుకున్న దేమిటంటే; యిందాక లాకు సూపరెంటు గారితో మాట్లాడొచ్చును. మా మామయ్య, పిక్నిక్‌కు సిద్ధం చెయ్యమన్నాడని చెప్పాను. సో, రేపు మనమందరం షికారెడుతున్నాము. Excepting వరసమ్మగారూ! ఆవిడ చుక్కానీ దగ్గర పడివుండొచ్చనుకోండి— కాని ఆవిడ తుమ్మడం వగైరా చేసిందంటే బుడుంగ్ మంటుంది పడవ."

"షికారేం ఖర్మం, రేపు పిక్నిక్ కెడదాం మరి నిద్రపోనా—" అవులించి పక్కకి తిరిగాడు.

"నేను నేరుగా నారయ్య దగ్గరికి పోతున్నాను. అతనితో నాకో పేచీ వుందిలెండి" అంటూ జగన్నాథం వెళ్ళిపొయ్యాడు.

నిద్రనుంచి లేచేటప్పటికి మధ్యాహ్నం మూడు గంటలైంది. సుశీల టీ తీసుకొచ్చింది. జగన్నాధం ఉత్తరాలు తీసుకొచ్చి అలమర్లో పెట్టాడు. ఒకటి దశరధరామయ్యగారు కాంప్ నుంచి వ్రాసింది. ఆయన వారం రోజుల వరకూ కాంప్‌లో వుండాల్సి ఒచ్చింది. కాబట్టి నారయ్య ద్వారా సరిపడ్డ బట్టలిచ్చి పంపించమన్నారు. మరో ఉత్తరం శ్రీనివాసరావు దగ్గర నుంచి. శ్రీనివాసరావు విధి ఇంటర్ మీడియట్ కలిసి చదివారు హాస్టల్‌లో ఒక రూములోనే వుండేవారు. వాళ్ళ నాన్న డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్. అతన్ని అందరూ సీనూ అని పిలిచేవారు. ఇంటి పేర్లో ఆర్ అనే అక్షరం ఉండేది. అంచేత రొమాంటిక్ సీనూ అని అనుకుంటూ అందర్నీ అలా పిలవమని చంపుకుతినేవాడు. మనిషెప్పుడూ నీరసంగా కనబడేవాడు. ఎప్పుడూ కీళ్ళ నొప్పులంటూ కాలేజీ ఎగేసి, గదిలో పడుకుని డిటెక్టివ్ నావల్సు చదువుకుంటూ గడిపేవాడు. వేళాకోళంగా అతన్ని రిమాటిక్ సీనూ అంటూ ఏడిపిస్తుండేవారు స్నేహితులందరూ. ఇప్పుడు ఆనర్సులో చేరాడు. సెలవలకి ఆ ఊరుమీదుగా ఏదో సంబంధం చూడ్డానికి వెళ్ళాల్సిన అగత్యం వుంది! కాబట్టి అతన్ని కలుసుకుని ఒకపూట కాలక్షేపం చేద్దామని ఉంది. కాబట్టి విధిని

తను ఆ ఊళ్ళో ఉండేదీ లేందీ తెలియబర్చమని అతనికి అభ్యంతరం లేకపోతే ఒస్తానని వ్రాసాడు చివ్వరలో తల్లి చనిపోయినందుకు కండొలెన్సెస్ స్వీకరించమని కోరుతూ ముగించాడు.

దయానిధి లేచి వెళ్ళి మొహం కడుక్కుని, తలకాయ దువ్వుకొని బట్టలేసుకున్నాడు. సుశీల చీరమార్చి, రిబ్బన్‌లు తీసేసి ఒదులుగా జడేసుకుని చక్కా వచ్చింది. నిధి హోల్డాల్ విప్పి, మాసిన బట్టలన్నీ మూట కట్టి దూరంగా వేశాడు. తరువాత ట్రంకుతీసి ఒక్కొటొక్కటే సామానులు తీసి చాపమీద పరుస్తున్నాడు. అరడజను పుస్తకాలు రెండు పాకేజీలు (ఒకటి పెద్దది, ఒకటి చిన్నది) లెటర్ కేస్ మంచం మీద పెట్టాడు.

"ఇవన్నీ ఏమిటి, కాలేజీ టెక్స్ట్ బుక్కులా?" అంటూ సుశీల పుస్తకాలని పరిశీలించడం మొదలెట్టింది.

"నాకోసం ఏం తెచ్చావ్ పట్నం నుంచి డాక్టర్" అంది. దయానిధికి సుశీల అక్కడ మంచి వెళ్ళిపోతే బాగుండు ననిపించింది.

"సుశీలా, కొంచెం దొడ్డిలో నారయ్య వున్నాడేమో చూసిరద్దూ."

"లేదు బావా, నారయ్యా, తమ్ముడూ జీడిమామిడి తోటలోకి వెళతామని వెళ్ళారు. ఇంకా ఒచ్చినట్లులేదు." అని పక్క గదిలోంచి అమృతం అంది.

"మంచివాళ్ళు తమకి తెలీకుండా హానిచేస్తారు." అనుకున్నాడు నిధి. ఎట్లా సుశీలను అవతలకి పంపడం?

"నువ్వు టీ తాగుతావా, కాఫీయా సుశీలా?" అన్నాడు.

"నాకా పట్టింపులు లేవు—రెండునూ, ఏం? ఎందుకు?"

"ఏమీలేదు. సాయంత్రం కూడా ఒక్కసారేనా కాఫీ తాగకపోతే ఎట్లాగో వుంటుంది. కొంచెం కాఫీ యిచ్చావంటే నీకు సర్వదా కృతజ్ఞుడను" అన్నాడు.

"ఇప్పుడేగా టీ త్రాగాం—"

"నే పెడుతున్నా బావా—" అటూ లోపల్నుంచి అమృతం అది.

కాఫీ సామాను, కుంపటి చప్పుడు వినబడుతోంది. మిడ్‌వైఫరీ మాన్యుయల్ తీసి సుశీల చూడడం మొదలెట్టింది.

ఛీ, ఛీ ఇవేం బొమ్మలు పాడు—" అని డోకొచ్చిన శబ్దం చేసింది.

"నీకెందుకు సుశీలా, అవన్నీ మా టెక్స్ట్ బుక్స్."

"నేను డాక్టరీకి మాత్రం చదవను—" ఖచ్చితంగా అంది.

"అట్లాగైతే భారతదేశం అధిక జనసంఖ్య తగ్గే ఆశలు మంట కలిసినై" అని అతనే నవ్వుకున్నాడు.

"మా నాన్ డిటైల్డు. రాబిన్‌సన్ క్రూసో—" అంది గర్వంగా.

"చూశావా ఎంత మంచి పుస్తకమో, డాక్టర్లు బాధ పళ్ళేకే రాబిన్‌సన్ క్రూసో ఏకాంతంలోకి పారిపోయాడు నరసమ్మత్తయ్య లేచిందేమో చూడు."

"ఆ పాకేజీ లేమిటి? నా కోసం ఏం తెచ్చావ్ డాక్టర్."

"ఇవా? ఇవి మందులు!"

"ఏం మందులో చూడనియ్యవు, డాక్టర్"

"సుశీలా, నువ్వు నన్ను డాక్టర్ అని పిలవడం బొత్తిగా బాగుండలేదు, ఇంకా నేను డాక్టర్ని కాలేదు. రెండోది, ఒక్క పేషంట్లకే నేను డాక్టర్ని అవుతాను కాని, అందరికీ కాను. పైగా నువ్వు పిలుస్తుంటే ఎల్లాగో వుంటుంది కూడాను."

అంటూ ఆమెకేసి, ఎగా దిగా తేరిబార చూశాడు, కనుబొమ్మలు చిట్లించాడు.

"డాక్టరని పిలిచినందుకు Excuseme డాక్టర్" అని నాలికకొరుక్కుంది. "అదే అలవాటైపోయింది. పైగా, అల్లా పిలిస్తే నువ్వు సంతోషిస్తావనుకున్నాను." అంది సుశీల.

"కాదు, నేను సంతోషించనని నాకు తెలుసు. అది నువ్వు సమాధాన పరచుకునేందుకు సృష్టించుకున్న కారణం. నన్ను బాధపెట్టడం నీకు సరదా... నీకు మొత్తం డాక్టర్లపై వున్న కోపం అంతా నా మీద చూపిస్తున్నావు—"

"నాకు డాక్టర్ల మీద కోపమెందుకు? నువ్వు చిత్రంగా మాట్లాడుతున్నావు. నిన్ను ఫ్రూండ్ చేసేనా?" అంది.

"ఇదివరకే ఫ్రూండై వున్న వాళ్ళని మనం ఫ్రూండ్ చెయ్యలేం – నిజం చెబితే నువ్వు బాధపడతావు. నిన్ను బాధ పెట్టడం నాకిష్టంలేదు. నాకు చేతకాదు—"

"నేనేమీ అనుకోను. చెప్ప నిధీ, నాకు డాక్టర్లంటే ఎందుకిష్టములేదు. చెప్పకపోతే నాకు రాత్రంతా నిద్రపట్టదు—" అంది.

"ఊరికే అన్నాను సుశీలా—తమాషాకి ఆ మాత్రం వూహించలేవేం?"

"చెప్పితీరాలి నువ్వు. మాట మరిపించేస్తున్నావ్. నిన్ను ఫ్రూండ్ చేశాను. ఎందుకో చెబితే ముందు జాగ్రత్తగా వుంటాను. ఏదో మీ అమ్మ ఉందనీ, మామయ్య ఒంటిగా వుంటాడని, ఇక్కడికొచ్చాం గాని, నీకు మనస్సులో ఏవో బాధలున్నాయంటే మావల్ల. నేను రేపే వెళ్ళిపోతాను." అని సుశీల తలకాయ ఒంచుకుంది.

"నిజం, సుశీలా! నువ్వు అల్లా అనుకోవద్దు. మీరందరూ ఇక్కడికి రావడం వల్ల నాకెంతో సంతోషంగా వుంది. మీరులేకపోతే చాలా దిగులుపడిపోదును—ఏమీ లేదు, నువ్వు కట్టుకున్న చీర లాంటిది మా అమ్మకి ఉండేది. అది జ్ఞాపకం ఒచ్చింది, అంతే!" అన్నాడు.

"ఈ చీర మీ అమ్మదే. అమ్మ – కట్టుకు చూడవే, నీ కెంతో బాగుంటుందని చంపుకుతింటే కట్టుకున్నాను—ఇప్పేస్తా నుండు."

"నా ముందే. ఖర్మ"

సుశీల వెళ్ళింది. బ్రతికానురా దేముడా అనుకొని, చిన్న పాకేజీ పొట్లం కోటు జేబులో దాచేసి. మిగతావి ట్రంక్‌లో సర్దడం మొదలెట్టాడు ఇంతలో కాఫీ తీసుకుని అమృతం చక్కా వచ్చింది.

"పట్నం నుంచి బావ ఏదో చాలా తెచ్చాడే!"

నాకేం తెచ్చావు బావా అని అడుగుతుందేమోనని భయపడ్డాడు.

"బావా, నువ్వు పట్నం మళ్ళా వెళ్ళినప్పుడు మా వూళ్ళో దిగావంటే, నీకు ఇట్లాంటి పాకేజీలిస్తాను. తీసుకెళుదువుగాని" అంది అమృతం.

"ఏమిస్తావ్?"

"సొజ్జప్పాలు—మాకు మంచి పూతరేకులొస్తాయి. అవీ; కజ్జికాయలు..."

"—కజ్జికాయలు మనమూ తింటాం—" అంటూ చక్కా వచ్చాడు జగన్నాథం. నీ కోసం ఇక్కడేం సిద్ధంగా లేవు.

"ఇవన్నీ ఏమిటండోయ్—" అంటూ జగన్నాథం పుస్తకాలను పరామర్శచేసి, సొంత పెట్టెలా, పెట్టి కెలకడం మొదలెట్టాడు.

"తప్పురా, అవన్నీ అల్లావుంచు—"

"ఇదేమిటండోయ్—" పాకేజీ కాగితం తొలగించి అట్టపెట్టి బయటికి లాగాడు. సుశీల చీరమార్చి చక్కా వచ్చింది. ఏదీ నన్ను చూడనీమనీ ఆ పెట్టి లాక్కుంది. జగన్నాథం మళ్ళా లాక్కుని హాల్లోకి పరుగెట్టాడు. సుశీల తరుముకుంటూ వెళ్ళింది.

అమృతం గుమ్మంలో కొచ్చి నారయ్యని కేకేసింది.

"నారయ్యా, వాడ్ని యిల్లా లాక్కురా. ఆ పెట్టి పుచ్చుకొని చక్కా పోతున్నాడు."

నారయ్య తువ్వాలు నడుంకి బిగించాడు.

"ఈ అబ్బాయిగారి పని మా యిదిగా వుందండి. కోతల్లరి—" అంటూ అరుగుమీద కొంత పెనుగులాట జరిగింతర్వాత ఆ పెట్టెని సుశీల తీసుకొచ్చింది.

"అదేమిటో చెప్పేస్తా నాకేమిస్తావు?" అన్నాడు జగన్నాథం.

"నువ్వెందుకయ్యా పెద్దాళ్ళల్లో కెగబడతావు?" అని కసురుకుని నారయ్య దొడ్లో కెళ్ళాడు. కూకలేసి, అదమాయించేటందుకు, నేటికో వ్యక్తి దొరికాడు గదా అని లోపల నారయ్యకి పరమానందం.

"కెమేరా?"

"కెమెరా"

"అంటే – ఫోటోగ్రాపులు తీసేదా?" అంది అమృతం.

"ఏదీ, నా ఫోటో తియ్యవ్?" అంది సుశీల.

"మనుషులూ పడతారా?"

"ఒక్క మనుషులే కాదు, ఆకస్మిక ఛాయాచిత్రం అనగా Snapshot కూడా రాత్రింబవళ్ళు ఇక్కడ తియ్యబడును. సరసమైనరేట్లు" అని పూర్తి చేశాడు జగన్నాథం.

"ఏదీ నన్నుతీ—" అని చేతులు కట్టేసుకొని, మూతి బిగించి నిలబడ్డాడు.

"ఊ—బాగున్నావులే, కోతిలా" అంది అమృతం.

"నేను భవదీయ సోదరుండని, మరువకుమో మగువా... ఈ మధ్య తెలుగు దంచేస్తున్నాడండి బావగారు, క్లాసులో నా పేపరు అర్థంకాక మా మాస్టారు ఫస్టుమార్కు ఇచ్చేసి వూరుకుంటున్నారు... ఈ పూటకి ఫోటోలు తీయటం అపు చెయ్యడమైంది. రేపు పిక్నిక్‌లో, మంచి దుస్తులతో, సెంటు పౌడర్లు వగైరాలతో వచ్చిన వారందరికీ వుచితంగా ఫోటోలు తీసి, వారి వారి ముక్కులకే తగల్చబడును—ఏమంటారు బావగారు..."

"ఐతే, ఏదీ, ఎవర్ని తియ్యాలని?" అంది సుశీల.

"What a foolish..."

"ఎవర్ని"

"What a foolish! వన్నే..."

"మనమందరం రేపు తీయించుకుందాం. లాకుల్ దగ్గర నాచురల్ సీవెరీ వుంటుంది. ఏం జగ్గూ?" అన్నాడు నిధి.

"మిమ్మల్ని మీరు సరిచేసుకోండి. నో జగ్, Call me నాధ్"

రేపు తీయించుకుందాం. మరి యీ పూట నువ్వు నారయ్యా వెళ్ళి రేపటికి తెడ్లు, తాడు–అన్నీ ఏర్పాటుచేసి, లాగేటందుకు మనుష్యుల్ని మాట్లాడండి."

"రైటో–కాని నారయ్యకు నాకు మాటల్లేవు."

"నేను మీ ఇద్దరికీ రాజీ చేస్తాగా..." నారయ్యతో బైట కొంత ప్రసంగం చేసి చక్కా వచ్చాడు నిధి.

నారయ్య ప్రశాంతాన్ని కొంతవరకూ జగన్నాథం భంగం చేశాడనే చెప్పాలి.

ఏవో కొత్తరకం మొక్కల్ని నారయ్య దొడ్లో పాతాడు; ఓ కఱ్ఱ పుచ్చుకుని, ఓ దానిమ్మపండుని తీసుకొని ఆ కఱ్ఱతో కొడుతూ, దొడ్డంతా జగన్నాథం తిరగడం అప్పటికి రెండుసార్లు జరిగింది. మొదటిసారి చూసి నారయ్య, వూరుకున్నాడు, ఏదో కుఱ్ఱాయనగదా అని. రెండోసారి అదేమిటనడిగాడు అది Home golf అనే ఆటట. మాట దక్కదన్నాడు నారయ్య. ఆ మొక్కల్ని ధ్వంసం చెయ్యడానికే తనీ అవతారం ఎత్తినట్లు ప్రవర్తించడం చూసి నారయ్యకి ఒళ్ళు మండిపోయి ఆ కఱ్ఱని విరిచి అవతల పారేశాడు. గొయ్యి తీసి అందులో దానిమ్మకాయని పూడ్చాడు.

జగన్నాథం మళ్ళా అవాళ ప్రొద్దున జీడిమామిడికాయని తీసుకుని సిద్ధమయ్యాడు. ఆ జీడిమామిడి కాయలు కొయ్యడానికి తనూ బాధ్యత వహించాడు. గనక రాజీకి నారయ్య ఒప్పుకున్నాడు. ఇద్దరూ లాకుల దగ్గర కెళ్ళారు.

దయానిధి లోపలి కొచ్చేప్పటికి సుశీల మంచం మీద మడిచి పెట్టిన కోటుని తొడుక్కుచూసుకుంటోంది.

"చూస్తున్నావా బావా, వొద్దంటుంటే ఆ కోటుని నలిపి పాడుచేస్తోంది" అంది అమృతం.

"నాకు సరిపోయింది చూశావా! నిధీ. నేను నీ అంతలావు వున్నా నన్నమాట" అంది సుశీల ఎగాదిగా చూసుకుంటూ ఆ కోటు సుశీల మోకాళ్ళదాకా వొచ్చింది. ఆ కుడివెంపున ఆ ఎత్తేమిటంటూ, అమృతం విరగబడి నవ్వుతోంది. విరగబడి నవ్వినప్పుడు పళ్ళు అంత బాగుంటాయని తనకి తెలీదు.

ఎందుకానవ్వు! నీ కేమన్నా ఫాషన్స్ తెలుసా, పాడా? నార్తు ఇండియాలో వింటర్లో లేడీస్ అందరూ కోట్లేసుగుంటారు? ఒసే అమ్మలూ, మీ ఆయనెప్పుడేనా కోట్లేసుగుంటాడే?" అంది వెక్కిరిస్తూ సుశీల.

"ఆ ప్రశ్న అడిగించుకునే అర్హత నీకు లేదు కదా! కోటు కోసం పెండ్లి చేసుకుంటుంది కాబోలు పెళ్ళి బాబోయ్." అంది అమృతం.

"అదుగో! మళ్ళా నా పెళ్ళి మాట ఎందుకెత్తుతావూ? ఆ నవ్వేమిటి? పిచ్చెక్కిందా?"

సుశీల మళ్ళా చూసుకుంది. మధ్య బొత్తం పెట్టడం వల్ల కుడి వెంపున ఏర్పడ్డ ఎత్తుని చూసి నాలిక కొరుక్కుని, గోడవైపుకు తిరిగి కోటువిప్పి, జేబులోంచి చిన్న

పాకేజీ తీసింది. అమృతం కిందికి జారిపోయిన పమిటకొంగును సరిగా సర్దింది సుశీల. చేతిలోంచి తటాలున నిధి పాకేజీని లాక్కున్నాడు. అదేమిటో చూపించమని అతన్ని ఇద్దరూ చంపుకుతిన్నారు.

"నన్నడక్కండి. ఇది మీకు అనవసరం" అన్నాడు.

"దాన్ని మాకివ్వనక్కర్లేదు – అదేమిటో చెప్పాలి." అన్నారు.

రహస్యాలంటే స్త్రీలకి గిట్టదు. స్త్రీ హృదయం ఒక రహస్య మందిరం దాన్ని పురుషుడు తెలుసుకోనంతకాలమూ స్త్రీ పురుష వ్యత్యాసాలుండాల్సిందే అనుకునే సనాతనులు భ్రమపడుతున్నారు. ఆ రహస్యం అంతా ఊహకి దాసులైన సౌందర్య పిపాసులు కల్పించేదే, కాని వారిలో ఏ రహస్యం లేకపోవడం సరిగదా సృష్టిలో వారి కర్థం కాని రహస్యాలతో అసలు మానవునికే నిమిత్తం లేదన్నట్లుగా స్త్రీలు ప్రవర్తిస్తూంటారు. గుప్పెట్లో గాలిని దాచి "ఇదేమిటో చెప్పుకో" అంటే పురుషుడు "కొంతవ్యవధి నివ్వండి ఆలోచించి చెబుతాను" అంటాడు. స్త్రీ గుప్పెటని రక్కేసి వేళ్ళని బలవంతంగా లాగి తీరా చూసి "ఓస్ ఇంతే, నాకక్కర్లేదు" పొమ్మంటుంది.

ప్రపంచం పురుషుడికి చెందుతుంది – దాన్ని శోధించి అర్థం చేసుకోవాలి, కాని ఏం లాభం? పురుషుడు స్త్రీకి చెందుతాడు, అంచేత ప్రపంచ రహస్యంతో స్త్రీకేం నిమిత్తం? వీళ్ళు ఒదిలేటట్లు లేరనుకున్నాడు నిధి.

"ఇది; – ఒకమందు–"

"ఆ మాత్రం దానికి ఇంత దాపరికం ఎందుకు?" అంది సుశీల.

"నేనేం దాచలేదు, అందులో సీసాలు బద్దలౌతాయేమోనని నా భయం" అన్నాడు.

"కొంపతీసి పొటాసియం సైనైడా?"

"అంటే?"

"అదో విషం–తాగితే హాయిగా బాధలేకుండా చచ్చిపోవొచ్చు" అంది సుశీల.

"అబ్బె–ఇది విషంకాదు. Artificial Gold చేసేందుకు ఇదో ద్రావకం..."

"ఏదీ చూణ్నీ?"

"ఒద్దు, ఒద్దు వెలుగులో దీన్ని బైటికితీస్తే దీని పటుత్వం తగ్గిపోతుంది." అంటూ నిధి కోటు వేసుకుని అరుగుమీదికి నడిచాడు.

ఎదురుగుండా ఒచ్చింది డోగప్పనాయుడిగారి కూతురు నాగమణి; డోగప్పనాయుడుగారు కంట్రాక్టులు చేసి బోలెడు డబ్బు గడించాడు; పెద్ద కొడుకు ఇంగ్లండు వెళ్ళాడు. ఎందుకో ఎవళ్ళకీ తెలీదు; పెద్దపిల్ల మొగుడికి బొంబాయిలో పని. నాగమణి రెండో కూతురు. డబ్బు గడించటం, ఇల్లుకట్టడం గొడవల్లోపడి సరిగా కూతురు విషయం కనుక్కోక పోవడం వల్ల స్కూల్ ఫైనల్ మూడుసార్లు ఫేలవడం జరిగిందనీ, ఉత్తుత్త పరీక్షలు ప్యాసు చేయించడం తన సంకల్పం ఐతే యీ పాటికో పదివేలు తగలేసి బి.ఏ. కూడా ప్యాస్ చేయించి వుందునవీ, అప్పుడప్పుడు వాపోతూ వుంటాడు. ఆ కారణాలవల్లనే వివాహం కూడా చెయ్యలేదంటాడు. ఉద్యోగం లేక పొట్టకూటికి అమ్ముడుపొయ్యే అల్లుళ్ళు దేశంలో అంతమంది వుంటుండగా

తన కూతురు వివాహం విషయంలో ఆంధ్రదేశంలో ఎవరూ బెంగపడక్కర్లేదని క్లబ్బులో పైబేస్తు గెలిచిన హుషార్లో అనేసినా లోలోపల పెళ్ళి కానందుకు కొంత చింతపడుతున్నట్లు క్లబ్బు స్నేహితులకి కూడా తెలుసు. గుమాస్తా కూర్మయ్య, జోగయ్య నాయుడు కొత్తగా కట్టినయిల్లు కామాక్షికోసమే అంటుంటాడు కాని అతను కుటుంబ సమేతుడై అందులోనే కాపరం వుండడం వల్ల ఆ పుకార్లో యదార్థం ఎంతవరకూ వుందో గట్టిగా నిర్ణయించిన వాళ్ళులేరు. కూర్మయ్య తనవాదం మాత్రం మానడు. ఆ మనిషి ఎట్లాంటి వాడైంది ఆయన కట్టించిన మేడే చెబుతుంది అంటాడు. కాని ఇదంతా యజమానిమీద నౌకరుకుండే యీర్ష్య, కసి కింద కట్టేసి ఆ వాదాన్ని ఎవరూ బలపర్చడం లేదు. ఈ మధ్య కూర్మయ్య సందడి నాలుక మరో కొత్త పుకార్ లేవదీసింది. జోగప్ప నాయుడిగారికి బ్రాహ్మణ కుర్రాణ్ని అల్లుడిగా తెచ్చుకోవాలని వుందనీ, అందుకే దశరథ రామయ్య గారబ్బాయితో అంత స్నేహంగా వుంటున్నాడనీ, యీ పుకారు సారాంశము. దశరథరామయ్యగారితో వియ్యమొందాలన్న కామాక్షి సంకల్పాన్ని మెచ్చుగుని. నాయుడిగారి ఆశలు అంతటితో అడుగంటుతాయి కదా అన్న ధైర్యంతో కూర్మయ్య నిశ్చింతగా వుంటున్నాడు. ఈ విషయమ్మై లోగడ ఇద్దరి వ్యక్తులతో స్వల్ప పందాలుకూడా వేశాడట. నాగమణి స్కూల్ ఫైనల్ పరీక్షలకి కట్టిన డబ్బుతో విశ్వవిద్యాలయం అభివృద్ధి చెంది తీరుతుందని కూర్మయ్య కసిగా అంటాడుగాని అల్లా జరిగే చిహ్నాలేవీ లేవు, నాగమణి చదువు చాలించుకుంది.

గిట్టని కూర్మయ్యలాంటి వాళ్ళు నాగమణిది దోసకాయ మొహం అంటారుగాని, అది ఆ అమ్మాయికి అన్యాయం చెయ్యడం. నాగమణి చాలా పొడగరి–శరీరానికి తగినట్లుగా వుండే, పొడుగాటి కోల మొహం; ములక్కాడల్లా వ్రేల్లాడే సన్నటి పొడుగాటి చేతులు, చెవులని కప్పేసి, చంపల నావరించుకుని ఒత్తుగా వుండే జుట్టు, పల్చటి పట్టుచీర, అందులోంచి కనిపించే లేస్‌తో కుట్టిన పరికిణీ అంచు; కూర్మయ్య అన్నట్లు "ఆ రవ్వల దుద్దులు తీసేసి నుంచో మనండి అందం బైటపడుతుంది"– అట్లాగైతే ఎట్లా వుంటుందో తెలీదుకాని, ధగధగ మెరసిపొయ్యే రాళ్ళదుద్దులు, చెవలమీది జుట్టులోంచి శ్మశానంలో అర్ధరాత్రి మంటలా వెలిగి పోతుంటాయి. రెండు శిఖరాల మధ్య అస్తమించ బొయ్యే సూర్యుడిలాంటి ఎర్రబొట్టు.... నాగమణిది కళైన మొహం కాకపోతే కూర్మయ్య బోటిగాళ్ళు చక్కదనం లేదని రుజువు చేసే అవసరమే రాదు.

నిధిని చూసి నమస్కారం పెట్టింది.

"మీరు పొద్దున్న రావడం చూశాను" సుశీలని, అమృతాన్ని చూసి నిలిచిపోయింది.

"మా యిల్లు చూడ్డానికి రారూ?"

"రేపు తప్పకుండా వొస్తాను..."

"రేపు మధ్యాహ్నం పిక్‌నిక్‌కి నువ్వు కూడా తప్పకుండా రావా" అంది సుశీల.

"మీరొచ్చి మా నాన్నగారితో చెప్పకూడదూ.. అవసరం లేదనుకోండి..."

"ఓ అల్లాగే..."

"అవును మరి – పెళ్ళికాని పిల్ల పరాయి వాళ్ళతో షికార్లు చెయ్యడం ఏమంత బాగుంటుంది?" అంది అమృతం.

"మహా చెప్పొచ్చావ్ లెద్దూ. నాగమణి చదువుకున్నది – నీలా పల్లెటూరి రకంకాదు."

"ఎంత చదువుకున్నా. మనం ఉన్నది పల్లెటూరు కాని మహా పట్నం కాదుగదా... నలుగురికి మనం భయపడాలి. .. మీ నాన్న పెద్ద ఉద్యోగస్తుడు గనుక, నీకు పెళ్ళి కాకుండా, ఎన్నాట్లాడి..."

"అదే ఒద్దన్నది. నా పెళ్ళి జోలెత్తకు నీకు సరదాలేదు. ఇంకోళ్ళు సరదాగా ఉండటం నీకు గిట్టదు, రా నాగమణీ, అమ్ములు మాట్లకేమిటి?"

"మనం ఈ విషయం, వీధుల్లోకాకుండా, ఇంట్లో తర్కించుకుంటే బాగుంటుం దేమో"

"మరి నే అట్లా వెళ్ళిరానా?..."

"ఎక్కడికి?" అన్నాడు నిధి.

"ఎక్కడికైతే నీ కెందుకు. మొగాడు తన యిష్టం ఒచ్చిన చోటికి..." అమ్ముల వాక్యం పూర్తి కాకుండానే సుశీల మొదలెట్టింది.

"నీకెందుకు నిన్నెవరూ అడగలేదు."

"ఎక్కడికేమిటి? క్లబ్బుకి..."

గుమ్మందాటి హాల్లో కెడుతూ నాగమణి మెల్లగా అంది. "ఎక్కడికి–కోమలి యింటికి–"

సుశీల కళ్ళజోడు తీసి కొంగుతో తుడుచుకుంది. అమృతం ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసుకుని, రెండుసార్లు రెప్పలు కదుపుకొని యింట్లో కెళ్ళింది.

దయానిధి నవ్వుకుంటూ నడిచిపోయ్యాడు. నాగమణి ఎట్లా కనుక్కుందా అని ఆశ్చర్యపడ్డాడు. మనుష్యుల్ని మనుష్యులు అర్థం చేసుకోలేరేమో అనుకొనేవాడు. భార్యాభర్త నందేళ్ళు కలిసి కాపరం చేసినా, ఒకర్ని ఒకరు ఎంతవరకూ అర్థం చేసుకుంటారు? తండ్రి కొడుకుని అర్థం చేసుకోగలడా? అందాకా ఎందుకు? తనకి తనే అర్థమయ్యాడా? నిద్రపోయి లేచి అద్దములో మొహం చూసుకున్నప్పుడు ఎవరోనని భయపడడం ఎన్నిసార్లు జరగలేదు? స్వప్నంలో తనను చూసుకొని ఎంత ఆశ్చర్యపడ్డాడు! స్వప్నములో క్రూరమృగాలతో భీకర యుద్ధం. స్త్రీలతో లాలన, సంఘంలో చీకటి శక్తులతో పోరాటం వీటిలో ఎన్నింటిని తన నిత్య జీవితంలో కనపర్చగలుతున్నాడు?

నిజంగా ఎవరూ, ఎవరికీ అర్థం కాదు. మనిషికీ మనిషికీ మధ్య గోడలు లేచి వున్నాయి. అవతల్నించి మనం మాట్లాడే మాటలు వింటారు. మన చేష్టల్ని చూస్తారు. "ఆ మాటలు మాట్లాడిన వ్యక్తి ఆ సమయంలో అట్లాగ చేస్తాడు" అని సంఘం నిర్ణయించుకొని వాడ్ని తక్కెట్లో తూచి బరువుకట్టేసి వాడితో నిమిత్తం ఒదులుకుంటుంది. నూటికి తొంభైతొమ్మిది మార్లు, వాళ్ళు అనుకున్నట్లుగానే ఆ మనిషి ప్రవర్తిస్తూ ఉంటాడు. సంఘం కట్టిన విలువ సరైనదని రుజువైపోతుంది. అందుకనే తన నియమాల్ని అందరూ పాటించేటట్లు చేసుకొనే బలం సంఘానికి ఉంది. అందుచేతనే సంఘం అంటే అమృతం లాంటి వాళ్ళకి అంతభయం.

మనిషికీ మనిషికీ మధ్యలోనే కాదు గొడవలుండటం, ప్రతి మనిషిలోనూ ఒక తెర వుంటుంది. ఆ తెర వూడిపోకుండా "సంఘం" కాపలా కాస్తుంది పగటిపూట. మామూలు సమయాలలో విస్త్రీ మడతలా ఆ తెర బాగానే వుంటుంది. కాని రాత్రి ఎప్పుడో, మందు వేసంగి రాత్రి మైమరచి నిద్రపోతుంటే వాన చినుకులు పడినప్పుడో, చీకట్లు అనంతాన్ని పెల్లగించుకొని ఆత్మని ఆవరించుకున్నప్పుడో, ప్రాచీన శక్తులు వేడి రక్తంలో కాలిపోయి ఉండలేక శరీరాన్ని బద్దలు చేసినప్పుడో, ఎప్పుడో, ఎందుకో, ఆ తెర వూడిపోతుంది.

పిచ్చాస్పత్రులలో ఉన్న వాళ్ళందరూ, ఈ "తెరలు" వూడి పోయిన వాళ్ళూను, కొంచెం చిరిగిపోయినవాళ్ళూను.

ఆ రోజు ఎన్ని అబద్ధాలాడాడు! ఎంత గుట్టు, ఎంత దాపరికం! ఎంతటి కుట్ర, ఎవర్నో ఖూనీ చెయ్యటానికి సంకల్పించుకున్నట్లు! ప్రేమలో సత్యం ఉందని అతను నమ్మలేక పోతున్నాడు. ఆ పవిత్రమైన వస్తువు అతనిచేత అబద్ధాలాడిస్తోంది, కుటిలత్వం నేర్పింది, సుశీల, అమృతం లాంటి వాళ్ళకి భయపడాల్సి ఒచ్చింది. పురుషుడి కృత్రిమ మనస్తత్వాలని ఛేదించి సాఫీ చెయ్యడానికి మరింత "కృత్రిమం" స్త్రీకి "సృష్టి" ప్రసాదించింది. అది ప్రేమ కాదేమో! పాపం, ప్రేమని ఎందుకు నిందించటం. ఇతరుల మనస్తత్వాలను తెలుసుకోడంలో మనం చూపించే శ్రద్ధ, వోర్పు, తెలివి, మనల్ని మనం తెలుసుగోడంలో ఉపయోగిస్తే ఎంత బాగుండును, లేక ఏదో శక్తిని సంపాదించుకోటం కోసం, ఉన్న నాలుగు శక్తుల్నీ దుర్వినియోగం చేసి, చంపుకునేటట్లు, సంఘం తర్ఫీదు చేస్తుంది.

అదుగో క్లబ్బు.

దయానిధి క్లబ్బులో పత్రికలు తిరగవేస్తూ అరగంటసేపు గడిపాడు. కబుర్లు చెప్పటానికి జోగప్ప నాయుడుగారు లేరు. అధమం కూర్మయ్య కూడా లేడు. ఓ మూల సుబ్బారావు పరీక్ష పోయినందుకు ఎవరు పరామర్శ కొస్తారోనని భయపడుతూ, "తోడా"స్త్రీల బొమ్మలు చూస్తూ వీక్లీ ఆఫ్ ఇండియా వెనకదాక్కున్నాడు. కోటయ్యగారు, తన బృందంతో కసిగా పేట్లాడుతున్నాడు. ప్రపంచంతో నిమిత్తం లేనట్లుగా ఓ ముసిలాయన స్తంభానికి జేర్లబడి అనంతాన్ని చుట్టపొగ లోంచి తిలకిస్తున్నాడు.

మోడరన్ రివ్యూ తీశాడు. అది నాలుగు నెలల క్రితంది. అది లైబ్రరీ మూమెంట్ లేవదీస్తూ విశ్వనాథంగారు గంభీరోపన్యాసం యిచ్చిన వారంలో తెప్పించిన తాలూకు. అద్దాలూడిపోయిన బీరువాలో, ఏ నాగరికతకి చెందినవో కొన్ని పుస్తకాలున్నాయి. ఒకటి రెండు బయటికి తీసి చూశాడు. పురుగుల అస్థిపంజరాలూడిపడ్డాయి. పుటలు తిప్పేటప్పటికే, టపటపమని వూడిపోతూ పొడుమై పోవటానికి సిద్ధపడుతున్న పుస్తకాన్ని హత్య చెయ్యటానికి ఇష్టం లేక, దాన్ని దాని స్థానంలో ఉంచేశాడు. గోడ మీద యివ్వవల్సిన రోజుకి పుస్తకాలు ఇవ్వని వాళ్ళ పేర్ల జాబితా తగిలించారు. అందులో మొదటి పేరు గోవర్ధన రావు గారిది. పాపం ఆయన చనిపోయి ఎనిమిది మాసాలైంది.

మళ్ళా దినపత్రికలున్న బల్ల దగ్గరకొచ్చి కూర్చున్నాడు. పత్రికలలో విశేషాలేమీలేవు. కాంగ్రెస్ ప్రెసిడెంట్ హౌరాస్టేషన్‌లో దిగి నప్పుడు అమృతలాల్‌గారు, భూలాభాయి దేశాయి తుమ్మినట్లు, అన్సారీగారు ముక్కుపొడుం పీల్చమన్నట్లూ స్వకీయ విలేఖరి తెలియచేస్తూ, ఆ తుమ్ము, జరుగుతున్న సంప్రదింపులు, బాగా సాగటం లేదని సూచిందమేమోనని కొందరు పైవాళ్ళు అనుకుంటున్నారనీ వ్రాశాడు. "భావల్ సన్యాసి" అప్పీల్ చదువుకుందామనుకుంటే, కాగితంలో సగం భాగాన్ని ఎవరో చించేసి, చెవుల్లో తిరెట్టుగున్నారు. సుబ్బారావు గబగబా వెళ్ళి బీరువా పైన ఉన్న వీక్లీల కట్టతీసి, దులిపి, మళ్ళా చదవడం మొదలెట్టాడు.

దూరంగా స్కూలు పిల్లలు ఆడుతున్న బంతాట ముగిసింది. చీకటి కోసం కాచుకున్న దొంగలా చీకటి తూర్పున మెదుల్తోంది. పొగ చూరిన చిమ్నీ తుడిచి క్లబ్బు కుర్రాడు దీపం వెలిగించాడు. క్లబ్బుకుర్రాడు తన విధి నెరవేర్చాడు. కాని దీపం ఎందుకూ ఉపయోగం లేదు. సుబ్బారావు బొమ్మలు కనబడక కాబోలు వీక్లీతీసుకొని బైటకొచ్చి స్తంభానికి జార్లబడి చదవటం మొదలెట్టాడు. అనంతాన్ని తిలకిస్తున్న ముసిలాయన చుట్ట ఆరిపోవడం వల్ల కాబోలు మళ్ళా ప్రపంచంలో అశాంతిని తెలియజేస్తూ "నీ పరీక్ష ఏమైంది, సుబ్బారావూ?" అని కుశల ప్రశ్న వేశాడు.

సమాధానం వినకుండానే నిధి క్లబ్బు విడిచి వీధిలోకి నడిచాడు అవులమంద నడిచిన వింత వాసన దుమ్ములో లేచింది. సిగరెట్టు నుసి లాంటి రంగుగల పొగ ఇళ్ళ కప్పులపై చుట్టుకుంది. చీకటిపడ్డ వార్తని తెలియచేస్తూ పక్షులు చెట్ల కొమ్మల్లో పలకరించుకున్నాయి. మదార్ సాయిబు సోడాకొట్టు క్రింద నుంచి నల్లకుక్క ఒక్కసారిగా బయటికి వచ్చి ఆకాశంలో నక్షత్రాలని చూసి మొరిగింది. దాని స్నేహిత బృందం దూరాన్నుంచి అందుకుని బృందగానం సాగించాయి. సృష్టిపై ఉన్న విరక్తిని కుక్కంత విశదంగా ప్రాణికోటిలో మరే జంతువూ ప్రకటించుకోలేదు. అరుగుల మీద నుంచి చాలా మంది దిగి వచ్చి అపుజెయ్యడానికి ప్రయత్నించారు గాని లాభం లేకపోయింది. సంత చేసుకొస్తున్న వారితాలూకు పొరుగూరి కుక్కని చూసి మరింత పేట్రేగిపోయి, కుక్కజాతికే తీరని కీడు సంభవించినట్లు ఏకస్థాయిలో మొరగడం మొదలెట్టాయి. పట్నంలో ఉన్నన్నాళ్ళూ మనవూరు ఎప్పుడు పోదామా అనుకునేవాడు. ఈ కుక్కలగోల అచ్చంగా పట్నంలో ట్రాములు చేసే చప్పుడులా ఉంది. పొరుగూరి కుక్కకు బదులుగా ప్రయివేటు కార్లు, లారీలు ఉంటాయి. వీటిగోల అపుచెయ్యటానికి ఒచ్చిన వాళ్ళే అక్కడ పోలీసులు.

సందులో కొచ్చాడు, అదుర్దాతో కొట్టుకుంటున్న నరాలన్నీ చప్పుడికి అదిరి పోయినాయి. చెవులున్నా లేకపోయినా మనిషికున్న వందేండ్ల అయుర్దాయంలో యీ శబ్దాలు, అధమం ఐదేళ్ళయినా హరిస్తాయి...

తలుపు తట్టాడు. అతడు వస్తాడని తెలిసి, కాచుకున్న దాని మాదిరిగా కామాక్షి వెంటనే తలుపు తీసింది. "రండి రండి" – అంటూ గదిలోకి తీసికెళ్ళింది. అతను కూర్చోతగిన కాళ్ళ పీట ఒకటి మాత్రం ఉంది. ఓ మంచం వుంది కాని, కూర్చోతగిందిగా లేదు, దుప్పటి – చిరిగిపోగా మిగిలిందే మడతలు రేగిపోయి,

చాకలాడికి పడేద్దామనుకుని బయటికి లాగి, మళ్ళా ఎందుకులే అనుకుని వదిలేసి నట్లుగా వుంది. తలగడ దిండ్లు వుండ వలసిన చోట్లో లేవు. గదిలోకి రాగానే తలగడని చూచి కోమలేమో ననుకుని హడలిపోయాడు. గోడని పైభాగం బీటవేసిన అద్దం వుంది – అదేనా గోడని అనుకునిలేదు ఏ స్థలంలో నుంచుంటే కనపడతామో తెలియాలంటే, చూసి తెలుకోవాల్సిందే కాని తిన్నగా వెళ్ళి నవ్వుతూ మొహం చూసుగుంటే కూర్మయ్య భాషలో "అడ్డంగా మాడిపోతారు" గోడని రెండు మూడు పటాలు కూడా ఉన్నాయి కాని అవి జంతువులవో, మనుషులవో, చెట్లవో, రాత్రిపూట ఆ దీపం వెలుగులో నిర్ణయించలేరు.

"ప్రొద్దున ఒచ్చారుటగా–ఇంకా మేం జ్ఞాపకం వున్నామూ? మీ అమ్మగారితోనే పోయింది ఆ యింటి కళ. ఆవిడ దర్జావేరు, ఆవిడ సర్దా వేరు. గిట్టనోళ్ళు ఎన్నను కుంటే ఏం గాని, భలే తెగింపు. ఆ ధైర్యం, చొరవ, ఇంతమంది బ్రాహ్మల్ని చూశాగాని ఎవ్వాళ్ళలోనూ లేవు స్మాండి అల్లా ఆ పీటమీద కూర్చోండి. ఆ మంచం మీద నల్లులుంటాయేమో–"

కామాక్షిని పరకాయించి చూశాడు–విశాలమయిన పెద్ద మొఖం, సన్నటి పొడుగాటి కళ్ళు, కళ్ళక్రింద నల్లని గీతలూ నిర్మలమయిన పల్చటి నుదురూ, ఒకప్పుడు చాలా అందమయినదని చిన్న వయస్సులో వున్న వాళ్ళకి అనిపించినా కూర్మయ్య భాషలో చెప్పాలంటే – "దాంతగలెయ్యా. అది రోజు రోజుకీ బాగుండే బాపతు." వెళ్ళిపోయిన యవ్వనానికి వీడ్కోలులా అక్కడక్కడ నెరసిన వెండ్రుకలు ఆ నిండు విగ్రహానికి పరిపూర్ణత నిచ్చాయి. కోమలి తల్లి పోలిక కాదనుకున్నాడు నిధి.

"ఇంక మీకు మాతో ఏం అవుసరం వుంటుంది – మీ సుశీల, అమృతం వచ్చారుగా!" అంది. ఆడవాళ్ళకి మనస్సు నొప్పించటం సరదా కాబోలు ననుకున్నాడు.

"సుశీలా, అమృతం ఇవాళే మా వాళ్ళు కాలేదు. వాళ్ళు నే పుట్టిన ప్పటినుంచీ వుంటూనే వున్నారు" అన్నాడు.

"ఎక్కడో వుండటానికీ, దగ్గరగా వుంటానికీ భేదం లేదు?" అంది.

"నువ్వనుకుంది నిజమే ఐతే, ఇక్కడికి నేనెందుకొస్తాను. కామాక్షి? సుశీల తండ్రి తాసిల్దారు; ఆస్తిపరుడు. నాకూ మా అన్నయ్యకి అంతా కలిపి ఆరెకరాలుంది. ఇప్పటికప్పుడే రెండెకరాలు అమ్మి వేశారు. మాలాంటి బీదసంబంధం వాళ్ళకెందుకు?"

మధ్యలో కామాక్షి అందుకుంది.

"మీరంటే సుశీలకి చాలా ఇష్టంటగా."

దయానిధి నవ్వుకున్నాడు.

"ఏమో, నాకేం తెలుసు? పైగా పెళ్ళిళ్ళు సుశీల ఇష్టం పైనా, నా ఇష్టంపైనా ఆధారపడవుగా."

"అదేమన్న మాటలెండి, చదువుకున్న వాళ్ళు మీరు ఒకర్ని ఒకరు కోరుకొన్న తరవాత, ఆపుచెయ్యడం ఎవరితరం! మీకు ఇష్టమేటగా–?"

"నీ కెందుకు ఆ అభిప్రాయం కలిగింది?"

"మా కోమలి అంటుంది."

"తనలాగా నేను అందరితోనూ స్నేహం చేస్తాననుకుంది కాబోలు"

చురుచురా కోమలి గదిలో కొచ్చింది. వస్తు ప్రదర్శనశాలలోకి చిరతపులి జొరబడినట్లుగా వాతావరణం చెదిరిపోయింది.

"ఆయన కెందు కేమిటి? నా యిష్టమొచ్చినోళ్ళతో సేవితం చేస్తాను... నేనేం సుశీలనీ, అమృతాన్ని కాను-"

కోమలి కళ్ళల్లో కోపాన్ని చూసి నిధి హడలిపోయ్యాడు. అది భావగర్భితమయిన కోపం కాదు. చాంచల్యానికి జనించిన చమత్కారకోపం. అందుకనే అది మరీ భయంకరంగా వుంటుంది. ఆడవాళ్ళు చాలా చిత్రంగా ఎదిగిపోతారు. ఎనిమిది నెలల్లో ఎంత మారిపోయింది. ఇంచుమించు తనంత పొడుగూ వుంది. ఇదివరకూ బలహీనంగా కనిపించే గడ్డం యిప్పుడు ఒంకర్లు తిరిగి బలంగా "నా సంగతి కనుక్కోండి, చూద్దాం!" అని సంఘాన్ని సవాల్ చేసినట్లుగా ఉంది. దట్టమయిన నల్ల మేఘం మధ్యలో మెరిసిన నక్షత్రంలో నల్లటి పాప దీపంలో మెరిసిపోతోంది. రాణివాసంలా ఉన్న ఠీవితో ఎడమ కనుబొమ్మని పైకి కదుపుతోంది. పురుషుడు సౌందర్యం ముందు చూపించే మూగ బాధ, భయం, సిగ్గూ... అన్నీ శరీరాల్ని చూస్తే అంతచిత్రంగానూ, మెదడు, బుద్ధీ కూడా మారి వికసిస్తే ఎంత బాగుండును! శరీరంలో యవ్వనం తెచ్చిన మార్పుని మహాశక్తిలా, అరాధించి ఆ మార్పునే, స్త్రీ హృదయానికి కూడా ఆపాదించి, స్త్రీని దేవత కింద పూజించడం వల్ల, పురుషుడ్ని, లోకువకట్టి, ఆడించకలుగుతుంది కాబోలు ననుకున్నాడు. తెలివితేట్లని అయుధంగా సంపాదించుకుని మొగాడు ప్రపంచాన్ని లోబరుచుకుంటున్నాడు. తెలివితేట్లు వుండక పోతాయా అని భ్రమించేటట్లుగానో... లేక అసలే తెలివి విషయం స్మరించకుండా చేసేలాంటి గీర్వాణ సౌందర్యాన్ని స్త్రీ తన ఆయుధంగా సృష్టినికోరితెచ్చుకుని, మొగాడ్ని లోబరుచుకుంది. లేకపోతే ఆ విశ్వాన్ని సైతం ముద్దులో అమర్చుకున్న పెదవులు, మూగప్రపంచాన్ని ఒక్క కేకతో మధురగానంలోకి పురిగొల్పే ఆ కంఠం-అందులో నుంచి రావల్సింది "సేవితం" అమృతం" - ఇవా?

"ఊరుకోవే పిచ్చిపిల్లా"

"వావ్వూసు ఆయన కెందుకు? తనవరే?" అని తల్లిని బుకాయించింది.

"ఆరోజున కృష్ణమాచారితో నిన్ను చూడలేదా?" అన్నాడు నిధి.

కామాక్షి తెచ్చి పెట్టుగుని వికృతంగా నవ్వింది.

"కృష్ణమాచారిట-చూడొసే" అంటూ, గడ్డంకింద చెయ్యి పెట్టుకుని, నీళ్ళల్లో కదిపిన ప్రతిబింబంలా మొహాన్ని ఒంకర్లు చేసుకుంటూ' కామాక్షి నవ్వడం మొదలెట్టింది. కోమలి కనుబొమ్మల్లో కోపం పెదవుల మీదకి దిగజారి, నవ్వుకోసం బుగ్గలు ఆశ్చర్యంతో కదిపింది.

అర్థంకాకుండా అతడూ నవ్వడం మొదలెట్టాడు-

"ఆ కోడుగుడ్డు మొహం కృష్ణమాచారి-" అని మళ్ళా కామాక్షి అతిగా నవ్వితే వికృతంగా మారుతుందన్న సంగతి కూడా మరిచిపోయి నిర్మొహమాటంగా నవ్వేసింది.

"మా పొలం ప్రక్కనే వాళ్ళ పొలమూను—వాడు అందరితోటి ఎకసెక్కాలాడతాడు" అంది కామాక్షి

"పోనీ మరోడు..." అన్నాడు.

"ఎవరన్నారు మీతో!"

"అనుకుంటున్నారు..."

"మీ బ్రాహ్మలకంటే వయమేలెండి మేం, యింట్లో గుట్టంతా కప్పెట్టుగుని, వూళ్ళో వాళ్ళని అచ్చేపించక్కర్లేదు. దాగుద్దేంటి..." కోమలి మొదలెట్టింది. "అవేం మాట్లండి—పెద్దకుటుంబంలో వారు కదా మీరిట్లాంటివన్నీ నమ్మొచ్చా? మేమేం కులం తక్కువైనా చెడ్డవాళ్ళం కాదు. మొన్న మొన్నదాకా కోమలితండ్రి నారాయణాచార్లుగారే అన్నీ చూసుకుంటుండేవారు. ఏదో వో ఎకరం భూమి రాసిపోయ్యాడు. హాయిగా బ్రతికిపోయాం! మాకా పాడు బుద్ధుంటే యీ పాటికి మేడలే కడుదుం. కోమలి సక్కదనం చూసి జమిందార్లు కుక్కలా మా యింటి చుట్టూ తిరుగరూ... మర్యాదగా బ్రతికినోళ్ళం. ఇంకెప్పుడూ ఇట్లాంటి మాట్లనకండి."

"మరే" అంది కోమలి.

"నువ్వింట్లోకి పోవే—నీకెందుకు?" అంది తల్లి.

"కూచోవే. ఏదో బ్రాహ్మల్ని గురించి అనబోతోందే!" అన్నాడు.

"అంటానా, ఇంకా అంటానా, నాకేం భయమా?" కాలుజారి గుమ్మం పట్టుపూడి ముందుకి పడింది.

"వెర్రి ఆవేసం—పిచ్చిపిల్లకి దీనికో మంచి మొగుడ్ని పడేస్తే నా కింక బెంగుండదు. మీరు చదువుకున్నవారు గందా, చేసుకోండంటే మీ నాన్న బుస్సుమన్నారు. అయ్యోరాత... ఏమండోయ్ నేనొకటడుగుతాను— ఎవళ్ళతోనూ అనకండేం—మీ అమ్మగారు ఎల్లా చచ్చిపోయారంటారు?... మామూలుగా చావలేదంటగా..."

దయానిధి ఆమెకేసి చూళ్ళేక పోయాడు— మొహం కిందికి వాల్చాడు. మంచం మీద దుప్పటిలాగి వేలుకి చుట్టుకున్నాడు. ఈ ఆలోచన అతనికి ఎప్పుడూ రాలేదు. ఇది నిజమైతే యింకేమన్నా వుందా? తండ్రి హంతకుడు – తను హంతకుడి కొడుకు. అధోలోకం తలుపుల్ని ఎవరో తెరచినట్లయింది. అందులో అడివి మృగాలు ఆకలితో గర్జిస్తున్నాయి. ఒక్కసారి ప్రాచీన శక్తులన్నీ అందులోకి చొరబడి భేతాళ నృత్యం సాగిస్తున్నాయి. అతనింక మనిషి కాదు; కాలిపోయి మాడి పోయి నుసై గాలిలో కలిసి విశ్వమంతా వ్యాపించిన మహోద్రేకాల సారాంశం.

"మామూలుగా జబ్బుచేసే..." అన్నాడు తల పైకెత్తకుండా.

"ఏమో లెండి—అల్లాగనుకున్నారు, మీ నాయనగారేనంట...ఐనా నాకెందుకు యీ గొడవలన్నీ! గొప్పోళ్ళ ఇళ్ళల్లో బోల్డు గొడవలుంటాయి.

అతనికి భయమేసింది. హిందూ సంఘంలో మర్యాదస్తుడైన భర్త అంతకంటే ఏం చెయ్యగలడు? నారయ్య బోటిగాడు ఎదరవాడిని పొడిచేస్తాడు. భార్యదే తప్పనుకుంటే భార్యనే పొడుస్తాడు. పెండ్లాం ఒదిలి పెట్టి పోతే, దేశానికి స్వతంత్రం ఒచ్చిన రోజున ప్రజల మాదిరి హాయిగా చెడుగుడు ఆడుకుంటాడు. మర్యాదస్తుడు భార్యని ఒదిలెయ్యలేడు, అప్రతిష్ఠ సహించి వూరుకోలేడు. అప్రయోజకుడంటారు. దారుణం

చేసి అటో యిటో తేల్చలేదు భయం. తన్ను తాను చంపుకోవాలి–చేతకాదు. ప్రాణం పై తీపి, హత్య! అన్నగారి మీదికి రాకుండా వూరికి పంపించివేసి, ఊళ్ళోని డాక్టర్‌కి కబురంపి, తను ఇంట్లోలేని సమయాన అది కాస్తా చేసేసి, ఏమీ తెలియని వాడిలా రోడ్డుమీద ఒంతెన దగ్గర విలబడి–పోయినప్పుడు ఎవ్వరూ దగ్గరలేకుండా ఎంత చక్కటి పన్నాగం! శవాన్ని బైటికి తీసి పరీక్ష చేస్తే దీని నిజంబైట పడుతుంది. ఇప్పుడెట్లా శరీరాన్ని తగల పెట్టేశారు ఆఖరికి ఎముకల్ని కూడా నదిలో పారేశారు. తగలేసే ఆచారం యిందుకే పెట్టారు కాబోలు, దూరదృష్టి గల మన పూర్వులు.

లేకపోతే అన్నగారే చేశాడేమో యీ పని. మందు సీసాలో విషం కలిపి ఆఖరు డోసు సాయంత్రం ఏడింటికి పుచ్చుగుంటుందిగా మరి తను నాలుగింటికే వెళ్ళిపోయాడు. హంతకుడు హత్య జరిగిన చోట లేడు– ఎవ్వరూ అనుమానపడరు. పోలీసులు తండ్రీ కొడుకులను అరెస్టు చేస్తే ఏమౌతుంది? ఎవరి మట్టుకు వారు – నేనక్కడ లేందే – అని తప్పించుకుంటారు. ఇంతకీ చంపటానికి తగినంత కారణం ఎవరికుంది? తండ్రి – "నువ్వెక్కడున్నావ్?" "కోమలికోసం వెళ్ళాను" కోమలి సాక్ష్యం కోసం కోర్టులో కీడుస్తారు. "అబ్బే మా ఇంటికసల్ రాందే – నాతో ఆడికేం పని." అని కళ్ళు పెద్దవిచేసి, కనుబొమలు ఎగరేస్తూ, మూతి సున్నాలా చుట్టుగుని అంటుంది కాబోలు. "ఏమయ్యా, రాలేదంటుంది యీ పిల్ల. చదువుకున్న వాడివి అబద్ధాలాడతావా?" తలకాయలో మెదడు గుండెల్లోకి లాగినట్లయింది. అనుకున్నంత అసంభవమా అల్లా జరగడం? తనే ఎన్నిసార్లు ఆ పని చెయ్యాలనుకోలేదు?

కాని అల్లాంటివి జరగవు. అనుకోడానికీ, ఆచరించడానికీ మధ్య చాలా దూరముంది. ఒక పర్వత శిఖరం మీదనుంచి, మరో దేశంలో వున్న పర్వత శిఖరం మీదికి దూకడం లాంటిది. ప్రతి దేశానికి పుష్కరంలా పన్నెండు సంవత్సరాలకి ఒకసారి, "ఇవాళ, అందరూ అనుకున్న వాటిని యథేచ్ఛగా ఆచరణలో పెట్టొచ్చు" అని ప్రభుత్వం టాం టాం వేస్తే, ఏం జరుగుతుంది? రోడ్డు మీద నడిచేవాళ్ళు, మొట్టమొదట కనిపించిన పోలీసుని కసిగా ఖూనీ చేస్తారు. కింద ఉద్యోగులందరూ, పైవాడి నోట్లో గుడ్డలు కక్కుతారు. పెళ్ళాం భర్త నెత్తిమీద పులుసు రాచ్చిప్ప ఒదిలేసి, కొరకంచుతో కాలుస్తుంది. రోగి డాక్టర్ని మంచానికి కట్టేసి నోట్లో రూళ్ళకర్ర దోపి టెంపరేచరు చూస్తాడు. కోడలు అత్తగార్ని మురుక్కాలవలోకి తోసి ఈదమంటుంది. స్కూలుపిల్లలు మేష్టారుచేత గోడకుర్చీ వెయ్యించి "ఏదీ యిప్పుడు చెప్పు అలాస్కాలో ఏం పండుతుంది?" అనడిగి సమాధానం చెప్పింతర్వాత, గుండుసున్నా "నీ మార్కు" అంట్లూ చుట్టూ గుండ్రంగా తిరుగుతారు. అంచేత యిల్లాంటివి అసంభవం అనుకున్నాడు నిధి. తనేం చేస్తాడో ఆ రోజుని? నవ్వొస్తుంది తల్చుకుంటే, సిగ్గేస్తుంది ఛీ ఛీ...

"గిట్టనివాళ్ళు అనుకుంటారు" అన్నాడు.

"ఏమోస్మాండి–మళ్ళా ఎవళ్ళతోనేనా అనేరు గనక."

"మాలో ఇట్లాంటివి జరగవ్" అన్నాడతను.

"అవునవును, బ్రాహ్మనోళ్ళ ఇళ్ళల్లో పిసుక్కుసావడాలే." అంది కోమలి–తరాలుగా బ్రాహ్మణులు ఇతరకులాలపై చేసిన దౌర్జన్యాలకి, ఒక్కసారి తిరుగుబాటు చేసినట్లు మళ్ళా బ్రాహ్మణుడికి పుట్టిందిట.

"ఊరుకో నీకెందుకు..." అంది కామాక్షి కాసేపు నిశ్శబ్దం. కోమలి గుమ్మం మీద కూర్చుంది. తనచుట్టూ తిరుగుతున్న పురుగుని తప్పించుకోడానికి అటూ ఇటూ కదుల్తోంది. చెవుల్లో వేళ్ళు దోపుగుని, కళ్ళు గట్టిగా మూసుకుంది. "పో, పో–వెళ్ళి ఆర్ని కుట్టు" అని ఆ పురుగుని తోసేసింది!

"కుడద్ది, కుడద్ది"... అని అతనిమీదికి వెళ్ళిన పురుగుని చేత్తో తరమడం మొదలెట్టింది. ఏమిటి? ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి? వెడదామని లేవబోతాడు, వెళ్ళలేదు. ఎందుకొచ్చినట్లు? కోమల్ని చూడాలని. కోమలికి చదువు చెప్పించాలి, డాన్స్ ట్రూప్‌తో ఇండియా అంతా తిరిగి తరవాత ఇంగ్లండు వెళ్ళాలి! ఇంగ్లండా, ఫ్రాన్సా? తన హాస్పిటల్‌లో నర్సుగా ఉంటుంది– తెల్లటి యూనిఫారమ్‌లో కోమలి ఎంత బాగుంటుంది!

"నర్సమ్మగారు, సుశీల పెండ్లి నిశ్చయించుకోడానికే ఒచ్చారుటగా" అంది కామాక్షి సంభాషణ సాగనిద్దామని.

"సుశీల నన్ను చేసుకోదు" అన్నాడు.

"అబ్బే లేదే, సుశీల చేసుకోదు, యీనే సుశీల్ని చేసుగుంటాడు" అని కోమలి నవ్వింది.

"నీ మొహం" అంది వాళ్ళమ్మ.

"మరెవర్ని చేసుగుంటుందండి?"

"అవన్నీ నాకేం తెలుస్తాయ్?"

"పోనీ మీరెవర్ని చేసుకుంటారు?"

దానికి సమాధానం చెప్పలేదు కోమల్ని చేసుగుంటాను అని అనేటందుకు ధైర్యంలేదు. అంటే చేసుకుతీరాలి. దాని కతను సిద్ధంగా వున్నాడా?

వివాహం కోసం, స్త్రీ భర్తని అంగీకరిస్తుంది. మొగాడు స్త్రీ కోసం వివాహాన్ని అంగీకరిస్తాడు.

అతనికి కావల్సింది పెండ్లి కాదు పెండ్లంటే ఏమిటో అతనికి అర్థంకాదు. కోమలి పెండ్లాం ఏమిటి? ఎవరైనా నవ్వుతారు. కోమలి పిల్లల్ని కంటుందా? అన్నం ఒండుతుందా? కోమలి అసలు స్త్రీ కాదు. ఏదో పొరబాట్న, యీ ప్రపంచంలో తమాషా చూసిపోదామని ఒచ్చిన ఒక స్వప్న సౌందర్యం. అసలు కోమలిని ఏ మొగాడూ తాకలేదు. చేతులాడవ్: మాటరాదు: కళ్ళు కనపడవ్. కోమలిని ఎవ్వరూ పెండ్లి చేసుకోకూడదు. ఏ మొగాడికీ చెందకూడదు. చంద్రుడు, నక్షత్రాలు, సముద్రం, తాజ్‌మహల్, పార్కులు – వీటిని అందరూ వూరికే చూసి ఆనందిస్తారు. ఏ ఒక్కరూ ఇవి నావి అనరు. అట్లాగే కోమలి. ఆమె పెండ్లాం కాకూడదు. – ఆమె ఒక సామ్యవాదపు సౌందర్య సంస్థ.

"మిమ్మల్నే" అంది కామాక్షి

"ఏమిటి?"

"మీరు ఎవరిని పెండ్లి చేసుకుంటారు?"

"నేను పెండ్లి చేసుకోను."

"ఈ మాటలకేంలెండి బోలెడు కట్నంతో ఏ పిల్లొస్తే ఆ పిల్లని పెండ్లాడుతారు. అంతేనా?"

వీటికి ఏం సమాధానం చెప్పాలో అతనికి తెలీదు. అతని మనస్సులో యీ విషయమై స్పష్టమైన అభిప్రాయాలు లేవు. సాంఘిక దృష్టితో యవ్వనం చూళ్ళేదు. అతని మనసులో వున్నవాటిని ఇతరులతో ఎల్లా చెప్పాలో తెలీదు. ఎవ్వరికీ అర్థం కాదు. పాశ్చాత్య విజ్ఞానానికి అలవాటు పడి భావ దాస్యం అలవరచుకున్న భారతీయ యువకుడికి, మట్టిలో పాతుకు పోయిన సంఘానికి మధ్య పెద్ద గోడవుంది ఇతను అవతలనుంచి ఎంత అరచినా, యివతల వాళ్ళకి అరుపులు వినబడటమేగాని మాటలు అర్థంకావు.

"నాకు కట్నం అక్కర్లేదు."

"అబ్బో, ఈ మాటలకేం లెండి... పెద్ద కట్నంతో కలెక్టర్ గారమ్మాయి చదువుకున్నది..."

అతను కోమలికేసి చూశాడు.

"మా అమ్మాయిని చేసుకోనక్కర్లేదులెండి, అల్లా చూస్తున్నారు."

"మీ అమ్మాయికి పెళ్ళి చెయ్యరా?"

"ఏమో దానికెవడు రానున్నాడో – మీరెందుకు చేసుకుంటారు గొప్పోరు."

"నేనసలు పెళ్ళి చేసుకోను" అంది కోమలి, ఎవరూ తన విషయం అడగకుండానే.

"అవును నీకు పెళ్ళెందుకు?"

"అట్లాంటి మాటలనకండో! ఎవరమనుకున్నారు. మేం? మీ వోళ్ళల్లోనే యిట్లాంటివన్నీ, కట్నాలకోసం పెళ్ళిళ్ళు చేసుకుని పైపై సర్దాలన్నింటికి, సందులమ్మట తిరిగి మా కొంపలు తీయటమేగా–"

కామాక్షి వాక్యంపూర్తి కాకుండానే, దయానిధి మధ్యలో అందుకున్నాడు. "ఇప్పుడు ఇవన్నీ ఎందుకు?"

"లేకపోతే ఏం మాటలండవి? మరెందుకూ, మా అమ్మాయి కేసి చూడ్డం. అసలు మా యింటికి రావటం యెందుకు? ఖలేజా వుంటే పెళ్ళి చేసుకోండి. పాపం, పిన్నపిల్లనిచేసి..."

"నే పిన్న పిల్లనికాను–పెద్దమనిషినయ్యాను."

"నువ్వూరుకో–లోపలికిపో, నువ్వెందుకిక్కడ?"

పెళ్ళి చేసుకుంటాననటానికి అతనికి ధైర్యంలేదు. అనుకోవడం ఒకటి, నిజంగా చేసుకోవడం ఒకటి ఈ కొండమీదనుంచి ఆ కొండమీదకి దూకడం. ఏం చెయ్యడం? యెవరూ సలహా చెప్పరు. యెవ్వరికీ అర్థం కాలేదు. తను చేసేది మంచో, చెడో తనకే తెలీదు. అసలెవ్వరికీ తెలీదు. ఈ దౌర్భాగ్యపు భారతదేశంలో, యెవరిమట్టుకు వారు ప్రత్యేకమైన దోవ త్రొక్కి అనుభవం వల్ల చివ్వరికి మంచో, చెడో యెవరికి వారు నిర్ణయించుకోవాల్సిందే. ఈ సంఘం ఒక పెద్ద కర్మాగారం. అంతా పనివాండ్రు. అంతా తలోపని చేస్తారు. ఒకరిది మరొకరికి అర్థం కాదు.

నెలనెలకీ పనివాంఢ్రు, పనిముట్లు మారిపోతున్నాయి. కాని వేతనాలు, చెయ్యాల్సిన విధానం, నియమాలు మారడం లేదు. ఇదొక పిచ్చాసుపత్రి. సంఘం కట్టుబాట్లు దానికి సూపరింటెండెంట్.

కోమలి ఆ కులంలో యెందుకు పుట్టాలి? తల్చుకుంటే భయమేస్తుంది.

కామాక్షేనా వూరికే అంది. కాని నిజంగా కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తుందా? అదంతా అతన్ని పరీక్ష చెయ్యడం. యెంత అసంభవమో, హాస్యాస్పదమో కామాక్షికి మాత్రం తెలీదు? అంత అనుభవం గల మనిషి!

"నేను సరేనన్నా, నిజంగా నువ్వు వొప్పుకుంటావా? ఏమిటీ?" అన్నాడు.

"అనండి – ఆ పైన అడగండి... అంతకంటే ఏముందండి– మీకు భూములు, చదువు చక్కదనం – అన్నీ ఉన్నాయి– ఈ వెర్రిమాలోకానికి మీలాంటి మొగుడు దొరుకుతాడా?"

"ఛీ– యీన మొగుడేంటి–"

"చూశావా; ఇప్పుడే ఇట్లాగంటోంది. ఇప్పటికే కృష్ణమాచారి, రామనాథం, వగైరా ముగ్గురు యోధుల పేర్లు విన్నాం–" ఏదో అనబోయాడు.

"ఏ వెధవండీ మీతో అంటా – దగ్గరికి తీసుకురండి, పళ్ళూడ గొడతాను."

"సీతాకాలపు సందేళా ఇంట్లోకి రానిచ్చినందుకా... ఒసే నువ్వింట్లోకెళ్ళు – ఈన కథ నే కనుక్కుంటా..." అంటూ కోమలి వాళ్ళ అమ్మని గదిలోంచి గెంటేసింది.

కామాక్షి "ఏమోనమ్మా, మీరు మీరు ఏమన్నాకండి" అని సణుక్కుంటూ వెళ్ళిపోయింది.

కోమలి కళ్ళల్లో ఒక్కసారి జీవం మెరిసింది. కనురెప్పల్ని కిందికి వాల్చి, మూతి బిగించి, గడ్డాన్ని వయ్యారంగా కదుపుతూ "ఏంటి మీరంటున్నది?" అని అతని మీదికి రాబోయింది.

"అవును విన్నాను" అతనికి భయమేసింది; బ్రాహ్మణుల దౌర్జన్యం పై దారుణమైన విప్లవం కోమలి నేత్రాలలో చూశాడు.

"మీరే, విన్నారా?" అర్థం లేకుండా గర్జించింది.

"అవును, మీ కులంలో అంతకంటే..."

"ఏమిటి, మళ్ళా కుయ్యండి ఆ కూత..."

"అనుకుంటుంటే నేను విన్నాను. నాకవి లెక్కలేదు, నీకెందుకంత కోపం?"

అతని దగ్గరకెళ్ళి తలవొంచి అతనిరెండు కళ్ళల్లోకి చూసింది. నీళ్ళకి బదులు రక్తంపోసి పెంచిన రోజాపుష్పంలా కనిపించింది ఆ మొహం.

"నేనూ విన్నా మీ అమ్మగారిని గురించి, సరేనా?" అంది, సగం ధ్వనిని కంఠంలో బిగించి, అప్రయత్నంగా అతని కుడిచెయ్యి కోమలి మొహాన్ని మధ్యగా, బలంగా కొట్టింది. ఊపిరి లోపలికి పీల్చి కోమలి మంచం మీద, భూకంపంలో వేళ్ళు వూడిన చెట్టులా వాలిపోయి, తలగడా పైన వేసుకుని దుప్పటిలో మొహం దాచేసుకుంది.

గదిలో రోదిస్తూ తిరుగుతున్న రెండు పురుగులూ గోడనివున్న దీపాన్ని చుట్టుకున్నాయి. ఎక్కిళ్ళతో బాధపడుతున్న దానికి మళ్లే – అందులో మంట

పైకీ కిందికీ ఆడుతోంది. ఆ ఆటకి వికృతమైన నీడలు గోడమీద పడుతున్నాయి.

దయానిధి తన చేతికేసి చూసుకున్నాడు. ఆ చెయ్యే తనతో నిమిత్తం లేకుండా ఆ పని చేయించింది అంతే? మనిషికి శరీరంపై అధికారం లేదు? ఉద్రేకాలని అతను కట్టేసుకోలేడు? వేదాంతంలో సత్యం సత్యం అని మొరెట్టుకుంటారు? సత్యం ఎంత ప్రమాదకరమైంది! నిజం చెబితే ఎవరు సహించగలరు? నిజం కాకపోతే అతనికి అంత కోపం ఎందుకొచ్చింది? కోమలి కెందుకంత కోపం? నిజంగా తను మోపిన నేరాలన్నీ నిజాలై వుండాలి. లేకపోతే అంతకోపం రాదు. అతన్ని నొప్పించాలంటే ఎన్నో సంగతులుండగా, ఆ ముక్కలే వీరడం ఎందుకు? మొగాడిని ఏ విధంగా బాధ పెట్టాలో, స్త్రీలకే తెలుస్తుంది. సత్యం నవ్వొస్తుంది. వికృతమైన అసహ్యమైన సత్యం ఎవరిక్కావాలి? అందమైన అసత్యాలే కావాలి! సంఘంలో నెగ్గాలంటే ఎంతో ప్రేమ వెలిబుచ్చుదామని వచ్చాడు, చేసినపనియిది. అనుకోడానికీ, ఆచరణకీ మధ్య వుండే లోయని పూడ్చటం ఎట్టాగో ఎవరికీ తెలీదు. కోమలి జడని స్పృశించడానికి తాను పెంచుకున్న చెయ్యి చేసినపని యిదా!

లేచాడు. కోట్లో పాకెట్ బైటికి తీశాడు. బల్లమీద పెట్టాడు. ముందుకి కదలబోయాడు. కోమలి చివాలునలేచి అతనిచెయ్యి గట్టిగా పట్టుకుంది. అతనికేమీ అర్థం కాలేదు. ఎక్కడ పుట్టిందో, సర్వేశాఖ వారు నిర్ణయించకపోయినా పిల్లనదిలా కన్నీళ్ళు అందంగా బుగ్గమీద జారి, పాయలుగాచీలి అధరాన్ని తడిపి గడ్డంకింద మాయమవుతున్నాయి. మంచం బద్దీ మీద జారిపోయిన కొంగుని కళ్ళకద్దుకుంది. ఒక్క కన్నీటి బిందువు, వంటి నక్షత్రంలా కంటికొనను అంటిపెట్టుకుని వుంది.

"మీ రెడతాని కీర్లేదు."

"ఎందుకు నేనిక్కడ? నీకు నాతో ఏం నిమిత్తం?"

"అసలెందు కొచ్చారు?"

"చూసి పోదామని–బుద్ధిలేక."

"సూసిపోవడమంటే, చెంప పగలెయ్యటమా?"

"అల్లా ఎప్పుడూ అనకు."

"నన్ననకండి."

"నీ జోలి నాకక్కరలేదు."

"అక్కర్లేకపోతే నన్ను సూత్తం ఎందుకు? మీరు కాబట్టి సరి పోయింది? మరొకరైతే రక్కుదును..."

"ఇప్పుడు రక్కు, అంత కసిగా వుంటే."

"అమ్మో! రక్కటమే. గోళ్ళు లేవుగా–"

"చెయ్యొదులు, నే వెళ్ళాలి–"

"సల్లో ఎక్కడి కెళతారు?–చూడండి, ఎదవ దీపం, సలికి కిరసనాయిలు లేక ఊ, సత్తోంది తన్నుకు" అని లేచి చీరంతా సర్దుకుంది– కిరసనాయిలు పోసింది దీపంలో.

"సీరకట్టునాకు చేతకాదు – చూడండి మా అమ్మదీ చీర, తెరసాప లాగుంది కాదు?" అని తనే నవ్వుకుంది, ఆ తుఫానుకి హడలిపోయి, రాయి వెనుక

దాక్కుని అవగానే బైటకొచ్చిన గడ్డిపువ్వులా, కోమలి మొహం కలకల్లాడుతోంది. కన్నీరు పాపాన్ని కొట్టేసి, పవిత్రం చేసింది ఏడ్చేటందుకు కూడా ఓపిగలేని కోమలి మొహాన్ని.

"చెయ్యి వాసన చూడండి. పాడు కిరసనాయిలు కంపు—ఛీ,—ం" అని డోక్కున్నట్టుగా మొహాన్ని ఛికారంగా చేసుకుంది. ఎంత వికారం చేసుకున్నా, కోమలి మొహం వికృతంగా వుండదు. ఎండిపోతున్న కన్నీటి బిందువుని వేలుతో తొలగించాడు. నాలికమీద పెట్టుగుని చూశాడు ఉప్పగా వుంది.

"అదేంటి, ఊరుకోండి, మా అమ్మ తన్నద్ది."

బల్లమీద పాకేజ్ విప్పింది అందులో టాల్ కమ్ పౌడరు, స్నో బుడ్డి, సెంటుబుడ్డి, రిబ్బన్, ఏట్సు రీడర్ వున్నాయి.

"ఇవన్నీ ఏంటి? అంటూ ఒక్కొక్కదాన్నే తీసి చూడడం మొదలెట్టింది. కాస్త పౌడరు చేతిలో పోసుకుంది.

"పా అడ్రి" అని నవ్వింది. గాలికి అదంతా ఎగిరిపోయింది.

"గట్టిగా తగిలిందా?" అని అడిగాడు, యిందాకటి దెబ్బని గురించి ఆలోచిస్తూ.

"ఏంటి, దెబ్బా?—అప్పుడే పోయింది. ఏడిస్తినిగా అమ్మ చెప్పిన మాట యినకపోతే చితకబొడిచేది. మా అమ్మ ఎంత తన్నినా ఏడ్పు రాదు..."

"ఎందుకు ఏడ్చావు?"

"ఏమో, నాకు తెలీదు—నన్నల్లా ఎప్పుడూ?"

"అసలు యింకెప్పుడూ ఇక్కడికి రానుగా—" అన్నాడు.

"ఎందుకు రారు—రాకుండా వుండలేరుగా—"

"నీ కెట్లా తెలుసు?"

"ఏమో, ఇవన్నీ ఎందుకు?"

"నీ కోసం. అవన్నీ వాడుకుని, మంచిచీర కట్టుగుని రేపు మాతో పిక్ నిక్ కి రావాలి."

"పికినిక్కేంటి?"

"నేను, సుశీలా, అమృతం—అందరం కలిసి పడవమీద లాకులు కాడికి షికారెడుతున్నాం. అక్కడే కాఫీలు, ఉప్మా చేసుగుని హాయిగా తిరుగుతాం. నువ్వు రావాలి."

"నేనెందుకు? సుశీల, అముత్రం వున్నారుగా..."

"అముత్రం కాదు ఏది అను; అమృ "మా" కింద "అరు" కారం అమృ—"అమ్"—"రు"—"తం" అను."

"నోరు తిరగదు. అమ్‌తరం, అమ్‌రుత్రం... ఛీ...ఛీ—ఈమాటు అంటాలెండి. అమ్‌రుత్రం..." అల్లా అనుకుంటూ కూర్చుంది.

"నిన్నే! రేపు రావూ?"

"ఆళ్ళల్లోకి రాను, భయం. అమ్మ సంపుద్ది."

"మీ అమ్మతో నే చెప్తాగా." భుజం మీద చెయ్యి వెయ్యబోయాడు. ధైర్యం చాలలేదు.

"పట్టుచీర మా అమ్మది. ఊ–సలిపుట్తోంది–నేనో చీర కొనుక్కుంటాను, పదిరూపాయలివ్వరూ–నా కొద్దు మా అమ్మ అడగమంది." చీరకొంగు రెండు చేతుల్లోనూ తీసుకుని వేళ్ళతో నలుపుత బొటనవ్రేలిమీద రాస్తోంది కోమలి.

"మా అమ్మ కష్టమానూ డబ్బు ఏవే" అంది.

"నీకు లేదూ?"

"ఛీ, నాకెందుకు ఎదవ డబ్బు?"

"మరి నీకు వాళ్ళతోనూ, వీళ్ళతోనూ, స్నేహా లెందుకు?"

"నేనేం సేవతాలు చేశానా?"

"స", "సే", "హి", తం – స్నే – అను"

"అబ్బ, ఉంకోపాలంటా లెద్దురు. ఆళ్ళే మాయింటి చుట్టూ తిరుగుతారు. కృష్ణమాచారి మంచోడు, భలే కబుర్లు చెప్తాడు. రామనాధం మా అమ్మసుట్టం. నన్ను బుజాల మీద ఎక్కించుగుని దొడ్డంతా తిరుగుతాడు."

"వాళ్ళందరితోనూ అల్లా తిరగొచ్చా?"

"అళ్ళకి నేనంటే సర్దా"

"వాళ్ళు రూపాయ లిత్తుంటారా?"

"ఓ, కృష్ణమాచారి బియ్యం పంపుతాడు."

"చీరలు కూడా వాళ్ళనే అడగరాదు?"

"ఆళ్ళని అడిగింది మా అమ్మ"

"ఇదంతా డబ్బుకోసం అన్నమాట!"

"ఛ, చ నా కెందుకు డబ్బు? మా అమ్మకి."

దయానిధికి ఏమీ అర్థం కాలేదు. డబ్బు గడించటం కామాక్షి ఉద్దేశ్యమైతే, కోమలి ద్వారా వేలు గడిస్తుంది. తిరుపతి కొండమీద గుళ్ళో డబ్బీ అంతా భక్తితో తలో అణా వేస్తారు. ఏడాదిలో నిండు గుంటుంది. కోమలి అందరి హస్తాలలోను పడి నలిగిపోయినట్లు వూహించి బాధ పడ్డాడు. మానవుడు భరించలేని యీ సౌందర్యాన్ని ముట్టుకోడానికే తనకి చేతులు రాని యీ మనిషిని – ఆ శుంఠలకు, ఆ మృగాలకి ఒప్పగించటం ఎంతటి అపచారం! తను పెళ్ళి చేసుకోమంటుందిగా కూతుర్ని!

"నువ్వు పెళ్ళిచేసుకోవు?"

"ఛీ పెళ్ళేంటి?"

"పెళ్ళి–అందరికీ పెళ్ళి, ఆడది పుట్టగానే పెళ్ళి; పెళ్ళికాని మొగాడికి సంఘంలో చోటు లేదు. మొగాడ్ని వొంటిగా వుండనివ్వరు" స్త్రీలు వేటాడతారు; బ్రహ్మచర్యం కాగానే, సంసార జీవితాన్ని వేదాంతులు శాసించారు. పెళ్ళి కాని మొగాళ్ళు అక్కడక్కడ వుండొచ్చు; కాని ఆడాళ్ళు వుండకూడదు. అలా వుండాలనుకున్న వాళ్ళు – నామకహ ఒకర్ని చేసుకొని, కావాలంటే తరువాత వాణ్ని ఒదిలేసో చంపేసో, ఒంటిగా ఉండాల్సిందే పెళ్ళంటే ఏమిటో కోమలికి అర్థంకాదు. అసలు ఏ వ్యక్తికీ పెళ్ళంటే ఏమిటో తెలీదు. అంతా సంఘం నేర్పింది. ఆ సంకెళ్ళు తగిలించి మళ్ళా వాటిని వొదిలించుకోమని, వేదాంతం అడుగుతుంది – పెళ్ళి

ఒక పద్మవ్యూహం – ఒక జైలు, బైట వాళ్ళు లోపలికెళ్ళాలనీ, లోపలివాళ్ళు బైటకి రావాలనీ వుబలాటపడటం. ఎందుకు యీ పెళ్ళి?

గాంధీగార్ని ఎవరో ఈ ప్రశ్న అడిగారు. పిల్లల వుద్దేశం లేకపోతే అసలు పెళ్ళికి అవసరం లేదన్నాడాయన.

పెళ్ళికాకపోతే పిల్లలు పుట్టరనికాదు, పుట్టకూడదని తాత్పర్యం. ఏ మొగాడేనా "ఈ పెళ్ళికోసంకాదు, పిల్లకోసం తప్పదు గాబోలు. కానీ ఏం చేస్తాం" అనుకుని వివాహం చేసుగుంటాడా! గాంధీగారికి ఉత్తరం రాసి కనుక్కోవాలి – తీరా చేసుకున్న తరువాత సంతానం కలగకపోతే! అతనికేమీ అర్థంకాలేదు. కోమలికి పెళ్ళంటే ఏం తెలుసు? అమాయకపు సౌందర్యాన్ని వివాహం అనే సంకెళ్ళతో బంధించడం ఏం న్యాయం?

"డబ్బు తీసుకుని రాత్రి రానా?"

"రేపు రండి."

"పగలు నాకు వీలుండదు. ఇవాళే ఒస్తాను."

"బాబో! రూపాయలూవద్దు ఏమీవద్దు. అసలు రాకండి."

"ఐతే నేనంటే నీకిష్టం లేదన్నమాట."

"ఏమో, నాకేం తెలుసు?" కాసేపు నిశ్శబ్దం.

"నేను పిక్నిక్కి రమ్మంటేరావ్! రాత్రొస్తానంటే వద్దంటావ్" నాకు నీతో ఏం నిమిత్తం? నే వెళ్ళిపోతా. ఇంకెప్పుడూ రాను.

"కోపం వచ్చిందా?"

"ఆ."

"ఎంత పొడుగు? నా జడంత పొడుగా..."

"నాకునీతో వేళాకోళం ఏమిటి? మీ రామనాథంతో సరసాలాడు"

"అట్లాగంటే రక్కుతాను... ఎళ్ళండి ఎప్పుడూ రాకండి." ఇంతలో కామాక్షి లోపల్నించి, "ఏమే తిండి తిప్పలూ అక్కర్లేదా ఏమిటి? పొద్దోతోంది... నాకు నిద్దరొస్తోంది" అని కేకేసింది.

"ఒస్తున్నా... అమ్మ పిలుస్తోంది – ఎళ్ళండి రాత్రి నూతికాడ దీపం పెడతాను దీపం లేకపోతే లోనికి రాకండి..." అప్పుడే వెళ్ళిపోయింది. ఏదో అడుగుదామనుకున్నాడు. సమయానికి అనుకున్నవి జ్ఞాపకంరావ్. సంభాషణ నడపటం అవతల వాళ్ళ మీద ఆధారపడుతుంది.

దొడ్లోకెళ్ళి తలుపు తియ్యబొయ్యాడు.

"వెడుతున్నారా?" అంది కామాక్షి

అతనేమీ మాట్లాడలేదు.

"ఇట్లా సర్దా ఏం తీరుతుంది? చేసుకుంటే పెళ్ళి చేసుకోవాలిగాని" అంది.

"నాకా వుద్దేశ్యం ఎప్పుడూలేదు."

"ఇదంతా ఎందుకు మరి? ఇట్లాంటివన్నీ మీ యిళ్ళల్లో సాగుతాయేమోగాని, మాకు వీలుపడదు. పదిమందీ నానోట్లో గడ్డెడతారు. ఎంత తీసిపోయిన వాళ్ళమేనా, మాకూ మంచీ మర్యాదా వున్నాయి"

అతను మాట్లాడకుండా వెళ్ళిపోయ్యాడు.

బైట చలిగావుంది. మంచు, చలి, యమపాశంలా ఊర్ని బంధించాయి. ఇళ్ళు, గుడిసెలు, వెచ్చగా వుండటంకోసం దగ్గరగా జరిగినట్లున్నాయి.

గదిలో కోమలిముందు మాట్లాడుతున్నంతసేపూ, చలిమంట కాచుగున్నట్లుగా వుంది – వేడితో వాతావరణం బరువెక్కింది. కన్నీరుతో తడిసిన తలగడ దిండుమీద చెయ్యిపెడితే, నిప్పులో వేలెట్టినట్లుగా వుంది. అంతా వేడి–వేడి, వెలుగుమాత్రం లేదు.

ఇంటికు చేరుకున్నాడు. అరుగుమీద జగన్నాథం, ముసుగు తన్ని పడుకోవాలని యత్నిస్తున్నాడు. సుశీల గదిలో దీపం, తలుపు సందులోంచి చూశాడు. పక్కగదిలో నాగమణి, అమృతం గవ్వలాడుకుంటున్నారు. భోజనం దగ్గర నరసమ్మగారు.

"మేం వొచ్చి చాలా రోజులైంది – వెళ్ళాలి. ఆయన రమ్మని ఉత్తరం కూడా రాశారు" అంది.

"పోనీ మామయ్యనే రమ్మని వ్రాయకూడదా?"

"ఆయనకి తీరికెక్కడా? ఎంత తాసిల్దారీ చేస్తున్నా సంబంధాల కోసం తిరగడం తప్పదుకదా?" అన్నది నరసమ్మగారు.

"సంబంధాలకోసం ఆయనెందుకు తిరగాలి? చదువుకున్నది కాబట్టి తనే నచ్చినవాడ్ని చేసుకుంటుంది. అసలు చాలామంది, సంబంధాలు చూడలేకనే, పిల్లలకి చదువులు చెప్పిస్తున్నారు. పైగా కోరి చేసుకున్న తర్వాత, ఏ వొడుదుడుకు లొచ్చినా, తల్లి దండ్రులని తిట్టరు." అన్నాడు నిధి.

"సరేలే, సుశీలమాట ఏం చెప్పావ్! దాని మంచి దానికే తెలీదు. అల్లాగని వాళ్ళని వొదిలేస్తామా? పెళ్ళిళ్ళ విషయంలో అదుర్దా పడడము పెద్దవాళ్ళ విధి."

"అవును మరి..." అంటూ లేచి చేయి కడుక్కుని సావిట్లో కొచ్చాడు. గవ్వలాట ముగించి నాగమణి వీధి గుమ్మంలో కొచ్చింది. గది గుమ్మంమీద అమృతం నుంచుంది.

"ఇంత పొద్దోయిందాకా ఎక్కడికెళ్ళావు బావా?" అతనేమి మాట్లాడలేదు.

నాగమణి రోడ్డుమీదికి వెడుతూ, "ఇంకెక్కడికి? కోమలింటికి" అంది.

ఆడాళ్ళకీ విషయాల్లో అంత చొరవ ఎల్లా వొస్తుందో అతనికి అర్థంకాదు పరాయి స్త్రీ మీద వాళ్ళ కంతటి అధికారంఉండి, తనెక్కడి కెడితే తనకెందుకు? తన పెళ్ళాం కాదుగా! మొగుడు టైఫాయిడ్ జ్వరముతో మూల్గుతుంటే – "క్రితం సంవత్సరాది రాత్రి ఎందుకాలస్యంగా వొచ్చారో నాకు తెలుసులేండి"... అంటుంది పెళ్ళాం. అంతే స్త్రీ. వాళ్ళకి కావల్సింది ప్రేమకాదు; పదిమంది ఇతర స్త్రీలలో తాము వాంఛింపబడటం.

"గవ్వలా టొచ్చునా బావా?"

"రాదు, నేర్పుతావా?"

"ఓ"

గదిలో కెళ్ళాడు. మంచం పక్కన కుర్చీలాక్కుని కూర్చున్నాడు. అమృతం మంచంమీద కూర్చుంది.

"అంతే బావా... కాపులుకి, మంచిలా మాట్లాడడం తెలీదు. మా ఊళ్ళో కమ్మార్మమ్మాయుంది..." ఆ గొడవ చెప్పటం మొదలెట్టింది. అమృతం కమ్మార్మమ్మాయిమీద కోపం ప్రకటించినప్పుడు నుదుటిమీద అందంలా గీతలుపడ్డాయి. అమృతం ఏం చెప్పేది అతని కర్థం కాదు– చిత్రకారుడు రచించిన బొమ్మతో ప్రసంగం.

"ఏమిటి బావా, తెల్లపోయి చూస్తావు?"

"........."

"ఐతే ఎవరు బావా కోమలి?"

"అమృతం నేను అవస్థలో వున్నాను? సాయం చేస్తావా?"

"ఏమిటి బావా చెప్పవు? – నే నెవ్వరితోనూ చెప్పను – చాతనైతే తప్పకుండా చేస్తాను."

"నేను మంచివాణ్నేనా?"

"అదేమిటి బావా... చిత్రంగా అడుగుతున్నావ్? నువ్వు చాలా మంచివాడివి."

మంచివాడు – అంటే అర్థం ఏమిటి అమృతం!"

"నీకు వుంకోళ్ళ జోలి అక్కర్లేదు. గడుసుతనం తెలీదు – అమాయకుడవు" అంటూ అప్రయత్నంగా పడుకుని తలని చెయ్యి మీద 50 డిగ్రీల కోణంలో ఆనించింది. అమాయకత్వం అజ్ఞానానికి నిదర్శనం. అట్లాంటి అమాయకత్వం, మంచితనం ఎలాగవుతుంది అతని కర్థంకాలేదు. అమృతం అందరిలా, లోకజ్ఞానం, అనుభవం వున్నదానల్లే మాట్లాడడం అతనికాశ్చర్యం కలగజేసింది. స్త్రీలు, మానసికంగా దబ్బున ఎదిగిపోతారు; పురుషుడి శీలం అంత తొందర్లో పరిణామాన్ని పొందలేదు.

"నువ్వనుకున్నంత అమాయకుడ్ని కాను అమృతం – నీలాగే అందరూ అనుకుంటావు; తమ గుణాలని యితరులలో చూడడం మనుషుల నైజం" అన్నాడు.

అట్లాగైతే, మన కిష్టమైన వాళ్ళందరూ మంచివాళ్ళూ, ఇష్టంలేని వాళ్ళందరూ చెడ్డవాళ్ళు – సరేనా?" అన్నది.

"ఆ యిష్టా యిష్టాలు దేనిమీద ఆధారపడతా యంటావు?"

"చెప్పడం కష్టమే సుమా, కొందరంటే ఎందుకో ఇష్టం వుండదు. నీకూ అంతేనా?"

"అవుననుకో – దానికి కారణం ఏమిటో తెలుసుకోవాలి. కొందరు మనుషుల్ని చూడగానే తొలిగిపోతాం. కొందరి మాటలు మనకి సరిపడవు, కొందరు నవ్వడం చూసినా తట్టుగాలేసుకొస్తుంది. కాని, ఇది తప్పు అన్యాయము అనిపించదూ నీకు? మనుషుల శీలాన్నిబట్టి గుణాలనిబట్టి మనము ఆదరించాలని పెద్దలు చెపుతారు. కాని నిజంగా మనం చూసేది యిదికాదు. మనుషుల వాలకం, వైఖరి యివే యిష్టాలు నిర్ణయించేవి.

అమృతం మూతబడుతున్న కనురెప్పల్ని అపుజెయ్యడం కోసం నాలుగుసార్లు గబగబా కదిపి, వొచ్చే ఆవులింత చిటికిన వ్రేలితో ఆపుకోలేక సాగదీసి నవ్వి, కాళ్ళమీదికి లాక్కున్న శాలువని తొలగించి లేచి కూర్చుంది.

"నిద్రొస్తోంది. కదూనాకు? అందుకనే సుశీల నన్ను మొద్దంటుంది.
మావారు నన్ను అట్లాగే పిలుస్తారు. అప్పుడప్పుడు. నిజంగా మొద్దునే అంటావా బావా?"అని సముద్రంలో కొట్టుకుపోతున్న గడ్డిపోచని చూచి ఒడమీదున్న ఆవుదూడలా, జాలిగా అడిగింది.
"పరిపూర్ణ జ్ఞానంతో విముఖత పొందిన అమాయకత్వం నీది."
"అబ్బో యింతకంటే మావారు "మొద్దు" అనడమే బాగుంది. ఊరికే అన్నాను బావా! అందుకనే అమాయకుడన్నాను. మొద్దుల్ని చూసి ఏదో పెద్ద పేరెట్టి సంతోషిస్తావు నువ్వు. ఇంతకీ నీ అవస్థ ఏమిటో చెప్పావు కాదు."
"నీకు నిద్ర వొస్తునట్లుంది – నే వెడతాను."
"లేదు, లేదు బావా, నిజంగా వినాలని వుంది."
"ఐతే అడగనా? నాకిప్పుడో యాభై రూపాయలు కావాలి అమృతం మళ్ళా కొద్ది రోజుల్లో యిచ్చేస్తాను."
"ఓస్ – ఇంతేకదా, అల్లాగే తీసుకో. నా ప్రయాణానికి ఏం ఫరవాలేదు. మా వారు నాలుగు రోజుల్లో ఎల్లానూ ఒస్తున్నారు. ఇప్పుడేకావాలా?"
"ఈ క్షణం"
"ఇంత రాత్రి ఎందుకు?"
"నీకు తెలుసు అమృతం."
"నాకా? అదేమిటి బావా, నాకెట్లా తెలుస్తుంది?" ఆశ్చర్యంగాతెచ్చి పెట్టుకున్న నవ్వు నవ్వింది.
"ఆలోచించు నీకే తెలుస్తుంది."
"నాగమణైతే, ఇంకెందుకు కోమలి కోసం" అంటుంది."
"నువ్వసాధ్యురాలివి అమృతం. నిన్ను మొద్దన్న మీ ఆయన్ని చూడాలని ఉంది. నిజంగా అందుకే."
"ఏదో అల్లా అంటావు నాకేం తెలుస్తుంది? ఊరికే అన్నాను. ఐతే కోమలి ఎవరు బావా?"
ఈపాటికి నాగమణి మీ అందరితోనూ యాగీ చేసి ఉండునే"
"ఏదో సుశీలా, తనూ మాట్లాడుకున్నారు మధ్య తన కెందుకు నీ సంగతి?"
"ఏమిటో"
"కోమల్ని చూపించవూ?"
"కోమల్ని నువ్వెరగవ్" నే నెల్లా చెబితే అల్లానే చేసేది కాదు – దానికి మంచీ మర్యాద తెలియదు. అదొక తలకాయలేని శరీరం; ఆత్మలేని అంగపుష్టి. అది దర్శనం యివ్వమంటే ఓ అవతారం ఎత్తాల్సిందే...
"అవును బావా – వాళ్ళల్లో మంచీ మర్యాదా వుండవు. మోటసరసం; మా ఊళ్ళో కమ్మారమ్మాయంతే. మా వారితో మోటసరసాలాడుతుంది. దానికి తగినట్లే యాయనాను"
"మీ ఆయన కథానాయకుడే"

"ఏదో అందరిళ్ళల్లోనూ వుండేవే. ఎటొచ్చీ కొందరు నోరుండి బైటపడతారు. ఆడదానికి సిగ్గులేకపోయిం తర్వాత, పాపం మా వారు మట్టుకేం చేస్తారు?"

"కోమలికి సిగ్గంటే ఏమిటో తెలియదు –"

"అల్లాంటి పిల్ల నీ కెల్లా నచ్చింది బావా–"

"ఏమిటో అమృతం. దానికి సమాధానం తెలిస్తే, జీవిత రహస్యమే తెలిసిపోను."

"అందులో రహస్యమేముంది? కుర్రతనపు చేష్టలు! పెద్దయి సంసారంలో పడ్డ తర్వాత బాగుంటారు."

అని దుప్పటిమీదికి జారిన దవనాన్ని తల్లో సర్దుకుంది.

"సంసారంలో పడటం అంటే నాకు భయం అమృతం. ఆ విధంగా బాగుండడం అంటే నాకు అసహ్యం కూడాను. నిర్మానుష్యమైన అడవిలో ఋషిగా వుండొచ్చు. కాని చుట్టూ పరిమళంతో మత్తెక్కించే పుష్పాలుండగా ముక్కు మూసుకుని కూర్చోటం మనుషులకి చేతకాదేమో –"

"అడవిలోనూ అడవి పువ్వులుంటాయిగా." ఉద్యానవనం తగులడుతోంటే రాణీలు చూసి బాధతో నవ్వినట్లు అమృతం నవ్వింది.

"అట్లాంటి కోమలికోసం వీడికి పిచ్చేమిటని జాలిపడుతున్నావు కదూ అమృతం?"

"లేదు బావా, ఎంత మొద్దునైనా నా కర్థమవుతుంది. పిచ్చివాళ్ళని చూసి మనం జాలిపడ్డట్లే, పిచ్చివాళ్ళు మన్ని చూసి జాలిపడతారు."

"నీలాంటి ఔదార్యం, సానుభూతి అందరికీ వుంటే, ఈ సంఘం స్వర్గంగా మారును అమృతం."

"నువ్వల్లా అన్నావా, మావారు అసలు ఆడాళ్ళే వుండకపోతే బాగుండు నంటారు, ఒక్క కమ్మారమ్మాయి తప్ప –"

"నీలాంటి పెండ్లాన్ని సంపాదించుకున్నందుకు మీ ఆయన తపస్సు చేసి వుండాలి–"

"అడివి పువ్వుల మధ్య, అడివిలోనా?" నీరసంగా నవ్వింది.

"ఐతే బావా, డబ్బు కావాలందా?"

" – – –"

"పోనీ అడగన్లే, తాళాల గుత్తికోసం పక్కతడిమి, తలగడ గలీబులోంచి బైటికి తీసింది గుత్తిని."

"అమృతం – యీ సంగతి ఎవరితోను చెప్పకు సుమా, నేను కోమల్ని పెళ్ళి చేసుకుంటే నువ్వు ఆశ్చర్యపడతావా?"

"అమృతం లేచి చీర సర్దుకుంది. నరసమ్మగారు "ఇంకా పడుకోలేదర్రా" అనడం వినిపించింది.

"అబ్బ దీపం లాక్కుపోకు" అన్న సుశీల కంఠం వినిపించింది.

"నరసమ్మ పిన్నీ. కుంపటిమీద పాలు, ఫ్లాస్కులో నేపోస్తాను – నువ్వు పడుకోవమ్మా" అంది అమృతం.

"దాన్ని పెళ్ళిచేసుకొని నువ్వేం సుఖపడతావు. బావా."

"నేను చేసుగుని దాన్నో మనిషి చెయ్యాలని నా ఆశయం. నేను చేసుకోకుండా వదిలేస్తే, పదిమందిలోనూ పడి అది ఏమైపోతుందో తల్చుకుంటే భయమేస్తుంది. చక్కదనం వుంది. చదువు, సంస్కారము, మర్యాదా, అన్నీ నా సంపర్కంవల్ల అబ్బుతాయని నే అనుకుంటున్నా, అవసరమైతే వో ఏడాది నీ దగ్గర ట్రైనింగ్‌కి పంపుతాను –"

"బాగానే వుంది బావా – కాని దాని సంపర్కం వల్ల నువ్వేమౌతావో ఆలోచించలేదు..." అంది.

"నేను ఏర్పడిపోయాను, ఏర్పడిపోయిం తర్వాత మనుషులింక మారరు. నువ్వు మీ ఆయన్ని ఎంతవరకు మార్చగలిగావు?"

"ఏమో కోమలి ఇప్పటికే మంచిది కాదంటుంది నాగమణి."

"కావచ్చు. పరిస్థితులను బట్టి, అది అట్లా ఐవుండొచ్చు. పరిస్థితులు మార్చావంటే, మరోలా అవుతుంది. ఎంత చెడిపోయినా, చచ్చేవరకూ బాగుపడే అవకాశాలుంటూనే వుంటాయి. చెడ్డవాళ్ళని మనం చేరదీసి బాగుచెయ్యాలి కాని వాళ్ళని హింసించి దూరం చెయ్యకూడదు. ప్రతియోగికీ భవిష్యత్తు వున్నట్లే ప్రతిపాపికీ ఒక భావికాలం కూడావుందని మా ప్రొఫెసర్ చెబుతూండేవాడు."

అమృతం ట్రంక్ తెరచి వెండి సబ్బుబిళ్ళ పెట్టిలోంచి నోట్లు తీసి అతని కిచ్చింది.

"నిజంగా అమృతం, సంతోషం ఎట్లా తెలియజెప్పాలో చేతకావటంలేదు."

"ఇందులో ఏముంది బావా? అవసరాలు అందరికీ వస్తుంటాయి. ఏదో వుందిగనక యివ్వగలిగాను" మళ్ళా ఆవులించి వంటింట్లో కెళ్ళింది.

దయానిధి కప్పులో పాలుతాగి, గోడ గడియారంకేసి చూసి వీధిలోకి నడిచాడు. అరుగుమీద మూలగా నారయ్య ఏదో చేస్తున్నాడు.

"ఏమిటి నారయ్యా, మూటతో కుస్తీ పడుతున్నావ్?"

"ఏముందండి, అయ్యగారి బట్టలు, తెల్లారగట్ల నాలుగుంటికి లేచెడతానండి."

దయానిధి రోడ్డుమీదికి నాలగడుగులేసి, వంతెన మీద కాలుపెట్టి నిలబడి ఆకాశంకేసి చూశాడు. ప్రక్కన నారయ్య నీడ పడింది.

"ఇంతరాత్రి ఎక్కడికండి"

"నిద్రరావడంలేదు చందమామని చూద్దామనొచ్చాను."

"దానింటి కెళ్ళమోకండి – వాళ్ళింటికి సుట్టాలొచ్చారుటండి; అబ్బాయిగార్ని రావొద్దని చెప్పమందండి."

"నీతోనే?"

అవునండి. దుకాణంకాడ కనపడి చెప్పిందండి?

"ఎవరు?"

"కుర్రదేనండి, ఐనా మీకా పోకిరిదాంతో ఏంటండి?"

"నారయ్యా, దాన్ని అట్లాగనడం బాగుండలేదు నాకు. కళ్ళతో నువ్వు నిజంగా చూశావా!"

"అయ్యో బాబూ, బాగుంటే ఐపోయిందంటండీ! వాళ్ళు ఎంత బాగుంటే అంత ముదనష్టపు సన్నాసు లౌతారండి. రమ్మన్నవాడితోటల్లా పోవడం ఆడోళ్ళ నైజం."

"నారయ్యా, నీకు ఆడాళ్ళంటే మంచి అభిప్రాయంలేదు. అందరూ నీ భార్య మాదిరే ననుకుంటావు. పొరపాటు నారయ్యా... ఇల్లాంటివి ఎవరి ముందూ అనకు."

"అందరికాడా అనడం నాకేం పనండి. వాళ్ళ సంగతి నాకు తెలుసు. ఎట్లా చెయ్యాలో అట్లా చేస్తానండి. మంచులో జబ్బుండి – లోపలికిరండి–"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

☆ ☆ ☆

"కిటికీ సందులోనుంచి సూర్యకిరణం గోడమీదున్న జాబ్ కో కాలెండర్ మీదపడింది. నిధి శాలువాని మరింత దగ్గరగా లొక్కున్నాడు. ఎదురుగుండా క్యాలెండర్ 1934ది – సంవత్సరం చూపుతోంది. ఇక రెండు రోజుల్లో 1935 జనవరి వస్తుంది. ఆ క్యాలెండరు తీసేవాళ్లు లేరు. దానిమీద బొమ్మకూడా వికృతంగా ఉంది. వికృతంగా ఉన్న వస్తువులు ఎందుకో అంత బాధ కలిగిస్తాయి. గోడమీద వొంకరగా అమర్చబడ్డ ఫోటోలు, పద్ధతిలో పెట్టని కుర్చీలు, బల్లలు, నలిగిపోయిన దుప్పటి, గొళ్ళెంపడని తలుపు, తెరుచుకోని కిటికీ, – ఇవి నిత్యజీవితంలోని వికృతాల సారాంశం; మానవుడి చికాకుకి కారణభూతాలు, 1933 నవంబరు 6 తేదీని, పాపిడి తిన్నగా కుదరక పడిన చీకాకు జ్ఞప్తికి వచ్చింది. దువ్వెన విసిరిపారేశాడు; జుట్టంతా రేపేసుకున్నాడు. అద్దాన్ని నేల మీద దొర్లించాడు; నుంచోబెడితే నిలబడదు. ఆ అద్దం; వెనకాల ఎత్తు పెట్టాడు – జారిపోయింది. అద్దాన్ని కిందపెట్టి, అతను బల్లమీద పడుకొని దువ్వుకున్నాడు. బుగ్గల కిందికి జారి, కళ్ళుపెద్దవయి, మొహం ఉబ్బినట్లయింది. తని ప్రతిమని కోమలి అద్దంలో చూచ్చి వొంకర మొహం" అంది. అద్దంలో దగాచేసే వస్తువు భౌతిక ప్రపంచంలో మరొకటి లేదు. అందరి మొహాలూ వంకరగా కనబడతాయి. కాని ఎవరికి వారు తెలుసుకోలేరు! వుంకోళ్లు చెబితే కోపం వస్తుంది.

చీకాకు వేసే యీ అల్ప వికృతాన్ని సరిదిద్దుకోవాలని యెవ్వరికీ అనిపించదు. నాగభూషణంగారి వంటింట్లో దేవుడి పటాలని చూసిం తర్వాత, నాలుగు రోజులు నిద్రపట్టక జబ్బుచేసినంత పనైంది. పుష్పించని మొక్క, ఫలించని ప్రేమ, సిద్ధించని ఆశయం యదార్థం. కాని – కల. యివి ఆశాజ్యోతిని ఆరకుండా చూస్తాయి; తలుపులన్నీ మూస్తే జ్యోతి ఆరకుండా వుండొచ్చు? కాని అది వెలిగించేది, విప్పుకోని గొడుగుతాడు, తెగిన చీపురు పుల్లల సమూహం. పట్టుచీరలో గోచరంకాని ముల్లు – వీటిని.

"బావగారు – నిన్ననే తెల్లారింది, మరి ముసుగులోంచి బైటపడండి మీ కోసం ఓ అమ్మాయొచ్చింది" అన్నాడు జగన్నాథం. నిధి కంగారుగా శాలువా తోసేసి లేచి కూర్చున్నాడు.

"ఎవరు?"

"ఓ అమ్మాయి – కొండొకచో ఒకానొక స్త్రీ –"

"స్త్రీ!"

"ఎవరి పూర్వులు తోకలేని కోతో... ఆ యొక్క స్త్రీ What a foolish తోకలేని కోతులో..."

"ఇంకా లేవలేదు బావా" అంటూ అమృతం గదిలోకి చక్కావచ్చి అతని తేరిపార చూసింది.

అమృతం కేసి నిధి పరీక్షగా చూశాడు.

రాత్రంతా ఏడ్చి ఏడ్చి మొహం వాచినట్లుగా వుంది. కన్నీటి తడికి ముంగురులు ముద్దుబారి నుదుర్ని పట్టుకొని నిరుత్సాహంగా నిలబడ్డాయి.

"ఏం బావా నిద్రపట్టలేదా ఏమిటి?"

"హాయిగా నిద్రపట్టింది. ఆ ప్రశ్న నిన్నడగాలనుకుంటున్నా?"

"నాకా! నాకెందుకుపట్టదు...?" అని దిగులుగా, కళ్ళల్లోలేని నవ్వుని పెదాలమీద చూపించింది.

"ఏమోలే... భర్తగారికోసం..."

"ఊరుకో బావా. పొద్దున్నే ఏంమ్మాటలవి... ఒరే నారయ్యని పళ్లుతోము పుల్లట్టుకు రమ్మను..."

"అతగాడితో మనకు సంప్రదింపులులేవు..."

"నారయ్యలేదు, పొద్దున్నే నాన్నకు బట్టలు తీసుకొని వెళ్ళాడు" అన్నాడు నిధి.

"శుభవార్త చెప్పారు – బావగారు – దుర్వాసుడు వెళ్ళిపోయింతర్వాత ఆశ్రమం లాగా, నేడు మన గృహం... పుల్లయు తోయము, తువ్వాలున్ మనమే తెచ్చెదంగాక..." అంటూ చక్కాపొయ్యాడు.

నిధి అరుగుమీదికి వచ్చాడు. ఆ వొచ్చిన అమ్మాయి, ఆ వూళ్ళో ట్రైనింగ్ చదువుతున్న క్రిష్టియన్ పిల్ల రోజ్. అతని తల్లి అప్పుడప్పుడు ఏదో ముట్టచెబుతూ ఆదరిస్తూండేది. పరామర్శకోసం వొచ్చింది. రోజ్ అతనూ వీధిలోకి నడిచి, వొంతెన దగ్గర నిలబడ్డారు.

"మా అమ్మ చచ్చిపోయినంత మాత్రాన నిన్నిక్కడ చూసేవారు ఎవరూ లేరనుకోకు అప్పుడుప్పుడు వొస్తూవుండు ఏదో తోచింది యిస్తుంటాను..."

రోజ్ విచారం ప్రకటిస్తూ మాట్లాడలేదు.

"ఇప్పుడేమన్నా కావాలా?"

"ఊరికే ఎల్లా పుచ్చుకోనండి? నాకు చిన్నతనం. మీ అమ్మగారిచ్చే వారంటే అది వేరు... మీరు ఇస్తున్నారంటే అందరూ ఏమన్నా అనుకుంటారు."

"అందరూ ఏమనుకుంటారో అని భయపడే వాళ్లు; ఎప్పుడూ జీవితంలో సుఖంగా ఉండరు. మన ప్రవర్తన మనకి నచ్చాలిగాని ఉళ్లో వాళ్ళేమనుకుంటే మనకెందుకు? పోనీ ఒక సహాయం చేస్తావా?"

"ఏమిటండి?"

"ఈ ఊళ్ళో కామాక్షి కూతురిని ఎరుగుదువా?"

"కోమలిని ఎరక్కేమండి!"

"ఎట్లా యెరుగుదువు"

"అప్పుడప్పుడు మా స్కూలులో సపోటా చెట్టుకాడి కొస్తుంటుందండి. ఓనాడు మాక్లాస్‌మేట్స్ అందరూ భలే గోల చేశారు."

"యెందుకు"

"యెవరో ఏదోఅన్నారు. అదివెక్కిరించింది. ఇహచూస్కోండి"

"నువ్వు, నీకు తీరుబడిగా వున్నప్పుడు వాళ్ళింటికి వెళ్ళి మెల్లిగా స్నేహం సంపాదించి, దానికి చదువు చెప్పాలి. జీతం నేనిస్తాను నా విషయము వాళ్ళతో చెప్పకు..."

రోజ్ అర్థమైనట్లు తలపంకించింది.

"అది చెప్పాకో పోతేనండి."

"ఎల్లాగో మచ్చిక చేసుకొని, నేర్పాలి."

రోజ్ వెళ్ళిపోయింది.

కాఫీ తాగి, నిధి పిక్‌నిక్‌కి కావల్సిన సరంజామా అంతా సర్దుతున్నాడు.

"నా మిడ్ వైఫరీ మాన్యుఅల్ ఏది! ఎవరేనా చూశారా?"

సుశీల కళ్ళజోడు కేస్ కోసం వెదుక్కుంటూ అక్కడికొచ్చింది.

"పుస్తకం దొరికింది బావా అటూ అమృతం చక్కావొచ్చింది."

"ఎక్కడ దొరికింది?"

"సుశీల పక్కమీద తలగడా కిందుంది" అంది అమృతం.

"నిన్న అందులో బొమ్మలు చూసి డోక్కున్నదానవు. అంత రహస్యంగా చదవాల్సిన అవసరం ఏమొచ్చింది సుశీలా?" అనడిగాడు నిధి.

"రాత్రి నిద్రపట్టక ఏదో కాసేపు పేజీలు తిరగేశాను" అంది సుశీల కొంగుతో కళ్ళజోడుని తుడుస్తూ. సుశీల కళ్ళజోడు తీసేస్తే అమాయకురాలిగా ఉంటుంది. కొంచెం లోతుకళ్ళు. కుడి కనుబొమ్మలో వెంద్రుకలు అంత సమంగా లేవు జోడు అనే చోట ముక్కుమీద చిన్న మచ్చ ఉంది. సుశీల దృష్టి చిన్నతనంలోనే చెడిపోయిందని కళ్ళడాక్టరు పరీక్షచేసి జోడు తగిలించడం సుశీల అదృష్టమే.

"ఐతే రాత్రి నీకూ నిద్రపట్టలేదు? ఒక్క బావకే ననుకున్నాను. అంది అమృతం."

"మీరిద్దరూ నిద్రపట్టకపోయినా, రాత్రంతా గుసగుసలతో కాలం గడిపారుగా" అంది సుశీల ఈసడింపుతో.

"గుసగుసలేం వుంటాయి. ఏదో కష్టం సుఖం చెప్పాకున్నాం –" అంటూ అమృతం అందుకుంది.

"ఔను, ఇవాళ పిక్‌నిక్‌కి ఏమేం జరగాలో అవన్నీ అనుకున్నాం కదు అమ్మలూ..." అన్నాడు నిధి.

చూశావా, ఒక్క రాత్రిలో అమృతం అల్లా అమ్మలైంది అప్రయత్నంగా సుశీల మొహం ఎర్రబారింది, అర్థంకాని అసంతృప్తితో ఆమె పెదవి కదుల్తోంది.

"అమ్మలూ అంటే తప్పా? నీకెందుకు? ఆ మూడు ముళ్ళు పడ్డ తర్వాత నిన్ను సుశీ అంటాడులేపోనీ" అంటూ నుదుటిమీద గీతలు తెచ్చుకొని అమృతం కోపాన్ని ప్రదర్శిస్తోంది.

"ఏమిటమ్మా... ఆ విషయం ఎత్తొద్దని ఎన్నిసార్లు చెప్పినా జ్ఞానం లేదేం?"
"అట్లాంటప్పుడు నన్ను అమ్మలూ అంటే నీకెందుకు అంతదుర్ద?"
"అబ్బో, మా అక్కయ్య పెద్ద పెద్ద మాటలే వేస్తోంది" మధ్యలో జగన్నాథం మొదలెట్టాడు.
"నిన్ను అమ్మలూ అంటే నాకెందుకు, అరటి బొంద అంటే నాకెందుకు... ఏదో తమాషాకన్నాను..."
హాయ్ హాయ్ – భలే రైమ్ సుశీల యింక తెలుగు మేష్టారిణీగా వుండొచ్చు.
"పోనీ నేను అరిటి బొందనే, నీలా నాజూకుగా అరిటాకు కానులే..."
"అరిటాకు! What a foolish..."
"ఊరికో జగ్గూ"
"అదే వొద్దన్నది. అరిటాకులు, అరిటిబొందలు ఉన్నాయి – ఐతే మైనస్ మీసాల బావగారు అరిటిపండు కాబోలు, కొట్టో!"
"తప్పురా..."
ఇంతలో నరసమ్మగారు చక్కా వచ్చింది.
"ఏమర్రా,... ఎక్కడికో వెళతామన్నారు, నీళ్ళు పోసుకొని, మరిదబ్బుని తెమలండర్రా."
"నేను రాను – మీ రెళ్ళండి" అని సుశీల తనగదిలోకెళ్ళి, తలుపులు చప్పుడయ్యేటట్లు మూసింది.
"తన కెందుకు బావా అంత కోపం?"
"ఏమో?"
"బావగారూ, సత్యభామాదేవి అలక తీర్చండి. మరిమనకి కావల్సిన వస్తువులు ఏమిటో చెప్పండి జాబితా వేస్తాను" అని కాగితం తీసుకుని జగన్నాథం జాబితా వెయ్యడం ప్రారంభించాడు.
విధి పక్కగదిలోకి సుశీలని వెతుక్కుంటూ నడిచాడు.
ఎందుకురావు సుశీలా? నిన్నల్లా వెడదామని ఎంతో సరదా పడ్డావు" సుశీల లేచి గోడ వెంపుకి మొహం తిప్పుకుంది.
"ఇటు చూడు సుశీలా" అంటూ దగ్గరగా వెళ్ళి కళ్ళల్లోకి చూశాడు.
"నా వొంట్లో బాగాలేదు"
"నేను డాక్టర్ని. ఎక్సామిన్ చేసి మందిస్తాగా" అని చెయ్యితీసుకుని నాడి పరీక్ష చేశాడు.
"ఏమీ లేందేనే – దొంగా –" అని జగన్నాథం ధోరణిలో అన్నాడు. నవ్వుతో కదులుతున్న పెదవుల్ని దిగించింది కాని కన్నీటితో కళ్ళజోడు అద్దం మసగైంది అతను తీసి తుడిచి మళ్ళా చేతికిచ్చాడు.
"ఏదో గుండెల్లో ఆయాసంగా వుంది." అని మంచంబద్దీ మీద కూర్చుంది. ఏడ్పు సుశీల ఆభరణం కాదు, కోపం చూపినప్పుడే కొంచెం బాగుంటుందనుకున్నాడు.
"స్టెతస్కోప్ తీసుకురానా!"

"ఒద్దు మీ రెళ్ళండి – నువ్వు, మీ అమ్మలూ, కోమలీ... నేను రాను."

"నీ కోపం నామీదా? వాళ్ళమీదా? మధ్యలో కోమలెందుకు?"

"అమృతం చూస్తానంటే కూడా తీసుకొస్తానన్నా వుటగా..."

"నీకెవరు చెప్పారు? ఐనా, నువ్వు మాత్రం మా దానవుకావా ఏమిటి – ఎందుకీ తేడా?"

"అమ్మలొస్తే నేనురాను. నన్ను దొంగంది – పుస్తకం నేను దొంగిలించానా? తనే దొంగ తనకే కావాలి. ఊళ్ళో విషయాలు, నీ విషయాలు దండకంలా చదవబోయింది."

"నా విషయాలే మున్నాయి సుశీలా? నీ వన్నీ అనవసరమైన అనుమానాలు. అమృతం ఏదో తమాషాకి అల్లా అంటూంటుంది. చదువుకున్న దానివి. నువ్వు ప్రతీదానికి యిదవుతే ఎట్లా చెప్పు."

"దాన్ని నా పెళ్ళిడోలి ఎత్తొద్దని చెప్పు."

"ఓస్, ఇంతేకదా.... లే, మరి.... నీ కొత్త జార్జెట్ చీర సింగారించుకుని, చైనీస్ డాల్ మాదిరిగా..."

"అదుగో నన్ను డాల్ అంటున్నావూ..." అని గారాం చెయ్యపోగా "స్నానం కరిష్యే" అంటూ జగన్నాథం గదిలోకొచ్చాడు.

"చూళ్లేదు – ఇక్కడ మనుష్యద్వయం వున్నారు. ఇవాళ మనంఏ గదిలోకెళ్ళినా, మనుష్యద్వయం మంత్రాంగం చెయ్యడమే చూస్తున్నాం. ఆ నారిగాడి మొహంచూశాను కాబోలు ఆ గదిలో అక్కయ్య నరసమ్మ. ఎక్స్కూజ్ మి, నరసమ్మగారూ, యిక్కడ యీ..."

"లే మరి.... అమృతం నిన్నేమీ అనకుండా చేసే పూచీ నాది" అన్నాడు నిధి.

"మనం స్నానం చేశాం. యీ వెంద్రుకా రాజములకు యింత నూనెకోసం ఇల్లా తిరుగుతున్నాం కాని, మదీయ యత్నంబును విఫలం బయ్యే... సుశీలాదేవిగారూ, మీ హేరాయిల్ యిప్పిస్తారూ – లేని పక్షాన, డాక్టర్జీ ఇంత ఫినైల్ యిప్పించండి..." అంటూ జగన్నాథం మంచం కింద దూరి పరకాయించడం మొదలెట్టాడు.

"లేమరి – చూడు. జగన్నాథం స్నానంకూడా చేసేడు" అన్నాడు నిధి సుశీలని సముదాయిస్తూ.

మంచం కిందనుంచి, జగన్నాథం "మిమ్మల్ని మీరు సరిచేసుకోండి – నాథ్ అనాలి – జగన్నాథం కాదండోయ్ మహాప్రభూ, మీరల్లా పిలవకపోతే పిక్నిక్కి నేనూరానూ – రాకపోవడంలో సుశీలకు తీసిపొయ్యేవాళ్ళు ఎవళ్ళూలేరు... అన్నాడు.

"ఎక్స్కూజ్మి. నాథ్... ఐతే తమరు మంచంకింద పరిశోధిస్తున్న దేమిటో తెలిసికోవచ్చా"? అన్నాడు నిధి వేళాకోలంగా.

"నిరభ్యంతరంగా – What a foolish మూతా మూతి లేని కొబ్బరినూనె సీసా తాలూకు మిగిలిన భాగం..." సుశీల కొంగుతో కళ్ళు తుడుచుకొని నవ్వుకుంటూ స్నానానికెళ్ళింది.

దయానిధి స్నానంచేసి, రాయవలసిన రెండుత్తరాలు రాసి, టపా తీసుకున్నాడు, "రిమాటిక్ సీనూ" దగ్గరనుంచి మరో వుత్తరం వచ్చింది. అతను పెండ్లి సంబంధం

చూడడానికి వెళ్ళే అవసరం లేదనీ, అంచేత అక్కడికి రాలేకపోయాననీ, మళ్ళా ఏదేనా అవాంతరం వొచ్చి, రావల్సిన అవసరం వస్తే, టెలిగ్రాం పంపుతానని వ్రాసాడు.

టైమ్ అప్పటికి పదిగంటలైంది. కాని పక్కగదిలో గోడ గడియారం ఏడుగంటలు కొట్టి నిల్చిపోయింది. దాని కథ కనుక్కుందామని పక్కగదిలోకి నడిచాడు. గదిలో మంచంమీద, "మూడు" అంకెలా ముడుచుకుని అమృతం పడుకుంది. అది నిద్రపోవడానికి సిద్ధం చేసుకున్న పక్క కాదు; దుప్పటీ అంతా రాత్రి నిద్రకి నలిగిన స్థితిలోనే వుంది. ఒక దిండు తలాబు దిక్కునా, రెండోది కాళ్ళవేపునా వుంది. అమృతం తల దిండుమీద లేదు. ఆమెలో ఏమో మార్పు జరిగిందనడానికి అదే నిదర్శనం.

"అమృతం, గడియారం ఎన్ని గంటలు కొట్టిందో విన్నావా?" సమాధానం లేదు.

"అమృతం, అల్లా పడుకున్నావేం?"

"ఏమీలేదు బావా" అని అవతలకి తిరిగి పడుకుంది.

"గడియారం విన్నావా?"

"లేదు."

మనస్సులో జరిగిన మార్పులు శరీరంలో బహిర్గతం కాకుండా చేసుకోలేరు స్త్రీలు. కొందరి స్త్రీల కది అలంకారం; మరికొందరికి ఆయుధం. బాధపడటం వాళ్ళకి సంతృప్తినివ్వదు; ఆ దృశ్యాన్ని ఇతరులు చూసి సానుభూతి ప్రకటిస్తేనే ఆ బాధ తీరుతుంది. ఆ ఇతరులు మళ్ళా స్త్రీలు కాకూడదు. కొంత బాధ అట్లా వోదార్చేదగ్గర మొగాళ్ళు లేకపోవడం వల్ల కల్గుతుంది. బహిర్గతమైన ఉద్రేకం యొక్క అంతర్యం తొందర్లో అవగాహన కాదు ఇతరులకి అది కోపమో, దుఃఖమో, విరహమో – వారే నిర్ణయించుకోలేరు. అదే దౌర్బల్యం, అబలత్వం అనబడుతోంది.

"అల్లా పడుకున్నావేం, అమృతం? లేచి స్నానం చెయ్యావూ? మనకి వేళవుతోంది..." అంటూ ఆమె ఎదురుగా ట్రంకుపెట్టె లాక్కుని కూర్చున్నాడు.

"ఏమీలేదు – ఊరికేనే బావా" లేచి, కళ్ళు నులుముకుని, చేతులు మెడవెనక బిగించి వయ్యారంగా ఆవులించి నిద్రొస్తోంది అనుకుని, మళ్ళా పడుకునే వుద్దేశంతో శరీరాన్ని మోచేతిమీద ఆనించింది. నవ్వు నీడ ఘోరంగా కళ్ళల్లోనే కలిగి కాటుకచుట్టూ జారింది.

"ఎందుకల్లా వున్నావు అమృతం, మీ ఆయన జ్ఞాపకంవచ్చాడా?"

"ఏం మాటలు బావా.... నేనేం చిన్నపిల్లనా ఏమిటి?"

"లేకపోతే మనుష్యుల్ని మోసిన ముసలిపండువా?"

నిర్జీవంగా నవ్వి, చీర మడమల మీదికి లాక్కుంది. కాలి బొటనవ్రేలి ప్రక్కవేలు, బొటన వ్రేలికంటె పొడుగ్గా ఉండడం చూశాడ ప్రయత్నంగా తనపాదంకేసి చూసుకున్నాడు.

"పాదాలు చూసుకుంటున్నా వెందుకు బావా?"

"నేనాడదాన్నయితే నీలా పట్టాలు పెట్టుకుందునుకదా. అని" అన్నాడు.

"పట్టాలు బాగుండలేదా? తీసేస్తాలే; మావారికీ ఇవంటే చిరాకే."

"లేదు లేదు – నీ పాదాలకి చాలా బాగున్నాయనుకుంటున్నా"

"ఏం ఆక్షేపిస్తావులే..."

"కాదు, కాదు. నిజంగానే అంటున్నా."

"దొంగమాటలు నీవి."

కొంచెం సేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

"చాలాపొద్దుపోయింది – మనం వెళ్ళొద్దూ – దబ్బున్న మరి సుశీలా వాళ్ళు సిద్ధం అయ్యారప్పుడే"

నేను రాను – మీరెళ్ళండి బావా.

"ఎందుకు రావు? నిన్ననెంతో సరదాపడ్డావు."

"ఎల్లాగో వుంది, నేనెందుకు? సుశీలా వాళ్ళు వున్నారుగా, నేను రావటం సుశీలకి ఇష్టంలేదు."

"అదంతా సరిచేశాగా ఇప్పుడు నువ్వు రాకపోతే తనూ రానంటుంది" అన్నాడు.

"అబ్బో; ఈ మాటలకేంలే. అంతా నాటకం."

"కాదు – కావాలంటే జగన్నాథాన్ని అడుగు" అని కాసేపాగి అన్నాడు. "ఇంతకీ రాత్రి వెళ్ళనేలేదు." అర్థం కానట్లు కళ్ళు పెద్దవి చేసింది. అమృతం; లేచికూర్చుంది.

"ఏం?"

"వెళ్ళలేదు. అంతే." అసలు కారణం చెప్పడానికి యిష్టంలేక అబద్ధం ఆడినందుకు అతనేమీ నొచ్చుకోలేదు.

"రాత్రంతా నిద్ర పట్టలేదు నాకు. నువ్వులోపలికి రావడం. దీపం తగ్గడం, హెచ్చడం, పడుకోడం – అన్నీ గదిలోంచి కనిపెడుతూనే వున్నా" అంది.

"మీ ఆయన కోసం బెంగా?" అన్నాడు.

"ధో–ఏంమ్మాటలు, రాత్రి నీతో మాట్లాడేటప్పుడు మావార్ని గురించి నీతో అట్లా ఎందుకు చెప్పానా అని దిగులేసింది."

"ఓస్–ఇదా–నేనేమీ అనుకోలేదులే. మీ ఆయన ఎట్లాంటివాడైందీ నాకు మాత్రం తెలీదు? నువ్వేం బాధపడనక్కరలేదు."

"ఆయన చాలా మంచివాడు" అంది.

"మంచివాడంటే ఎవరో నీకూ నాకూ తెలుసు, దానికి దిగులెందుకు? కాని పదిమంది మొగుణ్ని మెచ్చుగుంటే, పెళ్ళానికి మొగుడు చెడ్డవాడు. పదిమందీ మొగుణ్ని తిడితే, పెళ్ళానికి మొగుడు మంచివాడు" అనుకున్నాడు.

"ఆయన విషయం ఎవళ్ళతోనూ చెప్పకూడదు అనుకునేదాన్ని, ఏమిటో నిన్ను చూస్తే చెప్పాలనిపించింది" అంది తనేదో అపచారం చేసినట్టూ, దాన్ని సమర్థించుకున్నట్టూ.

"నువ్వు చెప్పినవి, నాకేమీ అంత ఘోరంగా కనిపించడంలేదు" ఆ వాక్యం తాత్పర్యం అమృతానికి బోధపడలేదు. తన సౌందర్యాన్ని భర్త అనుభవించే సంస్కారం కలవాడు కాడని అనుకోడం భర్తపై అసంతృప్తి కంటే, తన సౌందర్యంపై ఆమెకున్న ప్రీతిని రుజువుచేస్తుందని అమృతం ఒప్పుకోలేదు. తనని అర్థం చేసుకోడం అంటే, తన అందాన్ని అనుభవించినట్లు తెలియపర్చడం ఈ పని ఎవరు చెయ్యగలుగుతారు?

"నేనేం బావుండను. నేను కోతిని – పోనీలే" అని స్త్రీ అన్నదంటే, ఇతర విషయాలకంటే తన చక్కదనం గురించి ఆలోచించుకోడంలో ఎక్కువకాలం వృధా చేస్తోందన్న మాటే నిజంగా బాగుండదని తెలుసుకున్న వాళ్ళుకూడ ఇల్లా వృధా చెయ్యడం మానరు. అదేం ఖర్మమో!

అమృతం చిక్కుపడిన జడని సరిదీసుకుంటూ లేచింది. "నేనింట్లో వుంటా – మీరంతా వెళ్ళిరండి – నరసమ్మ పిన్ని ఒక్కతే ఉంటుంది పాపం" అంది.

"అసలిదంతా మీ కోసమేగా ఏర్పాటు చేసింది? అంత ఇష్టం లేకపోతే అందరం మానేద్దాం – పోనీ" అని నిధి లేచాడు.

"కోపం ఒచ్చిందా బావా – ఉండు ఇప్పుడే వస్తాను" అంటూ దూరంగా వెళ్ళింది. అమ్మయ్య ఇప్పటికి తెమిలిందనుకొని నిధి హాల్లోకి నడిచాడు. జగన్నాథం హాల్లో బీరువాకింద కర్రతో ఏదో పొడుస్తున్నాడు.

"మొన్న తాళ్ళు కనబడ్డాయి కాని జోడు కనబడలేదు. ఇవాళేమో జోళ్ళున్నాయి కాని తాడు కనబడ్డంలేదు." అని స్వగతం మొదలెట్టాడు. దొడ్లోంచి నరసమ్మగారు, పక్క దొడ్లో నాగమణిని స్టవ్ పొడిచే పిన్ను కావాలంటోంది. దయానిధి ఈలోగా కుర్చీమీద నిలబడి గోడగడియారాన్ని గంటలు కొట్టిస్తున్నాడు. ఇంతవరకూ కొన్ని నిబంధనలకు కట్టుబడిన ఆ గడియారం పూర్ణ స్వరాజ్యాన్ని ఇష్టమొచ్చినట్లు గంటలు మోగిస్తూ ప్రకటించుకుంటోంది. తరతరాలుగా దాస్యానికి అలవాటుపడి తిరుగుబాటు చేతకాని ప్రజలమాదిరి, ఏళ్ళ కొలది పనిచేస్తున్న గడియారం "కీ" లేకుండానే తిరుగుతూ వుంటుంది. అద్దం తలుపు తీసి అందులోంచి సిగరెట్టు పెట్టె అట్టలతో చేసిన పర్సుని బైటికి లాగాడు నిధి. గడియారం మూలుగు విని జగన్నాథం లోపలికి చక్కా ఒచ్చాడు.

"ఏమండోయ్ – దాని జోలికి పోకండి అందులో మన తాలూకు వుంది" అని ఆ పర్సుని లాక్కున్నాడు.

గడియారాన్ని బాగుచెయ్యటం చేతకాక, నిధి ఆ యత్నం మాని, కుర్చీ దిగి మళ్ళా హాల్లోకి రాబొయ్యాడు. అమృతం దూరంగా మూల నిలబడివుంది.

"ఏమిటి ఇంకా ఇక్కడే వున్నావు – స్నానానికి వెళ్ళావనుకున్నాను."

ఇంకా మూలగా నడిచి; జడని ముందుగా వేసుకుని పమిట నిండుగా కప్పుకుంది.

"నేను రావటానికి వీలులేదుగా" అని తలకాయ కిందికి ఒంచి అతనికేసి చూసింది.

"ఏం?"

"పో –" నవ్వుకోసం పెదవులు మెదిలాయి కళ్ళలోని నల్లటి ఆకల్ని; పళ్ళల్లో తెల్లటి సిగ్గు దాచలేకపోయింది.

అతనికి అర్థమైంది. చూస్తుండగా ఎదిగిపోతున్నట్లు కనిపించే అమృతాన్ని చూస్తే అతనికి భయం వేసింది. అమృతం ప్రకృతిలో ఐక్యమైపోయింది. తన వునికితో వాతావరణంపై ఒత్తిడి కలిగించింది ఆమె – అప్రయత్నంగా ఆమెని తాకాలనిపించింది. ఏపని బహిష్కరించబడుతుందో ఆ పనే చేయ్యాలని మనిషెంతో

వుబలాటపడుతుంటాడు. అనుభవానికి అనూహ్యమైన హద్దులులేవు, రహస్యం యొక్క పరిమితి తగ్గినకొద్దీ, అనుభవంలేని విలువ సన్నగిల్లుతూ వుంటుంది.

"దూరం, దూరం —"

"ఇది అర్థంలేని ఆచారం – ఈ ఒక్కసారి దీన్ని మానెయ్యాలి..."

"అమ్మయ్యో!" అని కళ్ళు పెద్దవి చేసుగుని, గుండెలమీద చెయ్యివేసుకుంది.

"నిజంగా ఆలోచించు – ఇందులో అర్థం వుందా? అందరూ యిల్లా చేస్తున్నారు కాబట్టి కొందరు చెయ్యకపోతే తప్పుగా ఎంచబడుతోంది కాని, చెయ్యకపోవడం తప్పుకాదు ఈ సమయంలో విశ్రాంతి కావాలి. ఇల్లా పెట్టకపోతే విశ్రాంతి పొందలేరేమోనని భయపడి, ఈ ఆచారం పెట్టారు కాని..."

"అయ్యబాబో – ఎవరికేనా తెలిస్తే ఇంకేమన్నా వుందా....!"

"ఉస్ – కేకలెయ్యకు.... ఎవ్వరికీ చెప్పొద్దు, మామూలుగా వుండు. లే, స్నానానికెళ్ళు..."

"తప్పు బావా – అమ్మో నాకు భయం. రేపు మీ ఆవిడచేత ఇవన్నీ చేయిద్దువుకాని లే..."

అమృతం చూడు– నా మాటంటే నీకు గౌరవం వుందా?

"ఉందనుకో..."

"నేను తప్పు విషయం చెప్పగలనని నువ్వు వూహించగలవా..." ఏ దేశంలో, ఏ స్త్రీ యిల్లా చెయ్యదు; వొక్క మనదేశంలో, కొన్ని కులాలలో మాత్రం యిది వుంది. నిజంగా దీనివల్ల ఎంతో నష్టం, చిక్కు ఉంది."

అని Periodic cycle, mienopause ciemacterie ను గురించి లెక్చరివ్వాల నుకున్నాడుగాని, దానికి సరైన మాటలు దొరకలేదు – పైగా అమృతంతో ఎట్లా చెప్పాలో మొదటే అర్థంకాదు; స్త్రీతో మాట్లాడేటప్పుడు కావాల్సిన మానసికబలం అతనికింకా రాలేదు. సిగ్గు పడ్డాడు తడపడ్డాడు; పెద్ద నేరం చేసినవాడల్లె కుంగి పొయ్యాడు. వాళ్ళు ఏమనుకుంటారో, వాళ్ళకు తెలుసు – భాషలేకుండా – మనుషుల్ని వొకరిని వొకరు అర్థం చేసుకునే నిశ్శబ్దాలలో అది వొకటి. ఆ విచిత్రమయిన అనుభవం, అతన్ని అమృతానికి బాగా దగ్గరగా తీసికెళ్ళింది. పంచేంద్రియాలూ, ప్రకృతి పిలుపుకి మారుమ్రోగిన మూగ అనుభవం.

నిధి, చాప చుట్టి మూలకి గెంటాడు. జగన్నాథం, పొడుగు చేతుల చొక్కాకి కఫ్‌లింక్స్ వెదుక్కుంటూ చక్కావచ్చాడు. ఊడిపోయిన రెండింటినీ దారంతోకట్టి అక్కయ్యని కఫ్స్ దూర్చమన్నాడు. అమృతం దూరంగా వెళ్ళబోయింది. దయానిధి ముక్కుమీద వేలేసుకొని వొద్దని సంజ్ఞ చేశాడు. నరసమ్మగారు సుశీల కూడా వక్కావొచ్చారు. అందరూ ఏకమైపోయూరు. మనుషులే ప్రకృతిని మైలచేశారు.

భోజనాలు చేశారందరూ. వీధిలో రెండు వొంటెద్దు బళ్ళు సిద్ధంగా ఉన్నాయి. సుశీల జార్జెట్ చీర కుచ్చిళ్ళు కుదరక అమృతాన్ని సర్దమంటోంది. అమృతం ఖద్దరు ఎర్రపువ్వుల చీర పమిటంచు బాగుండలేదని నరసమ్మగారితో ఫిర్యాదు చేస్తోంది.

"ఎట్లా వుంది బావా, యీ చీర?"

అది అర్థంలేని ప్రశ్నని అతనికి తెలుసు.

"ఈ చీరలో నే నెట్లా ఉన్నాను అని – అంతేనా?"

"పోనీలే చెప్పకపోతే" అని అద్దంలో గుండ్రంగా తిరిగి చూసుకుంది. పమిట చేతులో పట్టుకుని వెన్ను చూసుకుంది. రవికకీ, చీరకీ మధ్య చర్మం కనిపిస్తోంది; "బిగుతమ్మా జాకెట్టు యిప్పేస్తా" అంటూ స్వగతంచెప్పి మళ్ళా గదిలోకెళ్ళింది.

జగన్నాథం ఎడంకాలి జోడు పట్టక పడుతూ, లేస్తూ గుమ్మం మీద కసరత్తు సాగించాడు. నాగుమణిని గుమ్మం దగ్గర అటకాయించి జోడు వ్యవహారం చూడమన్నాడు! "హోయ్ హోయ్" అన్నాడు, గాలిపీలుస్తూ, నాగుమణి వాడిన నైట్ క్వీన్ పరిమళం హాలంతా వ్యాపించింది. జగన్నాథం నాగుమణి భుజం మీద చెయ్యి వేసి, ఎడంకాలి మడవని గుమ్మానికి తన్ని మొత్తానికి జోడుని కాలుకి తగుల్చుకున్నాడు. నాగుమణి తెల్ల సిల్కు జాకెట్టు మీద గుమ్మానికి కొత్తగా రాసిన పసుపు తాలూకు మూడు వేళ్ళ గుర్తుపడింది.

"క్షమించండి కాలవలో స్నానంచేస్తే, అదంతా పోతుందిలెండి" అన్నాడు జగన్నాథం.

"మంచి పిల్లాడివే" అని సణుక్కుంటూ నాగుమణి వాళ్ళింటికి వెళ్ళిపోయింది.

సుశీల జార్జెట్టు – వొంటిమీద నిలబడటం లేదని తీర్మానించుకొని, అది మార్చి సేలం పట్టుచీర కట్టుకుని అద్దం ముందు చూసుకుంటోంది. "చీర సొంతమేనా?" అన్నాడు జగన్నాథం. కుర్చీమీద నిలబడి జోళ్ళని అద్దంలో చూసుకుంటూ.

"ఒక్క టేస్తాను" అని సుశీల కొట్టబోగా, యిద్దరూ హాల్లో పరుగులు మొదలెట్టారు. గుమ్మంమీద నాగుమణితో డీక్కొని ఆమెని గుమ్మానికి చేరేసి, క్షమించమన్నాడు. పసుపు మరకలు చీర కొంగు మీదపడ్డాయి. "ఛీ, పొద్దున్నే ఎవరి ముహం చూశానో" అనుకుంటూ మళ్ళాయింటికి వెళ్ళింది.

దయానిధి గోచీపోసి పంచ కట్టుకుని లాల్చీ, పైన కండువా వేసుకొని బండిదగ్గరకు హాజరయ్యాడు. జగన్నాథం హుషారుగా "మీర జాలగలడా సత్యాపతి" పాడుతూ, పచార్లు చేస్తున్నాడు. చిన్ని బోర్డర్ మందారం రంగుచీర, వెడల్పంచు రవికా వేసుకుని అమృతం సిద్ధమైంది. జడ మెలి తిప్పి "బర్మా" ముడిగా మెడమీద అమర్చుకుని మందారాలని దోపుకుంటోంది.

"సాల్వేషన్ ఆర్మీ వేషం!" అన్నాడు జగన్నాథం.

"నోర్ముయ్."

"మూశాం."

దయానిధి నవ్వుతున్నాడు.

ఏం బావా, బాగాలేదా? పోనీలే, ఏం చెయ్యను. ఇంతకంటే మంచి చీరలు నాకెక్కడనుంచి వస్తాయి? అంది.

"చాలా బాగుంది రంగు చీరల సెలక్షన్‌లో నువ్వు చిత్రకారిణివి" అన్నాడు.

"ఏంఆక్షేపిస్తావులే"

ఇంతలో వరసమ్మగారు "యింకా బయలుదేర రేమర్రా" అంటూ బయటికి వొచ్చింది. మొసలి చర్మం శాండల్స్ తొడుక్కుని సుశీలకూడా వొచ్చింది.

"వాదులాడగలడా నాతో యిక", "ఎక్కండి, ఎక్కండి" అని జగన్నాథం అరుగుమీద వాళ్ళని ఆహ్వానిస్తున్నాడు. వీధిలో గేదెమీద నుంచి దిగి పాలేళ్ళ కుర్రాడు, కర్రమీద మెడ ఆనించి ఈ దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డాడు.

"ఇవాళ జగన్నాథం తెగ యెగిరిపోతున్నాడు – నారయ్య లేడు కాబట్టా?" అంటూ నరసమ్మగారు నవ్వడం మొదలెట్టింది.

"ఆ రోజులు వెళ్ళిపోయినాయండోయ్! నారయ్యే మదీయ కోపాగ్నికి తట్టుకోలేక వెళ్ళిపోయాడని గమనించ ప్రార్థన" అన్నాడు జగన్నాథం.

కళాపి "బికారి" కొంత సామాను బండిలోకి చేరేశాడు.

"మీ జోళ్ళేవి అమృతం?" అని అడిగాడు నిధి.

"మాకు జోళ్ళెందుకు?"

"మాకు – అని నన్ను కూడా కలపకు; నా కున్నాయి. ఇవాళే బొగ్గుపొడి, కొబ్బరినూనె కలిపి పాలిష్ కూడా వేసుకున్నాను" అన్నాడు జగన్నాథం. నాగుమణి కొత్తచీర ధరించి బండిలో ఎక్కింది. బండి వెనక్కి, ముందుకీ కదిలి పది గజాలు ముందుకి నడిచింది.

"నేను, నాగుమణి నో బండిలో" అంది అమృతం.

"What a foolish జగ్గు! నేనూ, బావగారు నో బండిలో, మిగత అందరూ నో బండిలో" అన్నాడు జగన్నాథం.

"మీరందరూ ఎల్లాగో అల్లా రండి – నేను నడుస్తాను" అన్నాడు నిధి. "ఐతే మనమూ నడుస్తాం" అని పూర్తి చేశాడు జగన్నాథం.

"పాలేరుకుర్రాడి నల్లమొహంలోంచి తెల్లటిపళ్ళు కనిపిస్తున్నాయి. కొంత గింజాకోటాలు; తోసుకోటాలు, దిగడాలు, ఎక్కడాలు, కాడివూడ్డం, అందరూ దిగడం అందరూ ఎక్కడం – అన్నీ జరిగాయి. ఆఖరికి నాగుమణి, నిధి, జగన్నాధం నో బండిలో, మిగతా యిద్దరూ "బికారీ" మరో బండిలో ఎక్కారు. బళ్ళు కదిలాయి. పందు మలుపు తిరిగింది. అది ఈస్టిండియా కంపెనీ కాలంలో పరిచిన రోడ్డు; ఆవాడది రాజబాట. జగన్నాథం జోళ్ళకాళ్ళకి పట్టుదొరక్క అటూ ఇటూ ఎగిరి పడుతున్నాడు. నాగుమణి ముందుకుపడి నిధి మోకాళ్ళి గట్టిగా పట్టుకుంది. వొదిలింది. బండి ముందు బరువన్నారు. జగన్నాథం వెనక్కిపాకాడు. మళ్ళా గొయ్యి, నాగుమణి నిధి భుజాన్ని పట్టుకుంది. చేతులు తొలగించాడు. మళ్ళా పెద్ద గాడు. నిధి చెయ్యిని బిగించి పట్టుకుంది. తోసేశాడు అతని కెల్లాగో వుంది, దిగి నడుద్దా మనుకున్నాడు నాగుమణి నవ్వుతోంది.

"నీలు తేబోతుంటే నీ తోడే నోలమ్మ, నన్నెనక ఎవరోను తన్నినట్లుంటాదే..." అని జగన్నాథం "ఎంకి పాట" మొదలెట్టాడు.

నాగుమణి అతన్ని పదే పదే తాకటం, నిధికి తప్పుగా తోచినా, బాధ కలిగించినట్లు ఒప్పుకోలేక పోతున్నాడు. అదో అల్పమైన తాత్కాలిక అనుభవం. ప్రేమికుల నిరంతర యాత్రలో, లక్ష్యం చేసుకునే ముందు, మార్గాన్ని చూపే మైలురాళ్ళు యీ అనుభవాలు. ఆ చేష్టలకి ఏమీ అర్థంలేదు; ఎవ్వరూ యిల్లా చెయ్యాలీ అనుకోరు; పరిస్థితులనుబట్టి యాత్రికులు నిర్మించుకున్న మజిలీలు,

ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని ప్రేమిస్తూ వుండడం మానవుడి నైజం. ఈ చేష్టలన్నీ ప్రేమరాజ్యంలో సామంతరాజులు. అప్పుడప్పుడు, అవకాశాలనుబట్టి సామంతరాజులు కేంద్ర ప్రభుత్వంపై తిరుగుబాటు సల్పడం జరుగుతూ ఉంటుంది. చివరికి వారి ఓటమి తప్పదు; అప్పుడు రాజు వారిని దండించకూడదు వారు లేందే తన రాజ్యమేలేదు.

అతను చెయ్యూ్యకాలూ దూరంగా లాక్కున్నాడు. ఇంతలో కాలు మళ్ళా ఆమె కేసి ఎల్లా జరిగిందో! ఏకాంతంగా వున్న తన చేతిమీదికి నాగుమణి చెయ్యి ఎల్లా ఒచ్చింది? ఇద్దరూ అది గమనించడం, గమనించనట్లు ఏదో కేవలం బండికుదుపుకే అల్లా జరిగినట్లు నటించడం – జరుగుతూనే వుంది. అతని చెయ్యిని గట్టిగా అదిమింది. చెయ్యి మార్చి, అరి చేతిని పైకి తీశాడు. ఎక్కడో అడుగు దూరంలో వున్న ఆమె కుడి చెయ్యి, ఆ చేతిమీద ఆని, వేళ్ళు కలిపి బిగించేసింది. సామంతరాజుల తిరుగుబాటు సన్నటి, పొడుగాటి, గట్టి వేళ్ళు;

లాకు దగ్గరకి బళ్ళు చేరుకున్నాయి.

రెండు టాపులేని డింగీలని, మధ్య తాడుకట్టి ఒకటి చేశారు. చుక్కానికి గురువడు సిద్ధమయ్యాడు. ముందు పడవలో, డేరా కోసం తెచ్చిన పెద్ద దుప్పట్లు, రెండు కంబళ్ళు టీ సామాను పెట్టి, కేరంబోర్డు వుంచి జగన్నాధాన్ని కూర్చోమన్నాడు. అమృతం కూడా అందులోనే కూర్చుంటానంది. సుశీలా, నాగుమణీ వెనకాల దాంటో ఎక్కారు.

పై లెవల్ కాలవ వడిలేకుండా, గట్లని నిండుగా అదుముకూంటూ, ఎదురో, వాలో తెలీకుండా పాకిపోతుంది. రెండు పక్కలా చెట్లు కొమ్మల్ని నీళ్ళల్లోకి చాచుతూ ఆహ్వానంకోసం హాజరైన స్కౌట్ల సిబ్బందిలా పొడుగూతా వుంటూనే వున్నాయి. నల్లటి నీడల్ని పరిచేందుకు తగిన తీక్షణతలేని శీతాకాలపు సూర్యుడు నీళ్ళల్లో వజ్రంలా మెరుస్తున్నాడు. దిక్కులేని గాలి, నీళ్ళని ఉత్తర దక్షిణాలకి గెంటుతోంది. ఎగిరి పడుతూ మొహాన్ని మూసేస్తున్న పమిటని అమృతం తలమీద గుండ్రంగా ముసుగేసుకుని, కొంగుని జబ్బమీద రెవిక అంచులో దోపుకుంది. ఎగిరిపోతున్న నాగుమణి కొంగుని సుశీల తన పళ్ళతో బిగించి పట్టుకుంది. జగన్నాథం క్రాపింగు పాపిడి ఎప్పుడో చెరిగిపోయి వెంట్రుకలు పైకి నిలబడ్డాయి. అక్కయ్యని దువ్వెన తియ్యమన్నాడు. కసురుకుంది. ఊరుకుని కాసిని నీళ్ళతో జుట్టుని తడుపుకుని సర్దుకున్నాడు. దయానిధి వీళ్ళనీడల్ని నీళ్ళల్లో చూస్తూ గట్టున నడుస్తున్నాడు.

ముందు పడవకి తాడుకట్టి "చిక్కారి" గట్టున లాగుతూ నడుస్తున్నాడు. మలుపు తిరగ్గానే ఫర్లాంగురాయి దగ్గర చికారి ఆగిపొయ్యాడు. గోచీ పెట్టుకుని, ఎర్రగుడ్డ పాగా చుట్టుకొని నల్లకుర్రాడు కొబ్బరి చెట్టు మొగలో వుండి, కాయలు దింపుతున్నాడు. కింద మరో వ్యక్తి నడుంకి తువ్వాలుచుట్టి, కొబ్బరికాయలు కొడుతున్నాడు. రెండో చెట్టు వెనకాల బండమీద కోమలి కూర్చుని గుంజు తింటున్నది.

చికారి, చెట్టుమీదనుంచి కుర్రాడ్ని దిగమని ఆజ్ఞాపించడం, కొంచెం వెనక నడుస్తున్న దయానిధి విన్నాడు.

"ఏమయ్యా పెద్దమనిషి, కుర్రోడికి, వాడికి బుద్ధిచెప్పడంపోయి నువ్విదేంపనయ్యా – జుల్మానా తెలుసా? సర్కారు చెట్లు యివి" అని బికారి నడుం తువ్వాలు వ్యక్తిని కూకలేస్తున్నాడు. ఆ వ్యక్తి కాయలు కొట్టడం మాని కాలవలో చేతులు కడుక్కున్నాడు.

"యెవరిది? యీసెట్టు, మాది – కొట్టు, రంగయ్యా – యేంటి భయం!" అంటూ కోమలి చెట్టు వెనకనుంచి వచ్చింది. రెండు మూడు రకాలచెట్లు మొదళ్ళలోనే అల్లుకుపోయినట్లుగా జడంతా ముళ్ళడిపోయి, విడిపోయిన వెంట్రుకలు చెంపవి పరదాలో కప్పి వేశాయి. అంచులేని పల్చటి ఆకుపచ్చచీర గాలికి రెండుకాళ్ళనీ పట్టుకుని వెనక్కి గోచికోసం యెగురుతోంది. కుడిచేతికి వక్కాటే ఆకు పచ్చగాజు: అక్కడక్కడ రాళ్ళులేని దుద్దులు, ఎర్రగళ్ళ నల్లరవిక – ఖరీదైన వేషంలో వున్న కోమలి, కోపం ప్రకటించడానికి కొంచెయత్నం చేస్తోంది.

నల్లకుర్రాడు కిందికి దిగాడు. "నాకు తెల్దండి – ఆరెక్కమన్నారండీ"

"పో, వెధవ –" అన్నాడు బికారి.

"పోతానండి –" అంటూ వాడు పరుగెత్తాడు.

"మా యిష్టం, మా సెట్టు: నీ కెందుకు?"

"నువ్విక్కడికి దాపరించావా?" అన్నాడు బికారి. దయానిధి వారిని కలుసుకున్నాడు.

"మీరు ఒచ్చారే అంటూ తెల్లబోయింది కోమలి."

మళ్ళా అందుకుంది. "చూడండి – ఈ సెట్టు మాది, అల్లదిగో ఆడుండేది మా పొలం, మా అమ్మకూడా వుందక్కడ. ఈ మూడూ సర్కారోళ్ళవి..."

అది నిజమే, సర్కారు చెట్లపై నెంబర్లు చెక్కి ఉన్నాయి. నెంబరు లేనిది కామాక్షిది. అన్నీ కలిసి దగ్గరలో ఉండడం మూలాన, యిట్లా కళాసీలు ఆ చెట్టుపై అధికారం చూపినవాళ్ళని బుకాయించటం పరిపాటయిపోయింది.

"అబ్బో, – పొలామందే ఉన్నారే... రంగయ్యా, నువ్వింటికి పో, అమ్మతో కాసేపుండి వత్తానను." రంగయ్య తువ్వాలు తలకి చుట్టుకుని, రెండు కొబ్బరికాయలు మెలివేసి కట్టి బుజాన వేసుకుని నడవడం మొదలెట్టాడు.

"తొందరగా రా..." అని దూరాన్నుంచి సంజ్ఞ చేశాడు. రంగయ్య – ఎవరో?... కోమలి వింత ప్రపంచంలోని విచిత్ర వ్యక్తులలో వొకడు. కోమలి ప్రభావం వాళ్ళందరిమీద కూడా వత్తిడి కలిగించింది.

పడవలో గుసగుసలు బయలుదేరాయి. జగన్నాథం పడవని వడ్డుకి నెట్టి, గట్టుమీదికి దూకాడు.

"నాకీ జైలు ఖర్మమేం? హాయిగా నడుస్తా"

"నేనూ నడుస్తాబాబూ..." అంటూ సుశీలకూడా దిగింది. మొత్తంమీద వకరి వెనుక వకరు, అందరూ దిగారు.

చుక్కానీవాడు పడవలో పడ్డ చేపలు పట్టుకుని కాలవలో పారెయ్యడానికి యత్నాలు చేస్తూ కూర్చున్నాడు.

"సేపని పడతం రాదు – యింతేనా –" అంటూ కోమలి చుక్కానీ వ్యక్తిని

చూస్తోంది. తను గబ గబా పడవలోకి ఎక్కి, చేపకోసం వేట ప్రారంభించి" యిట్టే పట్టుకుని గట్టుమీదికి వచ్చింది.

"ఛీఛీ – ఏక్" అంది సుశీల.

"బాబో, అదేమిటి!" అంది అమృతం.

జగన్నాధం కొంచెం దూరంగా నిలబడ్డాడు.

"ఇంద నాగూ—" అని కోమలి చేపని నాగుమణికి యివ్వబోయింది–

"అవతల పారెయ్యి – నాగూ ఏమిటి? నాగుమణి అనలేవు?" అని కసురుకుంది.

దయానిధి వాళ్ళని యెలా పరిచయం చెయ్యాలో తెలీక బాధపడుతున్నాడు. గొంతుక సవరించుకుని –

"చూడు – ఈవిడ అమృతం –"

"ఓ, – అముత్రంగారా... యిందండీ, సేపని చూస్తారా?" అంది కోమలి.

సుశీల నవ్వింది.

"అదుగో ఆవిడ సుశీల – మా మేనత్త..."

"నాకు తెల్సు"

"పరే యీావిడ..."

"నాగు" అని పూర్తిచేసింది కోమలి.

"నాగేమిటే నీకు – వళ్ళు పొగరెక్కి" అని నాగుమణి కోమలిపైకి వెళ్ళింది.

"దగ్గరకొచ్చావంటే సేప – జాగ్రత్త –" అని మాటలను పెద్దవిగా బొంగురు కంఠంలో విడదీసి ఉచ్చరిస్తూ జడిపించింది.

"అవతల పారెయ్యి – పెంటబుద్ధులు, నువ్వూనూ" – తప్పించుకుని దూరంగా పారిపోయింది నాగుమణి.

"మిమ్మల్ని పరిచయం చెయ్యక్కరలేదు – అదుగో ఆ అబ్బాయి"

'అబ్బా యేమిటండో బావగారు?' జగన్నాథం అందుకున్నాడు.

"పోనీ, ఆ బుల్లి పెద్దమనిషి –"

"జగ్గు –" అని సుశీల అడ్డం వచ్చింది.

'నాన్ సెన్స్–నాథ్'

'పరే–నాథ్–అమృతం...'

"మా యొక్క అభిమాన తమ్ముండను. కొండకచో చిరుసోదరుండ–ఈమె ఎవ్వరో తెలుసుకోవచ్చునా ఆర్యా!"

'ఏడిశావ్–ఊరుకో–' అంది అమృతం.

"అదేమిటే జెంటిల్ మేన్‌లా మాట్లాడుతుంటే – ఏయ్ అమ్మాయి, దానిమీద పడెయ్యి చేపని –" అన్నాడు జగన్నాధం.

"ఓ" అంటూ కోమలి చేపని జగన్నాధం మీద గిరవాటెట్టింది.

"What a foolish! మనకి జలచరాలంటే కించిత్ భయం" అనుకుంటూ జగన్నాధం దూరంగా పరుగెత్తాడు. అందరూ నవ్వుకున్నారు. మళ్ళీ పడవల్లోకి ఎక్కారు. అమృతం కోమల్ని తనతో పడవలో కూర్చోబెట్టుకుంది. వెనకాలదాంట్లో నాగుమణి, సుశీల యధాస్థానాల్లో కూర్చున్నారు.

"మీ రెక్కలేం?" అంది గట్టునున్న విధిని కోమలి.

"నేను నడుస్తా"

"నేను నడుస్తా – దిగండి – అమృతంగారు మనం నడవలేమంట పెద్ద మొగాళ్ళు."

ఈలోగా వాళ్ళు దిగకుండానే టికారి పడవల్ని లోపలికి గెంటేశాడు. జగన్నాథానికి పల్లేరుకాయలు గుచ్చుకున్నాయి. వాటిని తీసుకుని, "నా బోళ్ళు పడెయ్యండ్రా" అంటూ పడవలోకి దూకటోయ్యాడు. కోమలి యిన్ని నీళ్ళుతీసి అతనిమీద కొట్టింది.

"దిగు–నీపని చెప్తా –"

వాళ్ళిద్దరూ నడకసాగించారు.

పడవలు ఐదు ఫర్లాంగులు వెళ్ళి, మలుపులో నిలిచిపొయ్యాయి. అందరూ దిగారు.

చేలల్లోంచి సన్నటి కాలిబాట వుంది చేలు దాటగానే పెద్ద పచ్చగడ్డి మైదానం – అడుగు ఎత్తు ఎదిగిన గడ్డిపోచలన్నీ గాలికి తలలాడిస్తున్నాయి. మైదానం మధ్యలో జట్టుగా పర్వీచెట్లు జడలు విరబోసుకున్నట్లుగా పలకరించుకుంటూ మెదుల్తున్నాయి. వాటిని ఆనుకునే పెద్ద మామిడితోపు – సూర్యరశ్మి సోకకుండా, దట్టంగా అల్లుకుని మామిడి చెట్లు రహస్య విశ్చలత్వాన్ని నిరూపిస్తున్నాయి. వాటి కొమ్మలు, మధ్యగా వున్న చిన్న చెరువులోకి వ్రేళ్లాడుతున్నాయి. ఆ చెట్ల మెత్తటి చలినీడలలో వాళ్ళు విడది చేశారు! తపోభంగమైన ఋషిలా, ఒడ్డునున్న కప్ప నీళ్ళల్లోకి ఎగిరిపడింది. ఎవరి కాలికిందో మామిడి రెమ్మ పట్టుక్కుమంది. ఆకులు రెపరెపలాడాయి. పశ్చిమ పవనం ఆకుల్ని పోగుచేసుకొని ఓహోరిస్తూ వర్షించింది. రామచిలుకలు చెప్పరాని సిగ్గుతో తలకాయల్ని దాచుకుని సైగలు చేస్తున్నాయి – ఈలపిట్ట మత్తుతో ఒళ్ళువిరుచుకుంది. – ఒక్కసారిగా ప్రకృతి జీవించి చోద్యం చూస్తోంది.

కోమలి చెరువుగట్టున వికృతంగా కాళ్ళు ముడుచుకుని కూర్చుంది. మెల్లమెల్లగా ఆకృతి పొందుతున్న పొడుగుకెరటం, ఆమె మొహాన్ని అవతల గట్టుదాకా వ్యాపింపచేసింది. నీళ్ళల్లో ప్రతిమలా, శీలంలేని మొహం – చన్నీళ్ళ లోతులో గోరువెచ్చదనం దాచుకున్న చల్లటి మొహం.

"కళ్ళెత్తితే పాలు కనకాభిషేకాలు" అన్నపదం జ్ఞాపకం వచ్చింది విధికి – కాంతులు కురుపిస్తూ, ధగధగసిరితో మెరిసి, కోర్కెతో మండిపోతున్న నేత్రాలు.

చెట్లకింద అన్నీపరిచి నాగుమణి స్టవ్ ముట్టించింది. సుశీల చూస్తూ కూర్చుంది. కోమలికేసి, విధికేసి – వారిద్దరూ తన్ని చూడకుండా, ఒకర్ని ఒకరు చూస్కుంటున్నప్పుడు – సుశీల తన్ని చూడకుండా అదంతా అమృతం చూస్తోంది. నాగుమణి, అమృతం, సుశీల చూడకుండా, సుశీల వాళ్ళని చూడడం, అమృతం గమనించకుండా, అందర్ని చూస్తోంది. కోమలికి తనని యింతమంది చూస్తున్నారని తెలియక పోయినా, తెలిస్తే తాను ఎల్లా చూసునో, అల్లా చూడాలని ప్రయత్నిస్తున్న దానికిమల్లే చూసి, చూసి, ఆఖరికి నవ్వేసింది – ఏదో గట్టుమీదనుంచి చెరువులోపడి, కెరటం, ప్రయాణం ప్రారంభంలోనే నవ్వింది.

"ఇదేనా – పిక్నిక్కు?"

సుశీల నవ్వింది... కళ్ళల్లోడు పట్టుబారి వ్రూడేటట్లుగా.

"పెద్ద నవ్వాలా ఏమిటి?" అంది అమృతం

"టికిక్, పికిక్ చికిక్"... అంటూ నాగుమణి ఆక్షేపణ మొదలెట్టింది, కోపం వచ్చింది.

"మహో – పాసిపళ్ళ మూలచ్చి" అని పళ్ళ చిగుళ్ళు చూపిస్తూ వెక్కిరించింది.

"నీవా.... నీవి––" ఏమనాలో నాగుమణికి తెలీదు. పళ్ళు పట పట కొరికి స్టవ్ పిన్ను విరగకొట్టింది.

"చూస్కో – నా పళ్ళకేం" అని కోమలి పళ్ళను ప్రదర్శించింది. దయానిధికి నవ్వొచ్చింది.

"మిమ్మల్ని ఇది చుట్టానికేనా తీసుకొచ్చింది?" అని సుశీల అడిగింది చెల్లని సంబోధిస్తూ.

"ఏదో ఇంగ్లీషు రాదనుకో... అంటే కోపంరాదా ఏమిటి?" అంది అమృతం.

"నువ్వేం వెనకేసుకొని రానక్కరలేదు?"

"అవును పాపం అల్లా అనడం ఏం బాగుంటుంది?"

"మధ్యన మీకెందుకండి..." అని నాగుమణి అందుకుంది.

"ఏమిటి బావా, అల్లా చూస్తూ వూరుకుంటావ్!" అంది అమృతం.

"సూత్తమే ఆయనకి బాగా సేతవుద్ది" కోమలికి ఏం మాట్లాడాలో తెలీడంలేదు, అల్లా అనడం తప్పేమోనుకుంటూ,... "సూత్తం కూడా తెల్దు" అంది.

సుశీల నవ్వుని కొంగుని పళ్ళల్లో బిగించి ఆపుగుంది.

"తానం ఆడతారా!" అంది కోమలి అందర్నీ వుద్దేశించి.

"నీ కీతొచ్చునా?"

"ఓ..."

"గోదావర్ని అట్నించి ఇటు యీదినవాడు, నేనూ ఒకే రైల్లో ప్రయాణం చేశాం – అంచేత స్నానానికి మనం సిద్ధం..." అంటూ జగన్నాథం ప్రవేశించాడు.

"ఇంతసేపు ఏం చేస్తున్నావురా?" అమృతం అడిగింది.

"బికారితో స్వైర విహారం."

"ఆ వెనకాల చేతులో ఏమిట్రా?"

జగన్నాథం చేతులు వెనకాల బిగించి కోమలి దగ్గరగా వచ్చాడు.

"ఇందాకా మీద నీళ్ళుపోసి, పదిమందిలోనూ పరాభవం చేసిన అంగనవు నీవేనా? బావగారూ! ఈ పూట తెనుగు దంచేస్తున్నాను –"

"ఏంటి పిల్లోడా!" అని వెనక్కి తగ్గింది కోమలి, మొహంచిట్లించి కళ్ళు మూసేసుకుంది, సూర్యరశ్మి భరించలేని పద్మంలా.

"What a foolish మళ్ళా మనవి చేసుగుంటా – బైదిబై బావగారూ యీ యువతీలలామ ఎవరో కించిత్ సెలవిచ్చారు కారు –"

"కోమలిరా... అదేం వాగుడు? తిన్నగా మాట్లాడల్లేవా?" అంది అమృతం.

"More foolish? Italian of the East, స్వచ్ఛమైన తెలుగు భాష ప్రయోగిస్తుంటే to call it వాగుడు!"

"ఏంటబ్బాయి – మీది మీది కొస్తుండా –" అని యింకా వెనక్కి జరిగింది కోమలి.

"నీ కలవాటేగా," అంది నాగుమణి...

"తప్పు" అంటూ అమృతం ముక్కుమీద వేలేసుగుంది.

"ఏంటి కుశావ్ – మర్ఫీకుయ్." అని కోమలి నాగుమణి కేసి కసిగా చూసింది.

"What a foolish! కూత! ఇందాక నా మీద జలచర ప్రయోగము చేసిన అబలవు నువ్వేనా?..." అంటూ, చేతులో వున్న ఆకుల కొమ్మని మోచేతికి రాశాడు. కోమలి గోక్కోడం మొదలెట్టింది.

"ఆఅకులేమిత్రా – ఇల్లా పత్రా" అది అమృతం.

కోమలికి దురద ఎక్కువైపోయింది. జగన్నాథం కేసి కొంటెగా చూసి, మంటని బలవంతంగా అపుకుని, ఆ కొమ్మని లాక్కోబోయింది. జగన్నాధం పరుగెత్తాడు. అతన్ని తరుముతూ వెనకాల పరుగెత్తుతోంది కోమలి. ఈ దృశ్యం చూస్తూ దయానిధి నడవడం మొదలెట్టాడు. అంతవరకూ ఏదో చెప్పరాని అనుమానాలతో మూగదయిపోయిన వాతావరణము కంఠం సవరించి, సాఫీ చేసుకున్నట్లుగా, మిగిలిన వ్యక్తులందరూ మామూలు ధోరణిలో పడ్డారు – నీళ్ళన్నీ ఎండిపోయిన కాలువ.

చింపిరి జుట్టులో దొరబడి పాపిడిలా దారి చూసుకుంటూ నడిచిపోయిన మెరుపు పురుగులా కోమలి గడ్డిలో పరుగెత్తుకుపోతోంది – జగన్నాధాన్ని తరుముకుంటూ. దూరంగా సర్వీచెట్టు వెనకాల దయానిధి నిలబడి చూస్తున్నాడు. కోమలి జగన్నాధాన్ని పట్టుకుంది, ఇద్దరూ పెనుగు లాడుకున్నారు. అతని చేతిలో ఉన్న దూలగుండ మొక్కని లాక్కుని అతన్ని భుజాలమీదికి ఎత్తుకుంది! ఆ మొక్కని అతని మొహం అంతా రాసింది, అతను గడ్డిలోకి దూకి, ఆమె చేతిలోంచి ఆ మొక్కని లాక్కున్నాడు.మళ్ళా పరుగులు ప్రారంభించారు. ఆమె ముందు, అతను వెనకా, గడ్డిపోచలే ప్రాణం తెచ్చుకొని ఎదిగిపోయి మనిషిగా, మారినట్లు పచ్చ చీరలో కోమలి కదిలిపోతోంది. సర్వీచెట్ల వెనక మాయమవుతూ, నల్లటి మేఘాల మధ్యనుంచి ఆకస్మికంగా మెరిసిన మెరుపులా, ప్రకృతిని తనలో ఐక్యం చేసుకొంటోంది. ఇంకా దూరంగా వెళ్ళిపోయింది – ఆకుపచ్చగా, పల్చబడి అంతర్ధానమైపోయింది. చెట్లు, గట్లు, పుట్టలు, పిట్టలు అన్నీ అటుకేసి కదుల్తున్నట్టుగా మెదుల్తున్నాయి. ఆకాశం విశాలంగా నవ్వి సూర్యుడ్ని అరచేతి మేఘంతో కప్పింది. నీలం ధ్వని లేకుండా నవ్వుతోంది. నీలం ఆకుపచ్చల్ని దూరంగా కోమలి చెయ్యి చెయ్యా కలిసింది.

"అట్లా గడ్డిపోచల మధ్య గంతులేస్తూ ఆకాశాన్నీ, భూమిని బుజ్జగిస్తూ స్నేహం చేసుకుంటూ వుండవలసిన వ్యక్తి కోమలి. ఆమె నిజస్థానం అది. పుట్టినిల్లు పచ్చగడ్డి, అత్తిల్లు ఆకాశం. పిట్టలు, పువ్వులు సంతానం. మనుషుల మధ్య యిండ్లల్లో వుండి, ఎంగిళ్ళు ఎత్తవల్సిన మనిషికాదు. కొందరు కొన్ని వాతావరణాలకోసం ఉద్దేశింపబడతారు. ఆ వాతావరణం మధ్యనే వారికి పరిపూర్ణత వుంటుంది. స్వేచ్ఛా జీవనానికి ఆలయాలు వాతావరణమే. అందులోంచి తొలగిస్తే వారు నీరు విడిచిన చేపలు – శృంఖలాలు లేని బానిసలు. సర్వీచెట్లు వానాకాలంలో పీల్చుకున్న వర్షం నీటిని ఈనాడు మెల్ల మెల్లగా వొదులుతూ కోమలిని మధ్య కూచోబెట్టి

తలంటుపోస్తుంది. గాలి సిగ్గులేని పిచ్చి పువ్వుని బలవంతంగా తల్లో అమరుస్తుంది. వానకి చలించిన వేడి భూమిలో మైకం చెంది సుగంధ పరిమళం కింద ఆమెని ఆక్రమిస్తుంది. ఎర్రపువ్వులను బంధించుతున్న గడ్డిపోచలు గాలికి ఎండలో మెరుస్తూ లయగా అరబెట్టిన అకుపచ్చ పట్టుచీరలా, ఎండుకుని, కోమల్ని చుట్టుకుంటాయి, ఆకలి దాహాలులేని అయోమయపు ఆశదారుణాలు, ఎరగని దైవత్వం, హద్దులులేని అనుభవం ఆమె.

రాతి శిధిలాల మధ్య వుండవల్సింది అమృతం. ఎక్కడో ఏ హంపీలోనో – అన్నీ రాళ్ళు–భగ్న ప్రతిమలు. వొంటరిగానిల్చిపోయిన స్తంభాలు ప్రేమకోసం గుండె రాయిచేసుకున్న రాకుమార్తెలా విగ్రహాలు అన్నీ శిథిలమైపోయి, ఏ అర్ధరాత్రో అడుగుల చప్పుడూ, నిట్టూర్పు వినబడితే కదులుతాయేమో ననిపించే ప్రమాదస్థితిలో పడి ఉంటే వాటి మధ్య అమృతం కూచుని, విషాదంలో నవ్వుతుంది. ఆమె గడిచిపోయిన అనుభవపు వైభవాలని తల్చుకుని, ఏడ్చి ఏడ్చి, అతీతం ఐనప్పుడు కన్నీరు చుక్కలు చుక్కలుగా రొమ్ముల మధ్య నుంచి జారి యీనాటి నదిగా ప్రవహిస్తోంది. తన దుఃఖం నదులై పొంగి పొంగి దేహాన్ని ముంచి వేస్తుంది – తప్పు! తను ఏడ్వకూడదు – విషాదంతో నవ్వుతుంది. ఆనాడు సౌందర్యం తన యాత్ర ముగించుకొని ఆమెను శిలగా మార్చివేస్తుంది. ఏ రాతిని నిట్టూర్పుతో కదిల్చినా అమృతం కలలో కార్చిన కన్నీరల్లె నీరైపోతుంది.

సుశీల వాతావరణం వేరు. పెద్ద బస్తీలో మధ్య బంగళాలో మూడో అంతస్తుమీద మధ్య గదిలో, మధ్య సోఫాలో కూర్చుంటుంది. పైన అకుపచ్చని రంగు ఫాన్, ఎడమవైపున బ్రాకెట్ బల్ల, దానిమీద చేతులో ఎలక్ట్రిక్ బల్బు పట్టుకున్న వీనస్ డిమైలో బ్రాంజ్ ప్రతిమ, ప్రక్కన ఇరవైమూడు పుస్తకాలు పట్టే అద్దాల బుక్ షెల్ఫ్–దానిమీద ఫోటో స్టాండ్‌లో తోరుదత్ తైలచిత్రం తొమ్మిది గజాల ఆగ్రామసిన్ చీరచుట్టూ నాలుగుసార్లు తిప్పి కట్టుకుని, చైనీస్ డిజైన్ లాంప్ షేడ్‌కింద, ఇండియా పేపర్ ఎడిషన్‌లో ఒచ్చిన Scot's Bride of Lammermoor పుటలని దంతపు పేపర్ కట్టర్‌తో కోస్తూ కూర్చోవలసిన మనిషి జ్ఞాపకం తెచ్చుకొని బాయ్‌ని కేకేసి తన కళ్ళజోడు chest of drawers మూడో అరలో వుంచిన గంధపు పెట్టెలో ఉంది తీసుకురమ్మంటుంది. కాబోలు!

జగన్నాధాన్ని తప్పించుకుని దయానిధి దగ్గరగా ఒచ్చి, అకుల్ని అతని ఒంటికి రాస్తుంది కోమలి. అక్కడుండి యిక్కడలేని కోమలి గంతువేస్తూ ప్రకృతంతా వ్యాపిస్తుంది. అతడు వెనకాల తరమడం మొదలెట్టాడు, ఒక మహత్తర శక్తి వారిద్దర్ని ఎక్కడికో తోసుకు పోతోంది చోద్యం చూస్తూ. ఉడతల జంట వెంటపడింది. అది చిన్న కొలను; గడ్డి వయ్యారంగా నీళ్ళల్లోకి వొరిగింది. మాసిపోయిన అద్దంలో లాగా సూర్యబింబం నీళ్ళల్లో చలించకుండా. జలచరాలని రంగు రంగులుగా చలింపచేస్తోంది కోమలి అక్కడ పడిపోయింది అవయవాలు పట్టుతప్పి పోయి నిస్పృహగా వుండిపొయ్యాయి; చీరచుట్టువిడి ఒంటిని అంటి గడ్డిలో కలిసిపోయింది. అతను ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు; పచ్చగాజు పటుక్కుమంది. ఉడతలు సిగ్గుతో కొమ్మమీద దగ్గరగా జరిగాయి. నాలుగు కళ్ళూ వాళ్ళకే వొప్పజెప్పి

మూతులు బిగించుకుని రహస్యాన్ని తెలుసుకున్నట్లు నివ్వెరపోతూ – అతను కొమ్మను పీకి అవతల పారేశాడు, ఆమె రెండు కళ్ళలోకి తీవ్రంగా చూశాడు.

భరింపరాని సహజ సౌందర్యం అతన్ని శక్తిహీనుడ్ని చేసింది. అతనికి వస్తువులు కనబడక, చూపు తడబడుతోంది. కళ్ళు గట్టిగా మూసుకుని మూతిని సున్నాలా చుట్టుకుని;

"ఏంటది?" అంది కోమలి – మైకం చెందిన ఉడత కొమ్మమీది నుంచి పడింది. అర్థంలేని అయోమయపు మూగబాధ అది. గాజు పటుక్కుమన్న చోట రక్తం బొట్టు చూసుకుంది. లేచి కూర్చుంది, చెయ్యి వొదిలించుకుంది; ఆపలేని ఆయాసాన్ని ఆపుకుంటోంది. రెండు చెమట బిందువులు నుదుటినుంచి జారి కనురెప్పల్ని అంటి పెట్టుకున్నాయి – చెమట బిందువులో, ఆనందంతో మెరుస్తున్న కన్నీటి బిందువులో తెలియకుండా రెండు ఉడతలు దగ్గరగా ఒచ్చి చెవులు నిక్కబొడుచుకుని వింటున్నాయి.

ప్రశ్నలు అతని కళ్ళని కలవర పరుస్తున్నాయి. ఏం కావాలి? "ఎప్పుడు, ఎక్కడ?" ఈ రెండింటికీ సమాధానం. చేతిని చూసుకుని "రకతం" అంది. రుమాలుతో, తుడిచాడు – ఎరుపులేని, వోపిగలేని పల్చటి, ఎర్రటి రక్తాన్ని

"ఏంది? అల్లా చూస్తారు? అమ్మో–ఉడత!" అంటూ ఉడతలకేసి చూడమంది. ఉడతల జంట భయంతో దూరంగా గెంతింది.

ఉడతలాగే తనూ మొహం బిగించుకుంది. అప్రయత్నంగా అతని భుజంమీద చెయ్యివేసి పైకి లేవబోయింది. అతను చేతిని గట్టిగా పట్టుకోబొయ్యాడు. కాని అప్పుడే జడ మెడమీద నుంచి ముందుకు జారి అతని మొహాన్ని కప్పేసింది. "నీకూ నాకూ మధ్య నిశీధిలా పడ్డ నీ జడ" అన్న వాక్యం జ్ఞప్తికొచ్చింది.

"తప్పు–ఏంటది!" అని చిత్రంగా ముక్కుమీద వేలేసుకుంది. లేచి నిలబడింది "ఇస్" అని చప్పుడు చేసి, ఉడతల్ని దూరంగా తరిమేసింది. "రాతిరి నూతికాడ దీపం పెడతాగా.... రాతిరి" అని "రాతిరి"ని సాగదీసి ఉచ్చరిస్తూ కళ్ళు గట్టిగా మూసుకుంది. ఉడతలు అర్థమైనట్లు గుసగుసలాడుకుని, విసుగేసి వెళ్ళిపొయ్యాయి. కోమలి పడ్డచోట కోమలంగా ఒరిగిపోయిన గడ్డి మెల్లగా యధాస్థానంలోకి లేచి కదుల్తోంది. జలచరాలు అవతల ఒడ్డుకి నవ్వుకుంటూ వెళ్ళిపోయాయి. రంగులతో చీరలో దిగబడిపోయిన ఆకుల్ని, గడ్డిపోచల్ని అతను విడదియ్యడం మొదలెట్టాడు. లాక్కుని వెనక్కి అడుగేసి, పట్టు జారి కాలువలో పడింది కోమలి. అతను చెయ్యి పట్టుకుని పైకి లాగాడు. నోట్లోంచి నీళ్ళు ఒదిలేసింది; నీళ్ళకి తడవనంతటి తన ఒత్తయిన జుట్టుని తన చేత్తో వెనక్కి పర్దుకుంది తడి ఒంటిని చీరని అదిమేసి ఆరేస్తే గాలికి కాలవలో పడ్డ చీర మడత లాగైంది; బుజాల వొంపు వికృతంగా బైట పడింది. చలికి చలుస్తున్న చర్మం, ఆమెను గొట్టంలోంచి కడగడానికి బైటికి దీసిన, థర్మాస్ ఫ్లాస్కులా, పచ్చగా మెరిసేటట్లు చేసింది. ఒడ్డున మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించుకుని, ఒణికిపోతూ కూర్చుంది.

"సలి పుడుతోంది. – ఏదేనా తీస్కురండి – అబ్బ ఏంటది – మొగాళ్ళు, దూరంగా పెట్టుకాడి కెళ్ళండి"

దయానిధి అటూయిటూ దిక్కులు చూస్తున్నాడు. అతని కండువా తోట్లో చెట్టుకొమ్మని వదిలేశాడు. ఏం చెయ్యడం? చివాలున అతని పంచి గోచిలోంచి తొలగించి మొహం తుడుచుకుంది. రుమాలిచ్చాడు. తలకి చుట్టుకుంది. వస్త్రాలు లేని రోజుల్లో పూర్వీకులు ఏం చేసేవారో? చెట్ల మొదళ్ళు, ఆకులు – వీట్లతో తుడుచుకునేవారు.

ఎక్కడేనా అరటాకు దొరుకుతుందేమోనని దూరంగా చూస్తున్నాడు.

"ఇక్కడున్నారంటండీ నాన్నగా రొచ్చారు. మిమ్మల్ని తొందరగా రమ్మన్నారు... రండి రండి..."

వెన్కకి తిరిగాడు; సర్వీ చెట్టు వెనక నారయ్య.

"ఏం నారయ్యా – అప్పడే..."

"జట్కా బండిలో వొచ్చారండి – కాలవ కాదున్నారు. మిమ్మల్ని దబ్బున తీసుకురమ్మన్నారు."

కూర్చున్న కోమలిని చూశాడు నారయ్య. "నువ్వెందుకొచ్చా. యిక్కడికి?"

"నేనే రమ్మన్నాను" అన్నాడు నిధి.

ఆరేం రమ్మనలేదు – నేనే ఒచ్చా మా పొలంకాడికి – నా యిష్టం, నీ కెందుకు? అని ఒంకర మాటలతో అంది కోమలి.

నారయ్య కళ్ళల్లో కోపాగ్ని చల్లార్చుకుని, నవ్వుని బలవంతంగా అపుగుని, పాగా గుడ్డతీసి కోమలి ఒంటిమీద గిరవాటెట్టాడు.

"ఫీ–పాడు... అనుకుంది తనలో."

"ఏడిశావ్–నీళ్ళల్లో తడిపి ఆరేసుగుని కట్టుగురా, పద, వీపు పగలెయ్యమని చెబుతా మీ అమ్మతో –" అన్నాడు నారయ్య.

"అంత తొందరేమొచ్చింది నారయ్యా?" అని నిధి ప్రశ్నార్థకంగా అడిగాడు.

"నాకేం తెలుస్తుందండీ లెండి, వెడదాం."

ఇంతలో "పీతొచ్చింది. పీతొచ్చాడు" అని కేక వేస్తూ జగన్నాధం చక్కా ఒచ్చాడు.

"అదేంటయ్యా, పీతేంటి కుర్రాయనా? –" అని అడిగాడు నారయ్య.

జగన్నాధం జోరు తగ్గింది; గుటకలేసి –

"సుశీల పిత..." అన్నాడు.

"అంటే" అన్నాడు నిధి

"ఓస్ యింతమాత్రం తెలీదుటండీ–పిత–తండ్రి"

"సుశీల పితా–సుశీల నాన్నగారు – ఒచ్చారని తాత్పర్యం" అన్నాడు.

"గోవిందరావ్ మామయ్యా!"

"అతగాడు సుశీల పితైతే అతగాడే – ఓహో గోపికా జలక్రీడా ఫలితంబా యిది. ఓహో, శ్రీ కృష్ణుం డెవ్వరొక్కో...! అంటూ కోమలికేసి చూస్తున్నాడు."

"ఏంటయ్యా ఆ పిచ్చివాగుడు?"

"దగ్గరకొచ్చావంటే సూస్కో!" అంది కోమలి జగన్నాధాన్ని బెదిరిస్తూ.

"మనకి నీళ్ళంటే కించిత్ భయం. అందులో నీళ్ళాడిన అంగనలంటే మరీని పాపం రెవిక లేదుకాబోలు. శివదీక్షాపరురాలనురా – చీర ఎంతైనా విడవనురా – ఇదుగో, ఈ చీర చీనాంబరం ధరింపుము" అని చొక్కా తీసేసి కోమలికిచ్చి, తొడుక్కోమని సంజ్ఞచేశాడు.

"ఛీఛీ పాడు పిల్లడ..."

"మీరు రండి – అది బట్టలార బెట్టుకుని ఇంటి కెడుతుందిలెండి–" అని యిద్దర్నీ కదిపాడు నారయ్య.

"ఎల్లిపోతుండారా! –" అంటోంది కోమలి.

"పోయెనయ్యో ఇప్పుడు నమబాసి –" అంటూ పాడుకుంటూ జగన్నాధం పరుగెత్తాడు.

పిక్‌నిక్ సరంజామా అంతా కట్టివేసి అందరూ కాలవ వొడ్డుకి నడవటం సాగించారు. సుశీల అందరికంటే – ముందుగా నడుస్తోంది విడిగా

అమృతం ఫ్లాస్కు పుచ్చుకుని, కండువా బుజాన్న వేసుగుని మెల్లగా నడుస్తోంది, పక్కనే నాగుమణి.

"కాస్త టీ తాగు బావా! –" అని ఫ్లాస్కుతీసి మూతలో కొంచెం పోసిచ్చింది.

"ఎక్కడికెళ్ళావు బావా!"

అతనేమీ మాట్లాడలేదు.

"ఇంకెక్కడికి? ఆ కోమలితో సరసాలు" అంది నాగుమణి.

సుశీల జోళ్ళో ఇరుక్కున్న మట్టిబెడ్డతీస్తూ నిలబడి వాళ్ళని కలుసుకుంది.

"ఆ పెంటముండతో సరసాలా?" అంది గీర్వాణంగా

"తప్పు సుశీలా పెంటదెల్లాగైంది? ఏదో మనకి నాలుగు ఇంగ్లీష్ ముక్క లొచ్చునుగదా అని –" అంటోంది అమృతం.

"నువ్వు చెప్పకే అమృతం... నీకూ, మీ ఆయనకి పెంటవాళ్ళ మధ్య ఆ పల్లెటూళ్ళల్లో వుండడం మరిగి, వాళ్ళు అందరూ దేవకన్యకలలా కనిపిస్తారు."

"మేమేం పెంటవాళ్ళ మధ్యలేం మావూరిలో అరవై బ్రాహ్మణ కొంపలున్నాయి. నీలా డాబులు చెయ్యకపోతే సరా–" అంది అమృతం.

"పల్లెటూరి మొద్దువి. నీకు మాట్లాడ్డం తెలిస్తేగా –"

"చూశావా బావా, ఎంతలేసి మాటంటోందో... తన్ని ఏమన్నానని? తనకీ గర్వం అంతా తండ్రి తాశిల్దారనేగా. అవును మరి మర్యాదగా సంసారంచేసే నాబోటి మొద్దులు నీలా గడుసుగా ఎట్లా మాట్లాడగలరులే"

"పోదూ, ఎల్లాగో సంపాదించావు, వో మొగుణ్ని."

"పోనీ–నీకా మొగుడూ లేడుగా–" అంది అమృతం.

"మొగుళ్ళ కేం! కట్నాలు పారేస్తే కావల్సినంతమంది."

మధ్యలో నిధి అందుకున్నాడు – "ఇంతకీ మీ దెబ్బలాట కోమలి గురించి, మీరు విన్నట్లా చూస్తామన్నారని, నే తీసుకొస్తే, మీరు చేసే పని యిదా?"

సుశీల అంది... మాకేం తెలుసు. కోమలి కోమలంటే ఏ రంభో తిలోత్తమో అనుకున్నాం –

"ఊర్వసో..." అంది నాగుమణి.

"మీ ఎవ్వరికీ కోమలి నచ్చలేదా?" అని అడిగాడు నిధి.

"మా కిది క్వశ్చన్ పేపరా ఏమిటి?" అంది సుశీల.

"నీకెల్లా నచ్చింది?" అంది నాగుమణి.

"బావని-"నువ్వు" అంటున్నావే?" అంది.... అమృతం.

"నాకు నచ్చలేదు" అని సుశీలా, నాగుమణి అన్నారు.

"నాకు నచ్చింది బావా–"

"నే నేమీ అనలేదు" అన్నాడు నిధి.

"అనక్కర్లేదు. తెలుస్తూనే వుంది. మీ అమ్మబుద్ధు లెక్కడికి పోతాయి? నీ కట్లాంటివాళ్ళే నచ్చుతారు" అంది సుశీల కసిగా

"సుశీలా!" అన్నాడు కోపంతో కళ్ళు పెద్దవిచేసి.

"ఏమిటి సుశీలా, అట్లాంటిమాటలు? చచ్చి స్వర్గానవున్న అత్తయ్యని."

దయానిధి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. కోపంతో సుశీల పీక నులమాలను కున్నాడు. ఎట్లాగో అంతా మింగేసుకొని, తలవొంచుకుని, వాళ్ళల్లోంచి విడిపోయి, వొక్కడూ చరచరా నడిచిపోయ్యాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. కాలవొడ్డుకి చేరుకున్నారు.

గోవిందరావుగారు, దశరథరామయ్యగారూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"అమృతం – మీ అత్తగారికి కొంచెం సుస్తీ చేసిందట నిన్ను తీసుకెళ్ళడానికి కాంతారావు వచ్చాడు. సాయంత్రం ఆరుగంటల బండికి ప్రయాణం అంటున్నాడు. ఓ పదిరోజులపాటు అందరూ వుంటారనుకున్నాను" అన్నాడు దశరథరామయ్యగారు అమృతాన్ని సంబోధిస్తూ.

"అల్లాగా... ఐతే వెళ్ళిపోవాలి మామయ్యా – మీ రందరూ మా ఊరు రాకూడదా ఏమిటి?" అంది.

"అట్లాగే వస్తానమ్మా, ఇంక రిటైరయిం తర్వాత చేసే పనే అది ఓ ఏడాది మీ ఉళ్ళో మకాం" అన్నాడు.

"ఏడాది కాకపోతే, పదేళ్ళుండండి – మాకేం బరువు కారు. నే బైలుదేరేప్పుడే అత్తగారు కొంచెం నలతగా వున్నారు" అంది.

"అరరే! సుశీలతోపాటు నువ్వుకూడా మా ఊళ్ళోనే వో పదిరోజులుం టావనుకున్నాను. అత్తగార్ని మీ ఆయన చూసుకోలేడూ?." అన్నాడు గోవిందరావుగారు.

"ఏదీ... పాపం ఆయనకి తీరికెక్కడుంటుంది? పగలల్లా పొలంలో సరిపోతుంది."

అంటూ అమృతం జెట్కా ఎక్కింది. జగన్నాథాన్ని బండియెక్కమంటోంది.

"పోనీ, అతను తరువాత రాకూడదు?" అన్నాడు నిధి.

"మమ్మల్నందర్నీ ఉండమంటావు – నువ్వు మా ఊరు రాకూడదా ఏమిటి బావా! పట్నం వెళ్ళేటప్పుడు దిగరాదూ? ఇదిగో స్కూల్ ఫైనల్ గట్టెక్కితే, చదువు పట్నంలో నీదగ్గర వుంటాడులే" అంది.

"అమృతం–వ్యవహర్తే –" అన్నాడు గోవిందరావు.

"ఇంకా నయం –" అన్నాడు దశరథరామయ్యగారు. సుశీలా, అమృతం, జగన్నాథం, గోవిందరావుగారు బండిలో యెక్కారు. బండి కదిలింది. నాగుమణి టికారీ కోమల్ని తీసుకుని పడవలో వెనకాల రావడానికి నిశ్చయమైంది. నిధి వారయ్యతో కోమల్ని జాగ్రత్తగా పడవలో తీసికెళ్ళి వాళ్ళింట్లో దింపమని చెప్పి, తండ్రితో కలిసి కాలవగట్టున నడవటం సాగించాడు. రెండో బండి, వాళ్ళ వెనకాల మెల్లగా నడిపించుకు ఒస్తున్నాడు బండివాడు.

"ఏం నాన్నా, అకస్మాత్తుగా వచ్చావేం? గోవిందరావుగారు నువ్వు యెక్కడ కలుసుకున్నారు?"

"నరసమ్మని, సుశీలని తీసికెడదామని కాంప్‌లోకే వచ్చేశాడు. ఐతే – నువ్వు సుశీలని పెండ్లి చేసుకుంటావా!"

ఈ ప్రశ్నకి సమాధానంకోసం, కాంప్ ముగించుకుని నాన్న వచ్చేశాడా అనుకున్నాడు నిధి.

"ఏం?"

"ఏదో ఒకటి తేల్చెయ్యాలి."

"సుశీల నన్ను చేసుకుంటుందా అని ఆలోచించారా?" అన్నాడు నిధి.

"ఆ అనుమానం నీకెందుకు కలిగింది?"

"నన్ను ఒక మాటంది ఇందాక, దాంతో సుశీల వైఖరి తెలుసుకున్నాను. నాకూ, ఆ అమ్మాయికి సరిపడదు."

"ఏమంది?"

"నాకు ఆ మాటలు మళ్ళా అనుకోవడం యిష్టంలేదు. బాధగా ఉంటుంది."

"వాళ్ళకీ యిష్టంలేనట్లుగానే తేల్చారు." అన్నాడు దశరథరామయ్యగారు.

"బ్రతికాం."

"అందుకనే ఒచ్చేశాను."

"అంటే?"

"ఏమీలేదు, మాధవయ్యగారని, పోలీస్ ఇన్‌స్పెక్టర్. కొత్తగా బదిలీ అయిందిట. ఒక్క కూతురూ, కొడుకూ, నాలుగువేలదాకా కట్నం యిస్తానని కాంప్ దగ్గిరికి వొచ్చాడు. రేపే పిల్లని చూడడానికి వెళ్ళాలి."

"ఇప్పుడు నా పెళ్ళికి తొందరేం నాన్నా?"

"తొందరే, పెద్దమనిషికి మాటిచ్చాను, రేపే వెళ్ళి చూసి, వొంకలెట్టక ఒప్పేసుగురా అప్పుడే – నా ఆఫీసర్, మీ వాడి పెళ్ళి దబ్బుని కానిచ్చెయ్యండి – మేళం ఏర్పాటు చెయ్యమంటూ, అల్లరి మొదలెట్టాడు."

"ఆఫీసర్ల సౌకర్యం కోసం, పిల్లల జీవితాలు నిశ్చయం చేసెయ్యడం – యింతే తండ్రుల బాధ్యత!" అనుకున్నాడు నిధి.

"ఆఫీసర్‌కి పార్టీ యిద్దాం కావాలంటే" అన్నాడు నిధి.

"నీ అభ్యంతరం ఏమిటి?"

"ప్రాక్టీస్ పెట్టింతర్వాత చేసుకోకూడదూ?"

"అంతవరకూ ఆ పిల్లని అట్టేపెట్టరు – ఓ వేళ పెట్టినా, వాళ్ళు మనస్సు మార్చుకోవచ్చు."

"ఆ పిల్ల కాకపోతే, మరోపిల్ల."

"అంత సులభం కాదు."

"అంటే?"

"నీకు పెళ్ళికావడం వో సమస్య అని మరిచిపోకు. నీకుమట్టుకూ తెలిదూ?"

"ఏమిటి నాన్నా–దాచకండి."

"నీ కింతవరకూ సంబంధాలు ఎందుకు రాలేదో ఆలోచించావా?"

"లేదు"

"ఐతే, ఆలోచించు యిప్పుడేనా, మన కుటుంబ వ్యవహారాలు తెలిసినవాళ్ళు ఎవ్వరూ పిల్లనివ్వరు. మాధవయ్యగారు కొత్తగా ఒచ్చాడు, గొడవలు ఇంకా ఆయన చెవినపడి సంబంధం బెసికిపోక ముందే నిశ్చయం చేసుకుంటే మంచిది. లేకపోతే సమస్యే."

నిధి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి తుడుచుకున్నాడు.

"దానికీ దీనికి సంబంధం ఏమిటి నాన్నా?" అన్నాడు.

"పిల్లనిచ్చేవాడు కుటుంబ మర్యాదలు చూస్తాడు. పెళ్ళికొడుకు తల్లి ఫలానా అని చెప్పుకుంటారు."

"ఇంక చెప్పకండి నాన్నా... ఇవి ఎక్కడ తెలిసిపోతాయో అని భయపడుతూ కాపురం ఎంతకాలం చెయ్యగలను? ఇవి లెక్క చెయ్యకుండా నన్ను కోరుకుని చేసుకునే స్త్రీ వచ్చినప్పుడే చేసుకుంటాను."

"ఇట్లా ఏ స్త్రీ రాదు; యింతవరకూ రాలేదు."

"వస్తేనే చేసుకుంటాను."

"కోమల్నా...? మాట్లాడవేం?"

"తప్పా!"

"నేను బ్రతకడం నీకిష్టం లేదా?"

నిధి కన్నీరు నిలుపుకోలేక పొయ్యాడు. కండువాతో కళ్ళు తుడుచుకుంటూ బండెక్కాడు. దశరథరామయ్యగారు కూడా ఎక్కారు. బండి జోరుగా వెడుతోంది. సూర్యుడు ప్రయాణంచేసి అలసిపోయి నట్లుగా, మొహం ఎర్రబడి, మేఘాల వెనక విశ్రాంతిగా దిగుతున్నాడు. దూరంగా కాలవ మదుపులో పడవలు కనిపిస్తున్నాయి.

ఇంటికి చేరుకున్నారు.

దయానిధి తోచకుండా ఒక్కడూ గదిలో కూర్చుని మెడికల్ ఎసోసియేషన్ జర్నల్ పేజీలు తిప్పుతున్నాడు. సుశీల ఏదో కావల్సి వచ్చి, ఆ గదిలో కొచ్చింది.

"సుశీలా. నీతో మాట్లాడాలి" అన్నాడు.

"నాతో ఏం మాట్లు....?"

"మీ నాన్న నీ పెళ్ళి విషయం ఆలోచించాడా?..." అని మొదలెట్టాడు.

"నాతో ఏం మాట్లాడలేదు, నన్ను చేసుకోవాలని బెంగగా వుందా ఏమిటి? కోమలుందిగా...."

"నీ అభిప్రాయం ఏమిటి పెళ్ళి విషయంలో?..."

నరసమ్మగారు చక్కా వచ్చింది.

"మేం వెడుతున్నాం, రాత్రి తొమ్మిదిగంటల బండికి పట్నం వెళ్లేటప్పుడు మా ఊరు రాకూడదూ? పెళ్ళి విషయానికి ఇప్పుడు తొందరేం? వాళ్ళ నాన్న చదివిస్తాడు. ఎవడో ఒకడు రాసేవుంటాడు."

"బంధువుల్లో సంబంధాలు మంచివి రావంటారు. అందుకే..." అంది సుశీల.

"ఇంతకీ ఘటనుండాలి...." అని పూర్తిచేసింది నరసమ్మగారు.

ఇంతలో కాంతారావు, అమృతం గదిలో కొచ్చారు.

వెళ్ళొస్తా బావా... మావారు... వుందునుగాని అత్తగారికి ఒంట్లో బాగాలేదట...

"ఏం జబ్బు?"

"జలుబు చేసింది – ఊ, దగ్గు..." అన్నాడు కాంతారావు. అతనిది పెద్ద మధ్యపాపిడి జుట్టు, గుండ్రటి మొహం. లావు మెడ, విశాలమైన దవడలు.

"నువ్వు మాతోవచ్చి మందివ్వకూడదా ఏమిటి?" అంది అమృతం.

"అత్తగారిమీదే ఎక్స్పెరిమెంటా!" అన్నాడు నిధి.

అందరూ నవ్వితే కాంతారావూ నవ్వాడు.

సంభాషణ జరగడంలేదు. కాంతారావు చేతులో ఏదో పుచ్చుకుని భార్యని బండికి టైమైందంటూ వీధిలో కెళ్ళాడు.

"ఏదో మాట్లాడుకుంటున్నట్లున్నారు. మరి నే వెళ్ళిరానా?" అంది అమృతం.

"మాటలు మీకు గానీ మాకేముంటాయి?" అంది సుశీల.

"మా సుశీల వెర్రిపిల్ల – ఏమీ తేలీదు, కోపం తప్ప" అంటూ సుశీల నడుంచుట్టూ చెయ్యేసి బుజ్జగించింది. అమృతం "సుశీ – మరి నే వెళ్ళిరానా? – ప్రతిదానికి కోపం తెచ్చుకోకూడదమ్మా వెర్రిదానా..." అని దగ్గరగా తీసుకుని కౌగలించుకుంది.

జగన్నాథం ప్రవేశించి "పార్టింగ్ సీన్స్" అని Good bye. డాక్టర్ జీ, ఈ వియోగ జలధి..." అనే కీర్తన మొదలెట్టాడు.

"నేను మిమ్మల్ని వొదల్ను, మళ్ళా వస్తానండోయ్ – పెళ్ళికి" అని పూర్తిచేశాడు.

"ఎవరి పెళ్ళిరా పిచ్చి వెధవా?" అంది అమృతం.

"మందేలే..." అని విష్కృమించాడు జగన్నాథం.

"సుశీలా, నే వెళ్ళిపోతున్నాను. ఒక్కసారి నవ్వవూ?" అంటూ గడ్డం తనవైపు తిప్పుకుని నవ్వించబోయింది అమృతం.

సుశీల బలహీనంగా నవ్వింది.

"చూసుకో అద్దంలో, – ఎంత బాగున్నావో కదు బావా?"

సుశీల వెళ్ళిపోయింది. దయానిధి లేచాడు.

"ఇంత తొందర్లో వెళ్ళి పోతావనుకోలేదు అమ్ములూ!" అన్నాడు నిధి.

"ఏం చేస్తాం. దేశాలు తెగించిపోవటం లేదుగా. జ్ఞాపకం ఉంటావా నేను?" అంది అమృతం.

"నువ్వెళ్ళిపోతే దిగులుగా ఉంటుంది."

"నీకేం దిగులు బావా? మొగాడవు—చదువు, ఉద్యోగం బోలెడుంటాయి... ఎందుకు బెంగ!"

"అందరూ వెళ్ళిపోతే ఇల్లు బావురుమంటుంది. ఎప్పుడైనా ఉత్తరం రాస్తుంటావా?" అన్నాడు.

అమృతం చిత్రంగా నవ్వింది.

"ఉత్తరాలెందుకు బావా? జ్ఞాపకాలుండాలి కాని"

"నీ డబ్బు..."

మళ్ళా నవ్వింది.

"నీ దగ్గర ఉండకూడదా ఏమిటి? ఈ విధంగా నే జ్ఞాపకం ఉంటానేమో... ఇద్దుగానిలే..."

నిశ్శబ్దం!

బీరువా కింద నుంచి ఎలుక తొంగిచూసి పారిపోయింది ఎందుకో.

అతని కళ్ళలోకి చూసి, మొహం తిప్పేసుకొని వెళ్ళిపో బోయింది అమృతం.

"మీ ఆయన చాలా మంచివాడులా ఉన్నాడు."

"నువ్వింక ఆయన్నెరగవ్. చాలా మంచివారు. నే వెళ్ళనా! మా ఊరు తప్పకుండా రావాలి..."

"కమ్మారమ్మాయిని చూపిస్తావా?"

"పో, కొంటెబావా..."

అమృతం, జగన్నాథం, కాంతారావు వెళ్ళిపోయారు.

రాత్రి ఎనిమిదింటికే అందరి భోజనాలు అయ్యాయి. రైలుకి జట్కాబండి సిద్ధంగా వుంది. సామానులు ఒక్కొటొక్కటే నారయ్య బండిలోకి జేరేస్తున్నాడు. నిధి పెళ్ళి విషయం ఒకటి రెండుమార్లు నరసమ్మగారు మాట్లాడబోయింది కాని, ఆ విషయం ముచ్చటించేందుకు గోవిందరావు ఉత్సాహం చూపించలేదు.

దశరథరామయ్యగారన్నాడు "మా వాడి పెళ్ళి ఏప్రెల్‌లో ఏర్పాటుచేస్తాం, నరసమ్మను రెండు నెలలేనా ముందుగా పంపించవయ్యా?"

"ఐనా రోజుపెళ్ళి—మగ పెండ్లి వారికేం పనులుంటాయి?" అన్నాడు గోవిందరావుగారు. "ప్రాక్టీసు ఎక్కడ పెడతాడు?"

"ఏదీ, ఇంకా పూర్తికాందే—"

గడియారంకేసి చూస్తూ చేసే సంభాషణ అది. నరసమ్మగారు, గోవిందరావుగారు బండెక్కారు.

"మాతో రాకూడదూ?" అంది నరసమ్మగారు.

ఈ ఊరు వొదిలిరాకేం? అన్నాడు గోవిందరావుగారు. సుశీల వీధిలోకి వెడుతూ గదిలోకొచ్చి, తను తీసుకున్న రెండు పుస్తకాలూ నిధికి యిచ్చేసింది.

"కావాలంటే నీ దగ్గరే వుంచుకో. తరువాత పంపుదువుగానిలే" అన్నాడు నిధి.

"అక్కరలేదు."

ఏదో చెప్పాలనుకుని నిల్చిపోయింది.

"నేనంటే కోపమా?" అని అడిగింది.

"ఎందుకు?"

"ఉంటే చెప్ప..."

"లేదు, లేదు – నేనంటేనో...?"

"........."

ఏదో చెప్పాలని బాధపడింది. చెప్పలేకపోయింది. అతను స్టేషన్‌కి వొస్తానన్నాడు, చీకట్లో – చలిలో ఎందుకు ఒద్దన్నారు. బండి కదిలింది.

దశరథరామయ్యగారు పక్కేసి, పేపర్ చదువుతూ కళ్ళుమూశాడు. పదికావస్తోంది. నారయ్య చాపకోసం గది మూల వెదుకుతున్నాడు. దయానిధి దొడ్లోకెళ్ళి పొయ్యి ముట్టించి, కాగుతో నీళ్ళుపెట్టి కాగేదాకా సుశీల తిప్పి యిచ్చేసిన పుస్తకాన్ని ఏమీ తోచక విప్పిచూడడం మొదలెట్టాడు. చివరి పేజీలో సుశీల తనపేరు నాలుగుసార్లు రాసుకుంది. రెండుసార్లు రాసి కొట్టేసింది, ఒకచోట ఏదోరాసి, తెలీకుండా పూర్తిగా కొట్టేసింది. అతనికేమీ అర్థంకాలేదు. అహం అనేక విధాలుగా బైటపడుతుంది. ఎవరైనా కలం యిచ్చి, వ్రాయమంటే మొట్టమొదట తమ పేరే రాసుకుంటారు. స్వార్థం బైటపడుతుందని భయపడి, కొందరు ఎదుటివారి పేరు వ్రాస్తారు.

రెండో పుస్తకంలో సుశీల కాలేజి స్నేహితులలో తీయించుకున్న గ్రూప్‌ఫొటో ఉంది. అటిద్దరూ, యిటిద్దరూ, మధ్య తనూ ఫొటో వెనకాల "నేనెవర్ని చెప్పకో" అని రాసుకుంది. అది పుస్తకంలో ఎందుకు వొదిలేసిందో తనకి అర్థం కాలేదు పొరబాటేమో!

నీళ్ళు కాగాయి. దొడ్లోకెళ్ళి స్నానం చేశాడు. పల్చటి తెల్లచొక్కా తొడుక్కున్నాడు... తెల్లపంచి గూడకట్టుకోసం తీశాడు. చాకలి ఆరేసిన కంపవాసనా, క్లోరిన్ వాసనా ఆ పంచిని అల్లాగే ఉన్నాయి. ఎంతో జాగ్రత్తగా పాపిడి తీశాడు. పట్నంనుంచి తెచ్చిన సెంట్ కొంతరాసుకున్నాడు జగన్నాథం చెట్టుచాటు నుంచి దొంగతనంగా తీసిన కోమలిఫోటోని "డెవలప్" చెయ్యడం వీలుపళ్ళేదు, ప్రొద్దున చెయ్యొచ్చు. బుజాన్న తువ్వాలు వేసుకొని హాల్లోకొచ్చాడు. నారయ్య అరుగుమీద పడుకున్నాడు. తలుపు దగ్గరగా జేరేసి వీధిలోకి నడిచాడు. రాళ్ళ క్రింద యిసిక చల్లగా వుంది. తోగప్పనాయుడుగారి మేడలో దీపాలే లేవు. సందులోకొచ్చాడు. రెండు మేకలు పందుమొగని చూరుకిందకి జరిగి జాలిగా అరుస్తున్నాయి. అంతటా చల్లగా నిశ్శబ్దంగా ఉంది. చలికి తట్టుకోలేక మేఘాలు కూడ చంద్రుడికి దూరంగా కదిలి పోతున్నాయి. ఒంటిగా వున్న చంద్రుడు అనంతాన్ని నిర్మలంగా చేశాడు. నక్షత్రాలు మెరవడం మానుకున్నాయి.

కామాక్షి ఇంటి దొడ్డివెంపు తలుపులు దగ్గరగా జేరేసి ఉన్నాయి. సందులోంచి తొంగిచూశాడు. నూతి పళ్ళేం మీద సన్నగా తగ్గించినదీపం కనిపిస్తూ వుంది. రాత్రి దీపం పెడతానంది కోమలి అంటే ఎవ్వరూలేరన్న మాటే. వాళ్ళమ్మ ఎక్కడుందో – పిలవడమా, సకిలించడమా, ఈలెయ్యడమా, తలుపు తట్టడమా? తలుపు తెరచుకొని నిర్భయంగా లోనికి వెళ్ళటమా? కామాక్షంటేనే భయం? కోమలంటేనా? లేక తనంటే తనకే భయమా? – నేను బ్రతకడం యిష్టం లేదా? అది సంఘం, సంప్రదాయం తన తండ్రిచేత అడిగించిన ప్రశ్న. మరి దానికి తర్కంలేదు. వాదంలేదు. ఎవ్వరూ ఆపలేని సూర్యోదయం లాంటిది. ఆ "పెంట ముండతోనా సరసాలు?" సౌందర్యానికి అసూయ చేసిన నామకరణ. దాంతో ఏం సుఖపడతావు బావా? పాపం సుఖపడడం అటే మనుషులకు అంతభయం. ఎవ్వరూ ఆచరించలేని ఉన్నత ఆదర్శాలు మాకక్కరలేదు. మాకు రెండో రకం – చవకవి – యిప్పించండి. భరింపరాని మహత్తర సౌందర్యం బాబోయ్, మాకొద్దు దానికి మేం తగం–పోనీస్తురూ! సంసారం పక్షం చాల్లెస్తురూ... (కూర్మయ్య) అలి మర్కటం, యిల్లు యిరుకు, పెళ్ళాం కోతి... వీటిని కోరుకున్నారు. మన పూర్వులు ఫర్లాంగు దూరంలో వున్న చెరువు నుంచి రెండు బిందెలు నీళ్లు తనే మోసుగొచ్చి, ఇరవైమంది జట్టీలలాంటి మొగాళ్ళకి అన్నం వొండిపారేసి, సంవత్సరం అయ్యేటప్పటికల్లా పిల్లని కంటూ మీ కెన్నేళ్ళని స్త్రీని, ఎవ్వరూ అడగనక్కర్లేదు ఎంతమంది సంతానం ఉంటే అన్నేళ్ళు సరేనా? ముసలిది అవకుండానే చచ్చిపోవాలి మొగుడుకంటే ముందుగా హిందూ స్త్రీ, కోమలి హిందూ స్త్రీకాదు. కోమలి అసలు స్త్రీయే కాదు. అన్ని శక్తుల్నీ తనలో కలుపుగుని దహించేసే ఒక జ్వాల. సంప్రదాయాలు, ఆచారాలు, నైతిక విలువలు, కట్టుబాట్లు – అన్నింటినీ ముంచెత్తి వేసే మహా సముద్రంలోని అఘాతం. అందుకనే లోపలి కెళ్ళడమంటే అంత భయం.

భయంతో నరాలన్నీ కదిలిపోయి మళ్ళా కొత్త పద్ధతిలో సర్దుకున్నాయి. ఎవరో, ఎప్పుడో సహాయపడతారన్న ఆశ ఉన్న మనుషులే భయపడేది. ఎవరూ లేరు, ఎప్పుడూ రారు – అని నిర్ధారణ జరిగిపోయి ఏకాకి అవగానే, భయం పోతుంది. తను వొక్కడే తనకోసం జీవించి ఈ శక్తులను ఎదుర్కోవాలి. స్నేహితులు, బంధువులు, గురువులు, గ్రంధాలు, సలహాలు, వేదాంతాలు – అన్నీ కడసారి యధార్థాన్ని యెదుర్కొన్నప్పుడు వృధా, అదే కొత్త బలం, నూత్న వికాసం. అది మొండి – గుడ్డి ధైర్యం కాదు. ఇంద్రియాలన్నింటినీ ఏకగ్రీవంగా జీవింపచేసి, సర్వశక్తుల్నీ ఖంజాయింపుజేసుకుని, మూడో నేత్రం తెరచుకొని ఒక్కసారిగా, చెలరేగిన సాహసం అది.

తలుపు తెరుచుకుని లోపలికి వెళ్ళాడు దయానిధి.

అంతా నిశ్శబ్దం వెన్నెట్లో వొస్తువులన్నీ తెల్లటి పొర కప్పుకున్నట్లుగా ఉన్నాయి. నూతి పళ్ళేం పక్కనే మంచం సగం మండువాలోనూ సగం బైట వెన్నెట్లోనూ వాల్చివుంది. ఆ మంచంపైన కోమలి పడుకునివుంది. అది, వూడిన తాళ్ళు క్రిందికి వేళ్ళాడుతున్న నులకమంచంపైన దుప్పటి కూడా లేదు. తలగడ అనుకోవాల్సిన

చోట గట్టి బద్దీ తలకింద వుంది. దానిమీద నుంచి వూడిపోయిన జడ కిందికి వేళ్ళాడుతూంది. కుడిచెయ్యి మెడకింద, ఎడంచెయ్యి మడిచిన మోకాలుమీదా వున్నాయి – చీరకొంగు పొత్తి కడుపుమీదకి జారి గాలికి కదుల్తోంది. ఇంటి కప్పు మీదనుంచి జారిన వెన్నెల వెలుగు నుదుటిమీద గీతలా పడుతోంది. అనాడు సౌందర్యం తన యాత్ర ముగించుకుని పవ్వళిస్తోంది.

పరిమళం బరువుకీ రంగు వొత్తిడికీ తట్టుకోలేక వూడి పడిపోయిన అడవి పువ్వు; పర్వత శిఖరాన్నుంచి జారి పడిపోయిన మంచు ముద్దలోని నిర్మలత్వం; నిశీధిలో సృష్టివేసుగున్న మంటలో నడిజ్వాల అర్ధరాత్రి జీవులు కన్న స్వప్నంలోని మూగ బాధ.

మంచం తలాబు దిక్కున కూర్చుని రెండు చేతులూ రెండు బద్దీల మీదా అనించి, వెనుకనుంచి ఆమె మొహంలోకి చూశాడు. విశ్వ గానానికి లయ శ్రుతులలా వినిపిస్తున్న శ్వాస అతన్ని చుట్టుకుంది. ఆకస్మికంగా ప్రాణం తెచ్చుకున్న స్వప్నకాంత శరీరం మోయలేని వేడి, సముద్ర కెరటాలపై బహిర్గతమైన వేడిలా లేస్తోంది. వేసంగి సాయంత్రం వాన వెలసిం తర్వాత భూమి వొదిలేసిన వేడిలాంటిది. ఆ మంట. ఎక్కడా అనించడానికి అతని చేతులు రావడం లేదు. వేసంగి సాయంత్రం, వడగళ్ళ వానకి సరస్సులో చేపలు కదిలినప్పుడు బైటపడే పరిమళం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. ఏదో శక్తి అతనిలో ప్రవేశించి తన్ని కార్యశూన్యుణ్ణి చేసింది. ఏదో కాంతి కిరణం అతని చీకటి హృదయాన్ని మెరుపులా వెలిగించింది. కోమలి అతనిలోకి ప్రవేశించి అన్ని తలుపులూ మూసేసి నట్లనిపించింది. ఎక్కడ తాకినా అన్ని రేకులూ వూడిపొయ్యే పుష్పం. వేలుతో తాకితే, అంతా వొడిలి విడిపోతుంది; రంగులన్నీ పోతాయి. నశింపైపోతుంది.

చూడలేక అతని కళ్ళు చిత్రంగా మూతలు బడ్డాయి. మూర్ఛపోయి తెప్పరిల్లుకున్నాడు. అతని శరీరాన్ని చూసుకున్నాడు సిగ్గేసింది. తనది కాదు ఆ శరీరం. ఎక్కడికో వెళ్ళిపోయింది. దాన్ని వెదికి తెచ్చుకోవాలి. పారిపొయ్యే శరీరాన్ని పట్టుకోవడం ఆత్మ చేసే పనులలో ఒకటా? శరీరం "ఇది అన్యాయం! నే–నీ పని చెయ్యలేను. నేనే సౌందర్యం. నేను ధ్వంసం చేసుకోలేను. ఇతరులనీ ధ్వంసం చెయ్యలేను; నన్ను వొదిలెయ్యి" అంటోంది.

అతనికి భయమేసింది. సౌందర్యాన్ని ఎదుర్కొన్న మనిషి అతను. గొప్ప సౌందర్యం అనుభవం కాదు. గొప్ప సౌందర్యం అంటే ఐపోవటం కాదు; ముందు కావటం కాదు; ఎల్లప్పుడూ "అవుతూండటం" హద్దులు లేనిది అనుభవం. గొప్ప సౌందర్యానికి హద్దులు లేవు. రెండింటికీ శరీరం హద్దు కాదు; కాకూడదేమో–శరీరం–మరో శక్తి విడిపోయిన, ఆ అనుభవానికి హద్దులులేవు. లోకం అంతటా వ్యాపించి తనలో ఇముడ్చుకున్న శక్తి.

అతను తేరుకున్నాడు నవ్వొచ్చింది. శరీరంలో వున్న మనుషులందరూ పిచ్చివాళ్ళు – అనిపించే సమయం అది. ఆ అనుభవం అతని కక్కర్లేదు. అనుభవానికి హద్దులులేవు, కవర్లో వున్న ఐదునోట్లూ దిండుకింద వుంచి మెల్లగా లేచి వీధిలోకెళ్ళి తలుపులు దగ్గరగా మూశాడు.

★ ★ ★

# మూణ్ణాళ్ళ ముచ్చట

శుక్రవారం

రాజభూషణం సిగిరెట్ నోట్లో పెట్టుకుని అగ్గిపెట్టె కోసం దిక్కులు చూస్తున్నాడు.

"అగ్రిమెంట్ ప్రకారం ఇన్స్పెక్టర్‌గారు మొగపెళ్ళి వారికి అగ్గిపెట్లు సప్లయి చెయ్యరు కాబోలు" అన్నాడు.

"మీరు ఫిలాసఫీ చదువుతూ సిగరెట్లేమిటండీ – చుట్టయినా బాగుండిపోను" అన్నాడు, నిధి అన్నగారు రామానందం.

"హిందూ దేశంలో వేదాంత దృష్టికి బహిర్గత చిహ్నం చుట్టకాదండోయ్! చుట్ట నా వార్ధక్యానికి చిహ్నం, వార్ధక్యం వేదాంతాలకి చిహ్నం. యవ్వనానికీ, వేదాంతానికీ అతగదు, అతికించడం కొంతవరకూ సిగరెట్టు చెయ్యగలదేమో ననుకుంటున్నాను; హిందూ, ముస్లిమ్ కలయికకి బీడి కాల్చినట్టు!" అన్నాడు రాజభూషణం.

రాజభూషణం, ఫిలాసఫీ ఆనర్స్ రెండో ఏడు చదువుతున్నాడు పట్నంలో; మనిషి చాలా ఎత్తరి; కసరత్తు చేసే వ్యక్తికి వుండవలసిన ఛాతీ వుంది. కండలు తిరిగిన జబ్బలూ అవీ కనపడాలని, వొళ్ళు కనిపించే పల్చటి లాల్చీ వేసుకుంటాడు. ప్రపంచాన్ని ధిక్కరించినట్టుగా బైటికి పొడుచుకొచ్చిన గడ్డం, ఏదో కొంటెమాటాడేందుకు సిద్ధపడినట్లుగా వంకర తిరిగిన పెదవులు, మాట్లాడేటప్పుడు ఎదరవాడి నెత్తిమీద నుంచి చూసే కళ్ళు – మొత్తంమీద అతను వేదాంతం చదువుతున్న విద్యార్థనీ, ప్రొఫెసర్లే దబ్బుని నమ్మలేక పోతున్నారు. స్కూలులో చదువుకునే రోజులలో 3×0, సమాధానం, "0" అని అతను వొప్పుకోలేక పోయాడు. – పదార్థానికి నశింపంటూ లేదుకదా, దాన్ని సున్నతో గుడిస్తే, సున్నాగా నశింపు కావడం, సృష్టికే వ్యతిరేకమని వాదిస్తూ వొచ్చాడు. చరిత్రలో కూడా ఇట్లాంటి క్లిష్ట సమస్యలే అతనిని ఎదుర్కొన్నాయి. యుద్ధాలకి కారణం ఏమిటి? తిండికోసం కొట్లాట, మొగుడూ పెళ్ళాం కొట్టుకోవడం – నిజంగా వేరే కూర్చుని తిండి తినడం కోసమే – దీన్నే ప్రబంధ కవులు ప్రణయ కలహం అన్నారు.

తండ్రీ కొడుకూ? – అది కుటుంబ కలహం.

రాజూ రాజూ? – అది మహా యుద్ధం

సరే తిండి దొరికిందయ్యా; పోనీ తరువాతేనా సుఖంగా వుంటారా? లేరు. ఎందుకు?

తరువాత రాణీలకోసం కొట్లాట.

చైనా గోడ, రామేశ్వరం గుడి, తాజ్‌మహల్ కట్టిన వ్యక్తులకు తిండి తినడం చేతకాదు. పాపం చరిత్రనుంచి మానవుడు గుణ పాఠం నేర్చుకోడు అని

వేర్పుతుందిట చరిత్ర. ఇల్లా ఉండటానికి కారణం ఏమిటండీ అని మేష్టర్లు నడిగితే, పుస్తకాల జాబితా తయారుచేసి చదువుకోమని యిస్తారు. నిలేస్తే "ఖర్మ" అనేస్తారు దేవుడు నిర్ణయించాడు. కాని దేవుడు – పాపం, మంచివాడు, దయామయుడు, ఆపద్బాంధవుడు, ప్రేమే దైవం....!

ఈ విషయం యొక్క అంతు కనుక్కుందామని రాజభూషణం చరిత్ర మానేసి ఫిలాసఫీలో చేరినా, క్లాసులో ఉన్న ముగ్గుర్నీ ఫేల్ చేస్తే – వాళ్ళ ఉద్యోగాలే తీసేసి, అసలు ఫిలాసఫీయే ఎత్తేస్తారని ఉన్న ఇద్దరూ ప్రొఫెసర్లు హడిలి, అందర్నీ ప్యాస్ చేస్తారన్న ధైర్యం ఉండబట్టే "రాజా" ఫిలాసఫీలో చేరాడని, అతని మిత్రులు అంటారు. మరేదయినా ఫేల్ కావడం సులభమే కాని, ఫిలాసఫీ ఎవ్వరూ ఫేల్ కాలేరు మరి. అనేసి రాజాని చులకనగా చూసిన వ్యక్తులు కొందరు తమ అభిప్రాయాలని మార్చుకుంటున్నారు. "రాజా" కొన్ని సమస్యలని బాగా విశదంగా పరిశీలించగలడు. ప్రతి దానికి పునాదులు తవ్వి, పేకముక్కలతో కట్టిన తార్కిక భవనాలను కూలదోశాడు. కూలదొయ్యడంలో అతను ప్రతిభావంతుడు. పునాదులు తవ్వితే ఏర్పడిన గోతులను పూడ్చడం అతనికింకా చేతకాలేదు.

వివాహం చేసుకుంటే భావస్వాతంత్ర్యం పోతుందని భయపడి బ్రహ్మచారిగానే వుంటానంటాడు "రాజా"

"దేవుడు లేడని రుజువు చెయ్యగలం– కాని, మహాప్రభో చెప్పింది తప్పని రుజువు చెయ్యలేం."

"ప్రేమ పూర్తిగా నశించిన తర్వాతగాని వివాహానికి మనుషులు అర్హులు కారు."

"మానవుడి అధోగతికి కారణ భూతాలయిన శక్తులపై విప్లవంచేసి నశింపు చెయ్యకుండా పురుషుణ్నీ, వో స్త్రీకి కట్టిపడేసి, వివాహం అనే జైలులో బంధిస్తుంది నాగరికత."

"మానవ సౌభ్రాత్రానికి శత్రువు వివాహం."

ఇట్లాంటివి "రాజా" నమ్మి ప్రచారంచేసే అభిప్రాయాలు. ఇతనికి పెళ్ళి చేసి యీ రోగం చప్పగా కుదర్చాలని చాలామంది యత్నాలు చేస్తున్నారు కాని, అవి యింతవరకూ ఫలించలేదు.

"రాజా", దయానిధి నాలుగు సంవత్సరాలుగా కలిసి చదువుకున్నారు. కాని, "నిధి" స్నేహితుడి మాటలకి నవ్వి వూరుకోవడం తప్ప, వాటిని నిజంగా నమ్మి తదనుగుణంగా అతని దృష్టి మార్చుకోవడం జరగలేదు. పైగా, "రాజా"కి వినోదం కోసం మాట్లాడడం తప్ప మనుష్యులని తన మార్గానికి తిప్పుకుందామన్న పట్టుదల లేదు. అతని అభిప్రాయాలు అతనికి చాలా మంది శత్రువులని సంపాదించిపెట్టాయి. వాటికి తట్టుకుని ఆదుకున్నవాడు "నిధి".

వారిద్దరూ వేర్వేరు కాలేజీలలో ఉంటున్నా అంతరంగికం తగ్గలేదు తన వివాహానికి రమ్మని నిధి వద్దనుండి ఆహ్వానం రాగానే "రాజా" వెస్టర్‌మార్క్ వ్రాసిన "పెండ్లి – దాని కథ. కమామీసు" (History of Marriage) అనే పుస్తకం చదవడం ప్రారంభించాడు. అతనికి కొన్ని సందేహాలొచ్చాయి. సరే ఈ పెళ్ళికి హాజరయి సందేహనివృత్తి చేసుకుందామని చక్కా వచ్చాడు. సిగరెట్టుని సమర్థించుకునేందుకు రాజా అన్న మాటలు విని, దశరధరామయ్యగారు–

"అగ్గి పెట్టికోసం, ఎంత దండకం చదివావయ్యా" అన్నారు.

ఇంతలో దయానిధి వొచ్చాడు. వెనకాలే వో కుర్రాడు అరడజను అగ్గిపెట్లు, రెండు సిగరెట్టు డబ్బాలు తీసుకొచ్చి పెట్టాడు.

"చూశారుటండి – మామగారి ఖ్యాతి పోకుండా, తనే అగ్గిపెట్లు సప్లయి చేస్తున్నాడు." అన్నాడు... "రాజా" అగ్గిపుల్లని వెలిగిస్తూ.

"వారి ఖ్యాతి నిలబెట్టడం రాత్రి తొమ్మిదిన్నరనుంచీ – ఈలోగా నా పూచీ ఏమీలేదు. నిజానికి లగ్నం తొమ్మిదీముప్పై ఎనిమిదికీ...." అన్నాడు దయానిధి. కాబోయ్యే మామగార్ని పరిహసించడం, అతనికంత రుచించినట్లులేదు. ఆ మూడు ముళ్ళూ పడేవరకూ, ఆడపెళ్ళివారూ మగపెళ్ళివారూ, యుద్ధానికి విడిచిన సేనల మాదిరి, వొక చెప్పరాని శత్రుత్వం ప్రదర్శిస్తుంటారు. ఆడపెళ్ళివారు చివరికి వోడిపోతారు. రాకుమారుడు రాకుమార్తెను తనతో తీసుకుపోతాడు. మాకురాజ్యం వొద్దుబాబూ అంటూ వాళ్ళిద్దరూ ఏకాంతంలోకి లేచిపోతారు. రెండు పక్షాల సేనలూ, తెల్లపోయి సంధిచేసుకుని, ఈ ఎడబాటుకి ఖేదిస్తూ ఉండడం జరుగుతుంది.

కొత్తగా వొచ్చిన రాకుమారుడ్ని చూసిపోవాలని ఆడపెళ్ళివారి తాలూకు అమ్మలక్కలు, వొక్కరొక్కరే, ఏదో మిషమీద వొచ్చి దర్శనంచేసుకుని వెళ్ళడం జరుగుతోంది. పెళ్ళికొడుకు జంతుశాలలోకి కొత్తగా వచ్చిన సింహం లాంటివాడు.

"అబ్బో, ఎంత జాలో !"

"అల్లా బక్కలాగుందేం !"

"ఎక్కడ్నించి తెచ్చారో – ఎంతో !"

"అబ్బే, మూడుపూట్లా తిండిపెట్టి మూడు వేలుటండి."

"పెళ్ళి కొడుకు ఏదో అంటున్నాడు, వుండండి, సింహం గర్జిస్తోంది."

అవీ అమ్మలక్కల గుసగుసల సారాంశం.

"టైమెంతండి?" అంటూ వెంకటాద్రిగారు; పెళ్ళికొడుకు విడిదిలోకొచ్చాడు. దశరథరామయ్యగారు, ఆయన్ని "దయచేయండి" అంటూ ఆహ్వానించారు. వెంకటాద్రిగారు పెళ్ళి పెద్ద సబ్ ఇన్స్పెక్టర్ పని చేసి కొంతకాలం కిందటే రిటైర్ అయ్యాడు. ఆయన ఉద్యోగం చేస్తున్న రోజులలో, తమ్ముడు సర్కిల్ ఇన్స్పెక్టరయ్యాడని కొంచెం బాధపడినా, యిప్పుడు రిటైర్ అయ్యాడు కాబట్టి, కాస్త గర్వపడుతున్నట్లు కనపడతాడు. ఆయన చేతులమీద చాలాపెళ్ళిళ్లు జరిగాయి – ఆరుగురు మొగపిల్లలు – అన్నీ మొగ పెళ్ళిళ్ళే చేసినదర్జా ఆయనలో ఇంకావుంది. ఆరుగురు మొగపిల్లల్ని కని, పోలీసుదళాలని బలపరిచినందుకే ఆయనకి ప్రభుత్వంవారు రావ్‌సాహెబ్ యివ్వాల్సిందని వొకప్పుడు వాదించేవాడు. కాని పిల్లలకి ఆ ఉద్యోగాలు లభించనందున యిప్పుడు ఆ వాదం ఒదులుకున్నాడు. ఆడపిల్ల ముచ్చటకోసం తమ్ముడు కూతుర్ని తనదగ్గిరే చాలా కాలం వుంచుకున్నందువల్ల యీ పిల్ల పెళ్ళికి ఆయన బాధ్యత మరింత ఎక్కువగా ఉంది.

"నాగడియారం ఆగిపోయిందండీ" అన్నాడు దశరథరామయ్యగారు. "అబ్బా, అప్పుడే తొమ్మిదైందీ" అంటూ వెంకటాద్రిగారు తన చేతి గడియారాన్ని వూడదీసి పరిశీలిస్తున్నాడు. ఆయనకి కొంచెం చెవుడని తేలిపోయింది.

రాజా ఆయన దగ్గరగా వెళ్ళి, మీ గడియారాన్ని కూడా రిటైర్ చేసి పించినీ యిప్పిద్దురూ అన్నాడు. వూడగా మిగిలిన పళ్ళతో వెంకటాద్రి గారు వింతగా నవ్వారు.

"నా దాంట్లో ఎనిమిదిన్నరైంది" అన్నాడు నిధి అన్నగారు రామానందం.

"తమదీ?" అని వెంకటాద్రిగారు, తమ్ముడి క్యాటబోయ్యే అల్లుడ్ని సంబోధించాడు.

"ఈ గడియారం అతనిది కాదు, నాది – కాసేపు ఎదురు పెట్టుకున్నాడు. మామగారు మంచి గడియారం యిప్పించాలి" అన్నాడు రాజా.

"ఓస్, యింతేకదయ్యా! వెధవ గడియారం" అన్నాడు వెంకటాద్రిగారు.

"వెధవది వొద్దులెండి – మంచిదే తెప్పించండి."

వెంకటాద్రిగారు "రాజాకి" దగ్గరగా జరిగి, కొంచెం కన్ను మెదుపుతూ "అలకపాన్పు మీద అదీ యింకా, యింకా.... పేలేసి పుచ్చుకోండి– మా అబ్బాయిలు వూడెయ్యాలా...." అన్నాడు గర్వంగా.

తమ్ముడు అంత ఖర్చుచేసే మనిషి కాదనీ, యిప్పుడు ఆయన చేత కొంత ఖర్చు చేయించాలని బయలుదేరిన ఉద్యమంలో పాల్గొంటం వెంకటాద్రిగారి సరదాలలో ఒకటిగా వుంది ప్రస్తుతం.

వెంకటాద్రిగారికీ, తమ్ముడు మాధవయ్యగారికీ చాలా పోలికలున్నాయి. ఇద్దరూ పోలీస్ డిపార్ట్‌మెంట్ ఉద్యోగులే. ఇద్దరూ ఆస్తులు గడించారు, రౌడీమూకల గుండెలలో ఇద్దరూ బల్లాలమాదిరే వుంటూ వచ్చారు. కష్టకాలంలో ప్రభుత్వానికి అండగా నిలబడి వారి అభిమానానికి పాత్రులయ్యారు. బ్రిటిష్ సామ్రాజ్య తత్వపు భవనానికి యిద్దరూ చెరో స్తంభంగానూ నిలబడి పనిచేసేవారు, వెంకటాద్రిగారికి ప్రొమోషన్ రాలేదు. దానితో ఆయన వుత్సాహం కొంత చచ్చింది. పై అధికార్లని కదిపి చూశాడు; వెనకెప్పుడో ఒక దొంగని యిద్దరు పోలీసుల చేత పట్టించి, చేతులకి సంకెళ్ళు వేసి, తీసుకొస్తుంటే వాడు మధ్యలో నిలిచిపోయి కాలకృత్యానికని గోడలా లేచిన బొమ్మ జెముడు కంచిముందు కూర్చునట్లుగా కూర్చుని – కంచిమీదనుంచి దూకి పారిపొయ్యాడుట; ఆ కంచి దాటేటందుకు వెంకటాద్రిగారు కాని, పోలీసులు కాని సాహసించ నందున ఒక "నల్లమచ్చ" పడిందని, అధికారులు అన్నారట. దానితో ఆయనకి మరింత కోపం వచ్చేసింది. ఇప్పుడు ఆ దొంగని ఎల్లాగైనా పట్టుకుని అతిధి సత్కారం చేసి, పట్టాభిషిక్తుడ్ని చెయ్యాలన్న సంకల్పంతో "కసిగా" వుంటున్నాడు వెంకటాద్రిగారు.

మాధవయ్యగారి కిల్లాంటి మచ్చలు లేవు ఆయన పనిచేసిన పొలిమేరలో సైకిల్ మీద యిద్దరు వ్యక్తులు ఎక్కటం ఎప్పుడూ జరగదు. ఓ వేళ ఎక్కితే, ఆ యిద్దర్నీ నిలేసి జుట్టుట్టుకుని తలకాయల్ని డీ డిక్కలు కొట్టి పంపుతాడు; అప్పుడప్పుడు యిద్దరిచేతా సైకిల్ని మోయిస్తాడు. నిజంగా దొంగతనం చెయ్యని వాడ్ని కూడా బాబో నేనే చేశానండి. మరి ఒదలండి అనిపించగలడాయన. ఈయనకి రావ్ బహదూర్ కాకపోయినా కనీసం రావ్ సాహెబ్ ఐనా రానందుకు, పోలీస్ సూపరింటెండెంట్ నంబియార్ కూడా ఆశ్చర్యపడ్డాడు. లోలోపల మా బాగా అయింది అనుకున్నా, వెంకటాద్రిగారు కూడా దీనికి విచ్చేర పడ్డాడు. అధికారుల ఆదరాభిమానాలు దైవమాయలా ఏ దోవ తీస్తాయో ఎవరు నిర్ణయించగలరు లెండి అనుకున్నారు కొందరు.

అన్నదమ్ములిద్దరికీ ఒక విషయంలో మాత్రం తేడా వుంది. అన్నగారికి ఆరుగురు మొగ సంతానం. మాధవయ్యగారికి ముగ్గురూ ఆడ పిల్లలే. ఇప్పుడు వివాహం కానున్న ఇందిర పెద్ద పిల్ల. గుంటూరు, కృష్ణాజిల్లాలలో పనిచేసినా కూతుర్ని గోదావరి జిల్లాలో యివ్వాలన్న ఆశయం యీనాటికి, నెరవేరినందుకు ఆయన సంతోష పడ్డాడు. మహావైభవంతో యీ పెళ్ళి చెయ్యాలని ఏర్పాట్లు చేస్తున్నాడు.

ఇందిర చదువు యింటిదగ్గరే జరిగింది. సంగీతం అబ్బే సూచన లుండబట్టి, విడవకుండా వీణ చెప్పించాడు, అల్లుడు ఆయనకి అన్ని విధాల నచ్చాడు. చదువుకున్నవాడు, అందమైనవాడు; కాస్తోకూస్తో ఆస్తి కూడా వుంది; అత్తగారి పోరులేదు మరి ఆడబడుచులు లేరు. ఐతే ఒక్క విషయం ఆయనకి సరిపడలేదు. అల్లుడు డాక్టరికి చదువు తున్నాడు. "బి.ఏ. ప్యాసైవుంటే. పోలీసు డిపార్ట్‌మెంట్‌లో ప్రవేశపెట్టి, రావ్ బహదూర్ చేసి ఉందును. ఇప్పుడు ఆ అవకాశం లేకపోయిందికదా" అని భార్యతో వాపొయ్యాడు. అమ్మాయికి నచ్చాడు పిల్లాడు. కావలిస్తే రెండో అమ్మాయి మొగుడ్ని రావ్ సాహెబ్‌ని చేద్దురుగాని లెండి అందిట సుభద్రమ్మగారు.

వెంకటాద్రిగారు తమ్ముడి అల్లుడు మంచి చెడ్డలూ, సత్తా తెలుసుకోవాలన్న కుతూహలాన్ని బైటకి కనబర్చకుండా, యుక్తిగా కనుక్కోవాలని సాగిస్తున్న యత్నం దయానిధికి అర్థమైంది.

"ఒక్క గడియారం మట్టుకే కాదు - కారు, ప్రాక్టీస్‌కి కావల్సిన సామాగ్రి అన్నీ లాగొచ్చు. సదాశయం మీద మావాడు సమయంవస్తే ఖర్చుకి ముందూ వెనకా చూడడు లెండి" అన్నారాయన.

"తాళం చెవి మీ అమ్మాయి దగ్గరే వుంటుంది కాబట్టి ఫరవాలేదందురూ...." అన్నాడు "రాజా"

"ఐతే ప్రాక్టీస్ ఎక్కడ పెడతావయ్యా?"

"మీ సలహా ఏమిటి?"

"అల్లుడు మామగారు ఆలోచించుకోవల్సిన విషయం కాని, మధ్యనాదేముంది?" అన్నాడు వెంకటాద్రిగారు.

"ఐనా తమరు పెద్దలు, మీ ఉద్దేశం కూడా సెలవియ్యండి" అన్నాడు రాజా, పొగ ముక్కులోంచి ఒదుల్తూ.

ఇంతలో మాధవయ్యగారు దూరపు చుట్టం, లక్ష్మయ్య వచ్చాడు. ఆయన పెళ్ళి హంగుదారు; ఆయన అక్కడివార్ని యిక్కడికి, యిక్కడి వార్ని అక్కడికి పిల్చుకుపోతుంటాడు గాని, ఆయనలో ఏం మహత్యం ఉందో, ఎవ్వళ్ళూ ఆయన చెప్పినట్లు వినరు.

"మీ తాలూకు ముగ్గురు బంధువులొచ్చారు." అని లక్ష్మయ్య వాక్యం పూర్తి కాకుండానే, బండిలోంచి జగన్నాథం, అమృతం ఆడబడుచు విశాలి, ఆవిడ భర్త భుజంగం దిగారు.

"ఏ తెంచితిన్ సకల యిక్కట్లు దాటి మైడియర్ బావగారు.... రెక్కలులేని పక్షివోలె - పక్షి... వికృతి - తెనుగు దంచేస్తున్నాం...." అంటూ మొదలెట్టాడు జగన్నాథం.

"ఏం జగ్గూ, అమృతం రాలేదూ?" అని అడిగాడు నిధి.

"నన్ను సమాధానం చెప్పమనేనా, మీ ఉద్దేశం?"

"ఏం ఎందుకు రాలేదు?"

"ఈ ప్రశ్నల పరంపర కురిపించే ముందు మిమ్మల్ని మీరు సరి చేసుకోండి–"

"....."

"పెళ్ళి కొడుకువి ఐయ్యిండి యింకా, ఈ మహా బస్తీలో ఇప్పుడూ జగ్గ ఏమిటయ్యా? అడిగేవారు లేకగాని–"

"ఓస్; అదా, చంపేశావ్–"

"షోమీ దీ శవం, కొండొకచో కళేబరం"

"లక్ష్మయ్యగారితో వెళ్ళి ఫలహారాలు చెయ్యండి–"

"రండి బాబూ రండి–" అంటూ ఆహ్వానించాడు లక్ష్మయ్య.

"ఊరక రారు మహాత్ములు–సన్నాయి మేళం చేయించండి....వెధవ మందమతీ నేనూ, ఏమండోయ్– ఈ అంగన విశాలి, –మా అక్క ఉమన్ యూత్ – ఆడబడుచు – భుజంగం, –మై గురూజీ –యాజ్ వాట్ కాంతారావ్ ఈజ్ టు మై సిస్టర్."

"ఆడ+పడుచు, ఆడపడుచు కాదబ్బాయ్ ఆ సంధే లేందే – పైగా తెనుగు దంచేస్తున్నానంటున్నావ్" అని మధ్యలో అందుకున్నాడు రాజా.

"వీరెవరో తెలుసుకోవొచ్చునా – కొంపతీసి తెలుగు పండితుడు కాదుకదా?"

"సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్" అన్నాడు నిధి.

"ఐతే భయంలేదు– ఆడపెళ్ళివారి [illegible]కా!"

"కాదు కాదు, మన [illegible]లూకా?"

"చంపక చెబుదురు..... తమ మిత్రమండలిలో ఆయనా?...." అన్నాడు జగన్నాథం.

"చివరికి సత్యం కనుక్కున్నావ్, బాలకా" అని రాజభూషణం పూర్తి చేశాడు.

"ధన్యతముండను. క్షీరకషాయ సమ్మేళనం కాస్తంత సేవించి వచ్చెదరండ్రా....." అని విశాలిని, భుజంగాన్ని విడిదిలోకి ప్రయాణం కట్టించాడు.

దశరథరామయ్యగారి పెద్దకొడుకు రామానందానికీ, భార్యకీ వేరే పక్కమేడలో పెద్ద గది ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. గది పక్క పెద్ద హాలుంది. అందులో కొత్తగా వచ్చిన వాళ్ళందరికీ, విడిది ఏర్పాటుచేశారు. దశరథరామయ్యగారు, రామానందం వారి విడిదిలో కెళ్ళారు. ఇక్కడికి కాఫీ ఫలహారాలు తెప్పిస్తాం ఉండండని జగన్నాథాన్ని పెళ్ళి పెద్ద లక్ష్మయ్యగారు వారిస్తున్నా, ఆడపెళ్ళివారి విడిదిలో పడి, పెళ్ళికూతుర్ని వోసారి చూసిరావాలని జగన్నాథం వుబలాటపడుతున్నాడు.

"నాథ్–మీ అక్కయ్య రాలేదేం?–" అని నిధి రెట్టించాడు.

"ఊరికేనేనండి."

"ఊరికే ఏమిటబ్బాయీ! సత్యాన్ని శోధించటం నీ విధి...." అని రాజా.

"వాళ్ళాయన వొద్దన్నాడా?"

"అబ్బెబ్బె – రోజా అక్కయ్యని, డాక్టరుగారి పెళ్ళి ఎప్పుడంటూ అడుగుతూండేవాడు."

"వాళ్ళత్తగారికి వొంట్లో బాగాలేదా?"

"ఈస్టిండియా కంపెనీవారు పాతిన మైలురాయిలా వుంది"
"పోనీ తనకిష్టం లేదా?"
"What a foolish.... మీ కింకా రాత్రి తొమ్మిదింటి వరకూ టైమిచ్చాము, కారణం వూహించండి"
"వెలలా?" అన్నాడు రాజా కొంటెగా నవ్వుతూ.
"ఇంచు మించు అట్లాంటిదే – ఏది జరిగితే ఆ ప్రశ్నకి సమాధానం వ్యతిరేకంగా పరిణమిస్తుందో అంది"
"నువ్వు క్రాస్‌వర్డ్ ఫజిల్ ఫీండ్లలో ఒకడవా ఏమిటబ్బాయ్?" అన్నాడు రాజా.
"బాబూ, మీరు అబ్బాయి అన్న పదాన్ని మొగ్గలో తుంచేసి, దిగమింగి, ఆ దురదని కాస్త అరికట్టి "నాధ్" అని సంబోధిస్తే, ఆంధ్రదేశానికి శ్రేయస్కరం."
"క్షమించు మైడియర్ నాధ్"
"క్షమించా మైడియర్ రాజా! ఎ శాంపిల్ సినిమా డైలాగ్."
"ఇవాళ నీళ్ళు" అంది విశాలి జాలిగా.
"పాపం రావాలని సరదాపడింది" అన్నాడు ఆమె భర్త భుజంగం.
"ఊరేగింపు నాటికేనా వొచ్చి తీరతానంది" అన్నాడు జగన్నాధం దయానిధి ఆశ్చర్యం సూచించాడు.
"ఏమొచ్చిందండోయ్!"
"నువ్వు మామూలుగా మాట్లాడావ్" అన్నాడు నిధి.
"అదా, అప్పుడప్పుడూ నా భక్తులకు నిజస్వరూపం ప్రదర్శిస్తోంటాను."
వెంకటాద్రి, మధ్యలో ఏదో అందామని గొంతుక సవరించుకుంటూ చాలాసార్లు ప్రయత్నించాడు కాని అవకాశం చిక్కడంలేదు.
"ఈ అబ్బాయ్, మీకేమవుతాడండి?" అని అడగగలిగాడు.
"అబ్బాయ్ అనే వొద్దన్నది –" అని వెంకటాద్రిగారి చెవినిపట్టుకున్నాడు. ఆయన తాపీగా పొడుం డబ్బీ తట్టడం మొదలెట్టాడు.
"ఈ నాసికా చూర్ణ ప్రియునకు కించిత్ చెముడా ఏమి? మీరు సెలవియ్యండి రాజాజీ"
"అవునబ్బాయ్, కొంచెం గట్టిగా చెబితే–చాలు"
"వినకూడనివి బాగా వినబడతాయండి ఏం మాయో చెవుడికి? అబ్బాయిని కానండి" అని జగన్నాథం, వెంకటాద్రిగారి చెవిలో అన్నాడు.
"పోనీ అమ్మాయివా?"
ఆఖరికి విసుగుతో అవలిస్తున్న లక్ష్మయ్య కూడా నవ్వాడు. ఏదో జగన్నాథం మళ్ళా అనబొయ్యాడు. అది ఏమైవుండునో ఎవరూ నిర్ణయించలేదు, ఎందుకంటే ఆ సమయంలో అక్కడికి నారయ్య చక్కా వచ్చాడు. జగన్నాధం జోరు తగ్గింది.
"అబ్బో, కుర్రాయనొచ్చాడే?" అన్నాడు నారయ్య ఆశ్చర్యంతో. నారయ్య శుభ్రమైన ఖద్దరు పొట్టి చేతుల చొక్కా, చిరుగులు లేని పంచి, మంచి పాగా వేసుగున్నాడు.
"కుర్రాయన్ని, ఆరునెల్ల క్రితం" అన్నాడు జగన్నాథం.

"ఐతే ఆరు మాసాలంటయ్యా కోతూసులూ నువ్వూ, మీ అక్కయ్యగారు రాలేదేంటయ్యా?"

లేదన్నట్లుగా తలపంకించాడు జగన్నాథం.

"మద్దినాళ హోమ్ గోల్ఫ్ ఆటేసుకుందామంటయ్యా! పెళ్ళోరి కుర్రాళ్ళని పోగుచేశాను." అన్నాడు నారయ్య.

జగన్నాథం కొంచెం తేరుకున్నాడు. అతన్ని గురించిన అభిప్రాయం మార్చుకోవాలని సంకల్పించుకున్నాడు.

"ఈ మధ్య మా ఊళ్ళో చెడుగుడు మొదలెట్టాం" అన్నాడు జగన్నాథం.

"ఏదేనా, సరే—సై"

"స్నానాలు అవీ చేద్దురుగాని లేవండి" అంటూ లక్ష్మయ్య వాళ్ళని తీసుకుని వెళ్ళాడు.

జగన్నాథం వీధిలోంచి పరుగెట్టుకుంటూ మళ్ళా అరుగు మీది కొచ్చాడు.

"ఆర్చ్ బిషప్ ఆఫ్ కాంటర్ బరీ – పోపు వస్తున్నారు" అన్నాడు.

"పోపేంటయ్యా కుర్రాయనా" అని, నారయ్య వీధివైపు చూశాడు.

దయానిధి, రాజభూషణం లేచారు.

"బౌద్ధ భిక్షువులు" అన్నాడు మళ్ళా జగన్నాథం.

వెంకటాద్రిగారు వీధిలోకెళ్ళి, ఆ వచ్చిన ముగ్గురు వ్యక్తులకీ నమస్కారంచేసి, వారిని అతి మర్యాదతో తీసుకొచ్చి అరుగుమీద తివాచీ పరచి, స్తంభానికి దిండ్లు చేరవేసి, అక్కడ కూర్చోపెట్టాడు.

స్తంభానికి జార్లబడి, కాలుమీద కాలు వేసుకుని, రెండుచేతులూ కట్టేసుకుని ధీమాగా కూర్చున్న వ్యక్తి అపురూపానంద స్వామి. ప్రక్కన కూర్చున్న ఇద్దరూ, వారి శిష్యులు. అపురూపానంద స్వామికి, తూర్పు గోదావరి జిల్లాలో "ముక్తిసాధన" అనే పేరుగల ఆశ్రమం వుంది. మొదట్లో ఆయన మలబార్ నుంచి వచ్చినా, చాలాకాలం తెనుగుదేశంలో వుండడం మూలాన వ్యవహారరీత్యా తెనుగువాడనే చెప్పేకోడం. వేదాంత దృష్టిలో, దేశమంటూలేదు – "విశ్వమే నాదేశం" అని చెబుతూండడం, ఆశ్రమంలో వుండేవారికి తెలుసు. ఆయన మళయాళం, తమిళం, తెనుగు ఆంగ్లం, కొద్దిగా గుజరాతీ మాట్లాడగలడు. అమెరికాలో ప్రచురింపబడే 'వెలుగు' అనే వేదాంత పత్రికలో అప్పుడప్పుడు ఆయన ముక్తిసాధన గురించి రాస్తుంటాడు. జమీందార్లు, రిటైర్డు ఉద్యోగులు మున్నగువారికి ముక్తిసాధన మార్గాన్ని బోధించి విరాళాలని స్వీకరించి, 'శాంతి' అనే పత్రిక నాలుగు భాషలలో కొంతకాలం నడిపినమాట చాలామంది ఎరుగున్నదే. ఐనా, ఎందుచేతో ఆ పత్రిక ప్రచారంలోకి రాలేదు. ఈ పత్రికకోసం పాటుబడ్డవారిలో సర్కిల్ ఇన్‌స్పెక్టర్ మాధవయ్యగారు ముఖ్యులు. ఆయన యాజమాన్యం కింద, రెండు ప్రత్యేక సంచికలు వెలువడ్డాయి. అందులో మొదటి దానిలో, విరాళాలు ఇచ్చిన వాళ్ళ పేర్లు, ఆరు మాసాల తరువాత వెలువడిన రెండవ సంచికలో విరాళాలు యివ్వని వాళ్ళ పేర్లు – యివీ వాటి ప్రత్యేకత. కౌమార సుధా మీనాన్ అనే మళయాళీ కన్య ఆశ్రమంలో వుంటూ కొంతకాలం సంపాదకురాలుగా పనిచేసింది. వేదాంతం స్త్రీల సొత్తు కాకూడదనీ, అందులో

దక్షిణాది వాళ్ళ ప్రమేయం పనికిరాదని, కావాలంటే, "స్వామీజీ" కూడా షేర్లు వేస్తే ఆ కన్యకోసం సినిమా కంపెనీ లేవదీస్తాం అంటూ, ఆశ్రమం చుట్టుప్రక్కల వుండే ఆంధ్రులు ఆందోళన చేయగా, సుధా మీనాన్ హరిద్వారం వెళ్ళి అక్కడ వో బ్రాంచి పెట్టిందట. ఆ విషయం తెలియపరుస్తూ "శాంతి"లో వో వ్యాసం పడింది. అందులో ముక్తిసాధన గాయపడినా అసలు నిజం అదే అని కూర్మయ్యలాంటి వ్యక్తులు హేళనగా అన్నారు.

సుధామీనాన్ వెళ్ళగానే ముక్తిసాధన ఆశ్రమానికి ముక్తి వచ్చిందనుకోడం పొరపాటు, అపురూపానందస్వామికి చాలా ఆస్తి ఉన్న మాట నిజమే. ఆయన ఇంకా అనేక ఆశ్రమాలు లేవతీద్దామన్న ఆయన సంకల్పమూ నిజమే. కాని, ఆశ్రమం యొక్క పరపతి తగ్గడానికి కొంతవరకూ గవర్నమెంటు ఉద్యోగులు, ఆదరాభిమానాలు చూపడమే కారణమనాలి. అందులో మాధవయ్యగారిలాంటి పోలీసువుద్యోగులు కలుగచేసుకోవడం మరీ ప్రమాదించింది. అరుగుమీద చుట్ట కాల్చుకుంటూ చదరంగం ఆడుకునే ఆంధ్రులు స్వామీజీలు గవర్నమెంటు ఏర్పాటుచేసిన గూఢచారులు, "పోదురూ" అన్నారు. ఖర్చులేకుండా, రాజాలా బ్రతకడానికి కొందరు వేసే ఎత్తు, అని నిరుద్యోగులు అసూయతో అన్నమాట "తెగపాపాలు చేసి, యిప్పుడేనా పరిహారం చేసుకుందాం అని కాకపోతే ఈ పోలీసోళ్ళకి వేదాంతం ఎందుకయా, చెప్పండి." అని కూర్మయ్య బోటిగాళ్ళన్నారు.

మాధవయ్యగారికి ఇటీవల పరలోకచింత; ఆధ్యాత్మిక దృష్టి ఎక్కువైనమాట వాస్తవమే. ప్రతి శనివారం తను ఏ ఆశ్రమానికో వెళ్ళి వేదాంత గోష్టి చెయ్యడమో, లేకపోతే, ఏ స్వామీజీనో తన యింటికే రప్పించి, గీత రహస్యం తెలుసుకోవడమో జరుగుతుంది. పాపభీతి అనేక పనులు చేయిస్తుంది. అందులో ముక్తిసాధన కూడా వొకటి ఎందుకు కాకూడదు!

కూతురు వివాహానికి మాధవయ్య ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో, అపురూపానందస్వామి చేత గీతరహస్యం వినిపించడం ఒకటి. ఓ పక్క కుర్రకారు మరోపక్క పోలీస్ డిప్యూటీ సూపరిండెంట్ కురుపు సలిపినట్లు సలపగా "పెద్దాపురం మేళాలు కూడా ఏర్పాటు చేశాడు ఖర్చులు మొగపెళ్ళివారివేగా" అనుకుని, (వెంకటాద్రిగారి అభిప్రాయం) "కాబట్టి పాపం కూడా వారికే దక్కనీండి అనా" అనుకుని, (కూర్మయ్య అభిప్రాయం) ఈ రెండు అతకవు ఏదో ఒకటి వుంచమని వేంకటాద్రి గారు తమ్ముడితో మొరెట్టుగున్నాడు. "దానికీ దీనికీ ఏం సంబంధం? అది అదే యిది యిదే" అన్నాట్ట మాధవయ్యగారు.

"స్వామీజీ"కి పోలీసుస్టేషన్ వద్ద ముచ్చటైన పూరిపాక వేశారు. పెండ్లి కుమారుడ్ని పరామర్శిద్దామని చక్కా వచ్చాడాయన; మనిషి స్ఫురద్రూపి; ఆజానుబాహుడు; పెద్ద విశాలమయిన నుదురు, గంభీరమయిన కళ్ళు పొడుగాటి ముక్కు, బలమయిన మూతి, క్షౌరం చేసుకున్న పచ్చటి మెరుగు, వంగపండు రంగు ఖద్దరు లాల్చీ — ఆయన చాలా నిండయిన విగ్రహం. ఐదు నిముషాలకో, పది నిముషాలకో, గడియారము చూసుకుంటూ. "ఓం" అంటూంటాడు. శిష్యులది మాత్రం బైరాగుల జుట్టూ, ఎదిగిన గడ్డం, నీళ్ళల్లో నానిన కర్ర ఛాయ; "జీవ" "సజీవ" వారి ఆశ్రమ నామాంతరాలు.

వివాహం కాగానే వధూవరులు "ముక్తిసాధన" ఆశ్రమం చూడాలని స్వామీజీ అన్నాడు. అక్కడికి పాతిక మైళ్ళు ఉందిట. మోటార్ మీద అరగంట ప్రయాణం – "అసలు మామగారి ఉద్దేశమే అది: దయానిధి తప్పకుండా వస్తానన్నాడు."

"ముక్తి, సాధన మాబోటి బ్రహ్మచారులకు కూడదా ఏమిటండీ!" అని రాజా అడిగాడు.

"తప్పకుండా రావచ్చు. నేను బ్రహ్మచారిని కానూ?" అన్నాడు స్వామీజీ.

శిష్యులు ఆశ్చర్యం ప్రకటించకుండా, మనం "నువ్వు" అనుకునేదాన్ని చూపించారు. నారయ్య దూరంగా చేతులు కట్టుకుని వినయంగా నిలబడ్డాడు. అరుగుమీద పది మంది పోగయినారు.

"అసలు ముక్తి సాధన అంటే ఏమిటో సెలవిస్తారా?" అని "రాజా" అడిగేశాడు.

"మా వాడికి వేదాంతంలో, అభిలాష జాస్తి" అని దయానిధి చెప్పబోతుంటే, స్వామీజీ నవ్వి అందుకున్నాడు...

"ముక్తి సాధన గురించి చెప్పడం నా విధి, మీ బోటి చదువుకున్న యువకులంతా ఆధ్యాత్మిక చింత చూపడం, మంచి సూచన."

"ఎందుకంటున్నానంటే, మా వాడికి దేవుడంటే బొత్తిగా నమ్మకం లేదు. అసలు మతం అనేదే లేకపోతే, ప్రపంచం హాయిగా ఉండునంటాడు..."

"ఏ వస్తువు లేదని నిర్ధారణ చేసుకొని అందులో నమ్మికలేదో, అది లేదని రుజువు చెయ్యడానికి కాలం, శక్తులు వృధా చెయ్యడం అనవసరం కదా?" అన్నాడు స్వామీజీ.

"మీరన్నది నిజం. ఈ రోజుల్లో నిజంగా దైవచింతన గలవాళ్ళు నాస్తికులే. మా "రాజా" దేవుడు లేడని రుజువు చేసేందుకు వేదాంత గ్రంథాలు చదువుతాడు..."

"సతోషమైంది."

"ప్రార్థన, పూజ వీటికి వినియోగించే కాలాన్ని సంఘసేవ కోసం వినియోగించటం మంచిదంటాడు."

"సంతోషమైంది."

రాజా మధ్యలో అందుకున్నాడు–

"మా వాడు నా అభిప్రాయాలను విశదంగా చెప్పలేక పోవచ్చు. మీ సందేహాలని నేను నివృత్తి చేస్తాను. ముందు "ముక్తి" అంటే ఏమిటో సెలవిస్తారా?"

"మీరేమనుకుంటున్నారు?"

"నేను 'ముక్తి' 'మోక్షం' అనేవి అర్థశూన్యమైన ధ్వనులనుకుంటున్నాను. ఒకప్పుడు వాటిని వాడినవారికే, వాడగా విన్నవారికే, ఒక 'అర్థం' ఉండేది. యిప్పుడదిలేదు."

"జీవ" ఆశ్చర్యపడ్డాడు. నారయ్య ఒకడుగు ముందుకు వేశాడు. వెంకటాద్రి పొడుం డబ్బీ మూశాడు.

"ముక్తి–మోక్షం– అనగా పరమాత్మలో ఐక్యం కావడం" అన్నాడు స్వామీజీ.

"ఆహా!" (సభలో ఒక కంఠం)

"చిన్న నదులన్నీ సముద్రంలో పడినట్లు" అన్నాడు సజీవ.

"పరమాత్మ అనేది ఒక వ్యక్తా, స్థితా, వాస్తువా?"

"పరమాత్మ – బ్రహ్మన్ అందులో ఐక్యం ఐనవారికి జన్మలేదు. జన్మరాహిత్యమే ముక్తి" అన్నాడు స్వామీజీ.

"అంటే మళ్ళీ ఈ ప్రపంచంలో పుట్టకుండా వుండటం, ముక్తి, అందరూ, మాకా ముక్తి అక్కరలేదు. అన్ని లోకాలలోకి, ఈ ప్రపంచం ఉత్తమం; మానవజన్మ మహోన్నతం, ఈ సినిమాలు, రాజకీయాలు ప్రకృతి సౌందర్యం – వీటిని విడిచి పెట్టలేం. ఎన్నో జన్మలు ఎత్తాలని వుంటుంది కాబట్టి మాకు జన్మరాహిత్యం అక్కరలేదు." అన్నాడు రాజా.

దయానిధి అంత జోరుగా మాట్లాడొద్దని కళ్ళతో సంజ్ఞ చేస్తున్నా, అతడు అది గమనించలేదు.

"జన్మరాహిత్యం అంత సులభం కాదు. ఆధ్యాత్మిక కృషి పూర్వజన్మ సుకృతం – వారి వారి కర్మఫలాన్ని బట్టి మనుజులు దైవాన్ని తెలుసుకుంటారు. వారే పుణ్యాత్ములు."

"పుణ్యం అన్నా కూడా ముక్తన్న మాటేనా?"

"సంతోషం"

"పరమాత్మలో ఐక్యం కావడం కర్మమీద ఆధారపడింది కాబట్టి మానవుడు దానికోసం కృషి చెయ్యక్కర్లేదన్న మాటేగా? అందుకనే ప్రార్థన, పూజలు అవసరం అంటాను."

"మీరు చెప్పింది నాకు బోధపడలేదు." అన్నారు వెంకటాద్రి గారు.

"మరేంలేదు–పరమాత్మలో ఐక్యం కావాలీ అని రాసి పుట్టివుంటే మీరు ఐక్యం అవుతారు; లేకపోతే ఏం చేసినా కారు; అల్లా రాసి పెట్టి వుంటే నేను ఐక్యంకాను, ఒద్దు మొర్రో–నేను విడిగానే ఉంటాను." అన్నా, మానేది లేదు. కర్మసిద్ధాంతంలో వున్న చిక్కేయిది: మానవుడి కృషికి అవకాశం యివ్వదు. దానివల్ల మనదేశంలో పనిపాట లేకుండా, ఊరమ్మట తిరిగే సన్యాసులూ, బైరాగులూ పెచ్చుపెరిగి పొయ్యారు; పైగా వీళ్ళందర్నీ గౌరవించాలట. నేనైతే వీళ్ళందర్ని జైల్లో పెడుదును..."

అని రాజా వుపన్యాసం మొదలెట్టి, మధ్యలో నిధి "ఒద్దు ఒద్దు" అని చేస్తున్న కనుసంజ్ఞలు గమనించకుండానే, మళ్ళా మొదలెట్టాడు.

"మనది భ్రష్టజాతి కావడానికి ఆధ్యాత్మిక చింతనే కారణమంటాను. అపజయాన్ని, తృప్తినీ–అనారోగ్యం, అవిద్య వీటినీ–వారి వారి కర్మలను అనుసరించే... అనుకుంటూ బాహ్య ప్రపంచంపై విముఖతతో తిండికూడా సాధించలేని యీ సోమరులు, సంఘాన్ని దూషించి మానవజాతి అంటే అసహ్యం వేసేటట్లుగా తయారుచేశారు."

మధ్యలో స్వామీజీ అందుకున్నాడు–

"సంతోషమైంది. కాని కొందరు యిట్లా వుండి, మరికొందరు అట్లా వుండి– కొందరు అప్పుడే చచ్చిపోయి, కొందరు బీదలు, వ్యాధి గ్రస్తులు–యీ వ్యత్యాసాలు ఎందుకుంటాయో యోచించారా? అది కర్మఫలం, దేవుడే తీసెయ్యాలేకాని మనుషులవల్లకాదు. ఐక్యం కావడం అంటే, ప్రత్యేకాత్మ జీవాత్మలో కలుస్తుంది. జీవాత్మ పరమాత్మలో కలుస్తుంది. అదే ముక్తి సాధన..."

"అది పిచ్చి సాధన, పరమాత్మలో ఐక్యం కావడానికి మొదట్లో యిష్టం లేదు మాకు, మాకు యిల్లా విడివిడిగానే వుండి, అస్తమానూ యీ లోకంలోనే పుడుతూ వుండాలని వుంది–అధమం ఆంధ్రరాష్ట్రం వచ్చే వరకేనా. ప్రతి మనిషి జన్మలు ఎత్తుతూ వుండవల్సిందే. కాదూ కూడదూ, ఐక్యం అవడం మా చేతుల్లో, మా యిష్టంలో లేదంటారా. మమ్మల్ని దానికోసం, ప్రార్థన, యోగాభ్యాసం, దీక్ష, వ్రతం వగైరా చెయ్యమనకండి. మీబోటి పుణ్యాత్ములు రెండు మూడు జన్మలలోనే ఐక్యం అవుతారు. నాబోటి పాపాత్ములు, మరో యిరవై జన్మలు ఎక్కువ తీసుకుంటారు; అంతే తేడా మీరు ముందెడతారు. మేం కొంచెం ఆలస్యంగా వెడతాం, దానికింత గడబిడ ఎందుకండి...?"

జీవ, సజీవ తెల్లబోయి చూస్తున్నారు. గురువుగార్ని ఇంత ఇదిగా ఖండించడం ఎప్పుడూ చూడలేదు. సజీవ, ఈ వాదాన్ని తప్పని రుజువు చేసేందుకు తనూ ఏదో అనాలి. లేకపోతే బాగుండదు–అనుకుని కళ్ళుమూసుకుని ఆలోచించి, చివరికి "ఓం!" అన్నాడు.

వెంకటాద్రిగారు "రాజా" అన్నముక్కలకి లోపల సంతోషిస్తున్నట్లుగానే వుంది. మొహంలో చిరునవ్వుని బట్టి.

"ఐతే, దైవాన్ని ప్రార్థించి సాధించిన మహానుభావులందరూ వెర్రి వెంగళప్పలే అంటావు? రామదాసు, కబీరు, త్యాగయ్య, రామకృష్ణ పరమహంస, వివేకానంద..."

"చాలా మంది వున్నారు."

"అదే, వారంతా తెలివితక్కువాళ్ళా, మీ దొర్లందరూ మహానుభావులూనా?"

"మా దొరలు అనక్కర్లేదు; మీరు ఇంగ్లీషు చదువుకొని ఆ దొరల ఉద్యోగం చేసినవారే."

"ఏదో పెద్ద ముండావాడ్ని అన్నాను."

"అయ్యో అల్లానే, ఎంతమాట!–ఏదో కుర్రతనం అనుకోండి–ఆ దొరలలో కూడా అట్లాంటి మహానుభావులున్నారు. ఫ్రాన్సిస్ ఆఫ్ అసీసి, ఎడ్మండ్, అగస్టెయిన్, థేరిసా, మార్కస్ అరీలియస్, స్పైనోజా, వొందల–వాళ్ళందరూ యీ ప్రపంచాన్ని చూసి హడలి పొయ్యారు. ఈ కుళ్ళు, వ్యాధి, అజ్ఞానం, పశుత్వం, యుద్ధాలు, మృత్యువు– వీటిని సహించలేక హడిలిపోయి, మరమ్మత్తు చెయ్యడం చేతకాక, ఈ దౌర్భాగ్యపులోకంలో ఎల్లాగో అల్లాగ, సంతోషంగా గడపడానికి, వారొక జీవిత విధానాన్ని, ఒక ప్రశాంత దృష్టిని అలవరచుకుని, సమాధానపడ్డారు. ఆ మార్గం యితరులకి తెలియజేశారు. ఆనందాన్ని ఆశిస్తాడు మానవుడు. అది వాడి నైజం. అనేక మంది అనేక రకాలుగా ఆనందాన్ని సాధిస్తారు. కొందరు తాగుతారు, కొందరు వ్యభిచరిస్తారు; కొందరు పద్యాలు రాసుగుంటారు; మరికొందరు రాజకీయంలో పడి దేశ సేవ చేస్తారు; ఇంకా కొందరు చిత్రపటాలు గీస్తారు; ప్రకృతిని ఆరాధించేవారు, సౌందర్యాన్ని ఆరాధించేవారు–అందరూ తలో రకంగానూ వారి వారి పరిస్థితులను సంస్కారాలను బట్టి, ఆనందాన్ని సాధిస్తారు; ఆధ్యాత్మిక జీవితం ద్వారా ఆనందాన్ని సాధిస్తారు మీ బోటి కొందరు. వారు చేసే చేష్టలు, చెప్పే కబుర్లూ, ఇతరులకి అపకారం చెయ్యకుండా, పోటీ పడకుండా, ఇతరుల ఆనందానికి అడ్డుతగలకుండా వుంటాయి. కాబట్టి వారిని మహానుభావులనీ వారి మార్గం ఉన్నతమైన మార్గం అనీ

అంటున్నారు. ఉదాహరణకి చూడండి; సౌందర్యాన్ని ఆరాధించేవాడ్ని తీసుకోండి—ఒక అందమైన స్త్రీని చూస్తాడు, కోరతాడు; ఆ స్త్రీనే మరోడు కోరడం జరగొచ్చు; ఆ స్త్రీకి భర్త వుండొచ్చు. లేకపోతే, ఆ స్త్రీయే ఏమీ ప్రత్యుత్తరం ఇవ్వకుండా, తృణీకరించవొచ్చు! వీటన్నింటిలోనూ ఇతరులకి అడ్డురావడం, బాధ కలిగించడం జరుగుతోంది. కాని దేవుడ్ని ప్రేమించడంలో యిల్లాంటి చిక్కులు లేవు. ప్రకృతిలో అడవులు, మృగాలు, ముళ్ళూ వుంటాయి. కవిత్వంలో కఠోర పదాలు, చెప్పలేని బాధ, అర్థంకాని ధ్వనులు వుంటాయి. సౌందర్యం మాసిపోతుంది. యవ్వనం నీరసిస్తుంది; ప్రజాసేవకి పలుకుబడి, డబ్బు వోర్పు వుండాలి; చిత్రకారుడికి వాడి బొమ్మలు చూసి మెచ్చుకునేందుకు తగినంత తీరుబడి వున్న జనం కావాలి. దేవుడికి ఈ యిబ్బందులు లేవు. అసలు కనబడడు—ఏ కలలోనో, ఏ భూతంగానో తప్ప. యిందుగల డందులేడు; నీలో వున్నాడు. లేడు; సర్వాంతర్యామి; నిరాకారుడు. ఎంత పట్టుగుని పూజించినా విసుగు రాదు; వాడిపోడు; సమాధానం చెప్పడు, నేను చిత్రకారుణ్నీ అంటే "ఏవీ నీ బొమ్మలు చూపించి రుజువు చేసుకోమంటారు, కవిని పద్యాలు వినిపించు, విలువ కడతాం అంటారు. దేవుణ్ని ప్రార్థించే వాడికి యీ యిబ్బందులు లేవు. తాను చేసే పనికి నాణ్యం కట్టేవాళ్ళు లేరు, ఏడీ నీ దేవుడు? చూపించు, రుజువు చెయ్యి అని అడగలేరు. ఉన్నదీ లేనిదీ రుజువు చేసుకోలేక, కేసు వాయిదా వేయించుకోలేకపోయిన ప్లీడర్లా ఒట్టి దద్దమ్మలాంటివాడు దేవుడు. అసలు మంచి దేవుణ్ని సృష్టించడం మానవుడు యీ లోకంలో చేసిన మహా కార్యం అన్నాడు బట్లర్..."

"ఎవరి దగ్గర బట్లర్?" అన్నాడు వెంకటాద్రిగారు.

"అయ్యో, మార్క్స్ బట్లర్ అనే ఆయన ఒక సుప్రసిద్ధ ఆంగ్లరచయిత అన్నాడు "రాజా."

"అయ్యో రామ! అనడం బదులు అయ్యో మార్క్స్ అంటారా మీరు?" అని స్వామీజీ అడిగారు.

మార్క్స్ ఒకడే కాదు; ఆధునిక శాస్త్రజ్ఞులందరూను; డార్విన్, లమార్క్, బర్గ్సన్ పాన్ట్యూర్, ఫ్రాయిడ్, వాట్సన్—వీరందరూ, వ్యాధులు, అజ్ఞానం, బీదతనం వీటిని ఒక్కొక్కదాన్నే నిర్మూలం చేస్తానన్నారు. అన్నీ నిర్మూలమైనప్పుడు, మనిషికింక దేవుడితో నిమిత్తం లేదు. కళ్ళు, చీకటి, పశుత్వం, జాడ్యం—వీటితోనే అల్లా కూడా నిష్క్రమిస్తాడు."

"హెలెన్ ఆఫ్ ట్రాయ్‌ని చూశానండోయ్—మైడియర్ హెక్టర్‌జీ—..." అంటూ జగన్నాథం చక్కా వచ్చాడు.

అరుగుమీద బృందాన్ని చూడగానే కొంచెం తమాయించాడు—"ఫలారం చేశా వంటాయ్యా కుర్రాయనా?" అన్నాడు నారయ్య.

"ఓ, అంతేకాదు, వధూ సందర్శనా క్షీర కషాయాన్ని కూడా గ్రోలాం—" రాజభూషణం కేసి తిరిగి "సమాసం తప్పనుకోండి! శుభకార్యసందర్భాలలో వాక్కుమ్మడి భాషాస్వేచ్ఛ వోపదగన్! అబ్బే చాలా బరువైన మాటలు పడుతున్నాయండోయ్ బావగారు..."

మధ్యలో రాజభూషణం అందుకున్నాడు.

"వధువును క్లుప్తంగా వర్ణించి, ఆమె కుటుంబ పరివారాన్ని సూక్ష్మీకరింపుము—"

"All Questions carry equal marks- దంచేస్తాం—అసలు తెలుగు పేపర్లు Do not carry any marks..."

"ఫిలాసఫీ క్వశ్చన్ పేపర్ మాదిరి—" అన్నాడు నిధి. స్వామీజీ కూడా వింతగా నవ్వాడు. వెనక చెరువు గట్టున వెంటపడిన వుడతల జంట మాదిరి, జీవ పక్షీవులు కూడా ఆశ్చర్యంతో చూస్తున్నారు.

To begin with ఇందిర—ఇందీవరశ్యాము...లా వుందండి. సింహములాంటి నడుము, శంఖం లాంటి మెడ, మధ్య ముక్కు అడ్డం వచ్చిందికాని, లేకపోతే ఒకే కన్నులాగుండే నేత్రద్వయం—కాళిదాసు గుండెలు బాదుకుంటాడు – అసలు ముక్కే లేదు... ఫోస్, పో"

"కుర్రాడు ఘట్టివాడే— ఏం చదువుకుంటున్నాడు!"

"Ask me నన్నడగండి, సెకండరీ స్కూల్ లీవింగ్, కాలేజీ కోర్స్ ఎంటరింగ్, మారేజ్ ఎలిజిబిలిటి Examination కొండొకచో S.S.L.C."

"మంచివాడివే..."

"మా వాడేనండి, బిగ్గరగా ఆలోచించే అలవాటు వల్ల అల్లా మాట్లాడుతుంటాడండి నిజంగా అందరూ అల్లా వుండగలిగితే ఎంత బాగుంటుందా అనిపిస్తుంది" అన్నాడు నిధి. జగన్నాథం చెవి పుచ్చుకుని, తన దగ్గరగా తీసుకున్నాడు. బావగారి తొడలమీద తల ఆనించుకుని పడుకున్నాడు జగన్నాథం.

"కర్ణ రంధ్రము దవియనేలా..."

"చూడు నాథ్—స్వామీజీ వారు"

జగన్నాథం స్వామిజీకి నమస్కరించాడు.

"ఓం!" అన్నారాయన.

"నాకూ అంతేనండి. ఇడ్డెన్ల చట్నీలో కారం ఎక్కువగా వేశారో ఏమో, వూ ఎక్కిళ్ళు మంచి తీర్థం..."

రాజా జగన్నాథాన్ని లేవదీసి కూర్చోబెట్టాడు.

"ఎక్కిళ్ళు కావు నాయనా— "ఓం" అనేది ఓంకారాన్నుంచి ఉద్భవించిన ఒక ధ్వని – అంటే సృష్టి అన్నమాట. ఈ విశ్వం అంతా ఓం అని ధ్వనిస్తూ కదులుతుంది."

"అవునండోయ్ దీని విషయం విన్నాం మా డ్రిల్లు మాస్టరు స్టాండ్ ఎట్ యీజ్ లాంటిది. దీని మహత్తు ఎటువంటిదో కొంచెం సెలవిస్తారా?"

స్వామీజీ నవ్వులలో జ్ఞానకాంతులు మెరిశాయి.

"ఆ ధ్వని సర్వ మానవ భాషకీ పునాది. ఆ ధ్వనిలోంచి, భాష, భావం, ప్రాణి, సృష్టి, విశ్వం—అన్నీ జనించాయి. అది బీజాక్షరం. ఓం శ్రీకృష్ణ ప్రీత్యర్థే గీతాపారాయణే జపేన వినియోగః..."

పక్షీవ సంచీలోంచి భగవద్గీత పైకి తీశాడు.

"కావి దావి మహత్తు ఎట్టిదో సెలవిచ్చారు కారు" అన్నాడు జగన్నాథం.

"సంతోషమైంది సకల ప్రాణులకీ, సర్వమానవ కోటికీ మూలపురుషుడు పరమాత్మ – "ఓం" దైవోపాసన, ప్రార్థన..."

"దానివల్ల ప్రయోజనం?" అన్నాడు రాజా.

"దుఃఖం, బాధ, పాపం–అన్నీ పటాపంచలై, ఆత్మ–వికాసం, జ్ఞానం పొంది పరమాత్మలో చేరుకుంటుంది. జీవి ముక్తిని పొందుతుంది అదే జీవిత పరమార్థం. దానికి గీతాపారాయణ, యోగం, వుపాసన, ప్రార్థన, యాత్ర, యజ్ఞం – యివన్నీ వుపకరాలు..."

"నా వుద్దేశంలో, అందరి అనుభవంలోనూ, మీరు చెప్పిన వాటి వలన బాధ, దుఃఖం పాపం – యివి తొలగిపోవడమనేది కల్ల. ఈ ప్రచారం హిందూమతానికి, జాతికి నష్టం చేస్తుందనుకుంటాను! దేవుడ్ని వుద్రేకాలు, మంచి చెడ్డలు వీటికి కట్టుబడిన వాడిలా చిత్రిస్తోంది యీ వేదాంత సృష్టి. దేవుడ్ని ప్రార్థించడం, వొక లంచం యివ్వడం కింద వుంటోంది. నన్ను పరీక్ష పాస్ చెయ్యి. నాకు బోలెడు కట్నంతో మంచి పిల్లనిచ్చి వివాహం చెయ్యి. నాకు పిల్లలులేరు మొగపిల్లవాడ్ని ప్రసాదించు. నాకు ఇంక్రిమెంటు ఇప్పించు నీకు కొబ్బరికాయ కొడతాను. తిరుపతి కొండపై డబ్బీలో ఏదో వేసుకుంటాను... అనమంటోంది. మొద్దు, దుర్మార్గుడు, దుర్నీతిపరుడు, బలహీనుడు... వీళ్ళందరికీ దేవుడే శరణు, "నీ యిష్టమొచ్చినన్ని పాపాలు చెయ్యి. ఏం భయం లేదు నేను వున్నాను. చివ్వర కాస్త పశ్చాత్తాప్పడు, అన్నీ కొట్టుకుపోతాయి." అంటాడు దైవం. ఈ దృష్టి నిజంగా పాపిని ప్రోత్సహిస్తుంది. అన్ని మతాలు దేవుడికి రెండు లక్షణాలని ఆపాదించాయి. మొదటిది అపారమైన శక్తి, రెండోది అనంత ప్రేమ. మానవజాతి యిన్ని యుగాలు ఈ గోళం మీద జీవించింది. మానవుడికి తిండి తినడం చేతకాదు. జాడ్యం, బాధ, బీదతనం, చెడుగు–యివి ఏవీ మానవుడు ఎంతమంది దేవుళ్ళకి మ్రొక్కినా తొలగిపోలేదు. నిజంగా దేవుడు శక్తిగలవాడై వుండి కూడా యీ చెడుగుని తొలగించలేక పొయ్యాడంటే, ఆయనకి ప్రేమేలేదేమో ననుకోవాల్సి వస్తుంది. పోనీ దయామయుడు, ఆపద్బాంధవుడు – అనంతమైన ప్రేమ కలిగిన దేవుడు ఈ చెడుగుని తొలగించలేక పోయాడంటే, ఆయనకి శక్తి లేదని రుజువవుతోంది. ఏనాడు ఆయనకి వీటిని నిర్మూలించే శక్తిలేదని వొప్పుకుంటున్నామో అప్పుడు ఆయనకి ప్రేమ కూడా లేదనుకోవడం కష్టం కాదు. ఈ ప్రేమా, శక్తిలేని దైవం మాకక్కరలేదు."

"సంతోషమైంది." అంటూ మధ్యలో స్వామి అందుకున్నాడు.

"మీకక్కరలేకపోయినా ఆయనే మీ దగ్గరికి ఒస్తాడు. అదే ఆయనలో విశేషం"

సజీవ సంతోషం పట్టలేక "ఓం" అన్నాడు.

సముద్ర కెరటంపైన కొట్టుకొని పోతూన్న గడ్డిపోచలా, రాజ భూషణం తనుస్వతంగా రగుల్చుకున్న వుద్రేకంలో కొట్టుకొని పోవడం దయానిధి గ్రహించాడు. అతన్ని మరో కప్పు కాఫీ తాగమని, అందుకోసం జగన్నాథాన్ని పంపించాడు. మరో సిగరెట్టు ముట్టించమన్నాడు. అగ్గిపుల్ల పారేసి, ఆకస్మికంగా కొత్తభావం తట్టిన వాడిలా రాజా అన్నాడు.

"పనీ పాటా లేకుండా, ఎందుకూ పనికిరాని సోమర్లకి యింత అన్నం పెట్టడం తప్ప ఈ మతం వలన మరో వుపయోగం లేదు. శక్తులన్నీ అడుగంటిన అమ్మమ్మలూ, తాతయ్యలూ. దీని పేరిట ఇతరులపై ఆధ్యాత్మికంగా అధికారం చెలాయిస్తుంటారు. ఆధ్యాత్మిక జీవితంలో నాయకత్వం బహు సులువుగా సంపాదించవచ్చు. దీనికి కానీ ఖర్చులేదు. పరీక్షలు ప్యాసవనక్కరలేదు. సంఘ కట్టుబాట్లతో మొదలే నిమిత్తం లేదు. ఇంత సులభం కాబట్టి ఈ ఆధ్యాత్మిక జీవితానికి అంత పలుకుబడీ – ప్రచారమూను..."

"ఐతే రాజా నువ్వు ఖండించేది దైవాన్నా, మతాన్నా, ఆధ్యాత్మిక జీవనాన్నా?" అని అడిగాడు నిధి.

"ఈ మూడింటినీ కట్ట కట్టి – ఈ మూడూ ఒకటే"

"కాదు నేనోసారి బరంపురంలో జ్ఞానానంద స్వామిని కలుసుకున్నాను. ఆయన ఏమన్నాడంటే మత వైషమ్యాలకి కారణం, యీ మూడు ఒకటే ననుకోవడం – ఆధునిక విజ్ఞానశాస్త్రం దైవాన్ని ఖండించదు. ఎదుకంటే దీన్ని ఖండించినా అదొక నైతిక విలువ ఐ వూరుకుంటుంది. నైతిక విలువల్ని గుర్తించడమే ఆధ్యాత్మిక జీవనం–అన్నాడు. నువ్వు ఈ మూడు వేరని అంగీకరించాలి."

"సంతోషమైంది; జ్ఞానానందస్వామిని మీరు చూచి వుంటారు కదా, అయన దేనిని నైతిక విలువలన్నాడు?"

జ్ఞానానందస్వామి విషయం చెప్పేటప్పుడు, స్వామీజీ కళ్ళల్లో యీర్ష్య కదలడం నిధి గమనించాడు. ఋషులకు, దేవుళ్ళకు పడకపోవటం పెద్ద చిన్నల పోటీలు వుంటుంటే, మనుషులు ప్రజాస్వామ్య సిద్ధాంతాలని అనుసరించడం తప్పదు కాబోలు, భూస్వాముల పరిపాలనా తత్వం; దేవుడ్ని గూడా పాడుచేసేసింది కదా!

"సృష్టితో అసంతృప్తి పడటమే నైతిక విలువల్ని రుజువు చేస్తుంది, అసంతృప్తికి కారణాలైన వాటిని నిర్మూలింప చెయ్యడానికి అవలంబించిన మార్గమే ఆధ్యాత్మిక జీవితం. అందరూ అంటే చాలామంది ఆ మార్గాలనే అవలంబిస్తే అది మతం. మతం ప్రబోధించిన అనేక మార్గాలలో మోక్షసాధన పరమాత్మ – వొకటి–" అన్నాడు నిధి.

"ఇవన్నీ అయనే చెప్పినాడా? అని అడిగాడు స్వామీజీ. "జీవ" నమ్మడం కష్టం అన్నట్లుగా తల పంకించాడు.

"సరిగ్గా యీ మాటలు ఆయన వాడలేదు. నేను సారాంశం మాత్రం చెబుతున్నాను. ఈ దృష్టి సరియైనదని మనం వొప్పుగుంటే మా "రాజా" చెప్పిన విషయాలని సులభంగా పరిశీలించవచ్చు–" నిధి గొంతుక సవరించుకున్నాడు. నారయ్య ఒకడుగు ముందుకు వేసి కూర్చున్నాడు.

"మనిషికి కావల్సింది తిండి, అది లేనిదే ఏదీ చెయ్యలేడు. ఇంతవరకూ యిది మానవుడు సంపాదించుకోలేక పొయ్యాడు. అందరికీ సమానంగా భోజనం లభించే మార్గాలని గురించి ఆలోచించక, యీ మతం, దైవం అంటూ ఎందుకు కాలం వృధా చేస్తారో అని, "రాజా" విచారిస్తాడు. అవునా? అంటే. అందరికీ తిండిని సంపాదించడం రాజకీయ మార్గం అవుతుంది. ఆ మార్గాన్ని అవలంబించమంటాడు. ఆ తిండిని సృష్టించేది దేవుడే అని మీరంటున్నారు. ఆ దేవుడ్ని పూజిస్తే

తిండిరాదు. ఎందుకు వృథాగా పూజించడం అంటాడు రాజా. లభ్యం కాని వస్తువుని ఆశించడం మానవుడి నైజం. రాజాకి Karl Marx, Lenin, Morris... వీరికి తిండి లభ్యంకాదు. మీకు రామకృష్ణ పరమహంస, స్పినోజా, దయానంద సరస్వతి–వీరికి దైవం లభ్యంకాదు. ఇద్దరిదీ ఆధ్యాత్మిక జీవనమే. అంచేత పూర్వులు అన్నం పరబ్రహ్మస్వరూపం అనేసి ఇద్దరికీ రాజీచేశారు..."

"వేళాకోళం చేస్తే నేను వాదించను" అన్నాడు రాజా.

"సంతోషమైంది కాని, మీరు జ్ఞానానంద స్వామి చెప్పిన విషయాలు బాగున్నాయన్నారు కదా! ప్రజాసేవ, పెరుమాళ్ సేవకంటే ముఖ్యమంటారా?" అని అడిగాడు స్వామీజీ.

జ్ఞానానందస్వామి మోక్షం సాధించాడని స్వామీజీకి అసూయలేదు. ఇతరులకు ఆ మార్గం చూపగలిగాడంటేనే ఈయనకి కొంచం కష్టంగా వుంటుంది.

దయానిధి అన్నాడు – "మతానికీ, దైవానికీ బదులు, ఆధునికులు ప్రకృతినీ కళనీ ఆరాధించడం జరుగుతోంది. కొందరు ప్రజాసేవతో తృప్తి పడుతున్నారు. కాని యివేవీ ఆధ్యాత్మిక దృష్టిలో దైవానికి బదులుగా వుండకూడదనీ, అట్లా వుండటమే నేటి నాగరికతకి అరిష్ట లక్షణం అని రాధాకృష్ణన్ మొదలైనవారు అంటున్నారు. దైవచింత ఒక మహత్తరమైన ఆధ్యాత్మిక అనుభవం. ఆ ఆకలి చల్లార్చుకున్న వారికి ఆ వెలుగు చూపినవారికి మరి ఏ ఇతర వస్తువూ అక్కరలేదు. వారు దేన్నీ ఆశించరు, కోరరు, ద్వంద్వాలు లేవు; అసంతృప్తి లేదు. అన్నింటికీ అతీతమైపోయి ఒక నిశ్చలమైన ఆనందాన్ని పొందుతారు. దీని ముందు రాజకీయ రంగంలో మానవుడు పొందిన అఖండ విజయం, కళారంగంలో చవిచూసిన అనంత సౌందర్యం అన్నీ సూర్యుడి ముందు నక్షత్రాలు లాంటివి.

"మా కెవ్వళ్ళకీ ఈ ఆకలి లేదు. మేం దీనికి తగం మాకక్కర్లేదు. తిండి తినడం చేతగాని ఈ శుష్క అస్థిపంజరానికి అతీతమైన అందానికి అర్హతలేదు" అంటున్నాడు రాజా.

"నా కాకలేస్తోందండోయ్" అన్నాడు జగన్నాథం.

జీవ సజీవలు నవ్వారు; పాపం వారికీ ఆకలేస్తూంది కాబోలు, "రాజా" సిగరెట్టు పారేసి, భగవద్గీతని చేతిలో తీసుకున్నాడు. సజీవ వారించబోయ్యాడు, రాజాకి కోపం వచ్చింది.

"ఈ ఛండాలపు హస్తం ఈ పుస్తకాన్ని తాకకూడదా ఏమిటి...?"

సజీవ నాలిక కొరుక్కున్నాడు స్వామీజీ గ్రంథాన్ని తీసుకుని గుడ్డలతో తుడిచి రాజాకి యిచ్చాడు.

రాజా పేజీలు తిరగేస్తూ అన్నాడు....."ఈ గీత విషయం చూడండి. దీన్ని గురించి మొదటి అసత్యం యిది కేవలం ఆ కృష్ణ పరమాత్ముడే వ్రాశాడని, నిజానికి ఆనాటి మహారాజులు తమ చిరాస్తులని ప్రజాబాహుళ్యం తిరుగుబాటు చేసి దోపిడి చెయ్యకుండా, వ్యాసుడికో అగ్రహారం పారేసి, ఈ గ్రంథాన్ని వ్రాయించారు. ఇందులో కృష్ణుడు చెప్పిన సందేశం ఏమిటి? "ఓ ధనంజయా! ఈ భవనాలు, ఈ ఆభరణాలు, భూములు, భార్యలు నీవి. వీటిని కాపాడుకోవడం నీ విధి. నీ

వార్ధక్యంలో ఎవ్వరూ నిన్ను పోషించరు. అంచేత యుద్ధం చెయ్యి. నాకూ వున్నారు బోలెడుమంది భార్యలు పట్టు, నీతో కలిసి నేనూ యుద్ధం చేస్తాను" అని కేవలం భూస్వాముల తత్వం యొక్క ప్రచారం కోసం వ్రాయించిన గ్రంధం ఇది. ఇదిట భారతీయుల పవిత్ర గ్రంధమట! సిగరెట్టుకాల్చిన చేతులతో దీన్ని ముట్టుగుంటేనే అపవిత్రం ఐపోతుందట! దీన్ని అచ్చువేసింది ఎవరో ప్రెస్సులో పనిజేసేవాడు; వాడికి సరిగ్గా రెండోపూట తిండి వుండదు. సిగరెట్టు కాల్చడు. రాత్రి గుడ్డిదీపంలో దృష్టి ఆనక, బీడి సగం కాల్చి, ఆర్పేసి, చెవి వెనక దోపుకుని, ఆచేతులతో అచ్చొత్తిన ఈ పుస్తకం పవిత్రగ్రంథం ఎట్లాగైందో నా కర్థం గాదు...

జగన్నాథం చప్పట్లు కొట్టాడు.

"రైట్, అందుకనే మా తెనుగు టెక్స్టు బుక్కు పాడు వాసన! ముఖ్యంగా భర్తృహరి సుభాషితాలు కేవలం పత్రముఖీ.. అనగా బీడీ పొగ తాలూకు పరిమళం..."

దయానిధి అతని చెవిని మెలిపెట్టాడు.

"సోపీ క్షమించండి. కాగితపు ముఖీ పొగ తాలూకు పరిమళం, తమరు డాక్టరు కాబోలు. రైట్. ఐడోఫారం వాసన. ఓ.కె.?"

వెంకటాద్రి గారు "భోజనానికి వేళయింది లెమ్మ"న్నాడు– నారయ్య లేచి కండువా దులుపుకున్నాడు.

"లెగవయ్యా కుర్రాయనా"అన్నాడు.

"ఉండు కర్ణాకృష్ణామృతాన్ని కాస్త గ్రోలనీ."

రాజభూషణం కళ్ళు మూసుకుని ఏదో పుట తీసి, ఒక చోట తన వ్రేలిని ఆనించాడు.

"చూడండి– ఏ శ్లోకం మీద చెయ్యి పెట్టినా అసందర్భపు నిర్వచనమే. చూడండి– ఇది సాంఖ్య యోగంలోది "అకీర్తించాపి భూతాని కథ యిష్యంతి తేవ్యయామ్ సంభావితస్య చాకీర్తిర్మరణా దతిరిచ్యతే" దీనికి అర్థం చెప్పమని స్వామీజీని కోరుతున్నాను.

"సంతోషమైంది. లోకులు ఏ యపకీర్తిని శాశ్వతముగ చెప్పుకొనగలరు.. గౌరవముగా బ్రతికినవానికి అపకీర్తి కన్న చావే మేలు" అని అన్నారు స్వామీజీ.

"ఇంతకంటే దౌర్భాగ్యమైన సందేశం ఉంటుందా? పరమాత్ముని అనుభవించి, నిశ్చలమైన ఆనందాన్ని పొందినవాడు, అన్నిటికీ అతీతమౌతాడు." అని నిధి అన్నాడు. అలాంటివాడికి కీర్తిపై అంత మోజు ఎందుకు? సర్వాన్నీ విసర్జించి చిదానందం పొందిన వ్యక్తికి పేరు ప్రతిష్టలపై అంత తాపత్రయం దేనికో, పైగా దానికంటే చావే మేలుట, కీర్తి ఒక పాండవులకు మాత్రమేనా ఏమిటి? కౌరవులకు అక్కరలేదా. అంచేత కీర్తి కోసం దెబ్బలాడుకోమని ప్రబోధం. నేటి పెద్దరాజ్యాలన్నీ ఆర్థిక రంగంలో మార్కెట్లకోసం కొట్లాడుకుంటున్నట్లు! పైగా చావమంటోంది, అంటే ఆత్మత్యాగాన్ని మెచ్చుకుంటోంది. అవతలవాడిని చంపలేకపోతే నువ్వు ఏ గన్నేరుపప్పో తిని చావమంటోంది ఈ పవిత్రగ్రంథం–"రాజా మరోశ్లోకంపైన వ్రేలు పెట్టి చదవడం మొదలెట్టాడు..

"అవాచ్యవాదాంశ్చ బహూ న్వదిష్యం తి తవాహితాః
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖ తర న్ను కిమ్?"

అంటే నీ శత్రువులు నిన్ను శుంఠ అని నిందిస్తారు. దానికి మించిన దుఃఖమేమి గలదు? అని తాత్పర్యం. అది పోటీపడటంకాదు. కేవలం capitalist competitiveness మరోటి..

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వో వా భో క్ష్యసే మహీమ్
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయ"

అంటే యుద్ధంలో చనిపోతే స్వర్గమో (అంటే రంభ వగయిరా స్త్రీలతో కులాసా), గెలుపొందితే రాజ్యభోగము పొందగలవు. అందుచేత, లే, యుద్ధంచెయ్యి అని. చూశారా, భోగాలకోసం, శరీర సుఖాల కోసం మంచి బట్టలు, హైక్లాసు సిగరెట్లు, మోటార్, రేడియో, వీటికోసం యుద్ధం చెయ్యమని ప్రబోధం, ఈ నాడు అన్ని దేశాలు చేస్తున్న పనే యిది. దీని ఫలితంగా మన దేశం, మన నాగరికతా ఏమైందీ మీకందరికీ తెలిసిందే. పరీక్షల్లో ఫేలైన విద్యార్థి గోదావరిలో పడి ఆత్మత్యాగం చేసుకుంటాడు. ఫిలింతారని పెళ్ళాడలేక పోయిన బ్రహ్మచారి రైలు కింద పడతాడు. ఈ భోగాల కోసం రాజ్యాలు, దేశాలు నాశనమై పోతున్నాయి. ఇది పవిత్రగ్రంథం ఎట్లాగైందో నా కర్థం కాదు.

"సంతోషమైంది"అంటూ స్వామీజీ ఆ భగవద్గీతని తన చేతుల్లోకి తీసుకొని మరోపుట తీసి శ్లోకం చదవడం మొదలెట్టారు.

"విద్యా వినయం సంపన్నే బ్రాహ్మణేగని హస్తిని
శుని చైవ శ్వతాకే చ పండితా స్సమదర్శినః
సజీవ, దీని తాత్పర్యం చెప్పు."

సజీవ గొంతు సవరించుకొని

"విద్యావినయ సంపన్నే, అనగా విద్య వినయములు గల, బ్రాహ్మణే, బ్రాహ్మణుని యందును, గవి, గోవునందును, హస్తిని–"

" హస్తిని అంటే ఏమిటోయ్ నాథ్?" అని మధ్యలో అరిచాడు నిధి.

"హస్తిని, చిత్తిని వగైరా నక్షత్రములు– "

"ఊరుకో–" అన్నాడు రాజా.

"చిల్లుపడ్డ డోలువలె" అని నోరుమూసుకున్నాడు జగన్నాథం.

సజీవ అందుకున్నాడు– "హస్తిని, ఏనుగునందును, శుని చ, కుక్క యందును, శ్వపాకేచ, ఛండాలునియందును, పండితా, పండితులు సమదర్శనం స్వభావము గలవారు."

నిధి అన్నాడు "చూశావా రాజా, నీక్కావల్సిన సోషలిజమ్ యిందులో వుంది"

"అదే లేదు. ఈ పుస్తకం వ్రాసిన బ్రాహ్మలు వారు కాయకష్టానికి ఓర్చుకోలేరు. పొలం దున్ని పండించలేరు. అందుచేత రెడ్లని రాజుల్ని కాకా చేసి, ఏదో తాము పండితులం అని చెప్పుకుంటూ, వారి దగ్గర సలహాదార్లుగా చేరి పొట్టనింపుకున్నారు. ఈ నాడు, ఎంతమంది పండితులు, బ్రాహ్మలు, ఛండాలునితో కలిసి భోజనం చెయ్యడానికి సిద్ధపడుతున్నారు?"

లక్ష్మయ్యగారు "హార్డించేశారు, లేవండి" అన్నాడు. అందరూ లేచారు. బట్టలు మార్చుకున్నారు. వీధిలో కొచ్చారు. ఆ బృందంలో నిధి కూడా ఉన్నాడు.

"మీకు యిక్కడికే పంపుతాంగా" అన్నాడు వెంకటాద్రిగారు.

"ఎక్కడైతే ఏం లెండి- నేనూ మావాళ్ళతో కలసి అక్కడే భోజనం చేస్తాను."

"వెంకటాద్రిగారు నవ్వి అట్లా కుదరదు. పెండ్లి జరిగింతరువాత గాని, మీరు భోజనం చెయ్యకూడదు."

"చేస్తే ఏం జరుగుతుంది?"

"మన ఆచారం"

"అది అర్థంలేని ఆచారం. నేనీ పూట అక్కడే చేస్తాను."

"అది కుదరదు."

"అంటే- లేకపోతే అన్నం ఒడ్డించరా?"

"పోనీ మీనాయనగార్ని అడగండి"

"అడగనక్కర్లేదు. నేను అక్కడేకాని భోజనం చెయ్యను." అన్నాడు నిక్కచ్చిగా.

"Well said, బావగారూ, మీరు రాకపోతే నేనూ భోజనం చెయ్యను. although మనకి ఆకలి బాహాటముగా అయ్యేడిన్ యివాళ అంతా "ఆ "మీద నడుస్తోంది, మన భాష"అన్నాడు జగన్నాథం.

"అట్లా పట్టింపులకు పోవడం తప్పు బాబూ" అని వెంకటాద్రి గారు వాపోతూ, ఏం చెయ్యాలో తోచక లక్ష్మయ్యని పిలిచాడు.

"ఇక్కడికి పంపుతాం కాదంటండీ"

"దోవలో అందరి చూపులూ పడి అపవిత్రం కావచ్చు" అన్నాడు రాజభూషణం.

స్వామీజీ శిష్యులూ "ఓం" అనుకుంటూ భోజనాలకి వెళ్ళి పొయ్యారు.

"ఐతే వుండండి, మీ మామగారికి కబురు జేస్తాను"అంటూ వెంకటాద్రిగారు వెనక్కి తిరిగి నడవడం మొదలెట్టారు.

".....సవరణ, కాబోయ్యే మామగారు" అన్నాడు నిధి.

జగన్నాథం విరగబడి నవ్వుతూ "హాయ్ హాయ్-తప్పొప్పుల పట్టిక, మొదటి కూర్పు, టిప్పరము, వెయ్యి ప్రతులు, వలయువారు, ఇందిరా కార్యాలయానికి వ్రాయండి"అన్నాడు.

ఆడపెళ్ళివారి పందిట్లో పెద్దపెద్ద పొడుగాటి బల్లలు ఏర్పాటు చేశారు. వందమందికి పైగా పెళ్ళివారి జనం భోజనాలకి కూర్చున్నారు. స్వామీజీ స్తంభానికి జార్లపడి కూర్చున్నారు. ఎదురుగా దశరథరామయ్యగారు, రామానందం వున్నారు. నీళ్ళకావిడి బ్రాహ్మలు అటూఇటూ తిరుగుతున్నారు. పెళ్ళి కొడుకు తాలూకా జనాన్ని చూడడం కోసం, ఏదో పని కల్పించుకుని అమ్మలక్కలు వస్తూపోతూ ఉన్నారు. వడ్డన ఆలస్యం కనబడకుండా, పెళ్ళివారి కులాసాకోసం త్రివిక్రమదాసుగారు గుక్కతిప్పకుండా మాటలాడుతూనే వున్నాడు. ఎవరు విన్నా, వినకపోయినా ఆలస్యం ఎందుకో ఎవరికీ అర్థం కాదు. పందిట్లోకి మాధవయ్యగారు ప్రవేశించారు. కొంత అలజడి తగ్గింది. ఆఖరికి త్రివిక్రమదాసు కూడా మెల్లిగా మాటలాడడం మొదలెట్టాడు.

"బావగారూ, మనవారందరూ వచ్చారుగా, ఇంకా ఆలస్యం దేనికి?" అన్నాడు దశరథరామయ్యగార్ని సంబోధిస్తూ. "ఇంకా వారి తాలూకు కొందరు దిగబడ్డారు" అన్నాడు లక్ష్మయ్యగారు. అసలు విషయం వెంకటాద్రిగారు తమ్ముడు చెవిలో వూదారు.

"ఆయనకి చెవుడు లేదయ్యా, మహానుభావా" అని త్రివిక్రమదాసు కేకేశాడు. అందరూ నవ్వడం సాగించారు.

పెళ్ళి కొడుకు కూడా ఇక్కడే భోజనం చేసే ఏర్పాటు లేకపోతే సత్యాగ్రహం, ఉపవాసం వుంటాడని, అతని ముఖ్య అనుచరులు కూడా ఇక్కడికి భోజనానికి రారని వార్తవినగానే, మాధవయ్య మండిపడతాడని వెంకటాద్రిగారు, పందిట్లో మరికొందరు బంధుజనం అనుకున్నారు. కాని తీరా విన్న తరువాత మాధవయ్యగారు పెదవి చప్పరించి "ఓస్ ఇంతేగదా. అందర్నీ రమ్మనండి– దాని కభ్యంతరం ఏముంది?" అన్నాడు. గుసగుసలు బయలుదేరాయి. మొగాళ్ళకి హుషారెక్కువయింది. ఓ ముసలమ్మ పందిట్లోకి చక్కావచ్చి "మేం మాఇళ్ళలో ఎక్కడా ఇట్లాంటివి ఎరగం, అమ్మో, మేమూ చేశాం అబ్బాయిల పెళ్ళిళ్ళు, ఈ పట్టింపులు మా కుర్రనాగమ్మలకు తెలియవర్రో" అంటూ పారం చదివింది.

యువకబృందం నవ్వింది. ముసలమ్మకి ఒళ్ళు మండిపోయింది. "ఇంకా నయం పెళ్ళికూతురూ, తనూ కలసి ఇక్కడే భోజనం చేస్తాం అన్నాడు కాదు– ఆ మూడుముళ్ళు పడకుండానే, ఏం విడ్డూరం!"

త్రివిక్రమదాసు తన ఉపన్యాసం ఆపుచేసి

"ఏమండీ వదినగారూ, పెళ్ళికొడుకు ఎంత మంచి వాడో చూశారా! పెళ్ళి కాకుండానే అత్తవారింట్లో ముచ్చట్లు జరిపించుకుందామని ఉబలాటపడుతున్నాడు. మీరు ఎన్నేళ్ళు తపస్సు చేస్తేనే అట్లాంటి అల్లుడు దొరుకుతాడు!" అని ఆయనే నవ్వుకున్నాడు.

దశరథరామయ్యగారు బింకంగా కూర్చున్నాడు.

"సరేలే, ముచ్చట ముక్కలైనట్లే వుంది. రేపు నీ కూతురి పెళ్ళి అలాగే చేద్దువు గాని– నువ్వెళ్ళి ఆయన్ని దిగిరమ్మను"అంది ముసలమ్మ.

"దేనిమీదనుంచి దిగమంటారండోయ్?"అన్నాడు మరో వ్యక్తి.

"గుర్రం–సార్టుబండి"అంది ముసలమ్మ.

అందరూ నవ్వడం మొదలెట్టారు.

"ఐతే ముసలమ్మగారు ఓడిపోయినట్టే! ఆచారం మంటగలిపినట్లే!"

"ఇక్కడ ఎట్లా భోజనం చేస్తాడయ్యా? రానీ, నే మాట్లాడతాను పెళ్ళి కాకుండానే ఇక్కడ భోజనం చెయ్యటానికి సిగ్గులేదా అని నిలేసి అడుగుతా"అంది ముసలమ్మ.

"ఇంకా మీరు అడిగేదేమిటండి. ఓ మూల పెళ్ళి కొడుకు వచ్చిపడుతుంటే?" అన్నాడు. త్రివిక్రమదాసు.

ఇంతలో, వెంకటాద్రిగారు వెనకాలే, దయానిధి, జగన్నాథం, రాజభూషణం ఇంకా ముగ్గురు పందిట్లో కొచ్చారు. జనం ఒక్కసారి మాట్లాడడం మొదలెట్టారు.

పెళ్ళి కుమార్తె తాలూకు ఆడంగులు, ఓ డజను పైగా గుమ్మంలో నిలబడ్డారు, చోద్యం చూస్తూ. దశరధరామయ్యగారు లేచి కొడుకు దగ్గరకెళ్ళారు.

"ఏమయ్యా, స్నేహితులు మీరందరూ వుండి , మావాడికి చేసిన బోధ యిదా?" అని అడిగాడు రాజభూషణాన్ని సంబోధిస్తూ.

"మేం బోధ చెయ్యలేదు. అతనే మమ్మల్ని పురికొల్పుతున్నాడు. అన్నాడు రాజా."

"పోనీ నాన్నా, వాడికి వాడి స్నేహితులతో కలిసి కూర్చోవాలని సరదాగా వుంది కాబోలు. ఇప్పుడే మొచ్చింది" అన్నాడు రామానందం.

"అంత సర్దాగావుంటే, విడిదిలో అందరికీ భోజనాలు ఏర్పాటు చేద్దురుగా—తనకీ, స్నేహితులకీ?" అని అడిగాడు దశరధరామయ్యగారు.

"ఇదే విడిది అనుకోకూడదూ? – స్థలంలో ఏముంది?" అన్నాడు నిధి.

"అవును – స్థలాన్ని, కాలాన్ని విడగొట్టకూడదు– ఐన్‌స్టీన్ సిద్ధాంతాల ప్రకారం రెండూ కలిపి నాలుగో పరిమాణం అవుతుంది. పెళ్ళిళ్ళు జరిగేది నాలుగో పరిమాణంలోనే" అన్నాడు రాజభూషణం.

"అందరూ ఏమనుకుంటారు?"

"పెళ్ళికొడుకు పిచ్చాడనుకుంటారు!" అన్నాడు నిధి.

"పిచ్చాడికి పిల్లనిస్తారా?" అన్నాడు దశరధరామయ్యగారు.

"ఇవ్వరు. అసలు పిచ్చాడు పెళ్ళిచేసుకుంటాడా?"

"ఐతే ఈ పెళ్ళి సవ్యంగా జరగడం నీ కిష్టం లేనట్లుగా వుందే...."

దయానిధి మాటలాడకుండా స్వామీజీకి ఎదురుగుండా వున్న పీట మీద కూర్చున్నాడు. పక్కన రాజభూషణం, అవతల జగన్నాధం కూర్చున్నారు.

ముసలమ్మగారు మళ్ళీ వచ్చింది. ధైర్యం కోసం వెనకాల మరో ముగ్గురు స్త్రీలని మంచోబెట్టుకుని, "ఏమయ్యా, డాక్టరీకూడా చదువుతున్నావ్, ఈ మాత్రం తెలీదుటయ్యా–" అంటూ రాజభూషణాన్ని సంబోధించడం మొదలెట్టింది.

"What a foolish! ఆయన వేదాంతండోయ్, అమ్మమ్మగారు" అంటూ జగన్నాథం మాట్లాడటం మొదలెట్టాడు.

"అమ్మమ్మగారెవరు నాయనా?"

"పోనీ, బామ్మగారు– పెళ్ళికొడుకు ఈయన....."

ముసలమ్మ చెయ్యి కళ్ళపై నీడగా పెట్టుకొని నిధిని పరీక్షగా చూసి "ఏం బాబూ, నువ్వా? మా ఇందిర అదృష్టవంతురాలే అసలు అదృష్టం నాదే. నాకు ఈ మధ్య వూ పిరిపోటే దగ్గు; రాత్రిళ్ళు నిద్రపట్టదు. ఇనషజెన్‌లు ఇచ్చే అల్లుడు దొరకడం అదృష్టంకాదూ మరి! ఐతే నువ్వు విడిదిలో భోజనం చెయ్యి బాబూ, ఇక్కడ తప్పు – బ్రాహ్మలకి కోపాలొస్తాయి–"

ఇంతలో "భోజనకాలే గోవిందా...." అంటూ కేకలు ప్రారంభమయ్యాయి.

"పోనీ మీ అత్తగార్ని పిలవనా?" అంది ముసలమ్మగారు.

"మీరు మాతోటే భోజనానికి కూర్చోరాదుటండీ–" అన్నాడు త్రివిక్రమదాసు.

అంతా నవ్వారు. ముసలమ్మగారికి ఏమీ అర్థం కాలేదు. మరో అవకాశం వచ్చినప్పుడు తన అధికారం చలాయిద్దామనుకుని, ఇంట్లోకి వెళ్ళిపోయి, నేతి జాడీ పుచ్చుకుని వడ్డించటం మొదలెట్టింది. కూర తినడం ఐ, పచ్చడిలోకి వచ్చారు.

త్రివిక్రమదాసుని పద్యాలు పాడమన్నారు. "పెళ్ళికొడుకుచేత పాడించాలని" అన్నాడు త్రివిక్రమదాసు, ముసలమ్మని ఉద్దేశించి,

నిధి "నాకు సంగీతం రాదు, నే పాడలే" నన్నాడు.

"ఇప్పుడెందుకు పాడతావు"

ముసలమ్మ వాక్యం పూర్తికాకుండా, ఒక శాస్త్రులుగారు శ్లోకాలు చదవడం మొదలెట్టాడు జనానికి రుచించలేదు. కుర్రకారు ముసలమ్మనే పాడమన్నారు. ఆవిడ ఒళ్ళు మండింది; వేడి వేడి నెయ్యి చేతిమీద పొయ్యడానికి రయ్యిమని వెళ్ళి కొంచెం తమాయించింది. శ్లోకాలు ఎవరికీ నచ్చలేదు. "ఓరోరి బండివాడా" కావాలన్నారు. పోనీ రామనాథ శాస్త్రి పద్యాలు పాడమన్నారు. ఆడపెళ్ళివారి తాలూకు నాగేశ్వరరావు "సర్వేశ్వరుండగు" పాడాడు. జగన్నాథం తనని ఎవరేనా పాడమంటారేమోనని అటూ ఇటూ చూసి గొంతు సవరించుకున్నాడు. త్రివిక్రమదాసు చూపులు అతనిమీద పడ్డాయి.

"హో, హో, మనం గానం చెయ్యడం తప్పదంటారు?" అన్నాడు జగన్నాథం.

తప్పదన్నారు చుట్టూ జనం.

"రైటో! సభికులకి ఏది కావాలో కోరుకునేటందుకు సర్వాధికారం ఉంది– ఎక్సెప్టు త్యాగరాజ కృతులు తప్ప."

పులుసు వడ్డన జరుగుతోంది.

జగన్నాథం "ఎంకివంటి పిల్లలేదోయ్" పాడటం మొదలెట్టాడు కొంతవరకూ పాడి, మధ్యలో మాటలు మరచిపోయాడు.

"కతలూ సెప్పిందంటే– తర్వాత.....?"

ఎవరూ మాటలు అందివ్వలేదు; స్వంతంగా సాగించాడు.

"కతలూ సెప్పిందంటే కారక్కాయ్ నవలాల,

పదమూ పాడిందంటె పుగాకు పీల్సాల...."

"శ్రీమద్రమారమణ....." జనం గొడవ సాగించారు.

"బావగారు, రాహూకేతువుల్ని పాడమనరూ?" అన్నాడు జగన్నాథం మెల్లిగా.

"రాహూకేతువు లెవరూ? వింటారు స్మా,"

"వాళ్ళేనండి– కాషాయ వస్త్రధారీ మురారీ అడుగుదాటగలడా నా యానతి గాళ్ళండి–"

"ఓ, జీవసజీవలా? తప్ప! వింటారు."

రాజభూషణం విన్నాడు "నే పాడిస్తాను శిష్యా...." అంటూ సజీవని ఓ శ్లోకం చదవమని కోరాడు. "ఏదీ ఇందాకా, హాస్తినీ వగైరాది భగవద్గీతలోనిది."

సజీవ గొంతు సవరించుకుని, గురువుగారికేసి సూక్ష్మంగా చూసి శ్లోకం మొదలెట్టాడు.

"విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని శునిశ్చైవశ్వ పాకేచ పండితాస్స-మదర్శినః."

దానికి జగన్నాధాన్ని తాత్పర్యం చెప్పమన్నాడు నిధి.

"ఒకే బ్రాహ్మణుని యందును, కోతి కుక్కయందును, చండాలుని యందును...."

ఇంకా పూర్తికాకుండానే, వో నల్లకుక్క పందిరవతల తలుపు తోసుకుని చక్కా వచ్చింది.

"ఛీ, ఛీ, కుక్క కొట్టండి...." జనంలో అలజడి బయలుదేరింది. లక్ష్మయ్యగారు దాన్ని తరమడం మొదలెట్టాడు. అది కుంటు కుంటూ మధ్య బంతిలోనుంచి పరామర్శిస్తూ ప్రయాణం చేసి, వెళ్ళేటందుకు తోవ లేక రెండవ బంతిలోంచి నడిచి, మధ్యలో అంతా అగమ్యగోచరంగా, వుండేసరికి, వెనక్కి లక్ష్మయ్యగారి కాళ్ళ మధ్య నుంచే నడిచి మూడోవరసలోకి ప్రయాణం కట్టింది.

"చూస్తారేం? పట్టుకు చావతన్నక"

"అసలు ఎలా వచ్చింది లోపలికి?" అంటూ వో కంఠం ప్రశ్నించింది.

"ఏముంది? బహు సులభం రెండు తలుపులు మధ్యా ముందుకాలుతో గీరి, కొంత సందు చేసుకొని తరవాత కాస్తంత మూతిని లోపలికి పెట్టి, ముక్కు ద్వారా లోపలి పరిమళాన్ని అఘ్రాణించి బృందాన్ని నేత్రాలతో చూసి, ధైర్యం తెచ్చుకుని, మెడతో తలుపుసందు కొంచెం పెద్దదిచేసి...." అంటూ జగన్నాధం వర్ణన మొదలెట్టాడు.

"అదికాదు నేనడిగేది – అసలు దీన్ని లోపలికి ఎవరు రానిచ్చారనీ" అంది మళ్ళా మొదటి కంఠం.

"వెరీ సింపుల్! కేవలం ఆ శ్రీకృష్ణపరమాత్మ ఇంకెవరు. శునిచ భక్తికి సంతసించినవాడై, తదితర భక్తాగ్రేసరులైన జ్ఞానులని పరిశీలింప, యిట్టే తరిన్ గావించె– "తరి" తరవాత అరసున్న ఉంది."

లక్ష్మయ్య కాగడా అమర్చిన కర్రని పెల్లగించి, ఒక్కటంటించాడు. అసలే కుక్క కుంటిది; ఈ దెబ్బ తగలగానే దాని కాలు సాఫీ ఐనట్టుగా యీ భోజనశాల తన స్వైర విహారం కోసం ఉద్దేశింపబడ్డ పుణ్య భూమిలా "కేళి" సాగించింది.

బెదరగొట్టకూడదయ్యా మా ఇస్తళ్ళల్లో దూరబడుతోంది. అని జనం మొరెట్టుగుని, లక్ష్మయ్యని కసిగా చూసి, అంతా తలోతిట్టు తిట్టారు. పరోపకారం చేసేవాడు, ఈ త్యాగాలన్నీ చెయ్యాలి మరి!

కొట్టకుండా ఎత్తుకుని తీసుకెళ్ళి ఉయ్యాలలో బజ్జోపెట్టమంటారా అని అడిగాడు లక్ష్మయ్య.

"ఇంచుమించు అట్లాంటిదే మా అభిలాష" అన్న మీదట, ఆయన వెంకటాద్రి, త్రివిక్రమదాసు (ఆ క్షణంలో ఆవడ తినడం మానేసిన త్యాగి) లేచి దాన్ని గంజికావిడి పట్టి, బయటికి చేరేశారు.

ఛాందస బ్రాహ్మణులు కళ్ళు మూసుకుని మైసూర్‌పాకం నములుతున్నారు– ఏమిటో, తిండి తినాలి, తప్పుతుందా మరి!

జగన్నాధం వెంకటాద్రి గార్ని కేకేశాడు.

"ఏమండోయ్! ఆ శునకరాజాన్ని; సజీవ ఒళ్ళో కూర్చోపెట్టండి. కొండాకచో తొడమీద –" మెల్లగా రాజాతో – "ద" తర్వాత అరసున్న లేదనుకోండి.

నల్లకుక్క నిష్క్రమించగానే కొంత అలజడి తగ్గింది.

ఇంతలో మాధవయ్యగారు చక్కా వొచ్చి, వొకసారి పందిట్లో పచార్లుచేసి, కనుక్కుంటున్నారు. జగన్నాథం ఆయన్ని కేకేసి–

"మామగారు, ఇఫ్ఐయామ్ రైట్– ఆ లుంగీ వ్యక్తిని కాస్త కొళంబు వొడ్డించమనండి" అన్నాడు.

మాధవయ్యగార్కి నవ్వొచ్చింది. "పట్టుపంచి లుంగీలో దోషం లేదుగా, ఒరే రాముడూ, యిల్లారా" అని కేకేశాడు.

సిల్కు లుంగీ రాముడూ వొడ్డించడం మొదలెట్టాడు.

"లుంగీ బాగానే వుందండి– ఎక్కడ కొన్నారు. ఎంతకి కొన్నారు? ప్రశ్నద్వయం."

"అవన్నీ నీకెందుకు?" అన్నాడు లుంగీ రాముడు.

కేవలం స్వార్ధరహితమైన కౌతూహలం. సత్యాన్వేషణ – ఏమంటారు స్వాములోరు? సమాధానం చెబితే సంతోషమౌతుంది. చెప్పకపోయినా సంతోషమౌతుంది.

మాధవయ్యగారు నవ్వుతూ – పోనీ చెప్పరా, ఎక్కడ కొన్నావో

"సరే, వాల్తేరులో."

"నా రెండో ప్రశ్న?"

"............"

"?" కనుబొమ్మలు చిట్లించి.

"......" పెదవి చప్పరించి.

" " మూతి బిగించి.

"........" తల పంకిస్తూ.

"మామగారు, యిఫ్ ఐయాం నాట్ రాంగ్ సత్యాన్ని అన్వేషించగలిగాను. కనుగొంటినీ శ్రీరాముని నేడు...... త్యాగయ్య, అఫ్‌కోర్స్ మీ లుంగీ వీరి స్వంతం కాదు."

మాధవయ్యగారు విరగబడినవ్వారు. లుంగీకి వొళ్ళుమండి చురచురా నడిచిపొయ్యాడు.

జగన్నాథం అన్నాడు – "వెడలెను. కోదండపాణి – ఐ బూట్ రాముడు పులుసు జారితో వయ్యారం బొలక వెడలె– "బొ" తర్వాత అరసున్న వుండాలి....."

ఇంతలో దూరంగా తలుపు సందులోంచి ఒక తలపాగా, పాల కావిడీ లోపలికి తొంగి చూశాయి. మాధవయ్య ఆ దృశ్యాన్ని చూసి తొందరగా వెళ్ళి, ఆ పాగాని బైటికి నెట్టి, కాగడా కర్రతో వొక్కటి వొడ్డించాడు. తలపాగాని చూడగానే, భోజనం చేస్తున్న శాస్త్రుల్లుగారు లేచిపొయ్యాడు. ఆయన జీవితం అపవిత్రం ఐపోయింది. ఆ పాగా వ్యక్తి పేరు నారన్న; కాపు, పొరుగూరునుంచి పాలకావిడి మోసుగొచ్చాడు బ్రాహ్మలు భోజనాలు చేస్తున్నారని తెలుసుకోకుండా, లోపలికి ప్రవేశించి అపవిత్రం చేశాడు. అక్కడికీ మాధవయ్యగారు యిల్లాంటి ప్రమాదాలు

జరక్కుండా, గుమ్మందగ్గర కాపలా పెట్టిన ద్వారపాలకు లిద్దరూ, నోట్లో చుట్టలతో సహా గుమ్మానికి జార్లపడి నిద్రాదేవి హస్తాలతో బిగించబడ్డారు.

లేచి బైటికి వెళ్ళిన శాస్త్రులుగారిని మాధవయ్యగారు సముదాయించి క్షమాపణ కోరుతున్నారు.

"ఈ పాలకాపు చూసినందుకు కాదు నే లేచింది. వాడి వెనకాల గడ్డిమోపు ఏనాదికూడా తొంగి చూశాడు" అన్నాడు శాస్త్రుల్లుగారు.

మాధవయ్యగారు ఆ ఏనాదిమీదికి కాగడాకర్ర ఎత్తి వొడ్డించబోతుండగా, దయానిధి తొందరగా వెళ్ళి, ఎడంచేత్తో, ఆ కర్రనీ పట్టుగొన్నాడు.

నారన్నకాపు, గడ్డిమోపు ఏనాది ఎండలో ఎన్నోమైళ్ళు నడిచి, బొగ్గుతో చెక్కిన బొమ్మలలా తయారయారు. వారి శరీరాలమీద నుండి తలంటు సమయంలో నూని కారినట్టు చెమటకారి యిసికలో పడుతోంది. వాళ్ళు బిక్కమొహాలేసి "మేం సూళ్ళేదండి– సూత్తె సేత్తాంటండి బాబయ్యా–" అని మొత్తుగుని ప్రార్థిస్తున్నారు.

దయానిధి కాగడా కర్రని దూరంగా గిరివాటేశాడు.

శాస్త్రులు గారికి వొళ్ళు మండిపోయింది. "నేనింక భోజనం చెయ్యను" అని వెళ్ళిపోతున్నాడు.

"నేనూ భోజనం చెయ్యను–" అన్నాడు నిధి.

"మీరు వెళ్ళి తినండి – ఇప్పుడొచ్చిన ప్రమాదం ఏమీ లేదు." అన్నాడు మాధవయ్యగారు.

"ముందు వాళ్ళకి యింత మజ్జిగదాహం యిప్పించండి." అన్నాడు నిధి.

దయానిధి వెనకాలే రాజా జగన్నాథం కూడా లేచి వొచ్చేశారు.

"పెళ్ళికొడుకు అలిగాడుటగా.... " అంటూ ముసలమ్మ గారొచ్చింది ఆవిడ, మాధవయ్యగారు, వెంకటాద్రిగారు దయానిధిని భోజనం పూర్తి చెయ్యమని బ్రతిమలాడారు. కాని లాభం లేకపోయింది.

నారన్న కాపు కూడా "తప్పాండీ – మా కోసం మీ రెండుకండి తిండి మానడం మాకీ కష్టం లెక్కేంటండి లెగండి......" అని బ్రతిమాలాడు.

నిధి రాజావారి విడిదిలోకి నడవడం మొదలెట్టాడు.

"హస్తిని శునిచైవశ్వ పాకేశ పండితా స్సమదర్శి....నోరు తిరుగదు. ఏం చెయ్యను?" అంటూ జగన్నాథం వారి వెనకాల బైలుదేరాడు.

గదికి వెళ్ళగానే నారయ్య "టపా" అందించాడు వాటిలో రొమాటిక్ సీనూ వ్రాసిన ఉత్తరం, టెలిగ్రామూ రెండూ ఉన్నాయి. ఉత్తరంలో సాయంత్ర బండిలో మూహూర్తం వేళకి వొస్తున్నాను, స్టేషన్‌కి ఎవర్నేనా పంపమని రాశాడు. టెలిగ్రాంలో కారణాంతరాలవల్ల రాలేకపోయినందుకు చింతించి, ఆశీర్వచనాలు తెలియజేశాడు.

సాయంత్రం ఆరుగంటలైంది. జగన్నాథం మరికొందరు పిల్లలూ, నారయ్యా వీధుల్లో ఆట్లాడుకొంటున్నారు. దశరథరామయ్యగారు, రమానందం, మరికొందరు బంధువులూ కొత్త దుస్తులు వేసుగుని సామానులు సర్ది పెళ్ళిపందిట్లోకి వెళ్ళడానికి సన్నాహాలు చేస్తున్నారు. దూరంగా సన్నాయి వాద్యం వినబడుతోంది. నీళ్ళుచల్లిన కుంకుమ బొట్టు పడమటి ఆకాశం ఎర్రగా కప్పకున్న ముసుగులోంచి, వొక్కొక్క

నక్షత్రాన్నే బైట పెడుతోంది. మేఘాలు, ఆకాశంలో బాణాసంచా కాలుస్తూన్నాయి. నిశీధిని అన్ని వేపులనుంచి తొంగిచూస్తూ చొరవగా ప్రవేశిస్తోంది. పడమటి ఆకాశం వేసిన రంగుల కాగడాలని వొక్కొక్కదాన్నే ఆర్పేస్తూ నక్షత్రాల ద్వారా మెరుస్తూ నవ్వుతోంది. నిధి కనురెప్పల కింద ఎర్రగా మెరిసిన తడి నీలంగా మారింది. అతని భుజంపైన "రాజా" చెయ్యివేశాడు.

"లేరా – బట్టలు కట్టుగో – మరి వాళ్ళంతా వొస్తారు. ముహూర్తం టైమవుతోంది." అన్నాడు. "అదేమిట్రా, ఏడుస్తున్నావు? శుభ సమయంలో ఆనంద భాష్పాలా?"

నిధి చిటికినవ్రేలితో కన్నీటి చుక్కల్ని తొలిగిస్తున్నాడు – ఎందుకో తెలీకుండా, ధారగా ప్రవహిస్తున్న కన్నీటి చుక్కలు.

"ఇదేమిట్రా – పెండ్లికూతురు అత్తవారింటికెళ్ళేటప్పుడు చెయ్యవల్సిన అభినయం యిప్పుడే నువ్వు చేస్తున్నావు."

"ఏమీలేదు" అని నిధి లేచికూర్చున్నాడు. కళ్ళు వర్షం పోగొట్టుకున్న మేఘంలా తేటగావున్నాయి.

"ఎందుకురా – నాతో చెప్పకూడదు? నేను నీ అంతరంగిక స్నేహితుణ్ణి కానూ?"

"ఏమీలేదు ఏవేవో జ్ఞాపకానికొచ్చాయి."

"కోమలా?"

"ప్రత్యేకంగా యిదీ అని చెప్పలేను...." అన్నాడు నిధి పడమటి ఆకాశంలోకి చూస్తూ మళ్ళా ఏదో స్మరణకివొచ్చినవాడిలా – "కోమలి విషయం నీకెట్లా తెలిసింది?" అని అడిగాడు.

"ఇల్లాంటివి తెలీకుండా వుంటాయామరి? అదేం చిత్రమో, మనం రహస్యాలని స్నేహితులకి మినహా, అందరితోనూ చెప్పగుంటాం. స్నేహితులు ఎట్లాగో తంటాలుపడి తెలుసుగుంటారు...."

"ఇందులో రహస్యం ఏముంది? ఒక పురుషుడు, ఒక స్త్రీని వాంఛించడంలో, ప్రపంచానికి టాం టాం వేసేటందుకు తగినంత విశేషం ఏముంది?"

"అవును, ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి వాంఛించిందంటే ఆ విషయాన్ని ప్రపంచమే టాంటాం వేస్తుంది, నా అభిప్రాయం, మొదటినుంచీ నీకీ పెళ్ళి సుతరామూ యిష్టంలేదని, నిజమేనా?"

"నీకా అభిప్రాయం ఎందుకు కలగాలి?"

"నీ ఉత్సాహం తెచ్చి పెట్టుకున్నట్లుగా కనబడుతోంది. స్వల్ప విషయాలు, చికాకు కలగచేస్తే ఆ మనిషిలో ఏదో చెడిపోయిందన్న మాట. పెళ్ళివారింట్లో భోజనం చేస్తాననడం మూర్ఖమైన పట్టింపుకాదు? మామగారిని మామగారు వుతికితే, కోపగించి లేచిపోవటం మూర్ఖ్యంగాదు? గంటలో పెళ్ళి కాబోతుంటే, వొక్కడవు గదిలో ఏడుస్తూ కూర్చోవడం మూర్ఖ్యం గాదు? ఇంకా నిదర్శనాలు కావాలా?"

దయానిధి పెదవులు నవ్వుకోసం విప్పుకున్నాయి; కంటికింద బుగ్గమడత పడింది.

చీమ కుడితేనూ, ప్రొమోషన్ కాకపోతేనూ, సినిమాకి టిక్కెట్లు దొరక్కపోతేనూ, ప్రియురాలికి లేఖ వ్రాసి అణాబిళ్ళ అంటించడము మరచిపోయి పోస్టులో వేసినప్పుడు విచారించడానికి అలవాటుపడిన వ్యక్తులు, నిజమైన దుఃఖానికి కారణాలని కాని, దాని లోతునికాని నిర్ణయించలేరు ఆకాశములో అస్తమించే సూర్యుడ్ని చూసి ఏడుపు రాకూడదూ? కాలం గడచిపోతోంది. శ్మశానంలో మంటలు చల్లారిపోతున్నాయి. కన్య, పళ్ళు వూడిపోయి, జుట్టు నెరసిపోయిన అవ్వని చూసి హడలిపోయి నవ్వడము మానేస్తుంది. వానకి వొణికిపోయిన పువ్వు వికసిస్తుంది. ఆ దృశ్యాలన్నీ తల్చుకుంటే దుఃఖం రాకూడదూ? అల్లాంటి దుఃఖమే నాది.

"కొంపతీసి కవిత్వం రాస్తున్నావా ఏం రా?" అన్నాడు రాజా. "ఇందతా కోమలిలోంచి పుట్టిన కవిత్వమే కాబోలు, పోనీ కోమల్నే పెళ్ళి చేసుకోలేక పొయ్యావు. గ్రంధం ఎంతవరకూ నడిచింది? ఇప్పుడెక్కడుంది?" అంటూ బోలెడు ప్రశ్నలు అడిగాడు.

ఇతరుల ప్రేమగాధలు వినడం కంటే విసుగు పుట్టించేది మరోటి లేదన్నాడు నిధి. చెబితేకాని వల్లకాదన్నాడు రాజా. మరి ఎవ్వరితోనూ చెప్పనూ. అంటూ ప్రమాణాలు చెయ్యడం మొదలెట్టాడు.

"నువ్వు నమ్ముతావా, రాజా!"

"నిజం చెబితే."

"ఐతే విను, నేను కోమల్ని ప్రేమించలేదు, వాంఛించాను."

ఈ రెంటికి తేడా ఏమిటో నాకు తెలియదు.

"నువ్వు ఫిలాసఫర్‌వి నీకు తెలీదంటే ఆశ్చర్యంగా ఉంది. వాంఛించిన వస్తువుని ఎప్పుడూ ప్రేమించలేడు వాంఛించడం అంటే అనుభవించడం, అనుభవించడంవల్ల ఆ వస్తువు నశిస్తుంది. నశింపుకాకుండా చేసేదే నిజమైన ప్రేమ అనుకుంటాను."

"ఇదంతా ప్లేటోలో చదివాను. పూర్వకవులు ప్రబంధాల్లో అఘోరించారు. ఈ కబుర్లన్నీ ఆత్మవంచనే ననుకుంటాను. ఛండాలపు పనులని సమర్ధించేటందుకు వాళ్ళు కల్పించిన భాష తప్ప యధార్ధం కాదు; ప్రేమకి వాంఛ తప్ప మరో ఆశయం వుందనుకోను" అన్నాడు రాజా.

నీ యిష్టం వొచ్చినట్లనుకో – కాని ఆ రెండింటికీ తేడా వుందని గుర్తించ మంటున్నా, కోమలి వొక ప్రత్యేకమయిన వ్యక్తని నేను అనుకోలేదు. ధ్వంసం చేసి నాలో ఐక్యం చేసుకోవాలన్నంతటి వాంఛ ఆ రాత్రి సమయం దొరికింది. రాత్రికి రమ్మంది, వెళ్ళాను. అన్నీ అవకాశాలే; నేను ధ్వంసం చేసి వుందును; వేరే వుండటము సహించలేక చంపేసి వుందునేమో; కాని, రాజా! నువ్వు నమ్మాలి సుమా. ఎందుకో ఆకస్మికంగా ఆమెను ప్రేమించటం జరిగింది..." మౌనంలో పడ్డాడు నిధి.

"ఇంతకీ ఏం జరిగింది?"

"నవల్స్‌లో మాదిరిగా, నీకు ఐదు నిముషాల్లో క్లయిమాక్సుకు రావాలి? ఏమీలేదు. ప్రేమించాను; ఆమెని క్షమించాను. తననిగా తనని వుండనిచ్చాను. నాకు చంద్రుడూ, నక్షత్రాలు, మేఘాలు, హిమాలయ పర్వత శిఖరం, కోమలీ

– అందరూ సమానులే. ఇవి లేకపోతే నే జీవించలేను. వీటిని వాంఛించను. ప్రేమిస్తాను. అర్థమైందా?"

"ఐతే, కోమల్ని ఏమీచెయ్యకుండా అమాయకుడిలా వొదిలేసి చక్కావచ్చాను, నమ్మమంటావ్?"

"నమ్మలేవా?"

"నమ్మలేను. నేననుకోవడం, ఏమన్నా చేస్తే వివాహము చేసుకోవాల్సి ఒస్తుందేమోనని భయపడ్డావు. పెండ్లి చేసుకునేటందుకు ధైర్యం లేదు నీకు. నైతికంగా పిరికివాడి వయ్యావు. పైగా కోమలి మహాపతివ్రత అని, దేవకన్య అనీ నువ్వు కలలోనైనా అనుకున్నావని నేననుకోను. కొంత అసూయ; ఆమెనుంచి ప్రోత్సాహం లేకపోవడం – ఇవన్నీ నిన్ను కలతపెట్టి వుండొచ్చు. అంచేత ఆ రాత్రి యేం జరిగిందీ చెప్పక, ఈ నీతి తాలూకు ముసుగు కప్పుకున్నావు" అన్నాడు రాజా.

"నువ్వు చెప్పిన కారణాలన్నీ నిజంకావచ్చు, కానీ, ఆ రాత్రి కోమలిని ఏమీ చెయ్యకుండా, నా వాంఛని త్యాగం చేసి ఒదిలేసి వెళ్ళిపొయ్యానని నమ్మితే నేనింకేమీ అడగను."

"అంటే కోమలి కన్య, కొత్తపిల్ల. అమాయకురాలు – మొదట కొంత మచ్చిక చేసుగుని, మొన్నాడు రావచ్చుకదా అనుకున్నావేమో! స్త్రీని నూనిలో తడిపిన కాగడాతో పోల్చవచ్చు. ఏ పురుషుడో అగ్గిపుల్ల అంటిస్తేనే కాని మండదు. నా వుద్దేశం స్త్రీకి అసలు ప్రేమలేదని, ఏ ఒక్క పురుషుడి మీద గురి వుండదు; తన ఆశయాలని పురుషుడి మీద లగ్నం చెయ్యదు. ఆమెకి కావల్సింది సంతానం. అది కాస్తా తీర్చేవరకూ పురుషుడ్ని వేటాడుతుంది. మాతృత్వం అనుభవించిన తర్వాత పాత రిబ్బన్‌లా తీసి పారేస్తుంది. రోడ్డుమీద నడిచేవాళ్ళు (అంటే సంఘం) అయ్యోపాపం, రిబ్బన్ పారేసుగున్నారు తీసుకోండి అని మళ్ళా ఆమెకి యిస్తారు. దాన్ని తడిపి ఎండేస్తూ బీరువాలో పెట్టుగుంటుంది."

దయానిధికి నవ్వొచ్చింది.

"రాజా, నువ్వు వేదాంతం చదువుతున్నావు. తార్కిక శిఖరాల మీదకాని కాపురం చెయ్యవనుకున్నాను – కాని నీకు లోయలతో చాలా పరిచయం వుందే, నువ్వు ఆశ్చర్యపడతావు వో విషయం చెపితే."

"ఏమిటది?"

"కోమలి నన్ను ప్రేమించింది."

"సెబాష్"

"అందుకనే చెప్పనన్నది."

"లేదులే చెప్పు."

"అంటే కోమలికి నాపై వాంఛలేదు; నువ్వనుకున్నట్లు సంతానంపై కూడా కోర్కెలేదు. ఐతే, నేను లేకపోతే ఈ ప్రపంచమేలేదు. ఆమెకి"

"దీనికి నిదర్శనం"

"ఆ మొన్నాడే ఆ వూళ్ళో నుంచి వెళ్ళిపోయింది." అన్నాడు నిధి రాజా కళ్ళల్లోకి పరీక్షగా చూస్తూ.

రాజా విరగబడి నవ్వాడు, సిగరెట్టు పొగ ముక్కులోకెళ్ళి వుక్కిరి బిక్కిరయ్యాడు.

"మరోడితో లేచిపోయింది – ఆ విధంగా ఆమెకి నీపై వున్న ప్రేమ ప్రకటించింది అంతేనా?... నవ్వు బలవంతంగా ఆపుకొని – "నాతో అంటే అన్నావు గాని, ఇంకెవ్వరితోనూ అనకు – పిచ్చాసుపత్రిలో గది నెంబరు వెదుకుతారు." అన్నాడు.

"ఎవరో బాగా ఆస్తి వున్నాయన – నాకు వివరాలు తెలీవు – కోమల్ని తీసుకొని వెళ్ళిపోయాడంట; వాళ్ళ అమ్మకూడా వెళ్ళిపోయింది, కూతురుతో; ఐనా కోమలి నన్ను ప్రేమించిందని నాకు తెలుసు; నేను నమ్ముతున్నాను. నా మనస్సు, రక్తం చెబుతున్నాయి..."

"అట్లాగయితే, నేనిక్కడ కిళ్ళీ దుకాణం పెట్టుకుని, నన్ను గ్రేటాగార్బొ ప్రేమించిందంటే, నీ కెట్లాగనిపిస్తుంది?" అని అడిగాడు రాజా!

"కోమలి శరీరం నా ప్రేమతో పెరిగింది. హృదయం ఇప్పుడిప్పుడే జనిస్తోంది. ఆనాడు ప్రేమతో చూసింది నక్షత్రమండలం కూలి పడినట్లయింది. ఆ చూపులో మూగ పిలుపు, ఆశ, ప్రోత్సాహం, లాలన, మందలింపు, ఓదార్పు – మానవత్వం కన్ను తెరిచినట్లుగా – అన్నీ ఉన్నాయి. అది ప్రేమ; కాలిపొయ్యే నుదురు, మండిపొయ్యే పెదవులూ, కత్తిలా కోసేసే రొమ్ములూ, అలసిపోయిన మూల్గూ, శృంగారము లేని రోదన ఇవికావు కోమలి ప్రేమచిహ్నాలు. ఆమె ఎక్కడికెళ్ళినా, ఎవరి హస్తాలలో నలిగిపోయినా, ఏ దౌర్భాగ్యుడి శిక్షణలోనో వంపులు పోగొట్టుకున్నా – ఆమె హృదయం, దృష్టి, మానసిక వైరాగ్యం అన్నీనాకోసం కాచుకుని వుంటాయి..."

"అట్లా అనుకుని తృప్తిపడక, ఈ విచారం ఎందుకు?" రాజాకి నిధి మాటలు అర్థంకాలేదు. అదంతా పుస్తకాలవల్ల వచ్చిన భాషాపూరిత ఉద్రేకం అనుకోడానికి వీల్లేదు. ఆ మాటల వెనుక అనుభవాన్నుంచి జనించిన విశ్వాసం – బాధకి బంధించబడిన సంస్కారం ఉన్నాయని ఒప్పుగోవల్సి వస్తోంది. మళ్ళా అడిగాడు. "ఐతే ఇప్పుడు విచారం ఎందుకు?"

"కారణం లేని దుఃఖం అని మొదటే చెప్పాను. విశ్వాసాన్ని, నమ్మకాన్ని, ఆదర్శాన్ని చూసి, విని ప్రపంచం వెక్కిరించినప్పుడు, ఆ ప్రపంచాన్ని చూసి, దుఃఖించి "నాకు దీనితో నిమిత్తంలేదు." అని తృప్తిపడటంలో విశేషం ఏముంది...? సంపూర్ణమైన ప్రేమతో హృదయము నిండినప్పుడు సగం సగం మనుషులని, అసంపూర్ణమైన అనుభవాలని చూసిన వ్యక్తి దుఃఖించక చేసేదేముంది?"

ఇద్దరూ మవునంలో పడ్డారు.

అప్పుడు "రాజా" అన్నాడు – "నీ విచారానికి కారణం నాకు తెలుసు. చెబితే కోపం రావచ్చు."

"నువ్వు అనుకున్నవి కొంత వరకూ కారణాలు కావొచ్చు; కాని నిజమైన కారణం చెబితే ఎవరూ నమ్మరు, ఈ సంఘంలో ప్రేమకి చోటులేదు" అన్నాడు నిధి.

"నువ్వు నీ భార్యని ప్రేమించుకుంటే సంఘం వొద్దంటుందా?"

"ప్రేమలేని వివాహం, వివాహంలేని ప్రేమ – వీటిలో మొదటిది వ్యక్తిని బాధిస్తుంది. రెండవది సంఘాన్ని బాధిస్తుంది. నేననుకోవడం సంఘం బాధపడినా ప్రమాదంలేదు. వ్యక్తుల సంతోషం ముఖ్యం."

"ఐతే ఇందిరని నువ్వు ప్రేమించలేవా? నీకు నచ్చకపోతే ఈ వివాహానికి ఎందుకు ఒప్పుకున్నావు?" అని అడిగాడు రాజా.

"నాకు అందరి భర్తలలాగా, శరీరాన్ని ఒకచోటా, మనస్సుని మరోచోటా ఉంచటం చేతకాదు. రాజా చాలామంది యువకుల మాదిరిగా, నేనూ, పెళ్ళి సంఘం కోసం, బంధువుల కోసం చేసుకుంటున్నా నేమో అని అనుమానం. వివాహం నెగ్గాలంటే, భార్యాభర్తలకి నటనలో కొంత తర్ఫీదు అవసరం. ఆ విధంగా నాకు అర్హత లేదు. ఏకపత్నీవ్రతం, ఇతర స్త్రీలని తల్లుల మాదిరి చూడటం ఇవన్నీ కావాలి. నాకీ వాగ్దానాలలో నమ్మకం లేదు. ఏ మనిషీ తన ఉద్రేకాలనీ, వ్యక్తిత్వాన్ని భవిష్యత్తుకి అంకితం చేసుకోలేడు. చేసుకోకూడదని కూడా అనుకుంటాను. అట్లాగే భార్య పాతివ్రత్యం; కనీసం భౌతికంగా నయినా నటించాలి. ఊహ, శక్తి, ఆదర్శం, వ్యక్తిత్వం లేని స్త్రీలు పతివ్రతలుగా వుండగలరేమో నాకు తెలీదు. వివాహం నటీనటుల స్వర్గం. మన సౌఖ్యం మనలని మనం మోసగించుకునే శక్తిమీద ఆధారపడుతుంది. నాలో ఆ శక్తి లేదు..."

ఇంకా చెప్పపోతుండగానే, మధ్యలో రాజా అన్నాడు –

"ఇంకా వివాహం అంటే నీకు అనుభవం లేకుండానే, దీన్ని గురించి ఊహించి భయపడుతున్నావు. ఇది చాలా తప్పు. ప్రతి వ్యక్తీ తన వివాహం ఆదర్శమయినదిగా ఉండాలని కోరతాడు; అల్లా కోరకపోతే ఏ బెంగా ఉండదు. నువ్వు జీవించడానికి బదులు జీవించడాన్ని గురించి ఆలోచిస్తావు. అదే నీ విచారానికి కారణం. కోమలికి శీలం లేదు; నీకు కోమల్ని పెండ్లి చేసుకోవాలని లేదు; ఉన్నా తండ్రిని ధిక్కరించలేవు; సంఘం అంటే భయం నీకు. జీవితం అంతా ఊహించుకుంటూ, బాధపడుతూ గడపాల్సిందే! లే, లే ఎవరన్నా నవ్వుతారు. పోనీ, వివాహం సంఘంకోసం అనుకున్నవాడవు, ఇందిరలో అన్ని మంచి లక్షణాలను చూసుకోడం దేనికి? ఇందరికి చక్కదనం, సంగీతం, డబ్బు, గుణం, గౌరవం – అన్నీ ఉన్నాయి. నిన్ను సుఖపెడుతుందని నాకు గట్టి నమ్మకం వుంది..."

అతన్ని లేవదీసి, నోట్లో సిగరెట్టు పెట్టి అగ్గిపుల్ల ముట్టించాడు. "ఆడపిల్లలా ఏడుస్తున్నాడు, లేకపోతే" అంటూ.

దయానిధి రుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు.

అవును రాజా – ఆలోచిస్తే అంతా భయంగా ఉంటుంది. ఒక కొత్త వ్యక్తితో జీవితం గడపడానికి నిశ్చయించుకోవడం అంటే భయంగా ఉండదూ? మన స్వేచ్ఛపోతుందని భయపడేగా నువ్వు బ్రహ్మచారిగా ఉంటున్నది? అన్నాడు నిధి.

"నా విషయం వేరు. నా ఉద్దేశంలో అసలు స్త్రీకి ప్రేమించడం చేతకాదని, ప్రేమ పురుషులకీ పురుషులకీ సాధ్యంకాని, స్త్రీకి పురుషుడుకీ మధ్య ఉండేది వాంఛ తప్ప, ప్రేమకాదు. స్త్రీ కోరేది పదిమంది ఇతర స్త్రీలతో తను వాంచించబడటం అదేనా అట్టేకాలం కాదు; సంతానం కలిగే వరకే పురుషుడ్ని మాతృత్వం కోసం బానిసగా చేసి తన పని ముగిసిం తర్వాత తన పిల్లలకి అన్నం సంపాదించే కూలి వాడికింద చూస్తుంది. ఏదో ఘనకార్యం చేయాలనుకున్న నా బోటిగాడు తన కాలాన్ని, శక్తిని ఈ కూలిపని కోసం వృధా చెయ్యడానికి

వొప్పుకోడు. పురుషుడిలోని సృష్టి శక్తులని ప్రేమ పేరు శృంగారం పేరు చెప్పి, ధ్వంసం చెయ్యడానికి సిద్ధంగా ఉన్న మందుగుండు సామాగ్రి స్త్రీ అంటే –"

"సరే, స్త్రీ మీద లెక్చర్ మొదలు కాబోలు – వెడదాం పద కానీ రాజా, నువ్వేదో స్త్రీ వలలోపడి, బెర్నార్డ్ షాకి శిష్యత్వం మానడం నే చూడలేకపోతానా? నా అభిప్రాయం, నీ చేత స్వతంత్రంగా ఆలోచించేటట్లు చేసే శక్తి, వొక్క స్త్రీకే ఉంది. నిన్ను బానిసని చేసేసుకుంటుంది..."

"పాపము శాంతించుగాక!... పెళ్ళివారు కాబోలు, పద...."

ఇద్దరూ లేచి బైలుదేరారు.

దయానిధి ఇందిర పెండ్లి పీటలమీద కూర్చున్నారు.

"ఇంత ఆలస్యం ఐతే ఎట్లా" గంటూ మాధవయ్యగారు బిగ్గరగా కేకలెయ్యడం వల్ల మొగ పెళ్ళివారికి కొంచెం కష్టం తోచినా, తరువాత హడావుడిలో అంతా మరచిపొయ్యారు. మధుపర్కాలలో ఉన్న వధూవరులు పెళ్ళి పందిట్లో వెలిగిపోతున్నారు. దయానిధి ఇందిరకేసి భయంతో చూశాడు. ఆమె కళ్ళు కిందికి దించేసింది. తీర్చిన కనుబొమ్మలు, చిత్రమైన బొట్టు, వంకర తిరిగిన చెక్కిళ్ళు, రేగిపోయి, బుజాలమీదికి జారిపోయిన ఉంగరాల జుట్టు – అవి మాత్రం అతనికి కనిపించాయి; సిగ్గుతో, భయంతో ఆమె పెదవులు వొణికిపోతున్నాయి. గాలి ఏ దిక్కుగా వీస్తున్నదీ తెలీక, తెరచాప ఎత్తడానికి జంకుతున్న నావికుడులా, దయానిధి, ఏమీ అర్థంకాక వెఱ్ఱిచూపులు చూస్తున్నాడు. అది పవిత్రమైన సమయం. అతను ప్రత్యేకమైన వ్యక్తికాడు; సంప్రదాయాలు, సంఘం అతని ద్వారా తమ విధిని నెరవేర్చుకుంటున్నాయి. బ్రాహ్మలు వింత కంఠాలతో విచిత్రమైన భాషలో ఏదో చదువుతున్నారు. కొందరు సన్నాయి వాయించమంటున్నారు; మరికొందరు వెంటనే నిలిపివేయమంటున్నారు. మహా గందరగోళం తరువాత వెంటనే భయంకరమయిన నిశ్శబ్దం ఆ పందిట్లో తాండవిస్తోంది. గాజులు, నగలు, సిల్కు చీరల రెప రెపలు, గంధం, అగరొత్తులు, ఇలాయి బుడ్లలో నూనెజ్వాలల మసగ చప్పుడు, పాదాలు, చేతులు, ముడుచుకున్న పెదవులు. అక్షతలు, పువ్వుల రేఖలు, దూరంగా పాపాయి అర్థంలేని ఏడ్పు; యింకా దూరంగా వంట బ్రాహ్మల రొకాయింపు. రూపాయల చక్కలిగింత చప్పుడు – అన్నీ. ధ్వనులు తెగిపోయిన దృశ్యాలు, అస్పష్టమైన పరిమళాలు – అన్నీ పెద్ద కెరటం, పాము పడగలా లేచి, కొండరాతిపై తల బ్రద్దలు కొట్టుకొని తునియలయినట్టుగా. వాతావరణం అంతా ఆక్రమించుకున్నాయి. సూర్యచంద్రాదులు, తమ నిజస్థానాలు వొదిలి దగ్గరగా వొచ్చినట్లు, కళ్ళు మిరుమిట్లు గొల్పుతున్నాయి.

కళ్యాణం తోసుకొస్తోంది. వెయ్యి పిల్ల కెరటాలని తనలో ఐక్యం చేసుకుని, ఒక్క పెద్ద కెరటంలా లోతులని దొల్చుకుంటూ వొచ్చే మహత్తర సముద్రపు నీటి ప్రవాహం లాంటిది కళ్యాణం. ఎవ్వరూ ఆపలేని పెద్దగాలి. ఆపుకోలేని నవ్వు ఏడ్పులాంటిది. అందరూ గడియారాలకేసి చూస్తున్నారు. కొందరివి మెల్లిగా తిరుగుతున్నాయి కొందరివి చాలా వేగంతో తిరిగి పోతున్నాయి. మరికొందరివి విసుగెత్తి అసలు తిరగడం మానుకున్నాయి. కాలాన్ని నిర్ణయించటం మానవుడికి చేతకాదు కాబోలు లగ్నం తొమ్మిది గంటల మూడు నిముషాలకట. ఎవరికి తెలుసు?

బ్రాహ్మలు తెలుగులో సంస్కృతంలో లెక్కలు ఉకడుతున్నారు; ఏముందండి — లగ్నం నిర్ణయించటం మహా సులభం — పెళ్ళికొడుకు ఎప్పుడు పుస్తె కడితే అప్పుడు తొమ్మిది గంటల మూడు నిమిషాలయిందన్నమాట" అన్నాడు త్రివిక్రమదాసు అందరూ నవ్వారు; ఇందిర కూడా నవ్వుని అపుకుంటోంది. పెండ్లి సమయంలో కూడా నవ్వటం చేతగాని దౌర్భాగ్యులు ఆ పందిట్లో ఎందరున్నారో ఎవరు చెప్పగలరు? మళ్ళా సన్నాయి వాయించమన్నారు. మళ్ళా మంత్రాలు, యిందాకటికంటే వేగంగా: యింకా ఎక్కువ ధ్వనులు, పరిమళాలు, దృశ్యాలు. విరగబడి నవ్వడాలు; తమ తమ పెళ్ళిళ్ళు జ్ఞాపకం తెచ్చుకుని కంట తడి తుడుచుకొనే స్త్రీలు, పురుషులు అసంద బాష్పాలు; సంపూర్ణ మానవుడ్ని తయారు చేసినందుకు సంఘం గర్వపడటం, "మీ యిష్టమొచ్చినట్లు ఉండడానికి వీలులేదు. మేం చెప్పినట్లు నడుచుకోండి—హే!" అంటూ కనుబొమ్మలు ఎగరేసి కండ్లు ఎర్రజెయ్యటము. నూని పోతున్న కాగడాలా కళ్యాణం తోసుకొచ్చింది. దయానిధి చెయ్యిని ఎవరో లాగారు. అతన్ని గెంటారు. లేచి నుంచో పెట్టారు. కూచోపెట్టారు. గిరగిర తిప్పారు. "కానీ" మన్నారు. సన్నాయి, మంత్రాలు తాంబూలాలు, అక్షింతలు, బెల్లం, ధూమం. ధ్వని — "పెండ్లయింది" అన్నారు పెద్దలు.

జగన్నాధం మంత్రాలు చదివేవాళ్ళ పిలకలు ఎల్లా ఊగుతున్నాయో చూస్తున్నాడు. రాజభూషణం ఒకే దిక్కున దీక్షగా చూడడం దయానిధి చూశాడు. ఆ దిక్కునే అతను చూడగా, అతని చూపు, జనంలో నిలబడ్డ సుశీల మీద పడింది. దగ్గరలోనే గోవిందరావుగారు నరసమ్మగారు కూడా వున్నారు. ముహూర్తం సమయానికొచ్చారన్నమాట: మెరిసిపోయ్యే రాళ్ళదుద్దులూ, తళ తళలాడే పట్టు చీరా. సుశీల కళ్ళల్లోని చిత్రమైన బాధని ప్రస్ఫుటం చేశాయి.

తర్వాత కట్నాల చదివింపు ఏదో ధ్వనులు, రూపాయల మోగింపు:... "వివాహ సందర్భంలో... దీవిస్తూ — నూటపదహార్లు "... సందర్భంలో... గోవిందరావుగారు — పాతిక రూపాయలు — "మన పేరు కూడా యిప్పుడే చెప్పించండి" "రాజాగారు —" "కాదండోయ్ మహాప్రభూ — భూషణం అందరూ —" "సరే" గారు, షేవింగ్ అద్దం — "స్టేండ్‌తో సహా అని చేర్చవయ్యా" (జగన్నాధం) "బిందె" "వెండిచెంబు" "వెండిఆకు", — "పన్నీరు బుడ్డి", "టముకు పెట్టె" "కాదయ్యా మహానుభావా — తోలుపెట్టె కొండొకచో లెదర్ ఎటాచ్ కేస్ — ఫ్రెంచ్‌లో పోర్ట్‌మాంటో —" (జగన్నాధం) "తుంగభద్ర శ్రేష్ఠిగారు ఏకంగా వెయ్యి నూట పదహార్లు" "రివిన్యూ ఇన్‌స్పెక్టర్ రమణయ్య పాతిక రూపాయలు —" (ఉద్యోగం కూడా చెప్పండోయ్ శాస్త్రులుగారూ), "మూడో సర్కిల్ పోలీసుల బృందం మొత్తంగా యాభై, 432 హెడ్డు ప్రత్యేకంగా పది —" అల్లా సాగిపోతున్నాయి చదివింపులు.

దయానిధికి నవ్వొచ్చింది. గోవిందరావు పాతిక రూపాయలు చదివించాడు పాపం. దానితో అతన్ని వో చంటివాడ్ని చేశారు. తమ కింక ఏ విధమైన ఆర్థిక బాధ్యతా లేదన్నమాట. సంఘాన్ని అందరూ తిడతారు గాని, పాపం, సంఘం ఎంత మంచిది! కుటుంబానికి, కాపురానికి, జీవిత యాత్రకి కావలసిన అంత సరంజామా సంఘమే సప్లయి చేస్తుంది — బిందె, చెంబు దగ్గర్నుంచి, పాశ్చాత్య దేశాలలో పెండ్లాన్ని పోషించే శక్తి వచ్చేంత వరకు వివాహం చేసుకోరు. ఆర్థికంగా

యితరుల మీద ఆధారపడితే భార్యా భర్తలు చిక్కుపడతారు. ఇక్కడ అట్లాంటి యిబ్బందిరాకుండా, సంఘం కావలసిందంతా అదనంగా యిచ్చి వేస్తుంది. వివాహం జరిగింది. మరి సంఘానికి యెట్లాంటి బాధ్యతా లేదు! ఇంతకీ వారివారి కర్మ – అల్లానే మరి!

శనివారం

వివాహం కాగానే, గోవిందరావుగారు, భార్య, సుశీలని దిగవిడచి వెళ్ళిపొయ్యారు; కావలసిన వాళ్ళంతా, ముహూర్తం అవగానే ఒక్కక్షణం కూడా వుండకూడదుగా మరి! విడిదిలో హాల్లో తన హోల్డాల్ విప్పుకొని కొత్తచీర కట్టుగుని తల దువ్వుకుంటోంది సుశీల. పెళ్ళికొడుకు కోసం మళ్ళీ కాఫీ ఒచ్చింది – తొమ్మిదింటికి. నిధి సుశీలని తన గదిలో కొచ్చి కొంచెం కాఫీ పుచ్చుగోమని ఆహ్వానించాడు. సుశీల చక్కావచ్చి, పెద్ద వెండి సామాన్ల పెట్టెమీద కూర్చుంది.

సుశీల మొహం సంతోషంగా లేదు. ఎనిమిది నెలల క్రితం కంటె యిప్పుడు కొంచెం పొడుగై నట్లుంది. మొహం చిక్కింది. నిద్రనుంచి లేచిన దానివలె, చర్మం వింతగా మెరుస్తోంది. కళ్ళల్లో ఏదో అసంతృప్తిని దాచుకున్నట్లు పదే పదే చిట్లించి, వెర్రిపిల్లగా, చూస్తూ కూర్చుంది.

“నేను సాయంత్రం వెడతా” అంది సుశీల ఏదో అనాలి కదా అని.

“ఇక్కడ బాగాలేదా?”

“ఇంకెందుకు?”

“నువ్వు మీ ఊరెళ్ళి మాత్రం ఏం చేస్తావు? కాలేజీ లేదుగా” అన్నాడు.

“ఐనా నేనెందుకు?”

“అసలు పెళ్ళిళ్ళ సరదా అంతా స్త్రీలదే, నువ్వు లేకపోతే నాకు సలహా లెవ్వరిస్తారు?”

సుశీల నీరసంగా నవ్వింది.

“అమృతం రాలేదేం?” అంది.

“ఉత్తరం రాసింది.”

“ఏమని?”

“నువ్వే చదువు” అని లాల్చీ జేబులోంచి తీసి చేతికిచ్చాడు.

వేళ్ళతో ఉత్తరాన్ని నలుపుతూ కూర్చుంది కాని, సుశీల ఉత్తరం విప్పి చదవలేదు.

“పెండ్లికూతురు నీకు నచ్చిందా?” అని అడిగాడు నిధి సంభాషణ సాగిద్దామని.

“నాకు నచ్చడం దేనికి? నీకు నచ్చకపోతే చేసుకుంటావా?”

“నీ అభిప్రాయం వినాలని వుంది.”

“బాగానే వుంది” అంది సుశీల.

“బాగానే వుంది, బాగావుందా? రెండింటికి చాలా భేదం వుంది” అన్నాడు ‘నే’ మీద బరువు మోపుతూ.

“ఏమో నా కవన్నీ తెలియవు” అన్నది.

“అంటే నచ్చలేదన్న మాట”

“ఎదిగిన పిల్లే” అంది మళ్ళా కొంతసేపుండి తనే అన్నది, “చదువుకుందా?”

"ఏదో వానాకాలపు చదువు."

"సంగీతం"

"పెళ్ళి సంగీతం అనుకుంటా!"

"మరి నీకెలా నచ్చింది?"

మరో స్త్రీని మెచ్చుకున్న స్త్రీని అతనింకా చూళ్ళేదు.

"సంగీతం, చదువు, ఆస్తి, చక్కదనం... యివన్నీ ఉంటేనే నచ్చటం జరిగితే, ఎంతమందికి వివాహాలవుతాయంటావు?" అన్నాడు.

"నువ్వేదో ప్రత్యేకమైన మనిషివి, అనుకునేటట్లుగా మాట్లాడుతుంటావులే... అందుకన్నాను" అన్నది.

"కానవి ఇప్పుడు రుజువయిందా?"

"రుజువు చేసుకోవడం నీ పెళ్ళాం వంతు" అంది.

దాని తాత్పర్యం నిధికి బోధపడలేదు. సుశీల వాక్యాలకి విలువ కట్టడం మహాకష్టం. లోపల ఏవేవో తికమకలు, అడ్డంకులు తొలగించుకుని "అర్థం భావం" అనేవి ఒక చీకటి లోయగుండా పారి, కంఠంలో మాటలు వెదుక్కుని అక్కడ గడ్డకట్టి బయటపడతాయి. భావకవిత్వాన్ని విమర్శించడం లాంటిది సుశీల మనస్సు కనుక్కోవడం.

"నే నెట్లాంటి స్త్రీని వివాహం చేసుకుంటే నువ్వు ఆశ్చర్యపడవు?" అని అడిగాడు నిధి. అంతకంటే భావగర్భితంగా మాట్లాడడానికి నిశ్చయించుకుని. ఆ ప్రశ్నకు సమాధానం అతనికి తెలుసును. సుశీల ఆ సమాధానం చెప్పదని కూడా అతనికి తెలుసు. కాని అతను పొరపడ్డాడు. సుశీల సమాధానం చెప్పింది.

"అమృతం లాంటి స్త్రీని"

అతనికి ఆశ్చర్యం కలిగింది కాని దాన్ని బయట పెట్టలేదు.

"అమృతంలో ఏమున్నాయని నీకల్లా అనిపించింది? సంగీతం ఉందా? చదువుందా? చక్కదనం ఉందా?"

సుశీల అతనికి బాధ కలిగిందని గ్రహించక పోలేదు. వెంటనే విషయం మార్చివేసింది.

"పోనీ కోమలిలాంటి స్త్రీని" అన్నది.

దయానిధికి మరింత ఆశ్చర్యం వేసింది; కాని ఒుటకి ప్రకటించలేదు.

"పోనీ కోమలిలో మాత్రం ఏమున్నాయని? సంగీతం ఉందా? చదువు ఉందా? ఆస్తి ఉందా?–"

"మూడోది మర్చిపోయావు చక్కదనం ఉందా అనలేదేం?" అని సుశీల నవ్వింది కళ్ళజోడు తీసి చీరతో తుడిచింది. మళ్ళాతనే అన్నది.

"ఇవన్నీ ఉన్నవాళ్ళు లేరని; వాళ్ళపై పగతీర్చుకోటానికి అవన్నీ లేనిదాన్ని చేసుకున్నావేమో ననిపిస్తుంది."

అతనికి అర్థం కాలేదు సుశీల మనస్సు మహారణ్యం. కొమ్మల మధ్యనుంచి పడే సూర్యరశ్మిలో కనిపించేవి ముళ్ళపొదలు.

"నాకర్థం కాలేదు సుశీలా!" అన్నాడు.

"ఏదో అన్నాను అర్థాల పట్టింపులెందుకు?"

"నీ అభిప్రాయాలని సరిదిద్దుదామని" అన్నాడు, అయినా స్త్రీకి నిశ్చితమైన అభిప్రాయాలున్నాయా? ఉన్నా వాటిని పురుషుడు సరిదిద్దుతాడా? అతనికే నవ్వొచ్చింది.

"ఏమీలేదు – కోమలి, అమృతం లాంటివాళ్ళు వివాహానికి తగరు. ఇందిర వివాహానికి తగుతుంది. ఇందిర ఎప్పుడూ ఉండేది, వాళ్ళు మధ్య మధ్య వస్తూ పోతూ ఉండేవాళ్ళు."

దయానిధికి అర్థం కాకపోయినా, కోపం వచ్చేటందుకు కావల్సినంత కారం వుంది ఆ వాక్యంలో.

"నువ్వు అమృతాన్ని కోమలితో జత చెయ్యడం నా కిష్టం లేదు సుశీలా! అమృతానికి భర్త ఉన్నాడు" అన్నాడు.

"నిజం చెబితే కోపం వస్తుంది."

"నువ్వు ఎందుకలా అనుకున్నావో నాకు తెలియదు. అమృతం చాలా మంచి మనిషి" అన్నాడు.

"మంచివాళ్ళలోనే చెడిపోవడం జరిగేది" అన్నది సుశీల.

"అమృతానికి ఎవరన్నా ఆపేక్ష ఎంతో ప్రాణం, మనుషులని ప్రేమించగల్గడం, చెడ్డతనం ఎలాగవుతుంది?"

అమృతం వ్రాసిన ఉత్తరం విప్పి, చదవడం మొదలుపెట్టింది సుశీల.

"బావగారికి,

మాట్లాడేటప్పుడు 'బావా' అని పిలువబుద్దేసినా ఉత్తరంలో బావగారు అనకపోతే బాగుండదు. ఎందుకనో బావా! ఈ శుభ సమయంలో నేను రాలేకపోయినందుకు ఎంత విచారించానో, మరెప్పుడేనా కలుసుకున్నప్పుడు చెబుతాను. ఏం? నీకు తెల్సుగా, అత్తగారి ఒంట్లోబాగాలేదు. వారికి జమాబందీ – తాశీల్దారు ఇక్కడే కాంపు. అందుచేత జగ్గుని ఎలాగో వీలుచేసి పంపాను. నాకెన్నో విషయాలడగాలని ఉంది. మాట్లాడుకోవాల్సినవి బోలెడున్నాయి. ఎప్పుడో పెళ్ళి బహుమానంగా, మావారూ నేను కలిసి, షేక్‌హాండ్ ఉంగరం పోస్టులో పంపించాం. ఈపాటికి అందే ఉంటుంది. ఇందిర వేలుకి నువ్వు తొడగాలి".

అదీ ఉత్తరం చివర మరో వాక్యం ఉంది.

"ఈ ఉత్తరం చదవగానే చించివేస్తావు కదూ!" అని.

"ఈ ఉత్తరం చించివెయ్యమని వ్రాయడం ఎందుకో?" అంది సుశీల ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నీబోటి స్త్రీలు అపార్థాలు తీస్తారేమోనని" అన్నాడు దయానిధి.

సుశీలకి కోపం వచ్చింది కాని ఆ కోపాన్ని ప్రకటించే అవకాశం లేదు, వెంకటాద్రిగారు తలుపు మెల్లగా తెరిచి లోపలికి తొంగిచూసి, మళ్ళా తలుపు దగ్గరగా మూసి వెళ్ళిపోయాడు.

దయానిధి, సుశీల ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు. కొంచెం సేపటికి రాజభూషణం లోపలికొచ్చాడు. సుశీలని, అతనికి నిధి పరిచయం చేశాడు.

రాజభూషణం, నిధిని మరి మాట్లాడనివ్వకుండా సంభాషణ తనే స్వాధీనం చేసుకున్నాడు. లెక్చరర్లు, కాలేజీలు, పరీక్షలు, టెక్స్టట్ బుక్సు - అన్నీ గాలించి పారేశాడు.

అతని నిర్వచనాలని ఓ పుస్తకంలో రాసి, అతనికి అమరత చేకూర్చే శిష్యుడు లేకపొయ్యాడని, మధ్యలో వాపొయ్యాడు. సుశీలని కలవరపెట్టిన కొన్ని నిర్వచనాలు:

"ఎందుకూ ఉపయోగంకాని పుస్తకాలని పార్యగ్రంధాలుగా చెయ్యడంలో మన విశ్వవిద్యాలయం ప్రపంచంలోని యితర విశ్వవిద్యాలయాలకి ఎంతమాత్రం తీసిపోదు."

"కాలేజీలో మగవిద్యార్థులకి అతిశయం జాస్తీ, ఆడవిద్యార్థులకి తమకి అతిశయం జాస్తీ అన్న చైతన్యంకూడా వుంది. అదీ భేదం."

"వివాహంకాని స్త్రీకి, వివాహం అయిన పురుషుడికి విశ్వవిద్యాలయం శరణాలయం."

"ఆడదానికి హృదయం లేదని, చదువుకొన్న స్త్రీ బహిరంగంగా రుజువు చేస్తుంది; చదువుకోనిది, అదేపని రహస్యంగా చేస్తుంది."

మధ్యలో సుశీలని క్షమించమనడం, యివేవీ ఆమెకు వర్తించవంటూ వుండడం, జరుగుతూనే వుంది. అతని భావాలు విని ఆమెకు మత్తుమందు జల్లినట్లయింది.

సుశీల ఏమీ మాట్లాడకుండా కూర్చుంది. రాజా సంభాషణ జోరు తగ్గింది. శక్తులన్నీ ఒక్క గుక్కలో ఉపయోగించేసి, చివరకి దివాలా తీసినవాడిలాగ ఐపోయాడు.

"ఏమండీ - ఇందిరని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగింది సుశీల.

ఈ విషయం ముచ్చటించటం నిధికి ఇష్టంలేదు. అంచేత అన్నాడు: "రాజాకి పెళ్ళంటే పడదు, నీకు తెలీదు కాబోలు, వివాహం అనేది, నాగరికత బజార్లో కొనుక్కొని తెచ్చుకున్న జాడ్యం అంటాడు. అంచేత, ఇందిరని గురించి అతనికి అభిప్రాయాలుండవు."

"ఐతే వారూ నాలాగే నన్నమాట" అన్నది సుశీల.

"ఐతే మనము యీ విషయములో ఏకీభవించాం అందురూ?" అన్నాడు రాజా.

"అవునవును. ఒక విషయాన్ని ఖండించడములోనూ, ద్వేషించడంలోనూ మనుష్యులు ఐక్యం అయినట్లు, ప్రేమించటములో అవరు" అన్నాడు నిధి.

ఇంతలో వొగర్చుకుంటూ జగన్నాధం లోపలికి చక్కావొచ్చాడు.

"ఓ నా మంచితనమా - ఎక్కడి కొచ్చినా, ఈ పూట ఈ ప్రేమ న్యూసెన్సు చాలా జాస్తిగా ఉందనాలి. రాజాజీ, తమ రీజాడ్యానికతీతు లనుకున్నాను. కాని ఉత్తలీతులేనే! ఐ యామ్, ఐడువాట్ నొ టు సె, వాట్-ఛ, ఛా ఐడు నాట్ నొ వాట్ టు సె-బైదిబై -" అని జేబురుమాలు పైకితీసి, పొడుగ్గా మెలితిప్పి-వొక వేపు పళ్ళ మధ్య బిగించి, మరోవేపు వేళ్ళతో తట్టుతూ నాగ స్వరం వాద్య అభినయం చేస్తూ, "దిగు దిగు నాగూ - దివ్యసుందర నాగూ" అని పాడటం మొదలెట్టాడు.

కొంచెం విపులీకరించమని, ప్రేక్షక త్రయం కోరింది.

"ఓ.కె. వెరి సింపిల్-ఐ సా యె స్నేక్..."

"ఎక్కడ, ఎక్కడ" అని సుశీల అటూ ఇటూ చూసింది.

"మరి శాంతించండి – శాంతమూ లేక సౌఖ్యమూ లేదు – నన్ను పొడిగించనీండి – damn it, continue కి తెనుగేమిటి? పోనివ్వండి నేను త్రాచుబాముని చూశాను. గాంచితీ నొక కోబ్రాను, నేను, నేడు–బాగా నడుస్తోంది భాష ఈ పూట –"

దయానిధికి అర్థమవుతోన్నట్లుంది. "స్టేషన్ నుంచి వొస్తున్నావా?" అని అడిగాడు.

"దూరదృష్టి రహితులైన సామాన్య మానవమాత్రులు మీ రెట్లు గ్రహించితిరి – ఆశ్చర్య మయ్యేడిన్ – ఐనను, యిట్లని చూచెదగాక. ప్రకాశముగా – అవును అక్కడనుంచే; బండిలో దెచ్చితిని త్రాచుపాముని" అని మళ్ళా నాగస్వర వాద్యం ప్రారంభించాడు జగన్నాథం.

"ఏమిటిదంతా!" అని రాజా తెల్లబోతున్నాడు.

"ఏముంది? నాగుమణి ఒచ్చినట్లుంది, బండి దిగి". అంది సుశీల.

"బేలా, నిక్కువము పల్కితివి సత్యము కనుగొంటివి. అటుచూడుడు..."

జగన్నాథం వాక్యం పూర్తికాకుండానే, నాగుమణి నవ్వుతూ లోపలికొచ్చింది.

పరిచయాలు చేసుకోటం జరిగింతర్వాత, నాగుమణి కొత్తగా చేయించుకున్న నగలకి నాణెం కట్టడం జరిగింది. వివాహంకాని ఈ కొత్త వ్యక్తి రాకతో, రాజాకి ఒక వుద్యమాన్ని లేవదీసిన నాయకుడి మల్లే, మరింత వుత్సాహం వొచ్చి, మరికొన్ని ఘాటైన నిర్వచనాలు చేశాడు. అక్కడ కూర్మయ్య వుంటే గుండెలు బాదుకొన్ను?

రవ్వల దిద్దులు; చంద్రకాంతం, రాళ్ళ వుంగరం, ఐస్‌క్రీమ్, బొంబాయి ఫాషన్ ఒడ్డానం – వీటికి విలువలు కడుతున్నారు.

"ఇవన్నీ ఎందుకు? ఏ అమాయకుడైన మొగాణ్నో; వల్లో వేసుకుని తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోడానికే కదా!" – ఆ కర్తవ్యం ఏమిటో ఎవరూ అడగకుండానే, ఆ కర్తవ్యం ఏమిటి? మాతృత్వం? సృష్టిశక్తుల చేతుల్లో పురుషుడు ఒక కీలుబొమ్మ – ఒక పరికరం తన కర్తవ్యం నెరవేరగానే?, ఆ పురుషుడ్ని పెంటకుప్ప మీదకి గిరాటెడుతుంది స్త్రీ. పాపం ఆ దౌర్భాగ్యుడు, భగ్న హృదయుడై భావగీతాలు రాసుగుంటాడు. అది చేతకాకపోతే కోర్టెక్కుతాడు – ఏదో విధంగా పగ సాధించుకోవడం యత్నాలు సల్పుతుంటాడు. ఆ యత్నాలని, నాగరికత అంటున్నాం –"

"చాలా గొప్పగా వుందండి, రాజాజీ – ఐతే, అదంతా ఏమిటో నాకు తర్వాత విశదంగా మనవిచేద్దురుగాని" అన్నాడు జగన్నాథం.

నాగుమణి యింతటి వుద్రేకానికి తను కారణం ఐనందుకు గర్వంతో మెరుస్తున్న కళ్ళల్లో నవ్వుని పెదవుల మీదికి దింపుకుంది.

మళ్ళా రాజా అందుకున్నాడు.

"– ఇప్పుడు స్త్రీలు, స్వతంత్రం కావాలని మొరెట్టుగుంటున్నారు. దేనికీ స్వతంత్రం? తమ పని జరిగింతర్వాత పురుషుడ్ని పెంటకుప్ప మీద పడయ్యడానికి అంటాను నేను."

"పెంటకుప్ప అనే వికృతమైన పదాన్ని రెండుసార్లు వాడారు.

నాకు నచ్చలేదు. మరో మంచి మాటని వాడండి, నేను మీ వాదాన్ని ఖండించను. ఫర్ ఎక్జాంపుల్ కల్మషకందకం –" అన్నాడు జగన్నాథం. దీనికి రాజా

సమాధానం చెప్పబోతూండగా, బైట సన్నాయివాద్యం కలకలం వినిపించింది. సుశీల బైటకి వెళ్ళింది. "ఇదె వచ్చుచుంటిని భక్తాగ్రేసరులారా" అంటూ జగన్నాధం, అతని వెనక రాజా బైటికి వెళ్ళారు. నాగుమణి మళ్ళా, తీసేసిన నగలన్నీ వొక్కొక్కటే అలంకరించుకుంటోంది.

"బాగున్నాయా?"

"చాలా"

"అబ్బో, మీరూ వుంగరం పెట్టుకున్నారే ఎప్పుడూ లేనిది అత్తవారు పెట్టారా?"

"లేదు. అమృతం పంపింది, పెండ్లికూతురు కోసం"

"ఏదీ?"

అతను వుంగరం తీశాడు.

"అబ్బో, చెయ్యీ చెయ్యీకలుపుకున్న వుంగరమే" అంది నాగుమణి.

"నావేలు కెట్టండి."

నిధి సంశయించాడు. వుంగరం వేలుకి తొడుగుతుండగా, తలుపు సందున లక్ష్మయ్యగారి తల కనబడి, మళ్ళా వెనక్కి వెళ్ళిపోయి తలుపులు దగ్గరగా మూసింది.

"బాగుందా?"

"ఓ!"

"కోమలొచ్చిందా?" అంది నాగుమణి.

"ఎందుకొస్తుంది?"

"మీరు పిలవలేదా?"

"శుభలేఖ పంపాను. మావూళ్ళోలేదుగా ఎక్కడి కెళ్ళిందో తెలుసా?"

"ఏమో—ఎవడో జమీందారుతో వెళ్ళిందటగా"

"మరి కోమలొచ్చిందా అని అడుగుతా వెందుకు?" అన్నాడు.

"అంత ప్రేమ సూపెట్టిన అమృతం గారు రాలేదేం?"

"ఎవరిమీద అంత ప్రేమ?"

జగన్నాధం లోపలికి తొందరగా వచ్చి, గట్టిగా ముక్కు మూసుకున్నాడు. బాధపడుతున్న వాడల్లే అభినయం సాగించాడు.

"అబ్బ—సెంటు వాసన—బైటకి కొడుతోంది. ఈవూరంతా మైలవుతోందంటే నమ్మండి. ఈ పూట ఎవరి మొహం చూశామో మనం ఎక్కడ చూసినా ఈప్రేమ న్యూసెన్స్ చాలా జాస్తిగా ఉంది. Oh! tell me, my wingless dove, What is this thing called Love—'ఏమండోయ్, ఈపూట అంగ్ల కవిత్వం దంచేస్తున్నాం"

లక్ష్మయ్య, వెంకటాద్రిగారు భోజనాలకి వేళైంది, లెమ్మనమని ఆహ్వానించారు.

ఆ పూట ఒకే పందిట్లో ఆడవారికీ మగవారికీ భోజనాలు ఏర్పాటు చేశారు. నాగుమణి, దంపతుల పక్కనే కూర్చొని భోజనం చేస్తానని తెలియజేసింది. వారికి వేరే బంతి ఏర్పాటు చేశామన్నారు. నిధి, ఆమె తన పక్కనే కూర్చోవాలని పట్టుబట్టాడు; లేకపోతే తనసలు భోజనం చెయ్యనన్నాడు. త్రివిక్రమదాసు, వగైరా వ్యక్తులు పోనీ ఫరవాలేదు. కూర్చో నివ్వండి—శుభసమయంలో ఈ పట్టింపులేమిటి (ఐనా పిల్లదివ్యంగా, కలకల్లాడుతోంది) అన్నారు. ఆడపెళ్ళివారిలో గుసగుసలు కల్లోలం

బయలుదేరింది. ఆఖరికి, మాధవయ్యగారికి కూడా కోపం వచ్చి వీల్లేదు అన్నారట. దశరథరామయ్యగారు, రామానందం, ఈ పట్టువదలమని నిధిని బ్రతిమలాడారు. లాభం లేకపోయింది. తుదకి, రాజాకూడా "పోనీ–పెండ్లి జరిగిపోయిందిగా ఇప్పుడీ పట్టింపులు బాగుండవు"అన్నాడు. జగన్నాథం ఒక్కడూ మాత్రం నిధి తరఫునే వాదిస్తూ, స్వగతంలో చాలా సేపు మాట్లాడుకుంటూన్నాడు.

బ్రాహ్మలు "లేచిపోతాం వల్లకా"దన్నారు. కొందరు ముసలమ్మలు యీ అఘాయిత్యానికి రాగాలుకూడా మొదలెట్టారు. ఆఖరికి వధూవరులు, జగన్నాథం, సుశీల, నాగుమణి, రాజా, రామానందం వేరే బంతిలో కూర్చున్నారు. ఆ బంతిలో మూలగా కూర్చున్న నారయ్య సంతోషానికి అంతులేదు. అతను చూపిన వుత్సాహాన్ని, హుషారుని చూసి, తుదకి జగన్నాథం భయంకూడా పోగొట్టుకున్నాడు.

## ఆదివారం

సాయంత్రం నాలుగింటికి, మూడు మోటార్లమీద, పెండ్లి వారి బృందం "శాంతి" ఆశ్రమానికి వెళ్ళారు. ఆశ్రమం పక్కనే చిన్న కాలువ ఉంది. ఆశ్రమం చుట్టూ పూలమొక్కలు, కొబ్బరిచెట్లు దూరంగా పెద్ద చింతచెట్టు వున్నాయి. కొంచెం దూరంగా కాలువ సన్నబడుతుంది. అక్కడ తాటికఱ్ఱ కాలువమీద వొంతెనలా అమర్చి వుంటుంది, తాటిచెట్లకి అవతల పంటల కోసం రెండు గుడిసెలు వున్నాయి. అంతాచల్లాగా, ప్రశాంతంగా వుంది. ముందు అరుగుమీద చాపలేసుగుని, దశరథరామయ్యగారు, మాధవయ్యగారు, అపురూపానందస్వామి, శిష్యులు కూర్చుని గీతలో కొన్ని విషయాలని చర్చిస్తున్నారు. సుశీల, జగన్నాథ్, రాజా కాలవగట్టెమ్మ టేనడిచి పోతున్నారు. ఇందిరా, దయానిధి, నారయ్య ఆశ్రమం అంతా పరీక్షగా చూసి కాలవగట్టుకి చేరుకున్నారు. దూరంగా సుశీల రాతిబండ మీద కూర్చుని రాజా కబుర్లు వింటూ, వొక్కొక్క బెడ్డనే కాలువలో పోస్తుంది. జగన్నాథం తాటికఱ్ఱ వంతెన దాటి అవతల ఒడ్డున మామిడితోపులో కెడదాం అని ఆహ్వానిస్తున్నాడు. నాగుమణి, ఇందిర జగన్నాథం సహాయంతో అవతలకి చేరుకున్నారు. నారయ్య జగన్నాథాన్ని "ఈతలాడదాం" రమ్మనగా అతను చొక్కా తీసేసి, కాలవలోకి "మనకి కొంచెం భయం ఐననూ యత్నించెదగాక" అంటూ దూకాడు. అట్టే ఎక్కువలోతు లేదని, ధైర్యం చిక్కి, ఆకాశాన్ని సంబోధిస్తూ "సవాల్" చేస్తున్నాడు. వాళ్ళని చూస్తూ కూర్చుంది నాగుమణి. సూర్యరశ్మిలో రవ్వలదుద్దులు మెరిసిపోతున్నాయి. రశ్మి నీళ్ళలోంచి ప్రతిబింబించి, ఆమె మొహాన్ని వెలుగులో ముంచుతోంది. ఆ కాంతి ఆమెకి మైకం కలిగించింది. నీటికదిలికలో లయ వేడిలో మృదుత్వము ఆమెలోకి ప్రవేశించి కాసేపు కళ్ళు మూసుకుని, ఎక్కడికో మనస్సును జేరవేసింది.

మామిడిచెట్టుకింద పచ్చగడ్డిలో దయానిధి కూర్చున్నాడు. ఇందిర ఏం చెయ్యడానికి తెలీక అటూ, ఇటూ చూస్తూ నిలబడింది. కొమ్మమీద చెయ్యి ఆనించింది. చీమలు కదిలిన స్పర్శ కలిగి తీసేసి, కాసేపు దులుపుకుంది. చీమ కుట్టిన చోట జబ్బ ఎఱ్ఱబడి కుంకుమ జబ్బకి అంటుగున్నట్లయింది. ఇందిర కదలికలో కాంతి చెట్లనీడల్ని వెలిగించింది. ఆమెపాదాల కింద గడ్డి మోహంతో హొణికింది. ఆమెను ఆవరించిన గాలి మరీ కదలలేకపోయింది. సౌందర్యంతో గర్వించి, పొడుగ్గా ఎదిగిపోయిన లతలా

ఆమె చెట్లను బంధించింది. పరిపూర్ణతని ప్రకటించుకున్న ప్రకృతి సంతోషంతో స్తంభించిపోయింది.

"చీమలా?" అన్నాడు నిధి, లేచి ఆమెకేసి చూస్తూ.

ఇందిర కళ్ళు పెద్దవి చేసి, ఆశ్చర్యంతో తలపంకించింది. అతను దగ్గరగా వొచ్చాడు జబ్బకేసి పరీక్షగా చూశాడు.

"కుట్టిందా?"

"ఒకడుగు వెనక్కివేసి, మళ్ళా ఆశ్చర్యంతో తల పంకించింది."

తన చేతినున్న వుంగరాన్ని బైటికి తీశాడు నిధి.

"ఇది చూశావా?" అన్నాడు, ఉంగరాన్ని అరచేతిలో వుంచుకొని చూపుతూ.

"ఏది చెయ్యి" అన్నాడు.

"చెయ్యి ముందుకు చాచింది."

ఉంగరం తగిల్చాడు.

"ఎక్కడిదో తెలుసా?" అన్నాడు.

"ఉహూ"

"అమృతం అని మానాన్నగారి తాలూకు బంధువు, నీకిమ్మని పంపింది, బాగుందా?"

"ఊఁ" అని కాలువకేసి చూసింది.

"ఏం, వెళ్ళిపోవాలని వుందా?"

"ఉహూఁ, ఉ"

"ఏమిటి"

"ఏమీ లేదు, వాళ్ళంతా అక్కడున్నారు."

"ఉంటే? చూస్తున్నారని భయమా?"

"ఉహూఁ—ఏమో"అని చెక్కిళ్ళు వొంకర్లు తిరిగేటట్లు నవ్వింది.

"నిన్న భోజనాల దగ్గర గొడవకి, మీ వాళ్ళందరికి నామీద కోపం వచ్చింది కదూ?"అన్నాడు.

"కోపం ఎందుకు!"

"వొచ్చిందా, వొనా?"

"లేదు."

"నీకు రాకపోవచ్చు మీ అమ్మా, నాన్నకీ..."

"ఏమో"

"నీకలా కూర్చోవడం కష్టంగా వుందా?"

"లేదు...."

"నాకంతే చాలు..."

మళ్ళా కాసేపు మౌనం.

"ఎప్పుడూ ఇక్కడే వుండిపోతే బాగుంటుంది కదూ?"

"ఉఁ"

"నేనొకటడుగుతాను– సమాధానం చెపుతావా? మీ వాళ్ళు నన్ను గురించి ఏమను కుంటున్నారు?"

"ఏమీ లేదు."

"చెప్పవు?"

"నాకేం తెలియదు"

"పోనీలే..."

మళ్ళా మౌనం...

"పోనీ, నీకెలా వుంది?"అన్నాడు.

ఇందిర నవ్వు నిలుపుకుంది.

"చెప్పవు?"

"ఏమో..."

"పోనీలే నీకు నాతో మాట్లాడాలని ...."

వాక్యం పూర్తి కాకుండానే, జగన్నాధం చెట్టు వెనుకనుంచి చక్కా వచ్చాడు.

"సారీ– మంచి రసవత్తర ఘట్టంలో వొచ్చినట్లున్నాం నిష్క్రమిస్తే శ్రేయస్కరమని తోస్తోంది."

"ఇందిరా రమణా"అని పాడుతూ చొక్కాతో జగన్నాధం తల తుడుచుకుంటున్నాడు.

"సుశీల రువ్విన రాళ్ళతో కాలవ మెరకేసింది"అన్నాడు జగన్నాధం.

సుశీలా, నాగుమణి కూడా వచ్చారు. నారయ్య మామిడి కాయలు కోసి, ఉప్పూ కారం పొట్లం విప్పి, ముక్కలు సరిపెడుతున్నాడు. అందరూ తలో ముక్కా నోట్లో వేసుకొని "బాబో పులుపు రొడ్డు" అంటూ నెత్తిమీద కొట్టుకుంటున్నారు. ఇందిరని ఎలా ఉన్నాయి ముక్కలని జగన్నాధం అడిగాడు.

"తియ్యగా వుంది" అంది ఇందిర.

"ఎలాగైనా, భర్త స్వహస్తంతో కోసిపెట్టిన ముక్క మరి" అన్నాడు జగన్నాధం.

అందరూ నవ్వారు.

సూర్యుడు చింతచెట్టు మాను వెనుక మాయమయ్యాడు.

"ఇక్కడ పురుగూ పుట్రా వుంటుంది. మనం లోపలికి వేంచెయ్యడం ఉత్తమం"అన్నాడు జగన్నాధం.

ఇందిర ముందుగా నడిచింది. అందరూ వెనకాలే కదిలారు.

రాజా ఎంకి పాటలు పాడుకుంటూ కూర్చున్నాడు. లేచి–

"ఎన్ని అనుకున్నా, వెనకాల స్త్రీ అంటూ లేనిదే ప్రకృతి, పాటలు, కళలు ఎందుకూ పనికిరావు. సృష్టికి పునాది స్త్రీ, స్త్రీకి శరణం వివాహం, ఆలోచించగా వివాహం మంచిదే అనిపిస్తోంది."

"మనం కాదనం....మీరు చెప్పింది ఏదైనప్పటికీ" అంటూ జగన్నాధం కార్లోకి చేరుకున్నాడు.

"డ్రైవరు, బీడీ పారేసి హారన్ మోగించాడు. ఆ కఠోరధ్వనితో భంగపడిన శాంతం మళ్ళా తేరుకోలేదు."

★ ★ ★

# చప్పుడు చెయ్యని సంకెళ్ళు

ఎనిమిది మాసాలు గడిచినై సంక్రాంతి కి రమ్మనమని మామగారు ఆహ్వానించారుగాని, దయానిధి చివరి సంవత్సరం పరీక్షలు దగ్గర పడుతున్నాయి, చదువుకోవాలి, రాకపోయినందుకు క్షమించమని వ్రాశాడు. ఒకసారి మాధవయ్యగారు, ఏదో పనిమీద పట్నం వచ్చి, తీరికలేక అల్లుడిని కలుసుకోకుండానే మరునాడు తిరిగి వెళ్ళిపోయారు. అది జరిగిన నెల రోజులకు మాధవయ్యగారు అల్లుడికి వందరూపాయలు మనియార్డరు చేశారు. ఎందుకు చేసినట్లో అతనికి అర్థంకాక ఆ మనియార్డరు తిరగగొట్టాడు. మామగారు, తన తాహతుకు తగినట్లు పంపగలడనీ, అచ్చట్లు, ముచ్చట్లు కేవలం డబ్బులోనే లేవనీ, ఐనా ఇప్పటి యువకులంతా అదోరకం మనుషులనీ కాస్తంత చిరాకు ప్రకటిస్తూ ఇంగ్లీషులో పెద్ద ఉత్తరం వ్రాశాడు. దానికి, నేటి యువకులు మాయమర్మం తెలీని వాళ్ళనీ, స్వాతంత్ర్యాన్నీ, ముఖ్యంగా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఎక్కువగా కాంక్షించడం వలన బానిసత్వానికి అలవాటుపడిన వాళ్ళకి బాధకలగడం తప్పదనీ జవాబు వ్రాశాడు. ఆ ఉత్తరం ధోరణి మాధవయ్యగారికి అర్థం కాలేదు. నవ్వుకుని భార్యకి చదివి వినిపించాడు, ఆవిడ "మా అల్లుడు ఉత్తరాలు చాలా బాగా రాస్తా"డని ఇరుగు పొరుగుతో చెప్పుకుని సంతోషించింది. మాదవయ్యగారు ఆ ఉత్తరాన్ని, ఏదో సందర్భంలో, సెన్సర్ చుట్టల పెట్టి పోలీసు సూపరెంటెండెంట్ గారికి బహూకరించి చదివి వినిపించారుట. ఆయన నవ్వి "ఈ స్వాతంత్ర్యం అనే జబ్బు తొందర్లో ఒదిలిపోతుంది. కార్యం చేసెయ్యండి"అని సలహా ఇచ్చాడు. నాలుగు నెలల్లో ముహూర్తం స్థిరపరచి మాధవయ్యగారు అల్లుడికి తెలియబరిచాడు. 1986 మార్చికి అతని పరీక్షలు పూర్తయ్యాయి. ఏప్రిల్ 13 న ముహూర్తం. ఆహ్వానాలు అవీ పంపి పెద్ద గందరగోళం లేకుండా కార్యం జరిపించమని, నిధి ఉత్తరం వ్రాశాడు. ఇది "ఆడంగుల సరదా సమయం కాబట్టి, వారందరికీ తెలియజెయ్యక తప్పదనీ, యధావిధిగా తతంగం జరగాల్సిందే"నని మాధవయ్యగారు జవాబు వ్రాశాడు. నిధి తన బంధువులనీ, స్నేహితులనీ, ఎవ్వరినీ ఆహ్వానించలేదు. కార్యం అంటే సంకెళ్ళు తగిలించడం అన్న "రాజా"మాటలు జ్ఞాపకానికొచ్చాయి. రెండు తలుపులు ఎవరో బయిట గొళ్ళెం పెడతారు. అదే సంకెళ్ళు చప్పుడు చెయ్యడం అంటే. ఐతే లోపల తలుపు మొదట ఎవరు గడియపెడతారు? స్వతంత్రాన్ని పోగొట్టుకుని బానిసలయ్యేటందుకు ఎవరు ఎక్కువ ఉబలాటపడుతున్నారో, వాళ్ళు! సంకెళ్ళు చప్పుడు చెయ్యకూడదు అని నిశ్చయించుకున్నాడు నిధి.

ఫ్లాస్కులో టీ, సిగరెట్టు టిన్ను, ఎలక్ట్రిక్ దీపం తీసెయ్యడం, ఆవలించడం, పుస్తకం ముయ్యడం— మార్చి గడచిపోయింది. అప్పుడప్పుడు ఉత్తరధ్రువంలో వుండగా చదువుకున్న ఉత్తరంలా, "సీమా" దగ్గరనుంచో, రాజా దగ్గరనుంచో వచ్చిన ఉత్తరాలు చదివి నవ్వుకుని మళ్ళా పుస్తకం తిరగెయ్యడం— ఏప్రిల్ రానేవచ్చింది.

మూడోతేదీని, దశరధరామయ్యగారి వద్దనుంచి మనియార్డరూ, ఉత్తరం వచ్చాయి. ఆ ఉత్తరంలో ఏడెకరాల భూమి అమ్మవల్సి వచ్చినట్లుంది. ప్రాక్టీస్ ప్రారంభించే నిమిత్తం, రెండువేలు బాంకులో వేసి, మిగతా సొమ్ముతో చేసిన అప్పులన్నీ తీర్చి వేశారుట, ఇంక మూడెకరాల ఆస్తి మాత్రం మిగిలింది. వేషంగికి, వంటవాడ్ని తీసుకుని బెంగుళూరు వెడుతున్నాననీ కార్యం అవగానే ఇందిరని బెంగుళూరు తీసుకురమ్మని వ్రాశారు. నాలుగో తేదీన పోస్టులో, "సీనూ"దగ్గరనుండి, ఒక పార్సెలు, కవరు వచ్చాయి. ఆ పార్సెలు విప్పితే, పుస్తకం వుంది. అది హేవ్ లాక్ ఎల్లిస్ వ్రాసిన "స్టడీస్ ఇన్ ది సైకాలజీ ఆఫ్ సెక్సు"రెండో భాగం ఉత్తరం ఇది.

"నువ్వు దాచినా మహా దాగదు లేవోయ్. వివాహానికి కూడా రాలేకపోయాను. ఈసారేనా వద్దామనుకుంటే నువ్వు రమ్మనమనేనా వ్రాయలేదుగా. అందుచేత, సముచితం అనుకుని వో పుస్తకం పంపుకుంటున్నా."

అన్నట్లు చెప్పడం మరచిపోయాను. నా పెళ్ళి సంబంధం కూడా కుదిరేటట్లుగా వుంది. గోవిందరావనీ ఓ తాసిల్దార్— ఆయన కూతురు సుశీల— బాగానే వుంటుందిలే. బాగంటే ఎక్కడికి. కళ్ళజోడు తీసేస్తే మనిషి సంసారపక్షమే. చదువుకున్న పిల్ల భాయీ, అందుచేత పదిమందీ నావెనకాల నిలబడితే గాని మనం తట్టుకోలేం. నా పెళ్ళికి నిన్ను రప్పించేటందుకు, ఈ పుస్తకం గాలంలా వేశానని అనుకోకు సుమా!

శ్రీనివాసరావు, తన ఆరోగ్యం విషయం వ్రాయనందుకు నిధి విచారించాడు. ఐనా పరీక్షాఫలితాలు ఇంకా రాలేదుగా!

ఐదో తారీకున రాజభూషణం దగ్గరనుంచి వచ్చిన ఉత్తరంలో ఇలా వుంది.

"మనం ఎన్నిసార్లు కలుసుకుని మాట్లాడుకున్నా, ఒక విషయం నీతో చెప్పడానికి భయపడ్డాను. పైగా నీకు జ్ఞాపకం వుందా, వెనక నీతో "అదేం కర్మమో, మన రహస్యాలని మన స్నేహితులతో చెప్పకోం"అని అన్నాను. అందుచేత నీదగ్గర దాచేటందుకు వీల్లేదు. ముఖాముఖిని చెప్పేటందుకు ధైర్యం చాలక ఉత్తరం వ్రాస్తున్నాను.

అనాడు మనం ఆశ్రమాన్నుంచి ఇంటికి వచ్చాక, ఆ రాత్రి ఊరేగింపులో, సుశీల నన్ను ప్రేమించినట్లు నాకు అనుమానం కలిగింది. నాలో ఏం చూసిందో నా కర్థం కాలేదు. ఆశ్రమంలో కాలువగట్టున సుశీలతో నేను చాలాసేపు ప్రసంగించటం జరిగింది. నన్నా సమయంలోసుశీల కదిపింది, నేను కరిగిపొయ్యాను. దానికి కొంతవరకూ, ఆసమయం, ఆ వాతావరణం కారణం అనుకుంటా, మళ్ళా ఆమెలోనూ, నాలోనూ సమానంగా ఏమీ లేవు. మేమిద్దరం ఉత్తర దక్షిణ ధ్రువాలం. ఇంచుమించు ప్రతి విషయంలోనూ మాకు అభిప్రాయం భేదం తోచింది. ఒకవేళ మా అన్యోన్య ఆకర్షణ అదేనేమో! మన పుస్తకాల సంపర్కాలకీ, జీవితంలో యధార్థాల నెదుర్కొన్నప్పటి ప్రవర్తనకీ సంబంధంలేదు కాబోలు. పెళ్ళిని గూర్చి నా అభిప్రాయం మార్చుకోవల్సి వచ్చిందంటే నువ్వు నమ్ముతావని తెలుసు.

నీ విషయం సుశీల చాలాసేపు ప్రస్తావించింది. నువ్వు దొంగవంది. ఒక్కముక్కలో, నీకసలు నీతిలేదంది, నీకు కోమలితో, నాగమణితో, అమృతం అంట ఎవరో ఆమెతో సంబంధం ఉందట. నువ్వు అందరినీ ఆకర్షించి, ఆటవస్తువులుగా వాడుకుని,

నవ్వి మరచిపోతావుట. సుశీల మాత్రం నీనాటకం కనుక్కొని, నిన్ను దూరంగా ఉంచిందట. అసలా లక్షణం మీవంశంలోనే ఉందిట. ఇన్నీ చెప్పి, "గట్టిగా పట్టుపడితే అతన్ని వివాహం చేసుకునేదాన్నేమో" అన్నది. ఇవేవీ నిజంకావని నాకు తెల్సు. కానీ సుశీల మెప్పుపొందాలన్న అభిలాష వుండబట్టి. నేను వీటిని ఖండించి, తీవ్రంగా వాదించలేదు. సత్యాన్ని స్వార్థంకోసం త్యాగం చేసినందుకు నేను పశ్చాత్తప్తుడనవుతున్నాను. కాని ఏం లాభం! పశ్చాత్తాపం పాపిని ప్రోత్సహిస్తుంది. కాబట్టి నాకు పశ్చాత్తాపంలో నమ్మకం లేదని నీకెలానూ తెలుసు. అక్కడికీ సుశీలతో అన్నాను. "దయానిధి ఎవ్వరినీ నొప్పించలేదు, అందరినీ ప్రేమించి సంతోష పెట్టడం అతని నైజం, నిన్నూ ప్రేమించి సంతోష పెట్టాడేమో? తనకోసం త్యాగం చేసిన పురుషుడ్ని స్త్రీ ఎప్పుడూ క్షమించదు. అందుకనే నీకతడంటే అంతమంట" అన్నాను. ఎందుకో విచారంతో కళ్ళు తడిసినై, కళ్ళని తుడుచుకుంది. అప్పుడు నేను భుజం మీద చెయ్యివేసి సముదాయించటం జరిగింది. సుశీలా అయిష్టం చూపలేదు. మౌనం అంగీకారం అనుకున్నా, స్త్రీలు ప్రేమించడం సంభవం అని వొప్పుకుంటున్నా, సుశీల నన్ను ప్రేమించడం అనే మిరకిల్ జరిగింది. మిత్రుడవు కాబట్టి దాచకుండా మనసులో సంగతులన్నీ చెప్పివేశాను. నేను సుశీలని పెళ్ళి చేసుకోవడం మంచిదంటావా? తిరుగుటపాలో జవాబుకోసం నిరీక్షిస్తూ ఉంటాను."

అదీ ఉత్తరం. ఈ ఉత్తరంలోని ముఖ్యమైన విషయాలు దయానిధికి ఆశ్చర్యం కలుగచెయ్యలేదు. అతన్ని బాధపెట్టిన వాక్యం ఒక్కటుంది. "అసలీ లక్షణం మీవంశంలోనే వుంది, అంది" అన్నది. వెనకటి విషయాలు జ్ఞప్తికి తెచ్చుకుంటే, ఇందులోనూ ఆశ్చర్యం తగ్గింది. రాజభూషణంతో పరిచయం కలిగింతర్వాత సుశీల శ్రీనివాసరావుతో పెళ్ళి సంప్రదింపులు జరిపిందన్న విషయం వ్యక్తమైంది. కాబట్టి ఒక విషయం తేలిపోయింది. సుశీల, ఎవర్ని పెళ్ళి చేసుకుంటుందో కాని, రాజభూషణాన్ని మాత్రం చేసుకోదని వెంటనే ఉత్తరానికి జవాబు యిలా వ్రాశాడు.

"—పెళ్లిని గురించి నీకు సలహా ఇవ్వ సమర్థుడ్ని కానని నీకూ తెలుసు. కనీసం నాకు అనుభవం కూడా లేదు. నీ ఉత్తరంలో వొక్క విషయాన్ని నేను సంశయిస్తున్నాను. సుశీల నిన్ను ప్రేమించిందని వ్రాస్తున్నావు. నేననుకోవడం, సుశీల అసలు ఏ పురుషుడ్నీ ప్రేమించలేదు."

సుశీల ప్రేమించేదల్లా ఎవరో తన్ను ప్రేమిస్తున్నారు అన్న అనుభవాన్ని. నా అభిప్రాయం తప్పుకావచ్చు. అవకాశం వచ్చినప్పుడు నేనీ అభిప్రాయాన్ని మార్చుకోవడానికి సిద్ధంగా వున్నాను. అంతవరకూ మౌనం ఉత్తమం.

పదకొండో తారీఖున హాస్టల్ గదిలో, ప్రయాణానికి సన్నాహము చేస్తున్నాడు విధి. పోస్టు బంట్రోతు వొక ఉత్తరం యిచ్చాడు. అది జగన్నాథం వ్రాసినది.""

"......మనం చదువులో పడికొట్టుకుంటున్నాం, కేవలం, ఉత్తరాలవలన ప్రయోజనం కనబడటం లేదు. నాకు పట్నం వచ్చి మీతో గడపాలని ఉంటుంది. బట్ వాట్ కెన్ ఐ డు— అంటే నేనేం చెయ్యగలను? ఈ సారి పరీక్ష ఫేలవగలనని ఆశిస్తున్నాను. అయిన పక్షంలో మనవాడి తెలివితేటల్ని పరీక్షించేటందుకు నవాబ్ ప్రభుత్వానికి ఏ కోశానా హక్కు లేదని, మదీయ బంధుకోటికి. ఎట్టకేలకు తెల్లమయ్యి మన

రామన్న చదువుని—అనగా—అవర్ ఫ్యూచర్ ఎడ్యుకేషన్ మదరాసు మహాపట్నంలోనే జరిపించుటకు నిశ్చియించిరిగాన, ఏతత్శుభ ముహూర్తమునకు... ఎక్స్ట్రా లేక వగైరా అదీ సంకల్పం."

ఇంక కమింగ్ టు మై సిస్టర్ చాలా ఓకేగా ఉంది. కారణం అత్తగారు మంచం దిగకపోవడమే. హ్వై అని అడగొచ్చు. అత్తగారు నిజానికే పోయేకాలమూ లేదనుకోండి యాజ్ ది సేయింగ్ గోస్ బిట్వీన్ అవర్ సెల్వ్స్ వంట చెయ్యడం, కోడలిమీద తోసెయ్యవచ్చునని, భ్రమ—హెన్స్, మా అక్కయ్య యింట్లో స్లోగన్ "అమృతం వంట అమృతమే" అని బట్ అరేంజ్‌మెంట్ మా అక్కయ్యకి చాలా వీలు. ఎందుకంటే వంటిట్లో ఏం జరుగుతుందో తణిఖీ చెయ్యడానికి, దొడ్లో భార్యభర్తల మధ్య ఏం రాచకార్యం నడుస్తుందో సోదా చెయ్యడానికి, అవకాశం తక్కువ. శైలి బాగా నడుస్తుందండోయ్. ఇంతకీ చెప్పొచ్చే ముక్క మా అక్కయ్య చాలా భాగం వంటింట్లో పడి కొట్టుకుంటోందని, టు యూజ్ ఏ పాప్యులర్ యిడియమ్.

బైదిబై (స్పెల్లింగ్ రైటేననుకుంటాను) యింతకీ అసలు విషయం లైక్ ఏ ఫయిన్ ఆర్టిస్టు చివరికి ఉంచేశాను. (ఓ యస్ ఈ యేడు తప్పకుండా ప్యాసవుతానంది. అని చెప్పేటందుకు విచారించవల్సి వస్తూంది) మొన్న— అనగా ఇటీవల, కొండకచో కొంతకాలం క్రిందట— రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫాం పైన, శ్రీమతి కోమలిని సందర్శించడం జరిగింది. ఆమెను సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్‌లో కూర్చుని ఉండగా చూడటం తటస్థించింది. ఆమె ఉత్తర హిందూస్థానం (టు బి మోర్ స్పెసిఫిక్—గ్రావిటీ లేదనుకోండి, మాకెమిస్ట్రీ మేష్టారన్నట్లు) ఆగ్రా ప్రొసీడ్, అవుతోందిట. ప్రొసీడ్ రెండు "సీ" లా, ఒకటేనా తేలక తెలుగులో వ్రాయడం జరిగింది.

ప్రక్కన మరో మీసాల వ్యక్తి ఉన్నాడు. అతడెవ్వరో మీరే ఊహించుకోండి. "హ""హోం"అని కేకేసింది నన్ను. నిధిగారెక్కడున్నారని అడిగింది. ఇంతలో మీసాల రక్కసుడు అవతల కిటికీ దగ్గర నుంచి యివతలకి కళేబరాన్నే జేరేశాడు. వెంటనే అంగన మాటతప్పింది. "అమృతంగారెక్కడ?"అంది. నేను ఆ లలన యొక్క సౌందర్యాన్ని కించిత్ తిలకిస్తుండగానే, ధూమశకటం కూసి కదిలింది— అది వెనక్కి నడవడం— కదలడం ఐతే, బావగారికి వివాహం అయిందన్నా నేను, నాకు తెల్సు అన్నది "హౌ"అని అడిగాను. ఆ బేలకి ఆంగ్లంలో ప్రవేశం లేదని యిప్పుడిప్పుడు మదీయ బుద్ధికి స్ఫురిస్తుంది.....

ఆ ఉత్తరాన్ని చాలా సార్లు నవ్వుకుంటూ చదువుకుని, జాగ్రత్తగా మడిచి మనీ పర్సులో ఉంచాడు. ప్రక్కగదిలో ఉంటున్న, మాత్యు – చదువు తున్న పుస్తకాన్ని మూసి, చేతిలో వుంచుకుని నిధిని పేకాడుకుందాం రమ్మని ఆహ్వానించాడు. చేతిలో పుస్తకాన్ని బల్లమీద వుంచి బాత్‌రూంకి వెళ్ళొస్తాను. ఈ లోగా పేకాటకి సిద్ధం కమ్మన్నాడు. ఆ పుస్తకాన్ని తీసి నిధి చదవడం మొదలెట్టాడు. అది షేక్స్పియర్ రచించిన "హామ్‌లెట్" నాటకం ఆనర్సు విద్యార్థుల పాఠ్యగ్రంథం, తలనొప్పిగా వుంది. పేకాటకి వోపికలేదని మాత్యుని పంపివేసి, ఆ నాటకం చదవడం మొదలెట్టాడు. చదవడం సాయంత్రానికి ముగిసింది. సామానులు కూలివాడి నెత్తిమీద పెట్టి ఆ రాత్రి మెయిల్లో ప్రయాణం అయ్యాడు.

కాకినాడ చేరుకునేటప్పటికి పదకొండయింది. లక్ష్మయ్యగారు మాత్రం స్టేషన్

దగ్గరకొచ్చి, నిధిని విడిదిగదిలో దింపాడు. కార్యానికి ఎవ్వరినీ రమ్మనమని ఆహ్వానించనందుకు కొంచెం విచారించాడు. అతని కేదో భయంగా వుంది. భోజనం చేసి పరున్నాడు. ఐదు నిమిషాల్లోనే భారత మాత సంకెళ్ళని చప్పుడు చేస్తూ అతని ఏకాంతాన్ని భంగం చేసింది.

1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ క్రొత్తగా అమలులో కొచ్చిన రోజులవి. ఆ యాక్టులోని మంచిచెడ్డలతో ప్రజలకి నిమిత్తం లేక పోయింది. భారతదేశపు స్వాతంత్ర్య పరిణామాలని బ్రిటీష్ పార్లమెంట్ నిర్ణయించడం యెవ్వరికీ రుచించలేదు. వైట్‌హాల్ నుంచి ఏ శుభలేఖ వచ్చినా హిందూదేశ ప్రజ దానికి మసి పూసి దగ్గరగా ఉన్న సముద్రంలో గిరవాటెయ్యడం జరగాల్సిందే. అధ్యాత్మిక చింతలో మునిగివున్న ప్రజని, బ్రిటీష్ పార్లమెంటు చేష్టలతోనో మాటలతోనో రెచ్చగొడుతూ ఉంటుంది. ప్రజలకి జైళ్ళలో బంధించబడినందుకు విచారంలేదు. తుపాకీ పట్టుకొని బయట పచార్లు చేస్తున్న తెల్లాయన "నాలుగు రోజుల్లో నిన్ను విడుదల చేస్తాం– ఈ విధంగా"అన్నప్పుడే, ఈ బానిసలు చెలరేగేది. భారతీయులు బానిసలే – కాని 1935 ఇండియా యాక్టుతో తాము బానిసలం అని గ్రహించుకున్నారు. అదే వారి బాధలకి, అసంతృప్తికి కారణం. "మిమ్మల్ని మీరే పాలించుకోండి. కాని పైన మావాడొకడుండి మీరన్నది కాదంటాడు– యివిటండి దీని తబిసీళ్ళు"అని కూర్మయ్య బోటిగాళ్ళు యీ యాక్టుకి విలువకట్టారు. ఇది మరింత వెక్కిరింపుగా తోచింది. వధూవరులు ఒకర్ని ఒకరు కోరుకుని, పురోహితుడ్ని ఎన్నుకొని వివాహం చేసుకుంటారట. దొరగారు దాన్ని రద్దు చేసే హక్కు ఉంచుకున్నారట. ఆ దొరగారు అనవసరంగా ఆ హక్కుని అధికారాన్ని చలాయించరని ప్రభుత్వం హామీ యిచ్చింది. అసలట్లాంటి అధికారమే ఉండకూడదన్నారు.

ఆ అధికారం తొలగించడానికి ఏం చెయ్యాలి? ఏమో ఎవ్వరికీ తెలీదు. కాని ఏదో చెయ్యాలని మాత్రం అందరికీ కసిగా ఉంది. తమ అధోగతికి కారణం బ్రిటీషు ప్రభుత్వం. హోటల్లో పులిస్తరాకులు పారేస్తే మిగిలిన మెతుకుల కోసం నాలుగు కుక్కలు, నలుగు చినుగుళ్ళు ధరించిన యువకులు కలిసి కొట్లాడుకోటం, బ్రిటీష్ ప్రభుత్వం చిత్రించిన కళానుగుణమైన దృశ్యం– అజ్ఞానం, అంధకారం, ఆకలి, నిరోద్యోగం, జాడ్యం– అన్నిటికీ కారణం అదే మన ప్రాచీన సంప్రదాయాలేవీ? మన కళ ఏమయింది? మన శిల్పాలు? మన మేధావులు ఒకప్పుడు మహావైభవం అనుభవించాం అని చరత్ర చదువుకుని ఎంతకాలం తృప్తి పడటం? అసలు చరిత్ర లేకపోతేనే బాగుండును, ఉండబట్టే ఇంతటి అధోగతి పట్టింది కదాన్న పరిజ్ఞానంతో కూడుకున్న విషాదం. ప్రాచీన సంస్కారాన్ని, నాగరికతని, మ్యూజియమ్‌లలో బంధించివేశారు ప్రభుత్వంవారు. టికెట్టు కూడా లేదు. ఊరికే చూడొచ్చు. "లేవండి, లేవండి"అన్నారు దేశ నాయకులు, "ఎక్కడికి?" అన్నారు ప్రజలు.

ఏమో ఎవళ్ళకి తెలియదు. అందరూ లేచి కళ్ళు నులుపుకున్నారు. ఎక్కడికని వెళ్ళడం? పిల్లలు స్కూళ్ళకి– మానెయ్యండి. జీతాలు కట్టే వాళ్ళు , ఇచ్చేవాళ్ళు లేక అవే మూసుకున్నాయి. కోర్టులు మానెయ్యండి, కాలేజీలు మానండి, కొట్లు మూసెయ్యండి. ఏం చెయ్యద్దో చెబుతున్నారు నాయకులు, ఏం చెయ్యాలో చెప్పరు, మళ్ళా ఆవలించి పడుకున్నారు ప్రజలు.

మళ్ళా లేవండి అన్నారు ఎవరో. అందరూ లేచి మళ్ళా ఎర్రబడిన కళ్ళని తుడుచుకున్నారు. ఈ సారి ఏం చెయ్యాలో చెప్పారు. పన్నులు కట్టకండి. అందరూ వికటంగా నవ్వారు. కట్టేందుకు మాదగ్గరేముంది? జప్తుచేసుకుపోయ్యారుగా ఎప్పుడో! విదేశీ బట్టలు తగలెట్టండి, తగలెట్టారు. ఊం తర్వాత బట్టలు లేవు, తిండి లేదు, చీకటి అంతా చీకటి. జైలులోని అంధకారానికి అలవాటు పడిన ఖైదీ బయటికి వచ్చింతర్వాత, సూర్యరశ్మికి తట్టుకోలేడు. ఆ అంధకారమే బాగుంది, ఆ ఆకలే మంచిది, పోయి భజన చేసుకుంటున్నారు, ఎన్ని రోజులు భజన చేసినా, ఏరాముడూ, ఏ కృష్ణుడూ అన్నం పెట్టడు. నీరసంతో నిద్రపోయారు.

ఏదో కొత్త యాక్ట్ వచ్చింది లేవండి, లేవండన్నారు నాయకులు. మళ్ళా ప్రజలు లేచి, వేళ్ళతో కళ్ళని విప్పి పట్టుకుని చూశారు. జనం ఎక్కడికో కదలిపోతున్నారు. ఎక్కడికీ ప్రయాణం? ఆశలులేని, ఆకలి లేని ఆ లోకానికి పోదాం అన్నారు. ఎక్కడ ఆ లోకం? ఒక సన్నటి, నల్లటి, పొడుగాటాయన, కర్రపుచ్చుకుని తొందరగా కదిలిపోతున్నాడు, అందరూ ఆయన వెనకాల బడ్డారు. పిల్లలు, స్త్రీలు, వృద్ధులు అందరూ అటే పోతున్నారు. అయ్యో, అటు సముద్రంలోకి నడిచిపోతున్నారు, ఉప్పు తీద్దాం, ఉప్పు తింటారా? ఆశలులేనీ, ఆకలిలేనీ, ఆలోకం – తీరా చేసి సముద్రమా– ఇక్కడే బాగుంది, ఈజైళ్ళే బాగున్నాయి. హాయిగా అన్నం పెడతారు. అటువెడితే సముద్రం, ఇటొస్తే అంధకారం. అది ఆకుపచ్చ అంధకారం. ఇది నల్లటి అంధకారం.

అంధకారం యొక్క రంగుని నిర్ణయించుకునేందుకు సృష్టికి వ్యవధిలేదు. కదిలి పోతోంది విశ్వం. అన్నీ యధావిధిగా సక్రమంగా జరిగిపోతున్నాయి. అన్నీ బొగ్గులు, సముద్రంలో ఆరిపోయి, తడిసిన బొగ్గులు, ఈ బొగ్గులు ఆరిపోవు, లోలోపల నిప్పుకణాలు రగులుతూనే వున్నాయి– ఒక్కొక్క నిప్పుకణం, సముద్రాన్ని సహితం దహించి పిండబెట్టేస్తోంది.

గవర్నమెంటు ఉద్యోగులు, పాలకుల ఉప్పుతింటూ, వారి పతనానికి ప్రార్థనలు రహస్యంగా సాగిస్తున్నారు. ఉదయం లేవగానే పత్రికలు చదువుతారు– యూరప్‌లో మరో రాజ్యం బయలుదేరి వీళ్ళ కోరలు పీకెయ్యకూడదూ? పాశ్చాత్య ఆకాశంలో యుద్ధ మేఘాలు విహారం చెయ్యడం లేదూ? లేదు, అదంతా ఫ్యాక్టరీ బొగ్గు తాలూకా మేఘాలే. పోనీ కనీసం, ఆ ఫ్యాక్టరీలు మందుగుండు సామాగ్రిని తయారుచేసేవేమో అనుకుని తృప్తిపడ్డారు.""

మళ్ళా, సన్నని, నల్లటి, పొడుగాటి కర్ర పుచ్చుకున్న వ్యక్తి, పిలుస్తున్నాడు... పోనీ ఆయన వెనకాల వెడదాం లేవండన్నారు. లేచారు. మళ్ళా అందరూ ఆయన వెంటబడ్డారు. ఈసారి, ఎక్కడికని అడగటం మానేశారు. ఎక్కడికో ఎవరిక్కావాలి? మొత్తంమీద కదిలిపోవడం ఆయన పాదాలకింద ఇసుక రేణువులై యీ ప్రజ, ఒక్కసారి లేచి గంతులేసి నలుదిక్కులా వ్యాపించింది. నిప్పుకణాలు ప్రజ్వరిల్లాయి. సముద్ర కెరటాలు ఎవరు పిండుకునేందుకూ ఉప్పుకూడా లేకుండా, నీరసించి వెనక్కి వెళ్ళిపోతున్నాయి. అది ఆకలి చేస్తున్న మహాయజ్ఞం అది దాహం చేస్తున్న తీర్థయాత్ర, అది ఆశ సలుపుతున్న స్వప్నగానం.

ఎక్కడికో, ఎందుకో–ఎవరికీ తెలీదు, ఎవ్వరూ అడగరు. మరి వెనక్కి చూడ్డం లేదు.

ఆ సన్నటి పొడుగాటాయన వెనకాలే వెళ్ళిపోవాలి. ఏ కొద్దిమందో, ముందుకు నడిచే జనాభాని లెక్కబెడుతూ ఒక నోటు బుక్కులో ఎక్కించుకుంటూ, దిగడిపోయారు. అబ్బో, ఏం జనం? ఎంతమందినని లెక్కబెట్టడం! ఊరికే లెక్కపెడితే చాలదు. వాళ్ళని ఆపుచెయ్యండి అన్నారు ప్రభుత్వంవారు. ఐదుగురుకంటె ఎక్కువమంది వుంటే కొట్టండన్నారు, పట్టుకుని జైళ్ళల్లో పెట్టండన్నారు. అవసరమైతే కాల్చి చంపండన్నారు. అగ్నినే కాల్చమంటున్నామన్న ఆశ్చర్యం వాళ్ళకి కలగకపోలే.

నిప్పులో కర్రపెడితే కర్ర కాలిపోతుంది. మంట మరింత పెద్దదవుతుంది. ప్రభుత్వంవారు, అడవులను కొట్టి, యీ మంటని పెద్దది చేసేందుకో అన్నట్లు, కర్రలని తమ ఉద్యోగులకిచ్చి– వెళ్ళి ఈ ప్రయాణాన్ని ఆపుజెయ్యమని ఆజ్ఞాపించారు. కాకినాడ మునిసిపల్ లిమిట్సులో ఎక్కడ సభ జరిగినా సరే, ఈ కర్రల వర్షం ఆ మంటని చల్లార్చేటందుకు కురిపిస్తామని చాటించారు.

ఎవరూ నిద్రపోవడానికి సమయం కాదది. ఆకలిదప్పులచే బాధ పడుతున్న ఈ భారతీయులకి నిద్రాదేవి ఏనాడో విడాకులిచ్చింది. ముగ్గురు వ్యక్తులు గదిలో ప్రవేశించి, నిద్రని నిద్రనుంచి లేపారు. కుటుంబరావు కమ్యూనిస్టు, సుందరం సోషలిస్టు, అహోబలరావు అనార్కిస్టు, వీళ్ళు ఎవర్నీ నిద్రపోనీరు, వీళ్ళకి నిద్రాహారాలు అక్కరలేదు. ఇతరులకి ఉండకూడదు. అదే వారి జీవిత పరమావధి స్నేహితుల మాట కాదవలేక పొయ్యాడు దయానిధి. వాళ్ళ ఆవేశాన్ని అతను అర్థం చేసుకున్నాడు. కాబట్టి అరికట్టలేకపొయ్యాడు. ఈ యాక్టు డాక్టర్లకి చేసిన అన్యాయాన్ని గురించి అతన్ని బహిరంగసభలో ఉపన్యసించమన్నారు. నేను డాక్టర్ని కానన్నాడు దయానిధి నువ్వు, నేనూ అందరం బానిసలం అన్నారు. "మీరేం చేస్తున్నారు" అన్న ప్రశ్నకి ఒక్కటే సమాధానం – "బానిసత్వం"

ఆ రాత్రి అతని కార్యం అన్న సంగతి ఆ ముగ్గురు వ్యక్తులకీ తెలిసికూడా, అతన్ని బలవంతం చెయ్యసాగారు. ఊరికే వచ్చి వింటామ. కాని ప్రసంగించవన్నాడు. పోనీ అదన్నా చెయ్యి– అని అతన్ని సభ లోకి లాక్కుపొయ్యారు.

సాయంత్రం నాలుగైంది. రోడ్డు పక్కన మునిసిపాలిటీవారి హద్దుని తెలియపరుస్తూ ఒక బోర్డు వుంది. కాని జనం దాన్ని ధిక్కరించి అన్ని ప్రక్కలా కూర్చున్నారు, ఎక్కడ చూచినా మనుషులే. ఈ దేశంలో ఇంతమంది జనం వున్నారా అనిపిస్తుంది. ఏవో కేకలేస్తున్నారు. ఒకాయన లేచి మాట్లాడుతున్నాడు. అదేమిటో ఎవ్వరూ వినిపించుకోకపోయినా ప్రతివాక్యానికీ కరతాళ ధ్వనులు, పెద్దగంద్రగోళం. స్వరాజ్యం.... స్వేచ్ఛ తమ ఉనికిని గుర్తించమని చేసే చప్పుడు. ఈ మధ్యలో ఒకాయన నిలబడి ఏదో అన్నాడు. అయన్ని గోలచేసి కూర్చోబెట్టి, బయటకి యీడ్చుకుపొయ్యారు. మరొకాయన లేచి, ఉపన్యాసం సాగించాడు. దయానిధి, ఆ వుద్రేకంలో కొట్టుకు పొయ్యాడు. శరీరం పొంగింది. చర్మం విప్పుకుని వెంద్రుకలు నిలబడి, గుండెలు దడదడ కొట్టుకుంటూ వేడెక్కి వేగంగా ప్రవహిస్తూ అతన్ని నరాలకుప్పగా మార్చివేశాయి. అతనిక మనిషికాదు ఒక శక్తి, సముద్రాన్ని దహించివేసే మరో నిప్పుకణం. అప్రయత్నంగా కళ్ళమ్మట ఆకలి కన్నీరుగా వేడిగా జారుతోంది. "స్వేచ్ఛ" అతన్ని ఆవహించి తనలో కలిపేసుకుంది– ఏదో శక్తి అతన్ని ముందుకు తోసుకుపోయింది. వెళ్ళి లేచి నిలబడి, మాట్లాడడం మొదలెట్టాడు. అది భాషా?

అవి భావాలా? దానికి తర్కంతో నిమిత్తం ఉందా? పగిలిన హృదయం, పగలని హృదయంతో మొరెట్టుగోడం.

సముద్రం, నేలతో వర్షం ద్వారానూ, ఆకాశం భూమితో తుఫాను ద్వారానూ విడవడం లాంటిది. బురదలో పురుగు చంద్రుడికి కనుసైగ చెయ్యడం లాంటిది. సృష్టి చెప్పుకుంటున్న స్వగతం అది.

స్వాతంత్ర్యం జన్మహక్కన్నాడు నిధి. మానవుడికి స్వాతంత్ర్యం ఆకలిదప్పులకంటే కూడా ఎక్కువ ముఖ్యం అన్నాడు. దాస్యానికి అలవాటుపడిన యీ జనానికి తిరుగుబాటు చెయ్యడం చేతకాదు. ఏ వొక్కడో తమ నిజదుస్థితిని తెలుసుకొనేటంతటి తెలివితేటలు చూపడం మొదలు పెడితే, బ్రిటీషు ప్రభువులు అతన్ని కొనేస్తారు. పెద్దపెద్ద పదవులిస్తారు. బిరుదులిస్తారు. దేనికో సభ్యుడుగా దూరదేశాలు పంపించి వేస్తారు. వీటికి అతీతుడైనప్పుడు ఆ వ్యక్తి దేశనాయకుడవుతున్నాడు. అప్పుడు అతడిని ప్రభుత్వం బంధిస్తుంది. పొట్టకూటికై అమ్ముడు పోయిన యీ భారతీయ ఉద్యోగులపైననే, ఈ బానిసత్వాన్ని నిలబెట్టే భారం పడేశారు. భారత మాతని రూపాయి కమ్మేశాం. మనకి పావలా మిగిల్చి ముప్పావలా వాళ్ళే తీసుకుపోతున్నారు...అన్నాడు నిధి ఉపన్యాసంలో.

ఒకసారి సభ నిశ్శబ్దం అయిపోయింది. పై అధికారి కాళ్ళక్రింద ఇసుకరేణువులా బ్రతుకుతున్న వుద్యోగి, వర్షానికెదురు చూస్తున్న కర్షకుడు, పరీక్షలో ప్యాస్ కాలేని విద్యార్థి, ఐదునెల్లకి వొకసారేనా జీతం పుచ్చుకోని వుపాధ్యాయుడు, నిరుద్యోగి పెండ్లాం పెట్టే బాధల నుంచీ పారిపోయి వొచ్చిన భర్త—అందరికీ ఈ బహిరంగ సభలు, రంగస్థలాలు లాంటివి. ఒక్కసారి తమ ప్రత్యేకమయిన ఇబ్బందులు, అశాంతి, ఆకలి—అన్నీ మరచిపోయి, ఇక్కడ మానవులుగా మారుతారు... స్వేచ్ఛగా గాలి పీలుస్తారు.

డాక్టర్ల విషయం చూడండి....ఇండియన్ మెడికల్ సర్వీసులో విభేదాలు గమనించండి. తలకాయలు దొరలే, కాళ్లు, చేతులు వాళ్ళే మనం? మనం వాళ్ళ పాదాలకింద యిసుక రేణువులం. వొక రేణువు పెద్ద సైజుది. మరొటి చిన్నది. అంతే తేడా. ఇండియన్ మెడికల్ సర్వీస్...పెద్ద బిరుదు ఒ బి ఇ...మరో బిరుదు, ఒ.బి.ఇ. అంటే ఒబిడియన్స్ టు బ్రిటిష్ ఎంపైర్ అని...

జనంలో కలకలం బయలుదేరింది. బైట ఎవరో ఒచ్చి ఏదో అన్నాడు. ఒక్కసారిగా జనం లేచి అటునుంచి కదిలారు. ఆ గంద్రగోళంలో మునిసిపల్ లిమిట్స్ దాటి లోపలికి పడ్డారు. దూరంగా ఈలలు గుర్రాల డెక్కల చప్పుడు— దుమ్ము లేపడం, జనం అంతా దగ్గరగా జరిగారు...ఒక్క వ్యక్తిగా, వ్యక్తిత్వాలు పోగొట్టుకుని, ఒక పెద్దమనిషిగా మారిపోయారు, జనం చెల్లాచెదరయి పోవడానికి నాలుగు నిముషాల వ్యవధిచ్చారు... మళ్ళా ఈలలు, జనం అంతా ఒక్కసారిగా అటూ ఇటూ వూగిసలాడుతున్నారు.

దయానిధి తన వుపన్యాసం మానలేదు. ఒక్క రావు బహదూర్ బిరుదుకోసం, మానవత్వాన్ని, స్వాతంత్రాన్ని, సంసారాన్ని, ఆత్మల్ని అమ్ముకున్న ఈ వ్యక్తుల చెప్పుచేతుల్లో బ్రతకడం కంటే మరణమే మేలన్నాడు.

మళ్ళా ఈలలు! జనం చిందరవందరగా పరుగెట్టడం కేకలు, కర్రల వర్షం—మంటని చల్లార్చేందుకు ప్రభువులు కనిపెట్టిన యంత్రాల వర్షం, మూడు నిమిషాలు

స్వాతంత్ర్యానికి, బానిసత్వానికి మూగపోరాటం జరిగింది. కొందరు పడిపొయ్యారు. కొందరు గాయపడ్డారు. గాయపడిన వాడిలా సూర్యుడు పశ్చిమ ఆకాశంలోకి కుంటుకుంటూ దిగుతున్నాడు. పడిపోయిన వ్యక్తుల్ని కార్లల్లో లాక్కుపోయారు– ఇసుకబస్తాలమాదిరి.

హాస్పిటల్‌లో మంచంమీద పడుకున్న దయానిధి, అసలు గవర్నమెంట్ యిట్లా గాయపడిన వాళ్ళకోసమే ఈ దేశంలో హాస్పిటల్స్ నిర్మించారని వుపన్యాసంలో చెప్పలేకపొయ్యానే అని విచారిస్తున్నాడు. ఎడం చెయ్యి మోచేతికి, ఎడమకన్ను పైన నుదురు దగ్గరా రెండుగాయాలు తగిలాయి– అద్దంలో చూసుకుని నవ్వుకున్నాడు. ఇదే కాబోలు. దేశం కోసం త్యాగం చెయ్యడమంటే.

బైట బండి నిలిచిన చప్పుడు. బండిలోంచి ఎవరో దిగిన చప్పుడైంది.

అమృతం లోపలికొచ్చి, స్టూల్ దగ్గరగా లాక్కుని కూర్చుంది. దూరంగా, ఆమె భర్త పినతల్లి కొడుకు శంకరం నిలబడి వున్నాడు.

"మా జగ్గు చెప్పాడు–సరే, పెళ్ళికి కూడా రాలేదు, పోనీ చూద్దామని శంకరాన్ని తీసుకొచ్చాను. మావారూ రావాల్సిందే కాని, తాసీల్దారు అక్కడే క్యాంపేశాడు. నువ్వెళ్ళిరా అని నన్ను పంపారు. ఈ కట్లేమిటి? ఈ వాలకం ఏమిటి బావా! అంతా విన్నాను– ఔరా! కాలం ఎల్లాగై పోయింది–" అంటూ అమృతం ముక్కుమీద వేలేసుకుంది, ఏడాది లోగా అమృతం బాగా ఎదిగినట్లు కనబడుతుంది. వంగపండు రంగు చీరా, జబ్బలనంటి పెట్టుకున్న ఎర్రపువ్వుల ఖద్దరు రెవికా, వింతగా రేగి పోయిన జడా కొంత పరిపూర్ణతని ఆపాదించాయి. ముఖం కొంచెం వాడింది. కాని అది అందంగా వాడిపోవడం.

అమృతాన్ని చూడగానే దయానిధి కొండంతయ్యాడు. గాయాలన్నీ మానిన ట్లయింది. రక్తం వేగంగా ప్రవహిస్తోంది. కాని, అందులో వేడి లేనట్లనిపించింది. శీతలంగా వుంది. ఎందుకో భారతమాతని చూచినట్లనిపించి , అతనికి నవ్వొచ్చింది.

"బావా, నీకో తాయిలం తీసుకొచ్చాను ఏమిటో చెప్పుకో." అంది వయ్యారంగా నవ్వుతూ. మబ్బురంగు ముఖంలో పళ్ళవరస ఒంటి నక్షత్రంలా మెరిసింది. విశాలమైన చెక్కిళ్ళు, సృష్టినంతా ఒక్క చూపులో ఆవరించుకునే కళ్ళు– వీటిల్లో దేనికేసి చూడటం, ఏ మాటని వినడం? ప్రతి మాటనీ హృదయంలో తడిపి గుజ్జులా చేసి పడేస్తుంది. ఆ మృదుత్వం భావంలో వుందా, మనిషి ఆకర్షణలో వుందా– నిర్ధి నిర్ణయించ లేక పొయ్యాడు. అతన్నెప్పుడూ అమృతం ఈ విధంగా ఆకర్షించలేదు. బహుశా దీనికి కారణం. అతనికి ప్రస్తుత స్థితేమో. యుద్ధంలో గాయపడ్డ సైనికులకు ఫ్లారెన్స్ నైటింగేల్, దేవకన్యలా అగుపడటంలో ఆశ్చర్యం ఏముంది? స్థలం, కాలం, వీటి ఆసరా చూసుకుని బ్రతుకుతుంది ఆకర్షణ అదేం ఖర్మమో.

"జగన్నాథం రాలేదేం?"

"వాడికి పేపర్లు ఔటయ్యాయని, మళ్ళా పరీక్ష పెట్టారట. సికింద్రాబాదు వెళ్ళాడు. ఏం తాయిలమో చెప్పుకోలేకపొయ్యావు. ఇంతేనా బావా"అంది అమృతం.

"పూతరేకులా?"

"కాదు"

"అరిసెలా?"

"అబ్బే"
"నువ్వే చెప్పు—చెప్పటం దేనికి— ఇల్లా ఇవ్వరాదూ?"
"ఇందిరని తీసుకొచ్చా"అంది.

నిధి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, లేచి కూర్చోబోయి "అమ్మ" అనుకుని మళ్ళా పక్కమీద వాలాడు.

"రైలు దిగగానే బాబుగారింటికే తిన్నగా వెళ్ళాను. మేం కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న పదినిమిషాలకే వాళ్ళ పోలీసు ఒచ్చి లారీచార్జీ జరిగిందనీ, నీకు దెబ్బలు దగిలి అస్పత్రిలో వున్నావనీ చెప్పాడు. పోనీ అల్లుడున్నాడనేనా చూసుకోవద్దు—బాబుగారు మాత్రం" అని నిట్టూర్చింది.

"అట్లా చూసుగుంటూ కూర్చుంటే ఉద్యోగం చేసినట్లే. క్యాంపు చేసిన తాసీల్దారుని ఒదిలిపెట్టి. మీ ఆయన నీతో షికారొస్తే ఈ పాటికి దేశానికి స్వరాజ్యం రానే ఒచ్చును ఉద్యోగం అంటే అమ్ముడు పోవడం. విధి నెరవేర్చడంలో తమ్ముడు, అల్లుడు, బావా అంటూ చూడ్డానికి వీల్లేదు. అలా చూస్తూ కూర్చున్న వాళ్ళని, మర్నాడే పీకేస్తారు."

"నువ్వు చెప్పింది నిజమేననుకుంటా బావా— నేనూ చూస్తాగా జమాబందీ రోజుల్లో మావారికి నిద్రాహారాలే వుండవు."

"ఉత్తప్పుడే వుండదు నిద్ర— ఇంక జమాబంది ఒస్తే చెప్పాలా?"అన్నాడు నిధి.

"పో బావా— అన్నీ కొంటె కబుర్లు—దెబ్బలు తిని కూడా మానవు ఏం? ఏం చెప్పాను? సరే, పోలీసొచ్చి, ఆస్పత్రిలో వున్నావన్నాడు. బాబుగారేరని అడిగాను. తెలీదన్నాడు. అయ్యో, దెబ్బలు తగిలాయా అని మాధవయ్యగారి భార్యేనా, కొంచెం ఆదుర్దా పడొద్దూ, నాకు మాత్రం కంగారెత్తిందిస్మా చెప్పొద్దు, ఇందిరని కూడా రమ్మన్నాను. వాళ్ళమ్మ మొహం నాలుగుసార్లు చూసి, ఆఖరికి తనూ వస్తానంది. వెంటనే బయలుదేరి వొచ్చేశాం....."

"ఎక్కడుందీ?"

"పిలవనా? ఇందిరా..."అంటూ, గుమ్మంవేపు చూస్తూ, రెండు సార్లు కేకేసింది.

బయట నుంచి జవాబు లేదు, ఇందిర రాలేదు.

"శంకరం—చూడు, ఇందిరని లోపలికి రమ్మను—తీసుకురా..."అంది శంకరంతో, శంకరం, రెండునిమిషాలు, అన్ని వేపులా పరకాయించి, ఎక్కడా లేదంటూ చక్కావొచ్చాడు.

"ఇదేం చిత్రం బావా— నాతో కూడా రమ్మంటే, నేను తరువాతొస్తాలెండీ. మీరు వెళ్ళి మాట్లాడుతూండండని అక్కడే నిలబడి పోయింది తను. ఇంతలో ఏమైపోయిందబ్బా! అంతా గారడీలాగుంది... "

"ఒక వేళ ఎరుగున్న వాళ్ళెవరన్నా వుంటే, అవతల వార్డులో కెళ్ళిందేమో...."

"ఉండు, నేనే చూసొస్తాను బావా—"అంటూ అమృతం లేచి వెళ్ళింది.

దయానిధికి అనుభవం అంతా కలలో మాదిరిగా వుంది. మామగారికి తను సభలో వుపన్యసిస్తున్నట్లు తెలుసా? తెలిస్తే యిట్టా చేశాడా? ఆయనకేది ముఖ్యం? కూతురు సౌఖ్యమా? రావుబహద్దూరా? ఈ ప్రశ్నలకి సమాధానంపై నిధి తన భవిష్యత్తు ఆధారపడిందని తెలుసుకున్నాడు. కంటిమీదకి మెల్లగా రక్తపుచుక్క జారింది.

మరి గత్యంతరం లేక కన్నీటి బిందువుతో కలిసిపోయింది.

ఐదు నిమిషాలలో అమృతం తిరిగి వచ్చింది. మొహంలో ఎంతో ఆత్రుత కవిపిస్తున్నా, కళ్ళు నవ్వుతో మెరుస్తోన్నాయి.

"ఎక్కడా కనపళ్ళేదు బావా- ఇంతలో అక్కడ ఆస్పత్రి కుర్రాడొకడు, కనిపించి, ఎవరో వారి తాలూకు వాళ్లు వొచ్చి, ఆమెను కార్లో ఎక్కించుకుని తీసుకుపొయ్యారండి అన్నాడు- చాలా చిత్రంగా వుంది. ఎవరంటావ్?" అంది.

"తెలుస్తూనే వుందిగా- పోలీసుల్ని, వాళ్ళ నాన్న కూతుర్ని యింటికి పిల్చుకొని రండి అని పంపి వుంటాడు. ఇల్లాంటి అల్లుడితో సంపర్కం మరి ఆయన ఉద్యోగానికి నష్టంగా--"

"ఎట్లా?"

"నీకు తెలీదు కాబోలు, గవర్నమెంటు ఉద్యోగి, భార్య, పిల్లలు దగ్గర బంధువులు- ఎవరేనా సరే రాజకీయాలలో పాల్గొన్నారంటే వారే సంజాయిషీ చెప్పాల్సి వుంటుంది. ఈ ఉద్యోగులందరూ, పొట్టకూటి కోసం వారు చేసే పనులన్నీ మహా పాపాలని తెలిసే, రహస్యంగా దేవుణ్ని ప్రార్థించి, పూజలూ పునస్కారాలూ చేసుకుని పాపపరిహారం పొందుతారు."

"అల్లాంటి మనుషులుంటారని నే అనుకోను, బావా" అంది అమృతం.

"నేనూ ఎప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు అనుభవం ఐందిగా"అన్నాడు.

ఇద్దరూ మౌనంలో పడ్డారు. చీకటి పడింది. వింత వింత రసాయనాల వాసనలు ఆవరిస్తున్నాయి. శంకరం పచార్లు చెయ్యడం చాలించి పరుపుచుట్ట స్తంభానికి ఆనించి. దానిమీద జార్లపడ్డాడు. కారియర్‌తో అన్నం, ఫ్లాస్కులో పాలు తీసుకురమ్మని, అమృతం శంకరాన్ని పంపించి ఏదో మాట్లాడాలనుకుని అమృతం వాక్యాలని కంఠంలో సిద్ధం చేసుకుంది. కాని బైటికి అనలేకపోయింది. దయానిధి కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డాడు. కుటుంబరావు, సుందరం అక్కడికొచ్చి మళ్ళా కబుర్లు మొదలెట్టారు.

"మాధవయ్యగారింటికి వెళ్ళి గడ్డెట్టిరానా?"అన్నాడు కుటుంబరావు.

"ఎండుగడ్డి గనకనైతే, నేవెళ్ళి నిప్పుపుల్ల పెట్టొస్తా"అన్నాడు సుందరం.

"నా విషయమై మీరేమీ అదుర్దాపడి కోతిపనులు చెయ్యకండి. ఒక విధంగా నాకిట్లా జరిగినందుకు, కొంత సంతోషంగానూ, కొంత గర్వంగానూ వుంది. బాధపడటంలో స్వార్థం త్యాగం వుంది. అందుకే మనిషి బాధని భరించ గలుగుతున్నాడనుకుంటా-"

"బాధలో వైరాగ్యం వుంటే అందులో కొంతభాగం మీమామగారికి సమర్పించడం నీ విధి కాబట్టి, ఆయనకూడా బాధపడే మార్గం ఆలోచించు"అన్నాడు కుటుంబరావు కొంచెం హేళనగా.

"చూశావో లేదో తమాషా- కొన్ని అరెస్టులు జరిగాయి. అరెస్టు కావాల్సిన వాళ్ల జాబితాలో నిధి పేరు లేదు. ఇది మామగారు అల్లుడిపై దయచూపడం కాదంటావా?"అన్నాడు సుందరం.

"మనం యిక్కడ ముసుగులో గుద్దులాటెందుకూ? వెళ్ళి నాలుగు విషయాలు ముఖాముఖిన అడిగేస్తే మంచిదని తోస్తోంది."అన్నాడు. కుటుంబరావు.

"ఇందిర తన్ని చూడ్డానికి రావడం చూడనీయకుండా మాధవయ్యగారి తాలూకా మనుషులొచ్చి ఆమెను తీసుకెళ్ళి పోవడం– ఇవన్నీ నిధి స్నేహితులిద్దరికీ చెప్పాడు. సుందరం ఒళ్ళు మండిపోయింది. "పోనీ ఆ పిల్లకైనా జ్ఞానం ఉండొద్దా! ఊళ్ళో నలుగురూ గడ్డెట్టరూ"అంటూ, ఏదో అనడం సాగించాడు.

"నాకు ఎవర్నో అడిగి తెల్సుకోవాల్సిన సంగతులు కనిపించడం లేదు. ఎట్లాంటి సందేహాలు లేవు...అంతా మబ్బులేని ఆకాశంలాగా తెల్లమై పోయింది. ఏదో బరువు తగ్గినట్లుగా ఉంది. ఈ నిర్మలమైన ప్రశాంత హృదయం మహారణ్యంలో, చెట్లకింద సరస్సులా ఉంది. అందులో ఎందుకు రాళ్ళు విసురుతారు?"అన్నాడు నిధి కళ్ళు కొంచెం మూసుగొని.

"అబ్బాయీ, సరస్సులో కప్పలు, చేపలు కదులుతుంటాయి...ఎలాగా నీ మనస్సు అలలతో కొట్టుకోవడం మానదు"అన్నాడు. సుందరం వుపమానాన్ని అందుకుని పూర్తిచేస్తూ.

మాధవయ్యగార్ని కలుసుకుని, మళ్ళా వస్తామంటూ వాళ్ళిద్దరూ వెళ్ళిపొయ్యారు.

డాక్టరు, నర్సు వచ్చి పరీక్ష చేసి, కావల్సినవి చూసి వెళ్ళిపోయారు.

అమృతం స్క్రీన్ వెనకాలకెళ్ళి, మరో చీర కట్టుగుని, తల దువ్వుకుని జడ చుట్టగా చుట్టుకుని, వచ్చి, బల్లమీద కూర్చుంది.

"పోనీ నే వెళ్ళి, ఇందిరని చూసొస్తా బావా" అంది నిశ్చయం చేసుకున్న దానికిమల్లే.

"ఇందిరని చూశావుగా"అన్నాడు.

"ఆ చూడ్డం వేరు, నీ కెట్లా వుందోనని ఆదుర్దాపడుతుంటుంది. అత్తగారితో మాట్లాడి..."

"ఏం మాట్లున్నాయి?"

"ఏమిటి బావా అలాగంటావు? శోభనానికి మరో ముహూర్తం పెడతారో...ఏమిటో కథ..నాలుగూ మాట్లాడొచ్చుగా"అంది.

"మా వర్గాలు విడిపొయ్యాయి అమృతం! మళ్ళా కలస్తాయనుకోను"అన్నాడు నిధి విమ్మళంగా లేచి మంచం మీద కూర్చుని.

"అశుభం మాటలేమిటి బావా? నువ్వనేది నాకర్థం కావడంలా–"

"తల్లిదండ్రుల చెప్పుచేతల్లో పెరిగి, వ్యక్తిత్వం లేని అమాయకురాలు ఇందిర. వాళ్ళ క్షేమం కోసం తన సౌఖ్యాన్ని త్యాగం చేసుకుంటుంది...అంతేకాదు. మా విడిపోవడానికి యింకా లోతులున్నాయి అమృతం. వాటి పరిమాణం అందరికీ అర్థమవుతుందనుకోను."

"అంటే?"

"ఆదర్శాలలో ప్రధాన శత్రుత్వం వుంది. వారికి డబ్బు, ఉద్యోగం, హోదాతో వచ్చే సంఘంలో గౌరవం, బిరుదులు...ప్రపంచంలో పైకి రావడం, ఇల్లు, భూములు, పెద్ద పెన్షన్‌తో రిటైర్ కావడం, బ్యాంక్‌లో ఎక్కౌంటు...యివి కావాలి వారికి..."

"యివి ఎవరికి అక్కరలేదు? అందరూ వీట్నిగా ఆశించేది" అంది అమృతం.

"కొంతవరకూ, అందరూ వీట్ని ఆశిస్తారు. నేను కాదన్ను, ఆశించవల్సిందేకూడా. కాని, యివి పొందడం కోసం" ఆత్మవిశ్వాసాన్ని న్యాయవిచక్షణల్ని, సత్యాన్ని కొందరు

వదులుకోలేరు. మన ప్రభుత్వం అన్యాయంగా ప్రజల్ని పీడించి, బానిసలుగా చేసిన చరిత్ర తెలిసిన యువకుడెవడూ, ఈ దురంతరపు చర్యలో పాల్గొనడు, సత్యాగ్రహం ద్వారా ప్రజాసేవ చేసిన అనామకుడుగా, బీదవాడుగా జీవితం సాగిస్తాడు. అవసరమైతే మరణిస్తాడు. అంతే కాని అన్యాయానికి దాసోహం చెయ్యలేడు. మావి రెండు మార్గాలు. మాధవయ్యగారిది దక్షిణ మార్గం, నాది ఉత్తర మార్గం. మేం ఎప్పుడూ కలుసుకోం...

"నువ్వు చిత్రంగా మాట్లాడతావు బావా– మా వారెప్పుడూ యిట్లాంటివి చెప్పరేం? ఇదంతా వింటుంటే ఏదో భయంగా వుంది..."

"అందులో ఆశ్చర్యంలేదు. వేలకివేలు ఆస్తులు తగిలేసి, భూములమ్ముకుని, చదువుకొని, డిగ్రీపొంది" తాలూకా గుమాస్తాగా చేరడం తప్పదు నేటి యువకులకి, తల్లిదండ్రులు అదే ప్రతిఫలంగా కోరుతున్నారు. సంఘం ఆమోదిస్తోంది. భార్య ఆఫీసనే జైలుకి పంపించే కాపలా మనిషి. మళ్ళా రాత్రికి యిల్లు అనే మరో జైలులో మంచం కోళ్ళకి కట్టిపడేసి, తను పారా ఉంటుంది. ఆ జీతం రాళ్ళకోసం, భార్య రవికలు, రిబ్బన్ల కోసం ఈ దౌర్భాగ్యుడు నలభై ఏళ్ళు కూలిపనిచేసి, నీచంగా బ్రతికి, తన కొడుక్కి సామ్యుయల్ హోర్ దగ్గరనుంచి రికమెండేషన్ తెప్పించి, కోర్టు అమీనాగా జేరుస్తాడు. తరువాత మరణిస్తాడు. సౌందర్యం, సత్యం, స్వేచ్ఛా, ప్రేమ, ఊహాగానం ఆధ్యాత్మిక ఆనందం, మానవుడు కోరదగిన ఏ వొక్కదాని ఉనికి స్వప్నంలో కూడా గమనించకుండా మట్టిలో బ్రతుకుతాడు.–"

"ఇందిర అలాంటి మనిషనుకోను" అంది అమృతం.

"నేను ఇంతవరకూ మొగాడి జీవితం వర్ణించాను. ఇంక మన సంఘంలో స్త్రీ మాట చెప్పాలా? నువ్వు అనుభవిస్తూనే వున్నావుగా–"

"నాకేం బావా?"అంది అమృతం ఆశ్చర్యంతో.

"మన నిజస్వరూపం మనం చూసుకోలేం. ఇతరులు చెబితే సహించలేం మనలని మనం మోసగించుకుంటూ, ఆత్మవంచనకి లోబడి రోజులు గడిపే నటులం మనం అందరం. నీ అత్తగారి రంపపు కోతలు భర్త మౌఢ్యం, వొకర్నొకరు మోసగించుకోవటం, కమ్మారమ్మాయితో స్నేహం, సహనం – ఇంకా చెప్పాలా?"

"ఇట్లాంటివి అన్ని కుటుంబాలలోనూ వుంటాయి. ఇందులో విశేషం ఏముంది బావా? సంసారం గుట్టుగా చేసుకోడం తప్పా?"

"తప్పుకాదు, కాని, నీతికాదు. అందరూ ఎట్లాచేస్తే అట్లా చెయ్యడం నీతికాదు. ఇతరుల మెప్పుపొందడం కోసం కాకుండా, నీకు నిజమని, మంచిదని, మనస్ఫూర్తిగా తోచిన విషయాలని ఆచరణలో పెట్టడం నీతి. నీ ప్రవర్తనకి బాధ్యురాలవు నువ్వే – అంతే కాని, నీభర్త, అత్తగారు, కుటుంబం, సంఘం బాధ్యులు కాకూడదు. నీ చేష్టలకు నువ్వెంతవరకు బాధ్యురాలవో ఒక్కసారి ప్రశ్నించుకో" అన్నాడు విధి నవ్వుతూ.

అమృతం చాలాసేపు ఆలోచించి అన్నది. "ఐనా, బావా, యివన్నీ వూహించుకుంటేనే బాధపడటం జరుగుతుంది. అందరూ ఇట్లాంటివి అనుకుంటూ కూర్చుంటే వొక్కరోజు బ్రతకగలరా?"

ఊహించుకోకుండా ఏ క్షణానికాక్షణం జీవించడం జగన్నాధం పద్ధతి. అక్కయ్యకీ

కూడా ఆపద్ధతే నచ్చడం నిధికి ఆశ్చర్యం కలిగించింది. మళ్ళా కళ్ళు మూసుకున్నాడు. జీవించడమా, జీవితాన్ని గురించి ఆలోచించడమా—ఏది మంచి పద్ధతి? అదీ సమస్య, అసలు "యిది మంచిది"అని నిర్ణయించేటందుకు తగిన ఆధారాలేవి? ఒక మనిషి సుఖపడడమా? కష్టాలుపడ్డా చివరికి ఏదో ఘనకార్యం చెయ్యగలడమా?

"నువ్వు దిగులుగా వుంటే ఎట్లాగో వుంటుంది బావా"అన్నది అమృతం, కొంత నవ్వు తెచ్చిపెట్టుగుంటూ,

"అప్పుడప్పుడు నీకిట్లాగే వుండదూ?"

"ఉంటుందనుకో—కాని ఒంటిగా ఉన్నప్పుడే—"

"గుంపులో మధ్యనున్నవాడు, ఒంటిగా వుండడనా నీ ఉద్దేశ్యం? అసలలా పదిమందిలోనూ వున్నవాళ్ళకే, తాము ఎంత ఏకాంతంగా ఉంటున్నారో, తమకీ, యితరులకి మధ్య ఎన్ని సముద్రాలు పొర్లుతున్నాయో! భయంకరంగా కనుపించి, మరీ బాధపడతారు, తెలుసా.... అమృతం?" అన్నాడు నిధి.

"ఇతరుల సావాసం గిట్టక, ఎప్పుడూ ఒంటరిగా ఉండాలనే వాళ్ళల్లో ఏదో లోపం ఉంటుందనుకుంటా" అమృతం ఆ మాట అనేసినందుకు నాలిక కొరుక్కుంది, కాని, మాటలని వెనక్కి లాక్కోలేదు.

"ఇతరులతో కలిసి వుండాలంటే, మన వ్యక్తిత్వాలని, చాలా వరకూ ఒదులుకుని, మనకి అసహజమైన కొత్త లక్షణాలని ఎరువు తెచ్చుకుని నటించాలి—నువ్వు గ్రహించావా? భర్తని భరించాలంటే, భార్య ఎంత త్యాగం చెయ్యాలి? అల్లాగే భర్తనూ, నిజస్వరూపాలని దాచుకుని ఎంతో అభినయం చేస్తేనే సంసారం నిలబడి, సంఘజీవనం సాధ్యమవుతుంది—"

"అట్లా ఉండడం మంచిదేగా— అల్లా వుండగా, దానికి అలవాటు పడిపోతాం, అందులో చెడులేదు— మరి నీకెందుకు అల్లా వుండడం గిట్టదు?" అని అడిగింది.

"అమృతం అమాయకంగా కనబడ్డా, అదంతా స్థిరపడిన మనస్తత్వాన్నించి జనించిందనీ, ఆ మనస్తత్వం తర్కబద్ధమైన—అలవాట్లతో అమర్చబడ్డ వ్యక్తిత్వం మీద ఆధారపడిందనీ, నిధి గ్రహించుకున్నాడు."

"వ్యర్థ ప్రసంగం చేస్తున్నట్లు గ్రహించుకున్న వాళ్ళ మాదరి, ఇద్దరూ ఒకర్ని చూసి ఒకరు నవ్వుకుంటూ, మళ్ళా నిశ్శబ్దంలో పడ్డారు. స్వల్ప విషయాలలో అభిప్రాయభేదాలున్నా, ప్రధానాంశంలో ఏకీభావంగల ఇద్దరి వ్యక్తుల సంభాషణ మాదిరి, వారి ప్రసంగం బయలు దేరిన చోటకి చేరుకుని నిల్చిపోయింది."

ఇంతలో శంకరం టిఫిన్ కారీర్‌తో చక్కా ఒచ్చాడు. అమృతం భోజనం ఐంతర్వాత చెయ్యి కడుక్కుని మాధవయ్యగారింటికి వెళ్ళడానికి సిద్ధపడింది నిధి ఒద్దన్నాడు. మళ్ళా ఘర్షణ ప్రారంభమైంది. అప్పుడే ఒకాయన గదిలోకొచ్చి, నిధికి ఒక ఉత్తరం ఇచ్చి దూరంగా వెళ్ళి నిలబడ్డాడు. నిధి ఆ ఉత్తరం చదువుకుని, "ఇక మీరు వెళ్ళవచ్చు." నన్నాడు. ఆ ఒచ్చినాయన వెళ్ళిపొయ్యాడు.

అమృతం ఆ ఉత్తరం తీసుకుని చూసింది తనకేమీ అర్థం కాలేదు, అది ఇంగ్లీషులో ఉంది. ఏమనుందో నిధిని చెప్పమంది. అతను లేచి బ్రెడ్ తినడం మొదలెట్టాడు.

"రాక రాక ఒచ్చినందుకు, నీకు మంచి మర్యాద జరిగింది. అవునా?" అన్నాడు.

"మర్యాద పరాయివాళ్ళకుగాని నాకెందుకు బావా?" అంది అమృతం.

"మర్యాద జరగనప్పుడు నొచ్చుకునేది, కావాల్సినవాళ్ళే."

"అది – ఒక మోస్తరుగా కావల్సినవాళ్ళు."

"నీకు నామీద అంత అభిమానం ఉన్నందుకు– నేను ప్రతి ఫలం ఏమీ యివ్వలేకపోతున్నా అమృతం–"

"నేకోరే ప్రతిఫలం నువ్వు సంతోషంగా ఉండడమే"అన్నది.

"అందరూ ఒక వ్యక్తి సంతోషం కోసం ఎందుకు పాటుబడాలో నాకు తెలీడం లేదు. ఎవరి సంతోషం వారు చూసుగుంటే చాలదూ?"

"తమకి సంతోషం లేని వాళ్ళు, యితరులని సంతోషపెట్టేనా తృప్తి పడగూడదు?"

అమృతం మాటలని తూకం వేసి విలువ కట్టడం సాగించాడు నిధి: అమృతానికి తన జీవితంలో సంతోషం లేదు కాబోలు. ఎందుకు లేదో ఆమె కనబరిచే తృప్తి అంతా నటనే? అమృతం దేన్నో అన్వేషిస్తున్నట్లు కనబడుతుంది. దేన్నో అడిగితే? అతనికి ధైర్యం చాల్లేదు.

"ఆ ఉత్తరం ఏమిటో చెప్పవు బావా?"

"మాధవయ్యగారు వ్రాసింది. చాలా అరెస్టులు జరిగాయట, నేను అరెస్టు కాకుండా, ఆయన ఏర్పాటు చేశాడుట. తన్ను తక్షణం ఎక్కడికేనా వెళ్ళమన్నాడు మిగతావిషయాలు తరువాత చూసుకుందాం"అన్నాడు.

"ఈ ఉత్తరం ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసుకి పంపిస్తాను" అన్నాడు నిధి నిదానంగా, కాఫీగ్లాస్ నేలమీద పెడుతూ.

"అట్లా చేస్తే ఆయన ఉద్యోగానికి నష్టంకాదు బావా?"

"అట్లా అవాలనే."

"ఒద్దుస్మా."

"అవును అమృతం, మాధవయ్యగారు దేశానికి వుపకారం చెయ్యలేకపోయ్యాడు. తనకీ అన్యాయం చేసుకున్నాడు. ఆయన విధి ఆయన నెరవేరుస్తూ, నన్నూ అరెస్టు చేసి ఉన్నట్లయితే సంతోషిద్దును నేను: నాకు నిజంగా జైల్లో కొంతకాలం గడపాలనుంది."

"బాగానే ఉంది. ఆయన ఉద్యోగానికి భంగం కలిగితే, మనకే మొస్తుంది?"

"న్యాయాన్ని సాధించడం జరుగుతుంది. చూశావా అల్లుణ్ణి వొదిలిపించేశాడని చెప్పకువే అపకీర్తికన్నా ఉద్యోగం పోవడం పెద్ద అపచారమా?"

"నీ ధోరణి నిజంగా ఆ ఉత్తరం పోలీసు అధికారుల కిచ్చేటట్లుగా ఉంది అల్లా చెయ్యకుస్మా"

"నీ కెందుకు అమృతం వారిమీద అంత జాలి"అని అడిగాడు. ఎల్లాను ఇస్తాడని తెలిసి, యివ్వవద్దు అంటూ తన మంచితనాన్ని ప్రకటించుకోవడమా అది? లేకపోతే ఏదో ఘనకార్యం చేస్తున్నానని, సంస్కర్త స్వాతిశయమా?

"ఏం లేదు బావా...అనేక రకాల మనుషులుంటారు. వాళ్ళందర్నీ బాగుచేసినంత మాత్రాన, న్యాయం జరుగుతుందా? ఎందరో మన్ని మోసగిస్తారు చివరికి మోసపోతారు కోమలి విషయం చూడు..." అంది అమృతం.

"కోమలి ఎవర్నీ మోసం చెయ్యలేదు. కోమలికి బాగా ప్రవర్తించడం అంటే ఏమిటో కూడా తెలీదు."

"బావా! నిన్నో విషయం ఎప్పటినుంచో అడగాలనుంది.. ఏమీ అనుకోనంటే అడుగుతాను—"

"తప్పకుండా అడుగు—పైగా నువ్వడిగేదేమిటో నాకు తెలుసు"

అమృతం ఆశ్చర్యం ప్రకటించింది.

"ఐతే ప్రశ్న లేకుండా సమాధానం చెప్పు" అన్నది.

"నీ దగ్గర నాకు రహస్యం లేదు అమృతం! ప్రతివాడూ తన నిజస్వరూపం ఎవరో వకరి ముందు బైటపెడతాడు. నేను నీ ముందు బైట పెట్టక తప్పింది కాదు...."

"ఓ యబ్బో యీ మాటలకేంలే. మొగాళ్ళ రహస్యాలు ఆడాళ్ళతో ఎందుకు చెబుతారు. నాకు తెలీదేమిటి ఆమాత్రం" అంది కాని, అతని కేసి రెప్పవాల్చకుండా వింతగా చూసి మళ్ళా మొహం తిప్పేసి, గోడమీద పురుగుల్ని వేటాడుతున్న బల్లికేసి చూస్తోంది.

"కాదు అమృతం, చెప్పకపోవడానికి కారణం, చెప్పింది. అవతల వాడు నమ్మడేమోనన్న భయం. చెప్పిన విషయాన్ని, విమర్శించకుండా సానుభూతితో అర్థం చేసుకోగల సంస్కారం వున్నవాడు దొరికేవరకూ, మనలో సత్యం మరుగునపడి వుండాల్సిందే. కొంతమందికి అల్లాంటి వ్యక్తులు అసలెప్పుడూ జీవితంలో దొరకనే దొరకరు. వాళ్ళే విషాదకరమైన వ్యక్తులు. వాళ్లు చివరికి ఐతే మహా యోగులేనా అవుతారు. లేకపోతే రౌడీలేనా అవుతారు. తన ప్రవర్తన సరియైనదని రుజువు చేసుకుని సమాధాన పడటం కోసం, మానవుడు చేసే యత్నమే తన నిజ స్వరూపం."

అమృతానికి బాగా అర్థమైనట్టులేదు. కొన్ని విషయాలు యిట్టే బోధపడతాయి. వాటికి మాటలు, ధ్వనులు, నిర్వచనాలు ఏవీ అక్కర్లేదు. మరికొన్ని పరిశీలించి, తర్కించినకొద్దీ యింకా దూరమైపోయి ఆకృతిలేని, మేఘంలా విడిపోయి ఆకాశమంతా ఆవరిస్తాయి. అమృతం వెనక్కి జంకింది. చూపుతో, నాడి కదలికతో, చర్మం తాకిడితో చుర్రుమని కాలి పొయ్యే హృదయం, నోరు విప్పగానే మూగదై పోయింది.

"అసలు విషయం తప్పించేశావు. బావా....నీకు కోమలంటే ఎందుకంత యిది...?"

"యిదంటే?"

"ఏమో బాబూ, నాక తెలీదు."

"తలకాయ గిర్రున తిప్పి సిగ్గుని నవ్వులోకి మార్చేసింది అమృతం. అట్లా ఆ నవ్వు పైకి లేచిపోయి "దొంగబావా" అన్న వాక్యంలో పేలిపోయింది. రంగురంగుల నక్షత్రాలు ఆమె కళ్ళ ముందు కదిలాయి. ఇందాకట్నుంచీ అల్లుకున్న నిశ్చలత్వం వొక్కసారి విడిపోయింది. తినేటందుకు పురుగులేక బల్లి వెనక్కి వెళ్ళిపోయింది. శంకరం వచ్చే ఆవలింతను ఆపుగుంటూ చిటికలు వేస్తున్నాడు.

అమృతం లేచి ఒళ్ళు విరుచుగుని, అటూ యిటూ పచార్లు చేసి మళ్ళా అతని దగ్గరగా వచ్చి—'

"సమాధానం నాకు తెల్సు బావా"అన్నది.

"నీకు తెలీదు, అమృతం. అసలు ప్రశ్న ఏమిటో కూడా నీకు తెలీదు"అన్నాడు.

"నాకు తెలుసు"అంది అమృతం.

"పోనీ నీ ప్రశ్న ఏమిటి? నాకు కోమలితో సంబంధం ఉందా అని. లేదని, నీకు తెలుసు ఐనా వుందని, నాకు కొంత బాధ కలిగించాలని, నిజాన్ని నిజం అని

రుజువు చెయ్యడం నాచేత కాదు" అన్నాడు నిధి.

అమృతం ఒక్కసారి మొహం విచారంగా చేసుకుంది. స్త్రీత్వం లోని అసహాయత కళ్ళల్లో ప్రదర్శించింది.

"అదికాదు బావా! కోమల్ని గురించి నీకెంతటి అభిమానం ఉందో తెలుసుకోవాలని–అన్నా కాని, నిన్ను బాధ పెట్టాలని కాదు. ఐతే ఈ విషయం నీతో మాట్లాడన్లే. నేనేమన్నా తప్పుగా అంటే... క్షమించు"

"స్త్రీ ఈ ధోరణిలో మాట్లాడినప్పుడు, తెరవెనుక జరుగుతున్న నాటకం లో పాత్రగా మారుతుంది. మనం చూడొచ్చు–వినొచ్చు. తెలుసుకోవచ్చు. కాని అర్థం చేసుకోలేం."

"ఇట్లాంటప్పుడు, మీ అమ్మగారుంటే యెంత ధైర్యంగా ఉండును."అన్నది అమృతం మరో విషయం యెత్తుతూ.

అమృతం అనుభవం వల్ల తెలుసుకుని, ఆలోచించి ప్రయోగించిన అస్త్రం అది. మళ్ళా సంభాషణ ప్రస్తుత కర్తవ్యాన్ని గురించి ప్రారంభమైంది. నిధిని తనతో వాళ్ళ వూరు రమ్మంది అమృతం.

"మీ ఆయన ఏమన్నా అనుకుంటాడేమో?"అన్నాడు.

"పో,...ఏం మాటలు బావా?"

"నేను మా నాన్న దగ్గరికి బెంగుళూరు వెడుతున్నాను. నువ్వు తెల్లారగట్ట బండికి మీ వూరెళ్ళు"అన్నాడు.

నిధికి మాధవరావుగారేర్పాటు చేసిన బసలో అమృతం, శంకరం పడుకోటానికి ఏర్పాటైంది. బండి తెల్లారగట్ల ఐదున్నరకి. స్టేషన్‌కి వెళ్ళేటప్పుడు అక్కడికొచ్చి చెప్పి వెడతామని... శంకరం, అమృతం బండీమీద గదికి వెళ్ళారు.

నాలుగింటికి అమృతం హాస్పిటల్‌కి వొచ్చింది. నిధి నిద్రలో ఉన్నాడు. రాత్రి నిద్ర పట్టిందని వార్డుబోయ్ అన్నాడు. అమృతం మెల్లగా అతని మంచం దగ్గరకొచ్చి, మాదవయ్యగారు వ్రాసిన ఉత్తరం కోసం వెదకడం మొదలెట్టింది. అతని దిండుకింద ఆ ఉత్తరం దొరికింది. దాన్ని తీసుకుని దాచింది తరువాత అతన్ని లేపి "వెళ్ళొస్తా బావా! నువ్వు తప్పకుండా మావూరు రావాలిస్మా. మామయ్యనికూడా తీసుకురా. ఇంకో పది రోజుల్లో జగ్గుగాడు కూడా వొస్తాడు. ఏం?"అంది.

"నిధి లేచి కళ్ళు తుడుచుకుని ఆవలించి, "అల్లాగే"అంటూ మళ్ళా వాలాడు. బైట బండివాడు "టైమైంది లెగండమ్మా"అని అరుస్తున్నాడు.

"వెళ్లొస్తా బావా! జ్ఞాపకం వుంటాం కదూ–ఓ ఉత్తరం ముక్క రాస్తూండు. తమ్ముడ్ని స్టేషన్‌కి పంపుతా.."

"తప్పకుండా వొస్తా. ఐతే, వో వేళ నే రాలేననుకో– నేను ఎప్పుడు రమ్మంటే అప్పుడు రాగలవా నువ్వు" అన్నాడు.

"అమృతం అటూ యిటూ చూసి, శంకరంతో, "పద ఎక్కవోయ్ బండి అంటూ– "ఓ" అంది ధైర్యంగా నమ్మమన్నట్లుగా, నవ్వి, బండెక్కి వెళ్ళింది. భారతమాత సంకెళ్ళు చప్పుడు చేసినట్లు గాజులు చప్పుడు బైటనుంచి వినబడింది.

నిధి పక్క సర్దుకుంటూ దిండ్లకింద చూశాడు. మామగారు వ్రాసిన ఉత్తరం లేదు. అతనికి నవ్వొచ్చింది. చిత్రమైన మనిషి అమృతం అనుకున్నాడు.

★ ★ ★

# సౌందర్య రాహిత్యం

దయానిధి ఏలూరులో ప్రాక్టీస్ పెట్టాడు. మిగిలిన మూడెకరాల భూమి అమ్మి, దశరథరామయ్యగారు కొంత డబ్బు కొడుక్కిచ్చి, మిగతా డబ్బుతో నారయ్యని తీసుకుని దక్షిణదేశ యాత్రకి బయలుదేరారు. ఆ డబ్బుతో దయానిధి ప్రాక్టీస్‌కి కావల్సిన సరంజామంతా తెచ్చుకున్నాడు. ఇల్లు కొంచెం పెద్దదే డాబా, మధ్యపెద్దహాలు, వెనక రెండు గదులు, వరండాలోంచి పైకి మెట్లు, వెనకాల విశాలమైన దొడ్డి దాన్నిండా పూలమొక్కలు, అరటిచెట్లు, చుట్టూ గోడ – బొత్తిగా నడివీధిలో కాకుండా, కాలవకి కొంచెం దూరంలో వుంటుంది. రెండు గదులలోనూ, కుడివైపు దాంట్లో మందుల బీరువాలు, కుర్చీలు, బల్లలు అమర్చబడివున్నాయి. ఎడమవైపుదాంట్లో పుస్తకాల బీరువా, గుండ్రటి బల్ల, సోఫా, పడక్కుర్చీ, వుంటాయి. రామదాసుని కాంపౌండర్‌గా పెట్టుకున్నాడు. భోజనం హోటల్‌నుంచి కారియర్‌లో తెప్పించుగుంటాడు.

తన జీవితం అసంపూర్ణంగా వుందని దయానిధికి తెలుసు, మాధవయ్యగారి వద్దనుంచి ఉత్తరం రాలేదు. ఇతను ఇందిర సంగతి కనుక్కుంటూ వ్రాసిన ఉత్తరానికీ జవాబులేదు. ఇందిర ఇతన్ని ఇక్కడ కొచ్చి, తనని తీసుకరమ్మని కబురంపింది. ఒకసారి ఉత్తరం వ్రాసింది. మామగారి దగ్గరకెళ్ళి, ఘర్షణపడి, పెద్ద గొడవ చెయ్యడానికి యితనికి తగినంత ధైర్యమూలేదు, యిష్టమూలేదు. పెళ్ళాం కాపరానికి రాదేం? అని చాలా మంది అతన్ని అడుగుతూనే వున్నారు. పుట్టింటి కెళ్ళిందనీ, చదువుకుంటుందనీ, జబ్బుగా వుందనీ–ఏదో అబద్ధపు సమాధానాలు ఇతను చెబుతూనే వున్నాడు. జనం రకరకాలుగా చెప్పకోడం సాగించారు. లండనెడతానని మామగార్ని ఒక్కసారి పదివేలు అడిగాడనీ, ఆయన యివ్వలేనందున భార్యని వొదిలేసి, వాళ్ళతో సంబంధం వదులుకున్నాడని, కొందరనుకొన్నారు! మరికొందరు ఇతనికి మరో స్త్రీతో పెళ్ళిగాక పూర్వం నుంచీ సంబంధం వుందని అభిప్రాయపడ్డారు. వారి అభిప్రాయాలని బుజువుపరిచే నిదర్శనాల కోసం వెదుకుతున్నారు. కాని ఫలితం లేకపోయింది. రికామీగా వున్న కొందరు వ్యక్తులు యిందులో నిజమేమిటో తెలుసుకోడానికి పరిశోధనలు చేస్తున్నారు. అందర్లాగే కాకుండా, ఎవరేనా వింతగా జీవిస్తుంటే, సంఘం క్షమించదు. అందరూ పెళ్ళాం బిడ్డలతో కాపరం చేస్తుండాలి. సన్యాసం పుచ్చుగుంటే అది వేరే సంగతి మనుషుల ప్రవర్తనకి బహిర్గత చిహ్నాలు చూపమని శాసిస్తుంది. పరీక్ష ప్యాసైతే సర్టిఫికేటు, పట్టాపుచ్చుగుంటే బోర్డు, పెళ్ళాం వుంటే మెళ్ళో పుస్తి, సన్యాసం పుచ్చుకుంటే కాషాయవస్త్రం, గుండు, పోనీ గడ్డం – యివన్నీ చూపాలి.

ఒకరోజున నిధి, క్లబ్బులో ప్రకాశరావుని కలుసుకున్నాడు. ప్రకాశరావు తండ్రికీ, దశరథరామయ్యగారికీ పరిచయం వుండేది. ప్రకాశరావు "లా" పూర్తిచేశాడు కాని

ఇంకా ప్రాక్టీసు పెట్టలేదు. అతనికింకా వివాహం కాలేదు. అవీ ఇవీ మాట్లాడుకొన్న తర్వాత ప్రకాశరావు శ్యామల విషయం చెప్పాడు.

శ్యామల ప్రకాశరావు చెల్లెలు; వయస్సు 22. అత్తారు నూజివీడు దగ్గర. శ్యామల భర్తకి బొంబాయిలో ఫ్యాక్టరీలో పని. బొంబాయిలో నాలుగేళ్ళు కాపరం చేసింది. ఆమె తండ్రి, అన్నగారు, ఒక్కసారి తీసుకొచ్చి, చూపించమని ఎన్నిసార్లు వ్రాసినా, అతను సెలవు దొరకలేదనో తనకి ఒంట్లో బాగాలేదనో, ఏదో సాకు చెబుతూ నాలుగేళ్ళ మధ్యలో ఒక్కసారి కూడా భార్యని పుట్టింటికి తీసుకురాలేదు. ఎప్పుడేనా ప్రకాశరావు బొంబాయి వెళ్ళి చెల్లెల్ని చూసి వస్తుంటాడు. ఈ మధ్య తండ్రికి జబ్బు చేసి, కూతుర్ని చూడాలనుందంటే ఇతను వెళ్ళి శ్యామల్ని తీసుకొచ్చాడు. వచ్చిన మర్నాడే శ్యామల ప్రవర్తన వింతగా వుంది.

మనిషి అసలే సన్నం; పైగా అన్నం తినడం మానేసింది. ఆకలి లేదంటుంది. అందరూ బలవంతం చేస్తే కాస్త తిని డోక్కుంటుంది. కొన్ని చిత్రమైన పనులు చేస్తుంది. బొగ్గుల్ని చూస్తే శ్యామలకి భయం. ఐనా నీళ్ళదగ్గరే కూర్చొని, బొగ్గులు కాలుతూంటే తదేకదీక్షతో చూస్తూ కూచుంటుంది. మధ్యలో పొయ్యిలో నీళ్ళోసి, మంట ఆర్పేసి బొగ్గుల్ని పొడుం చేసి, కాటికగా పెట్టుగునో, పౌడర్‌లా మొహానికి రాసుకునో, లేకపోతే ఆ పొడుం నీళ్ళలో కలిపి పోసుగోడమో చేస్తుంది. అదేమిటే అని అడిగితే మరిచిపొయ్యానంటుంది. వంటింట్లో సత్యనారాయణస్వామి బొమ్మ దగ్గర కూర్చుని దానికేసి చూస్తూ, కొంత మట్టితీసి నీళ్ళలో కలిపి, ఆ బొమ్మకి పట్టిస్తుంది అదీ ధోరణి. నూజివీడులో వైద్యులు గారలన్నారు. భూతమన్నారు. మళ్ళా మనిషి శుభ్రంగా, తెలివిగా మాట్లాడుతుంది. ప్రకాశరావుకి వైద్యులు చెప్పిన విషయాలలో నమ్మకం లేదు. ఏ మద్రాసో తీసుకెళ్ళి డాక్టర్లకి చూపించాలని వుందన్నాడు.

"బొంబాయి నుంచీ, తన కాపరం ఎలా వుంటున్నదీ, భర్త విషయం ఎప్పుడేనా ఉత్తరాలలో వ్రాసేదా?" అని అడిగాడు నిధి.

"మొత్తం నాకు యీ నాలుగేళ్ళలో, ఆరు ఉత్తరాలు వ్రాసింది తను బాగానే వున్నానని వ్రాసేది కాని—"

"భర్త విషయం—?"

"అంతా బాగానే ఉన్నామని వ్రాసేది."

"నువ్వు బొంబాయి వెళ్ళి చూసేవాడవు కదా, నీకేమన్నా విచిత్రంగా తోచేదా?"

"అంటే?"

"బావగారు నీకు నచ్చేవాడా?"

"నా అనుమానం అప్పుడప్పుడు అతను తాగుతాడని. శ్యామల నడిగాను. అది నవ్వి—కాదు అవన్నీ ఖాళీసీసాలు, స్పిరిట్, నూని ఇవి పోసుకునేందుకు కొనుక్కున్నామనేది."

"అతని ఆరోగ్యం?"

"దుక్కలాగుండేవాడు."

"మీ శ్యామలకి పిల్లలా?"

"లేరు."

"కడుపొచ్చి పోయిందా?"

"నేనడగలేదు."

శ్యామల్ని చూడాలని వుందన్నాడు నిధి. వాళ్ళిద్దర్నీ ప్రొద్దున్న తనింటికి రమ్మని ఆహ్వానించాడు.

"నేనేమీ మందిచ్చి జబ్బు కుదురుస్తాననుకోవద్దు. ఊరికే ఫ్రెండ్లీ విజిట్—శ్యామల్ని చూడాలని కుతూహలంగా వుంది." అన్నాడు.

ప్రకాశరావు పేకాట బల్ల దగ్గరికీ, దయానిధి కారమ్‌బల్ల దగ్గరికీ కదిలారు.

ప్రొద్దున్నే ప్రకాశరావు, శ్యామల్ని తీసుకొచ్చాడు. నిధి ఆమెను చూడగానే ఆశ్చర్యపడినా, పై కేఆశ్చర్యాన్నీ ప్రకటించలేదు. పెండ్లి సంబంధాలు చూస్తూ తను చూసిన పిల్లలలో శ్యామల ఒకత్తి. ఈ సంగతి ప్రకాశరావుకీ తెలీదు. శ్యామల గుర్తుపట్టినట్లు లేదు. శ్యామల కొంచెం నలుపు. అంత ఎత్తరికాదు. చర్మాన్ని ఎముకలమీద సాగదీసినట్లు సన్నగా ఉంటుంది. అందమైన పళ్ళ వరస మాట్లాడినప్పుడు చూడముచ్చటగా వుంటుంది. కాని మాట్లాడదు. గదిలోకి రాగానే; బల్లముందు కూర్చుని ఇంటికప్పు, గోడలని చూడటం మొదలెట్టింది. బల్లమీద ఉన్న సిరాబుడ్డి తీసుకుని, కొంచెం సిరా మీద పోసుగుంది. ఆమె కట్టుకున్నది పసుపు పచ్చ పువ్వులద్దిన నల్ల అద్దకం చీర. గుజరాతి ఫక్కీలో కట్టి, నెత్తిమీద వేసుకున్న ముసుగుని తీసేసింది. జడ ముందుకు వేసుగుని యిప్పింది. సిరా జడకి పూసుకుంది "చాలా మంచి వాసన" అన్నది సిరావాసన చూస్తూ.

నిధి ఆమెని పరీక్ష చేసి, ప్రకాశరావుని పక్కగదిలో కూర్చోబెట్టి మళ్ళా యివతలి కొచ్చాడు.

"బొంబాయి బాగుంటుందా?" అని అడిగాడు.

"బాగంటే?"

"అందంగా ఉంటుందా?"

శ్యామల వికటంగా నవ్వి, జడ తన మెడచుట్టూ బిగించుకుంది.

శ్యామల లేచి అన్ని మూలలా పచార్లుచేసి, వాసన చూసింది.

"మీ ఇంటికి అద్దెంత?"

"మనిషికి రూపాయి."

"అంటే?"

"నలభై మందున్నాం."

"నలభై అన్నమాట" అన్నాడు.

"భోజనానికెంతవుతుంది?" అని అడిగాడు మళ్ళా.

"గుర్రాని కెంతవుతుంది?" అని ప్రశ్నించింది.

"సరే, మీ ఆయన పన్లో కెన్నింటికెడతాడు?"

"ఇంట్లో ఆదివారం గంట" అంది.

"పోనీ రోజూ ఎన్నింటికి ఇంటికొస్తాడు?"

దీనికి శ్యామల సమాధానం చెప్పలేదు. "చాలా చక్కగా వుంది" అంటూ బయట అరుగుమీదకు నడిచి పచార్లు చేస్తోంది. నిధి దొడ్లో గాలేస్తుంది రమ్మని పూలమొక్కల దగ్గరికి తీసికెళ్ళాడు. వాటికేసి వింతగా చూసింది. ఒక పువ్వుని కోసి వాసన చూసి, "ఛీ పాడువాసన" అని నలిపిపారేసి కిందమట్టిని అరిచేతుల్లో

రుద్దుకుని, మొహం అంతా తుడుచుకుంది. ఆకాశం కేసి చూసి ఆలోచించి చివరికి నేలమీద పడుకుంది.

"నువ్వు రోజుల్లా ఎట్లా గడిపేదానివి బొంబాయిలో?" అని అడిగాడు.

శ్యామల నవ్వింది. కాని సమాధానం చెప్పలేదు.

"శ్యామలా, నువ్వు కట్టుకున్న చీర ఎంతో బాగుంది. నువ్వు కొనుక్కున్నావా? మీ ఆయన కొన్నాడా?" అని అడిగాడు.

శ్యామల చీరకేసి, గర్వంగా చూసుకుని, పమిటకొంగు తీసేసి గడ్డి మీద పరిచి మొహం అందులో దాచుకుంది. పల్చబడి గుండెలకతుక్కుపోయిన రొమ్ములు, కంఠనరాలు సాలిగూడులా మెదుల్తూ, భయంకరంగా వుంది శ్యామల.

"మీ ఆయన మంచివాడేనా? ఎట్లా ఉంటాడు, చెప్పవ్?" అన్నాడు.

"ఓ ఫ్యాక్టరీ గొట్టంలాగుంటాడు" మళ్ళీ నవ్వింది, "మీకు తెలీదు బొగ్గు వాసన, తారు జిగురు... మాట్లాడితే మరల మోత, నవ్వితే నషాళం అంటే నలుపు—" అని యింకా చెప్పబోతోంది.

అతను ఆమె దగ్గరగా వెళ్ళి, మెల్లిగా అడిగాడు.

"నీకు నిద్ర బాగా పడుతుందా?"

"నే నసలు మేలుకోను."

"కలలు తరచు ఒస్తుంటాయా?"

"బొంబాయి కల" లంది తను మెల్లిగా...

"ఓ కల చెప్పవు?"

"బొంబాయి రండి చెబుతాను."

"ఎట్లా రాను? మీ గదిలో నలభైమంది కాపరం వున్నారన్నావు. మరి నాకు చోటేది వొస్తే?"

"నా బుజాలమీద" అంది వికృతంగా నవ్వుతూ.

అంతలో ప్రకాశరావు దొడ్డి వేపుకొచ్చాడు. అతన్ని చూసి, శ్యామల "బాబో బొంబాయి మనిషి" అంటూ గబగబా లోపలికి పరుగెత్తింది.

నిధి మెల్లిగా నడిచి మెట్లమీద కూర్చున్నాడు. ప్రకాశరావు అతని కేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏమిటంటావు?"

"నాకేమీ తెలీడం లేదు, ఐనా, నాకో అనుమానం కలిగింది నా దగ్గర శ్యామలని రెండు వారాలుంచగలవా?"

"ఏం?"

"ఉంచితే నా అనుమానం తీరిపోవడమో, రుజువు కావటమో జరుగుతుంది."

"టి.బి. యా?"

"కాదు, కాదు."

"చెప్పకూడదు,"

"నేనిప్పుడు చెప్పను. నువ్వు నవ్వుతావు పైగా నమ్మవు. అంచేత ముందు నే నిర్ధారణ చేసుగుని నీకు తెలియపరుస్తా. అదృష్టం ఉంటే ఆమె మామూలు మనిషి కూడా కాగల్దు, లేకపోతే నష్టంమట్టుకు లేదు" అన్నాడు నిధి.

"మా యింటికొచ్చి, మందు ఇవ్వడానికి వీలవుతుందా!"

"కాదు, ఇక్కడే ఉండాలి."

"ఉంచుతాను ఎవ్వరితో చెప్పను. ఏమిటో కథ నాకు చెప్పకూడదూ?" అన్నాడు ప్రకాశరావు.

"చెపుతాను; ఎవ్వళ్ళతో అనకు. సౌందర్య రాహిత్యం అనే జబ్బుతో బాధపడుతోంది శ్యామల" అన్నాడు. ఇద్దరూ లోపలకెళ్ళారు!

ప్రకాశరావు శ్యామల్ని పదిరోజులపాటు నిధి ఇంట్లో ఉండేటందుకు అంగీకరించాడు. దొడ్డివైపువున్న వరండాలో సగం వొదిలేసి. ఒక స్క్రీన్ ఏర్పాటుచేసి ఆ వరండా, దానవతలున్న గదీ, శ్యామలకోసం ఏర్పాటు చేశాడు. గదంతా మార్చివేశాడు. నిధి గోడకి సగం భాగం ఆకాశంరంగు వేయించాడు. క్రింది భాగానికి పసుపుపచ్చరంగు కాగితం చుట్టూ అంటించాడు. నాలుగువైపులా నాలుగు చిత్రపటాలున్నాయి. మూలల్ని ఎత్తు బల్లలు అమర్చి, వాటిమీద పూలతొట్టెలు ఫోటోగ్రాఫ్‌లు ఉంచాడు. నేలంతా మబ్బురంగు తివాచీ పరిచాడు. మూలగా, కిటికీపక్కన మంచం... కిటికీలోంచి చెట్లు ఆకాశం కనిపిస్తుంటాయి. కూర్చునేందుకు వరండాలో కుర్చీలు మధ్యన గుండ్రటి బల్ల; చిన్న పుస్తకాలు షెల్ఫు... వీటిమధ్య శ్యామల ఏకాంతంగా కాలం గడపటం. రామదాసు వేళకి భోజనం వరండాలో పెడుతుంటాడు. కుట్లు, అల్లికలు వీటికి కావల్సిన సరంజామా గదిలో ఉంచారు. డ్రాయింగు కాగితాలు; రంగులపెట్టె కుంచెలు ప్లాస్టర్ అఫ్ పారిస్‌తో కలిపిన మట్టిమైనం; ఒక ముద్దగాచేసి ఒకమూల బల్లమీద ఉన్నాయి. అప్పుడప్పుడు నిధి వచ్చి శ్యామల ఏం చేస్తుందో చూసి; కాసేపు మాట్లాడి పోతూంటేవాడు. మొదటిరోజున దొడ్లో మట్టి తీసుకొచ్చి, మంచంమీద చల్లింది శ్యామల. "పోనీ మంచం, దొడ్లో వేయించనా" అన్నాడు నిధి.

శ్యామల మాట్లాడకుండా మంచంకింద దూరి ఒట్టి నేలమీద పడుకుని తలగడదిండు గుండెలమీద ఉంచుకుంది.

"ఇక్కడ బాగుందా?"

"అంటే?"

"నీ మనస్సు హాయిగా, నిశ్చితంగా —" శ్యామల మాట్లాడలేదు.

"మీ అయన్ని రమ్మని వ్రాయనా? ఇద్దరు హాయిగా ఇక్కడే ఉందురుకాని" అన్నాడు.

"బాబోయ్" అని కళ్ళు గట్టిగా మూసుకుంది.

"ఏం?"

"వినండి, వినండి" అంది?

నిధి విన్నాడు. మిల్లుకూత ఆ శబ్దానికి బెదిరిపోతోంది శ్యామల.

"శ్యామలా, నీకు పాటలొచ్చునా?"

"ఓ"

"ఐతే పాడు."

"మట్టి మశానంలో మసలే వో రామయ్యా"

"ఓ, ఫస్టుగా వుంది. గ్రామ్‌ఫోన్ తెప్పించనా?"

నారాయణగారింటికి కబురంపి, నిధి గ్రామ్‌ఫోన్ తెప్పించి, గదిలో పెట్టాడు. మొదట్లో శ్యామల ప్లేట్లని చూసి భయపడింది. నిధి ప్లేట్లమీద సౌండ్‌బాక్స్

పెట్టింతర్వాత, తెల్లటిగుడ్డతో మొత్తంగా కప్పాడు. బెంగుళూర్ నాగరత్నం, వనజాక్షి రాచప్ప, ఖాదర్ బాచ బాలగంధర్వ, రామనాధశాస్త్రి వీళ్ళ రికార్డర్లలో శ్యామలకి, వనజాక్షి పాటలు నచ్చాయి. అవే అస్తమానం పెట్టుకునేది. ముఖ్యంగా, రికార్డు చివర "మైనేమ్ యీజ్ మిస్ వరనజాక్షి" అన్న వాక్యం శ్యామలకి చాలా యిష్టం, తనూ చివర, "మైనేమ్ యీజ్ మిస్ శ్యామలా" అంటూ కూర్చునేది.

"నువ్వు మిస్‌వి కాదు." "మిస్ అనేది పెండ్లికాని వాళ్ళకే" అన్నాడు నిధి.

ఆమాత్రం తెలుసులే వెళ్ళవయ్యా, మిస్టర్ నిధి" అంది శ్యామల.

మళ్ళా తనే అడిగింది.

"మిస్ నిధి ఎక్కడ?"

"అంటే"

"యువర్ వైఫ్."

నిధికి సమాధానం ఏం చెప్పాలో తెలీడంలేదు.

"బొంబాయి వెళ్ళింది"

"ఏం?"

"అది స్వర్గలోకం. వెళ్ళినవాళ్ళు వెనక్కిరారు."

మూడోనాడు శ్యామల రామచిలక కావాలంది. నిధి మనుష్యుల్ని బంపి, వో చిలకని పట్టించి పంజరంలో వుంచి, గదిలో పెట్టాడు.

ఒకటి చాల్దు, యింకా కావాలంది శ్యామల. మరో రెండు చిన్ని చిలకల్ని కూడా తెప్పించి, వేరే పంజరాల్లో పెట్టించాడు, అన్నీ ఒక పంజరంలోనే ఉండాలంది. అన్నింటినీ ఒకే పంజరంలోనే వుంచాడు. అవి మొదట్లో పాడుచుకునేవి; తరవాత గత్యంతరం లేక అల్లాగే వుండి పొయ్యేవి.

"ఒక్క పంజరంలో నలభై చిలకలు కావాలి" అన్నది శ్యామల.

నిధికి అప్పటికి అర్థమైంది. "ప్రయత్నం చేస్తున్నాను. మెల్లి మెల్లిగా వొస్తా" యని చెప్పి శ్యామల్ని వూరుకోబెట్టాడు.

శ్యామల ఆ పంజరంతో ఆడుకునేది. పంజరం నిండా మట్టి పోసేది, సున్నం మెత్తేది, సిరా పోసేది పుల్లలతో చిలకల్ని పొడుస్తూ ఆనందించేది.

ఐదోనాడు, పిచ్చిపిచ్చిగా రంగులతో బొమ్మలు గియ్యడం మొదలెట్టింది. ఫ్యాక్టరీ గొట్టాలు, మరలు; - అవీ ఆమె గీసిన బొమ్మలు, కుట్లు అల్లికలు సాగించివది. "యిబాంబో" అని అక్షరాలని కుట్టింది. ఆ గుడ్డని పంజరం మీద కప్పింది. సాయంత్రం ఏడైంది కిటికీలోంచి చంద్రుడు కేసి చూస్తూ కూర్చుంది. నిధి లోపలికొచ్చాడు.

"చందమామ బాగుందా?"

"చంద్రుడిలో ఫ్యాక్టరీ వుందండోయ్ - అదిగో నల్లగా గొట్టం - పొగరాదేం?"

"వెనక వుండేది, ఈ మధ్యన పాడైపోయి; విర్చిపోయింది." అన్నాడు నిధి.

"ఐతే, శ్యామలా! చిలకల్ని అల్లా పొడుస్తున్నావు కదా,- అవి చచ్చిపోవు?"

"చావాలనే పొడవటం - మీకంత మాత్రం తెలీదు."

"ఎందుకు నీకంత కసి?"

"అవి చస్తే, నా కానందం."

"పోనీ, వాటిని వొదిలేద్దాం."

"అమ్మో, అవిలేకపోతే కాలక్షేపం కాదు."

"కాలక్షేపానికి బోలెడున్నాయి. పుస్తకాలు చూశావా? కన్యాశుల్కం—చిలకమర్తి వారి గణపతి. కర్పూరమంజరి— బొమ్మలు, కుట్లు గ్రామఫోన్, చంద్రుడు, పూలు, నక్షత్రాలు..."

"మీరు చాలా మంచివారు."

"నేనేం మంచి? పాపం నీ కెంత కష్టంగా ఉందో ఇక్కడుండటం! జైల్లో వున్నట్లు ఉంది కాదు? ఆ చిలకలు, నువ్వూ ఒకేరకంగా బాధ పడుతున్నారు—ఔనా? పోనీ, మీ అన్నయ్య దగ్గరికి వెళ్ళిపోతావా?"

"నాకిక్కడే బాగుంది."

"బాగంటే ఏమిటి?"

"ఏమో."

"అవుతే శ్యామలా, నేనెవర్నో జ్ఞాపకం వున్నానా?"

"ఓ నన్ను చూడ్డానికి వచ్చారు, వెనక నేను మీకు నచ్చలేదు. అందుకని నన్ను చేసుకోలేదు. మీ పెళ్ళాన్ని చూపించండి, ఏ వూళ్ళో వుంది?"

"వాళ్ళ వూళ్ళో వుంది రమ్మని వ్రాయనా?"

"ఓ"

"మీ ఆయన్ని కూడా రమ్మని వ్రాయనా? పాపం నీ కోసం బెంగ పెట్టుకొన్నాడట."

"నిజంగా?"

"అవును."

"పోనీ, రమ్మనండి."

"పొద్దవుతోంది భోజనానికి లే"

"మీరు నాతో కూర్చుని తినండి."

ఇద్దరూ వరండాలో కూర్చుని భోజనం చేశారు. భోజనం చేసి ఇవతలకి రాగానే గుమ్మంలో రోజ్ నిలబడి వుంది. స్కూల్లో ఆమె ఉద్యోగం తీసేశారట. నిధి ఆమెని తన దగ్గర కాంపౌండర్‌గా ఉండమన్నాడు—అభ్యంతరం లేకపోతే. రోజ్ వొప్పుగుంది. శ్యామలకి తోడుగా కూడా వుంటుందనుకున్నాడు.

ముందు గదిలో కెళ్ళి కూర్చోగానే రోజ్ ఓ ఉత్తరం ఇచ్చింది. తను కోమల్ని ఎక్కడ ఎల్లా కలుసుగున్నదీ చెప్పింది. ఆ ఉత్తరం యిది:

మిమ్మల్ని చూడాలని వుంది. ఎందర్నో అడుగుతాను. నేను ఇదివరకు కోమల్ని కాను. జమీందారు చదువు చెప్పిస్తున్నాడు. మీ అమృతంగారూ వారూ బాగా వున్నారు? మీ భార్యగార్ని వొస్తే చూపిస్తారా? నేను అక్కడకొస్తే నాతో మాట్లాడతారా? నాకు రాత్రుళ్ళు నిద్రపట్టదు నిద్దట్లో అస్తమానం మీరే కనపడతారు. అట్లా ఎందుకుంటుంది? నేను మీకు జ్ఞాపకం వస్తానా? ఇంకెందుకొస్తాను.

నేనిప్పుడు చిక్కుల్లో వున్నాను. జమీందారు ఏవూరో చెప్పకుండా వెళ్ళాడు.

నెల దాటింది. మీరు కొంచెం డబ్బు పంపిస్తారా? నన్ను రమ్మంటారా! ఏమి చెయ్యను, చూసి వొచ్చేస్తాను. లేకపోతే జ్వరం వస్తుంది."

"డబ్బు పంపమని నీతో చెప్పిందా?"

"మనియార్డర్ చెయ్యమంది."

"ఏమిటి చిక్కు?"

"నాతో చెప్పలేదు."

"మందులకా?"

"నాకు తెలవదండి."

మొన్నాడు నిధి రెండొందల మనియార్డరు పంపించాడు. కోమల్ని రమ్మని రాసేటందుకు సాహసించ లేకపోయ్యాడు. అయినా ఆ రాత్రి కూర్చుని కోమల్ని గురించి తన కెట్లాంటి అభిప్రాయం వున్నదీ విపులీకరించేందుకు ఒక పెద్ద ఉత్తరం వ్రాశాడు. ప్రొద్దునే ఆ ఉత్తరం చదువుకున్నాడు. అందులో రాసిన సత్యాలని సంశయిస్తున్నాడు. తనకి నిజంగా కావల్సింది, కోమలి శరీరం, అది పవిత్రమైన శరీరం కాదన్న సత్యాన్ని సహించలేడు. అది అతనికి వాంఛకి అడ్డుగా తోచటం లేదు. ఆకలేసినప్పుడు ఏమీ దొరక్కపోతే గడ్డితింటాడు మనిషి అందంకోసం ఆకల్ని ఎవడు చంపుకుంటాడు? కోమలి, అందం శరీరానికి పవిత్రతని కూడా అపాదిస్తుంది. అది మాయ భ్రమ. ఆ భ్రమని వాంఛించటం తప్పదు. ఈ లోకాన్ని పట్టుకొని ప్రాకులాడే వాళ్ళకి ఆ భ్రమ యదార్థం. పరలోక చింతాపరులకి, యీ యదార్థం భ్రమ. ఉత్తరాన్ని చించి వేశాడు నిధి.

శ్యామల గదిలో, గ్రామఫోన్‌తో కలిపి తనూ పాడుతోంది. గదిలో కొచ్చాడు. చిలకలు గొడవ చేస్తున్నాయి. శ్యామల గీచిన బొమ్మలు మంచంకింద వున్నాయి. సగం అల్లిన దుస్తులున్నాయి ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో పొడుగాటి గొట్టాలని తయారుచేసింది పేకముక్కలతో మేడ కట్టింది. ఆ గదిలో ప్రతీ వస్తువూ నిజస్వరూపాన్ని చాటేస్తోంది.

"నువ్వు బాగా పాడతావు శ్యామలా, సంగీతం చెప్పించుకోరాదు?"

గర్వంగా నవ్వింది శ్యామల. "నేర్చుకుంటా."

"నీ కిక్కడ బాగుందా."

"అంటే?"

"ఇక్కడే వుండాలనుందా, వెళ్ళిపోవాలనుందా?"

"నాకు యీ గదిలో బాగా లేదు, నూతిపళ్ళెం దగ్గర ఓ గది కట్టించు"

"మధ్యాహ్నం తాటియాకు, కర్రలు తెప్పించి, దొడ్లో చెట్ల మధ్య వో చిన్న పందిరి వేయించి మంచం, కుర్చీలు అక్కడికి పట్టించాడు. శ్యామల ఆ దొడ్లో గడుపుతోంది, కింద గడ్డిలో పడుకుంటుంది. పువ్వుల రేకలని పోడుం చేసి వొళ్ళంతా పోసుగుంటుంది. చేదతో తనే నీళ్ళు తోడుకుని వొళ్ళు తడుపుకుంటుంది.

శ్యామల అహారానికి చాలా ఖర్చవుతోంది. ద్రాక్ష, దానిమ్మ, మామిడి, అరిటి, సపోటా, అనాస–రకరకాల పళ్ళు, పాలు ఎన్నో కావాలి శ్యామలకి. విపరీతమయిన ఆకలి తెలియపరుస్తుంది. పల్చటి తెల్లచీర కట్టుకుని వెన్నెట్లో నూతిపళ్ళెం మీద కూర్చుని పిచ్చి పాటలు పాడుతుంది. అక్కడికి నిధి వొచ్చాడు.

"ఇప్పుడు బాగుందా?"

"ఓ, కాని ఆ నూతిలో వుండాలని ఉంది."

"చల్లగా వుండాలన్న మాట, రాత్రి మంచుపడి, జలుబు చేస్తుంది. మంచం గదిలో వేయిస్తా."

"గదిలో చిలకల గోల."

"వొదిలేద్దాం."

"అమ్మో, అవి అందులోనే చావాలి."

"ఎందుకంత కసి"

పెద్ద గాథ చెప్పింది. మధ్యలో ఒక్కొక్క ద్రాక్షపండే నోట్లో వేసుకుంటూ, తన వెనుకటి కథ చెప్పటం సాగించింది. శ్యామలకి–బొంబాయి పట్నం, అక్కడి మనుషులు, రొద, గందరగోళం, మిల్లులు – యివంటే భయం, భర్తను ఈమె ప్రకృతి రీత్యా కోరింది. యివ్వలేకపోయాడు. దానికి కారణం ఆ వాతావరణం అని, శ్యామల భ్రాంతి ఐదో నెలలో గర్భం పోయింది. ఏవో బాధలు; చెప్పుకోలేదు. చెబితే భర్తకి అర్థం కాదు. శ్యామలకి జీవితంపై మమకారం ఎక్కువ. జీవితాన్ని హింసించాలి. ఎట్లా? తన్నుతానే హింసించుకుంటుంది.

భోజనాలు కాగానే, నిధి ముందు గదిలోకి వెళ్ళిపోయాడు. సైకోథెరపీ మీద డాక్టర్ పోన్‌సన్‌బీ బొంబాయిలో యిచ్చిన లెక్చర్లు విన్నాడు. ఆ వ్యాసాలు తీసి చదవడం మొదలెట్టాడు. శ్యామలతో వొచ్చిన తిరకాసు కొంతవరకూ అతనికి అర్థమయినట్లు తోచింది. గడియారం తొమ్మిది కొట్టింది. కాంపౌండింగ్ రూమ్ తలుపులు వేసిన చప్పుడైంది. రామదాసు వెడుతున్నాడు. రోజ్ తన పక్కచుట్ట సర్దుకుంటోంది. శ్యామల గది నిశ్శబ్దంగా వుంది. బైట ఎద్దుల బండి నిలిచిన చప్పుడైంది. గదితలుపు ఎవరో తట్టారు.

వెళ్ళి తలుపు తీశాడు వెంకటాద్రిగారు.

"ఇందిర వచ్చింది."

"లోపలికి రమ్మనండి"

ఇందిర లోపలికొచ్చి, హాల్లో బల్లమీద కూర్చుంది.

"సామానులు లోపల పెట్టించండి అన్నాడు నిధి."

"సామానులేమీ లేవు" అన్నాడు వెంకటాద్రిగారు.

"భోజనాలు చేశారా?"

నేను రాత్రిళ్ళు భోజనం చెయ్యను. అమ్మాయి పళ్లు తింది." అన్నాడు.

రోజ్‌ని కారియర్, ఫ్లాస్క్ యిచ్చి పంపించాడు నిధి. వెంకటాద్రి గారు ఫలహారం చేశాడు.

"ఇల్లు బాగానే వుంది, అద్దెకేనా?"

"ఆ"

"ఏమయ్యా, పెద్ద ముండావాడ్ని, నా మాట విని ఓసారి మామగారి దగ్గర కెళ్ళి, ఏదో రాజీపడి, ఇందిరని తెచ్చుకుని కాలక్షేపంగా కాపరం చెయ్యరాదూ?"

"రాజీపడేటందుకు, అసలు దెబ్బలాటే లేదుగా."

"మరి నువ్వెందుకు వెళ్ళవు?"

"వారు నన్ను రమ్మనలేదు,"

"ఒకళ్ళు రమ్మనేదేమిటి? నీ పెళ్ళాన్ని నువ్వు తెచ్చుకోక?"

"వారు పంపందే?"

"ఏమొచ్చింది?"

"అది వార్నే అడగండి. వారు పంపితేనే యిల్లా తీసుకొచ్చారా మీరు?"

"నా దగ్గర వుంటోంది ఇందిర. "తీసుకెళ్ళు బాబయ్యా" అంది బయలుదేరాను."

"చూశారా మరి అన్నీ తెలిసే అల్లా సెలవిస్తారేం మీరు?"

"ఏదో తెలివి తక్కువవాడు మీ మామగారు. నువ్వేనా సర్దుకుపోవద్దూ. చదువుకున్న వాడవ్?"

"ఏం చెయ్యమంటారు?"

"కాంగ్రెస్ మెంబరువటగా నువ్వు? ఆ కాంగ్రెస్‌లోంచి తప్పుకోరాదు? అందులో కూడా, గుడ్డా? లారీ దెబ్బలు, జైలేగా!"

"దానికీ, ఇందిర కాపరానికీ సంబంధం ఏమిటో నాకు తెలీదు. అంతకంటే మామగారే కాంగ్రెసు మెంబరుగా చేరిపోతే తీరిపోతుందిగా."

"బాగానే ఉన్నాయ్ పట్టింపులు" అంటూ ఆయన సణిగాడు. ఇంతలో రోజ్ కారియర్, ఫ్లాస్కు తీసుకొచ్చింది.

కప్పులో పాలుపోసి యిచ్చాడు. ఆయన పుచ్చుకోనన్నాడు.

"నేనింకా ఆ స్థితికి రాలేదు బాబు. మీరుభయులు పుచ్చుకోండి."

ఇందిర రెండు పళ్ళు తిని పాలు తాగింది.

"మేం తెల్లారగట్ట ఐదు గంటల బండికి వెళ్ళాలి! నువ్వు కూడా మాతో వస్తే, నీ మామగారు సంతోషిస్తారు. ఏదో మాట్లాడుకోవచ్చు." అన్నాడు వెంకటాద్రిగారు.

"ఐతే మీరు వారు పంపితే రాయబారిగా వచ్చారా, లేక మీరు తమాషా చూద్దామనొచ్చారా?" అన్నాడు నిధి.

"పెండ్లి చేసుకుని భార్యను విడిచిపెట్టి: ఒంటరిగా వుండడంలో తమాషా ఏముంది బాబు?" అన్నాడాయన కొంచెం హేళనగా.

"ఇంతకీ మీ తప్పు ఏమీ లేదంటారు?"

"వెనకటివి కెలుక్కుని ఏం లాభం? ముందుగతి చూసుకోవాలి. మొగాడెల్లాపడితే అల్లాగే వుండగలడు, ఇందిర విషయంలో ఆలోచించు!"

"అల్లా అనడంలో మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకోవచ్చా?"

"వేరే చెప్పాలా – అందరికీ తెలుస్తూనే ఉంది."

"మీరు పెద్దలు, నిజానిజాలు తెలుసుకోకుండా; మాటలనెయ్యడం భావ్యం కాదు."

"నేను నోరు కట్టేసుకుంటే ఆగుతుందా; లోకం లేదూ!"

"ఊరుకో బాబయ్యా–నువ్వు పడుకో. మళ్ళా ఆయాసం ఒస్తుంది" అంటూ ఇందిర వెంకటాద్రిగార్ని మందలించి, బల్లమీద పక్క అమర్చింది; ఆయన దగ్గు ఆపుకుంటూ వెళ్ళి పడుకున్నాడు.

"మరి నువ్వో?"

"ఈ గదిలో మంచం వుందిలెండి," అన్నాడు నిధి. ఇందిర ఆవులించి గదిలోకి నడిచి మంచం మీద కూర్చుంది. గది గుమ్మం అవతల దయానిధి మడతమంచం వాల్చుకుని, దానిమీద వో దిండు పడేసి గదిలో పడకకుర్చీమీద కూర్చుని దీపం పెద్దది చేసి: చదవడం సాగించాడు.

"మీరే ఈ మంచం మీద పడుకోండి – నేనక్కడ పడుకుంటా" అంటూ ఇందిర లేచింది.

"ఫరవాలేదు. నువ్వు పడుకో, మళ్ళా ప్రొద్దున్నే లేవాలి" అన్నాడు.

ఇందిర తన మంచం మీద పరుపు, దుప్పటి, మడత మంచం మీదకి జేరేస్తూ – "మీరు మాతో రారా?" అని అడిగింది.

"దేనికోసం రాను?" అని అడిగింది.

"అవునులెండి మీరెందుకొస్తారు."

పక్కగదిలో చిలుకలు శబ్దం చేశాయి. నిధి పుస్తకం మూసి దీపం కొంచెం తగ్గించాడు. ఇంతలో శ్యామల వచ్చి గది గుమ్మం ముందు నిలబడి కళ్ళు పెద్దవిచేసి, గదంతా పరకాయించి–

"ఇంకా పడుకోలేదు? నా గదిలో దీపం ఆరిపోయింది, భయమేస్తోంది" అంటూ లోపలికొచ్చి, బల్లమీద దీపం పెద్దదిచేసి, "గదిలో కెడదాం రండి" అని పక్కకి తిరిగి ఇందిరని చూసి. "బాబో" అని కేకేసి ఉలిక్కిపడి దీపం మళ్ళా పెద్దది చేసి గబగబా అవతలకి నడిచిపోయింది.

నిధి బెడ్‌రూం దీపం వెలిగించి పెద్ద లాంతరు తీసుకొని ఆమెని చెయ్యిపట్టుకుని ఆమె గదిలోకి తీసికెళ్ళి పడుకోబెట్టి మళ్ళా తన గదిలోకొచ్చాడు. ఇందిర బల్లపక్కన కిటికీ దగ్గర నిలబడివుంది.

"ఇంకా పడుకోలేదేం?" అన్నాడు.

"నిద్ర రావడం లేదు. మీరు పడుకోండి" అంది.

"నువ్వేం చేస్తావు మరి?"

"ఇలాగే చూస్తూ కూర్చుంటాను" అంది.

రెండు నిముషాలు నిశ్శబ్దం. వెంకటాద్రిగారు గుఱ్ఱుపెడుతున్నట్లు చప్పుడు మాత్రం వినిపిస్తోంది. ఇందిర గుమ్మంలోకి వెళ్ళి రెండు తలుపులూ దగ్గరగా మూసి మళ్ళా వొచ్చి.

"ఐతే నన్ను మీరు ఎప్పుడూ తీసుకురారా?" అని అడిగింది.

"————"

"యీ వుంగరం మీరు పెట్టిందే, ఆనాడు కాలవగట్టున తోటలో... అన్నీ మరచిపొయ్యారా?"

"నేనేం దుష్యంతుణ్ని కాదు" అన్నాడు. ఇందిర బలహీనంగా నవ్వింది.

"అవునులెండి–మీకు నే నెందుకు యింక!"

"అంటే?"

"మీక్కావల్సిన వాళ్ళు మీ దగ్గరే వున్నారు."

"నువ్వనేది ఏమిటి? మీ బాబయ్య రైల్లో ట్రైనింగ్ యిచ్చాడా యిలా అనమని?"

"మా బాబయ్య బోలెండుకు లెండి. నాకు దేవుడు కళ్ళిచ్చాడు."

నిధి నవ్వాడు.

"ఆవిడ నా పేషెంటు, చిత్రమైన కథ అంతేనా నీ అనుమానం ఇంకా ఏమన్నా ఉందా?"

"డాక్టర్ని చీకటి గదిలోకి రమ్మనే పేషెంటు. మరో పాత పేషెంటు కూడా వొస్తుందిగా—"

"నాకు కోపం రావాలనా, లేక నవ్వించాలనా?"

"డాక్టరు దగ్గర డబ్బు పుచ్చుకునే పేషెంటు."

"ఈ బల్లమీద ఉత్తరం చదివావా?" అన్నాడు.

"ఏం తప్పా?"

"తప్పే"

"ఈ వుత్తరం చదివితేనే తెలియనక్కరలేదు పెళ్ళిలోనే చెప్పాగున్నారు, వింతగా—"

"నోరు మూసుగుని పడుకుంటావా?"

"ఏమిటో చెప్పాగున్నారు – నాగమణి, సుశీలా అంటూ. నేను నమ్మలేదు, మీ అమ్మగారూ యింతేటగా?"

నిధి అవతలికి వెళ్ళిపోయి, వీధిలో అరుగుకింద మెట్లమీద కూర్చున్నాడు. దూరంగా ముస్లిమ్ కుర్రాడు "ఏదీ గతి నాకు" పాడుకుంటూ పోతున్నాడు. నిధికి విచారం వేసిందతని మీద జాలేసింది. బ్రతికి నప్పుడే కాకుండా, మరణించిం తర్వాత కూడా, ఆడవాళ్ళ వొంతు బాధపడటం మొగాడివంతు.

కాసేపు మెట్లమీదే పడుకున్నాడు. కాసేపు లోపలికెళ్ళి, మడత మంచం మీద పడుకున్నాడు. కాసేపు కుర్చీలో కూర్చున్నాడు. కాసేపు రోడ్డుమీదకి వెళ్ళి వంతెన మీద కూర్చున్నాడు. ఎలాగో నాలుగయింది. వెంకటాద్రిగారు లేచి దంతధావనం మొదలెట్టాడు. జట్కాబండి వచ్చింది. ఇందిర మెట్లమీద నిలబడింది.

"మాతో రండి."

"మీ నాన్నచేత కూడా మాటలనిపిస్తావా?"

"క్షమించండి, ఎప్పుడూ అనను."

"అనడంలో బాధలేదు నాకు; అసలు నువ్వు వాటిని నమ్మి అనుకోడంలో వుంది."

"ఇంక అనుకోను వస్తారా?"

"ఏ మొహంతో."

వెంటాద్రిగారు బండి ఎక్కమన్ని తొందరచేస్తున్నాడు. శ్యామల కూడా లేచి హాల్లో నిలబడి చూస్తోంది. ఆమెకేసి పరకాయించి చూసింది. "నేనిక్కడే వుంటాను; బాబయ్యా, నువ్వు వెళ్ళకూడదు?" అంది ఇందిర.

"మీ నాన్న నా పీక్కి వురెడతాడు. ఎక్కు, కావాలంటే తర్వాత వొద్దువు కాని,"

ఇందిర బండెక్కింది. బండి కదిలింది.

దయానిధి గదిలో కూర్చుని కళ్ళు మూసుగున్నాడు, ఎనిమిదింటికి రామదాసు లేపాడు. స్నానం చేసి, కాఫీ త్రాగి హాల్లోకి రాగానే శ్యామల తన గదిలోకి ఆహ్వానించింది.

రాత్రి తను చూసిన దృశ్యం జ్ఞాపకం చేసి ఆవడ ఎవరో, ఎందుకొచ్చిందో అన్నీ చెప్పమంది. నిధి అన్నింటికీ సమాధానం చెప్పాడు. శ్యామల వ్యాధి కుదురుతోందనీ, అతని చికిత్స పనిచేస్తోందని అనిపించినా, ఆమెను మామూలు మనిషిగా చెయ్యగలనన్న ధైర్యం అతనికి చిక్కడం లేదు. అతని జీవితమే సరిగ్గాలేదు. అతనికి తెలియని లోటుపాట్లు అతనిలో ఎన్ని వున్నాయోనన్న భయం వల్ల అతను ఏ పనీ దీక్షతో నిర్వహించలేకపోతున్నాడేమో. అతని మనస్సుని కుదుట పర్చుకోవడం చేతకావటం లేదు. ఇతరులని బాగుచేసే అధికారం, డిగ్రీ ద్వారా అతనికి వుంది. కాని నైతికంగా అట్లాంటి అర్హత లేదేమో!

"తెల్లవార్లు చిలకలు దెబ్బలాడుకున్నాయ్–నాకు నిద్రపట్టలేదు" అంది శ్యామల.

"కలిసి వున్నా, అవీ మనలాగే విడివిడిగా వుంటాయి" అన్నాడు.

"ఈ సంఘం పాడుపడిపోయిన దేవాలయం లాంటిది. మన మందరమూ అందులో స్తంభాలం. ఎప్పుడూ కలుసుగోవు. చిలకలు పంజరంలోనూ – మనం, స్వార్థం అనే కోటలోనూ బంధించబడ్డాం."

శ్యామల ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, నుదురు చిట్లించింది. దయానిధికి తను యిలా ఎందుకు మాట్లాడాడో అర్థం కాలేదు. బిగ్గరగా ఆలోచించడం కాబోలు. ఆలోచించడం కూడా కాదు! నిజంగా అనుభవిస్తున్న బాధని ప్రకటించడానికి బుద్ధి చేసే యత్నం ఆ మాటలు.

శ్యామల తన బొమ్మలని చూడమంది, చేతి గాజులు చూపించింది. వాటిని పూలతో జంటలుగా కట్టి కదిలించింది.

"మీ కళ్ళు వాచాయి మొహం బరువెక్కింది. పాపం తెల్లవార్లూ నిద్రపోలే దనుకుంటా" అంటూ శ్యామల, అతన్ని ఓదార్చడం మొదలెట్టింది. పేషెంటు లక్షణాలు తనకే వొచ్చేటట్లున్నాయనుకుని నిధి లేచాడు.

"కూర్చోండి–మీ రివాళ అదోలా మాట్లాడుతున్నారు."

"వొచ్చినప్పుడు కంటే యిప్పుడు నీ వొంట్లో బాగుంటోందా?"

"ఓ–నాకేం తెగులు–?"

"బొంబాయి వెడతావా?"

"వెళ్ళను"

"ఏం?"

"ఏమో..."

శ్యామల దిగులుగా కుర్చీలో కూర్చుని ఎందుకో ఏడ్పు మొదలెట్టింది. అతనికి అర్థం కాలేదు. భుజం మీద చెయ్యి వేశాడు. కళ్ళమ్మట కారే నీటిని తుడుస్తున్నాడు. ఏదో చప్పుడైతే పక్కకి తిరిగి చూశాడు. గుమ్మంలో ప్రకాశరావు నిలబడి వున్నాడు.

నిధిని ప్రకాశరావు ముందుగదిలోకి తీసుకెళ్ళాడు.

"శ్యామల్ని తీసుకెడుతున్నాను."

"చాలా భాగం నయమైంది ఇంకో రెండు వారాలుంచకూడదు?"

"క్షమించాలి. ఆ జబ్బు యిక్కడ కుదరదని తోస్తోంది."

"మీకు మార్పు కనబడటం లేదూ."

"ఏం మార్పో–నాకేమీ నచ్చడం లేదు."

"అంటే మీ లోపల ఏదో వున్నట్లుంది, చెప్పి వేస్తే సంతోషిస్తా"

ప్రకాశరావు, గోడలకేసి మొహం తిప్పి; సణగడం మొదలెట్టాడు. "నాకు చెప్పడం యిష్టం లేదు. ఊళ్ళో పదిమందీ అనుకున్నది నేను నమ్మక పోయినా, వాళ్ళు అనుకోడం నా కిష్టం లేదు." అన్నాడు.

నిధికి కోపం వచ్చింది.

"ఇదిగో ప్రకాశరావు, నువ్వు చదువుకున్నవాడవు. శ్యామల జబ్బుని గురించి నీకంతా చెప్పాను. వొప్పుకున్నావు. శ్యామలలో కొంత మార్పు కూడా వచ్చినట్లుంది. శ్యామల కిప్పుడు సౌందర్యం అర్థమవుతోంది. కోల్పోయిన బాంధవ్యం మళ్ళా నెలకొల్పుకుంటోంది. బాధ పడుతున్న చైతన్యం చూపుతోంది. తుదకి సానుభూతి కూడా చూపగల్గుతోంది. మనుషుల శానిటికి సానుభూతి నిదర్శనం ఆ సానుభూతి ఎట్లాంటిదో నీకు చెప్పాలంటే నా స్వీయ చరిత్ర చెప్పాలి. అది చాలా కష్టం."

"చెప్పటం దేనికి? కొంతవరకూ తెలుస్తూనే వుంది."

"మీరంటున్న దేమిటి?"

"మీతో నాకు వాదం ఎందుకు–శ్యామల్ని తీసుకువెడతాను."

"తక్షణం తీసుకువెళ్ళండి."

"నేనూ పెద్దగా కేక వెయ్యగల్ను. ఐనా బ్రహ్మచారి దగ్గర అట్టే పెట్టడం నాదే తప్పు" అన్నాడు ప్రకాశరావు.

అతన్ని లెంపకాయ కొట్టడానికి నిధి చెయ్యి లేవబోయింది. ఆ చేతిని తీసి డ్రాయర్లో పెట్టి, ఎడం చేత్తో మూశాడు.

ప్రకాశరావు గబగబా గదిలోకెళ్ళి, శ్యామల్ని చెయ్యి పట్టుకుని బైటికి యీడ్చుకొచ్చాడు.

"నేనురాను, రాను" అంటూ శ్యామల చెయ్యివిదిలించుకొని దొడ్లోకి పరుగెత్తి కాసేపుమట్టిలో దొర్లి వొళ్ళంతా బురద చేసుకుంటోంది ప్రకాశరావు వెంటబడి ఆమెని మళ్ళా పట్టుగుని బైటికి తీసుకొచ్చాడు.

అతని తాలూకు మనుషులు బండి తీసుకొచ్చారు.

"నేను రాను, రాను–" అని శ్యామల గింజుకుంది.

"ఎందుకొస్తావు? అన్నీ యిక్కడ ఏర్పాటుగా వున్నాయి." అని ప్రకాశరావు ఆమెని బైటకు తీసుకెళ్ళాడు.

నిధి పళ్ళు పటపట కొరుకుతూ, అతనికేసి కోపంగా చూశాడు. కాని అసహాయుడు.

శ్యామల వెనక్కి తిరిగి "నా పంజరం" అంది.

"నీ క్కావల్సింది పంజరమా, చిలకా?" అని అడిగాడు నిధి.

శ్యామల కాసేపు ఆలోచించి, అటూ ఇటూ చూసి "పంజరం" అన్నది.

వెంటనే నిధి పంజరాన్ని తీసుకొచ్చి, తలుపు తెరిచాడు. రెండు చిలకలు బైటికి ఎగిరి పొయ్యాయి. మూడోది కుంటుతోంది; ఎగరలేక అక్కడే గంతులేస్తోంది. ఖాళీ పంజరం శ్యామల కిచ్చాడు నిధి. దాన్ని గట్టిగా పట్టుగుని శ్యామల బండెక్కింది. బండి కదిలింది. మలుపు తిరుగుతోంది. బండిలో నుంచి రోడ్డుమీదికి ఎవరో పంజరాన్ని గిరవాటెట్టారు.

★ ★ ★

# స్వయం సంస్కారం

రెండు మాసాలు గడిచినై. నిధి పేషంట్లు పల్చబడుతున్నారు. ప్రాక్టీస్ నీరసించింది. శ్యామల కోసం అతను నాలుగైదొందలు ఖర్చు చేశాడు. అందులో కానీ కూడా ప్రకాశరావు యివ్వలేదు. అతను మళ్ళా యితని దగ్గరకు రాలేదు. ఎప్పుడైనా క్లబ్బులో పేకాట బల్ల దగ్గర కనబడినప్పుడు మొహం పక్కకి తిప్పేసుగుంటాడు. వెనక ప్రకాశరావు అన్న మాటలను నిధి మరచిపోలేకపోతున్నాడు. వాటి నిజాలు కొంత వరకూ క్లబ్బు దగ్గర రుజువవుతున్నాయి? ఇతను రాగానే ఇంతవరకు హుషారుగా మాట్లాడుతున్న వ్యక్తులు వెంటనే జోరుతగ్గించి మెల్లగా మాట్లాడడం మొదలెడతారు వాళ్ళు అంతవరకూ తన విషయమే మాట్లాడుకుంటున్నారనీ, తన్ని చూడగానే విషయం మార్చేస్తున్నారనీ యితని అనుమానం.

వారు చెప్పగునే రహస్యాలేమిటో తెలుసుకోకపోతే అతనికి పిచ్చెక్కేటట్లుగా ఉంది. సంఘం ఏమనుకుంటున్నదీ నా కక్కర్లేదనుకునే వ్యక్తి, సంఘం దాచుకున్న రహస్యాన్ని భేదించే యత్నాలెందుకు చేస్తాడో, ఒక వ్యక్తి బాధపడుతుంటే సంఘానికి సరదా కాబోలు. సంఘం వేసిన తారు రోడ్డమ్మట నడవక పొదల్లోంచి వేరే కాలిమార్గం చేసుకుని నడిచే వ్యక్తి సంఘాని కంత వినోదం కలిగించినప్పుడు. ఆ వ్యక్తికి సంఘం తన కృతజ్ఞత తెలియపరుస్తూ, అయనకొక రాతి శిల్పం చెక్కించి వడిరోడ్డులో ప్రదర్శించొద్దూ? అతన్ని గురించి అనుకుంటున్నారన్న భావంలో కొంత గర్వం లేకపోలేదు. మంచో, చెడో ఏదో చెయ్యడంలో వోటమి లేదు. ఏమీ చెయ్యక పోవడంలో ఉంది వోటమి, సంఘం ఏమీ చెయ్యదు. ఆఫీసు కెడుతుంది, భోజనం చేస్తుంది, పేకాడుతుంది, పిల్లల్ని కంటుంది. ఎవడో ఏదో చేస్తుంటే వింతగా చూసి, అది చెడేనని నిర్ణయించి ఆ చెడుగులో ఆనందం పొంది తృప్తి పడుతుంది.

ఐతే సంఘం తనలో దేన్ని చూసి సంతోషిస్తుంది–మంచినా, చెడుగునా? అసలు అతనిలో మంచి ఏముంది? డబ్బు, హోదా, కుటుంబం, వృత్తిలో ప్రావీణ్యం, ఖ్యాతి – వీటిలో ఏం ఉన్నాయి అతనికి పోనీ, చెడుగునా? చెడుగంటే ఏమిటి? డబ్బు, హోదా, కుటుంబం వృత్తిలో ప్రావీణ్యం ఖ్యాతి – ఇవి లేకపోవడమే చెడుగా? ఇవి లేకపోవడానికి కారణం అతనిలో ఏదో ఉండాలని సంఘం తెలుసుకుంది. అదే చెడుగు. అది ఏమిటో? ఎట్లాంటిదో తెలుసుకోవాలి ఎట్లా? సంఘం చెప్పదు. సంఘం ధ్వనులు చేస్తుంది కాని, అర్థమయ్యే భాష మాట్లాడదు, సంఘం తీర్పు చెప్పదు. వూరికే వాదిస్తూ కూర్చుంటుంది. ఆ వ్యక్తిని మధ్య నిలబెట్టి అతని చుట్టూ అలుముకొని సంఘం చూస్తూ కూర్చుంటుంది.

నిధికి క్లబ్బులో వున్న స్నేహితులు కూడా, అదోలా మాట్లాడడం మొదలెట్టారు. శ్యామలను గురించి హేళన చెయ్యడం సాగించారు. శ్యామల వ్యాధిని గురించిన అతని అభిప్రాయాలని వెక్కిరించారు. అప్పుడప్పుడు "బ్యూటీ స్పెషలిస్టు" అనేవారు.

ఒకసారి సంగమేశ్వర రావు, డాక్టర్ బ్యూటీఫుల్ అని పిలిచాడు కూడాను. ఆ పిలుపుకి నిధి వెనక్కి తిరిగాడు. అతని పేరు అదికాదు. ఐతే తను ఎందుకు పలకాలి? కొన్ని వారాలు, స్నేహితులు ఇందిర విషయం ముచ్చటించేవారు. ఒకసారి నిధి క్లబ్బు కుర్రాడ్ని, చదువుకోడానికి ఇండియా అనే పత్రిక తెచ్చి పెట్టమన్నాడు. వాడు తెచ్చాడు దానిమీద "ఇండియా" అనే మాటలో, ఎవరో(రెండో) "ఐ" అనే అక్షరం పక్కనే సిరాతో "ఆర్" అనే అక్షరం వ్రాశారు. ఒకసారి తను వెళ్ళి భార్యను తీసుకొద్దామనుకున్నాడు కూడాను. సంఘం (క్లబ్బు ద్వారా) వేసే బాణాల పరంపరా? లేక మాధవయ్యగారి ఆదర్శాల విషవాయువులా? ఏది ఎదుర్కోటం సులభం? బాణాల పరంపరనే ఎదుర్కోవటం సులభంగా తోచింది. బాణాలు ఏ ఒక వ్యక్తి వెయ్యడు. అవి అన్ని వైపులనుంచీ తగుల్తాయి. కొట్టిన వారిని కనుక్కోలేం ఎదురు తిరిగేటందుకు. కాని మాధవయ్యగారు ఒక మనిషి. ఆయన ఆదర్శాల పునాదులు అతనికి తెలుసు. అవి ఎంతవరకూ వ్యాపించాయో కూడా అతనికి తెలుసు. వాటి బారినుండి అతను తప్పించుకోవచ్చు. పైగా సంఘం ఎక్కడుంది? ఏలూరు టౌన్ హాల్ సంఘమా? అనంత విశ్వంలో ఈ ప్రపంచం ఎంతటిది? ఢిల్లీలో ఒక ఇసుక కణం ఈ భూగోళం అయితే, కొలంబోలో మరో యిసుక కణం మరో గోళం అవుతుంది. అంతటి అల్పమైన ఈ గోళంలో ఏలూరు టౌన్‌హాలెంత? భూగోళశాస్త్రం ఈ విధంగా యిచ్చే తృప్తి క్షణికం. ఏలూరు టౌన్ హాలు చాలా చిన్నదే, కాని ఎక్కడికెళ్ళినా అది తన వెనకాలే ఒచ్చే నీడ లాంటిది. సంఘంలో ఉండదల్చుకున్నవారు సంఘాన్ని తప్పించుకు తిరగలేరు పోనీ క్లబ్బుకి వెళ్ళడం మానేస్తే? తన పేషెంట్లు సంఘంలో వాళ్ళే; వాళ్ళు రావడం మానుకున్నారు. ఏలూరు నుంచి వెళ్ళిపోయి మరో చోట ప్రాక్టీసు పెడితే? తనని ఎరుగున్న వాళ్ళు ఆంధ్రదేశమంతటా వున్నారు. అతను చేసిన ద్రోహం ఏమిటి? అతను ఎరుగున్న వారినందరినీ చంపడమేనా గత్యంతరం? ఈ ఆలోచనలని త్రొక్కిపెట్టేసుగుని హాస్పటల్‌కి వచ్చేశాడు నిధి. జీతాలిచ్చి ఇద్దరి కాంపౌండర్లని భరించే స్థితిలో లేడు. ఒకర్ని మానిపించాలి. ఎవర్ని? రామదాసు ముందుజేరాడు. తెలివైనవాడు. రోజ్ స్త్రీ; బీదది. తన విషయం తెలుసున్నది.

టౌన్‌హాల్ తేనెపట్టులా మళ్ళీ చెలరేగుతుంది.

రోజ్ జీతం లేకపోయినా తిండీ, బట్టా ఇస్తే ఉంటానంది. జీతం లేకపోతే ఉండలేనని రామదాసు తనే మానేశాడు.

ఆ మొన్నాడు. దయానిధి టెన్నిస్ ఆడి, సోడాతాగి కూర్చున్నాడు ఈ సారి టెన్నిస్‌లో కృష్ణమూర్తే గెలిచాడు. కృష్ణమూర్తి లక్నో విశ్వవిద్యాలయంలో ఎం.బి.,ఎల్.ఎల్.బి. డిగ్రీ పొందాడు; స్థితిమంతుడు కులాసా పురుషుడు, క్లబ్బు స్నేహితులందరూ అతన్ని వేళాకోళం చేస్తూంటారు. అతనికి కోపంరాదు: నవ్వేసి మళ్ళా కొంటెగా మాట్లాడటం సాగిస్తాడు. అతను ఏ వూళ్ళో ప్రాక్టీసు పెడతాడా అన్నది అందరికి ఒక సమస్య అయిపోయింది. టెన్నిస్ సెట్ గెల్చిన సంతోషంలో అతనే సమాధానం చెప్పేశాడు. "నేను పూనాలో ప్రాక్టీస్ పెడుతున్నానండీ" అని తెలియచేశాడు.

"ఏం కథ? మొన్న ఆదివారం మద్రాసులో నన్నావ్?" అని అడిగారు.

"ఏముందండీ ఆ మాత్రం ఊహించలేరూ?"

ఊహించలేమన్నారు.

"పూనాలో అందమయిన స్త్రీలున్నారు." అన్నాడు అంతా విరగబడి నవ్వారు.

"అందమయిన స్త్రీలు బొంబాయి, మద్రాసు పట్టణాలలో మాత్రం లేరా అని మీరడగొచ్చు. ఉండవచ్చు: ఉన్నారు కూడా. ఉండగా సరికాదు. అందుబాటులో ఉండాలి." అని ఉపన్యాసం ధోరణిలో సాగించాడు.

ఆ విషయం విస్తరించి, విపులీకరించమన్నారు.

"పూనాలో గరల్సు, ఫార్‌వర్‌డే—సైకిల్‌మీద వెడుతుంటారు. మధ్యలో తొందరగా నడుస్తున్న యంగ్‌మేన్ కనపడితే సైకిల్ నిలిపి, వెనకాల ఆ యంగ్‌మాన్‌ని ఎక్కించుకుని పోతుంటారు.

హైలీ డెవలప్‌డ్ సివిక్స్ సైన్స్ ఉంది. డాక్టర్ నిధి బోటిగాళ్ళకి పూనాలో ఫస్టురేటు అపర్చ్యునిటీస్ ఉన్నాయి. లాయర్‌ల లైబిలిటీస్ చాలా లిమిటెడ్."

పేకాట బృందం చప్పట్లు కొట్టారు. నిధి చిరాకుతో కుర్చీలో కదిలి బలవంతంగా నవ్వాడు. నిధి లేచి దూరంగా బల్ల దగ్గిరకెళ్ళి పత్రికలు తిరగేస్తున్నాడు.

కృష్ణమూర్తి జేబులోంచి దువ్వెన తీసి, సోడా నీళ్ళు నెత్తిన జల్లుకుని జుట్టు వెనక్కి దువ్వి అటూ ఇటూ పచార్లు చేసి ఓ గులాబీ పువ్వుని కోసుకొచ్చి వాసన చూస్తూ, నిధి దగ్గరకొచ్చి "డాక్టర్, స్మెల్ ది రోజ్, రోజ్ చాలా అందమయిన పువ్వు సుమండీ" అంటూ ఆ గులాబీని అతనికిచ్చాడు.

నిధికి కోపం వచ్చింది. ఇంతలో కాంపౌండర్‌గా ఉంటున్నరోజ్‌ని వేళాకోళం చేసినట్లనిపించింది. "రోజ్ బాగానే వుంటుంది కాని, ముళ్ళుంటాయి" అన్నాడు నిధి.

"దానందం ముండ్లే ముల్లు గుచ్చుకోకుండా కొయ్యడంలో ఉంది అసలందం" అన్నాడు కృష్ణమూర్తి.

"ఐతే డాక్టర్ జీ, లేడీ శ్యామల ఎట్లా ప్రోగ్రెస్ అవుతోంది?" అని అడిగాడు.

"శ్యామల్ని నేను ట్రీట్ చెయ్యడం లేదు" అన్నాడు నిధి.

"అదేమిటండి, మీ ట్రీట్‌మెంట్ గురించి విన్నాను. నాకు నచ్చింది. మనవాళ్ళు ఫూల్స్‌ండి శ్యామల కేస్ గురించి నాకు వినాలని ఉంది" అన్నాడు కృష్ణమూర్తి.

"నా డయాగ్నోసిస్ సరియైనదేనని నాకు తెలుసు. కాని ఇతరులకీ, డాక్టర్లకీ దాని నిజానిజాలని రుజువు చెయ్యలేను. అదీ వచ్చిన చిక్కు. చాలా కేసులు పరిశోధించి, నయం చేసి, తరువాత ఒక పేపర్ వ్రాయొచ్చు. అప్పుడే శ్యామల కేస్ మీద వో పేపర్ వ్రాయడం మొదలెట్టా కూడా. ఆకలి. దాహం; సెక్సు—వీటికిమల్లే సౌందర్యం కూడా ఒక ఆకలే ననుకుంటాను. ఐ.ఏ. రిచార్డ్స్, వాట్‌సన్, డాక్టర్ పాన్‌సన్ బీ, అగ్‌డెన్ ఇది నిజమనడానికి ఆధారాలున్నాయని నిర్ధారణ చేశారు. మీకు విసుగెట్టక పోతే వాళ్ళు చెప్పిన ఉదాహరణలని చెబుతాను..."

"తప్పకుండా—చెప్పండి—ఉండండి, మరో సిగరెట్ ముట్టించనివ్వండి."

"ఉండి ఉండి ఒక్కసారిగా కోపం రావడానికి కారణం? ఆకస్మికంగా చిరాకొచ్చి, భార్యతో తగువులాట్టం, పిల్లల్ని కొట్టడం దీనికి కారణం ఏమిటి? ఇల్లు చిందరవందరగా ఉండటం, తలుపులు గడియపడక పోవటం? రాకపోవటం, గోడమీద పటం వంకరగా వేలాడడం – రొద యివి భర్త పొడుగాటి గోళ్ళు పెంచుకున్నాడని విడాకులిచ్చిన అమెరికన్ స్త్రీని గురించి విన్నారా? పతివ్రతగా వుంటున్న స్త్రీ ఒక్కసారిగా చాంచల్యం కనబరచడానికి కారణం. కొంతవరకూ భర్త ఏ రోజుకు ఆ రోజు గడ్డం చేసుకోకపోవడమే అంటే ఎవరయినా నమ్ముతారా? ఇవన్నీ అల్పమయిన విషయాలే ఇంతకంటె పెద్దవి కూడా వున్నాయి. మూఢనమ్మకంతో మగ్గిపోయిన వాతావరణం, మనస్సుని విభజన చేస్తుంది. ఆచారం దాస్యాన్నీ, వ్యక్తిత్వం స్వాతంత్ర్యాన్నీ పురిగొల్పుతాయి. అత్త–మామ, బంధువులు, యిరుగు–పొరుగు, దేవుడు, దయ్యం– యివి ఆచారాన్ని సూచిస్తాయి; ఇంగ్లీషు చదువుకున్న భర్త సంపర్కం, పట్నాలలో నాగరికత–యివి వ్యక్తిత్వాన్ని సూచిస్తాయి. ఈ రెండింటికీ రాత్రి, పగలూ యుద్ధం జరుగుతుంటుంది.

వ్యక్తిత్వం ఓడిపోతే వ్యాధి సంక్రమిస్తుంది. మనదేశంలో నూటికి తొంభైమంది స్త్రీలకి ప్రకృతితో సంబంధం ఉంది చెట్లు, నేల, ఆకాశం, చెరువులు అనాది నుంచీ వొస్తున్న సంప్రదాయం. వీటితో చెలిమి చేసిన వారిలో నూటికి పదిమందికి భర్తలతో బస్తీలకి ఎగబడగానే ఆ సంబంధం పోయింది. చెట్లు, చంద్రుడు, ఆకాశం, చెరువులు, సంప్రదాయం వీటికి బదులు – తారు, పొగ, నీళ్ళు రాని కులాయి, రొద–వీటితో చెలిమి చేసుకోవడం చేతకాక, మతులు పోగొట్టుకుంటారు. అట్లాగే, సెక్స్ జీవితంలో విభజనలుంటాయి. భర్తని దైవంగా పూజించటం నేర్చుకున్న స్త్రీ, భర్త తనని వేశ్యగా ఉండమని వేధించుకుతింటే ఏం చేస్తుంది? సంపూర్ణ జీవితం స్వేచ్ఛా ప్రకటన భర్త కోరతాడు. రాత్రి పగలు మళ్ళా సంప్రదాయం దాపరికం, గుట్టు, నటన ఈ రెంటికీ పొసగదు. మానసిక వ్యాధి రాక తప్పదు. ఈ దేశంలో నూటికి తొంభై స్త్రీల జబ్బులు మానసిక జబ్బులే...."

"బాగానే వుంది ఐతే దీనికి మందేమిటి?"

"రాత్రికీ, పగటికీ మధ్య ఉండేలోయని మరుగుపరచడం."

"అంటే?"

"ఈ వ్యాధి కేవలం డాక్టర్ల వల్ల నయం కాదు; ప్రతి డాక్టరూ, మానసిక శాస్త్రంలో ప్రావీణ్యం పొందినా ఎక్కువ ఉపయోగపడదు. సంఘం తమకేది కావాలో నిర్ణయించుకోవాలి. సంప్రదాయం నేర్పిన అసంపూర్ణ జీవనమా? వ్యక్తిత్వం ఆధునిక విజ్ఞానం ప్రబోధించిన స్వేచ్ఛా జీవనమా? అల్పమయిన ఆదర్శాలను ఆచరణలో పెట్టుకోవడమా? అనాచరణీయమైన ఉన్నత ఆదర్శాలకి నోటితో కృతజ్ఞత వెలిబుచ్చుతూ రహస్యంగా చెడిపోవడమా? ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. ప్రస్తుతం మన దేశం, పగలు మంచిగా వుండి రాత్రి చెడిపోతోంది. పగలు కూడా చెడిపోవడం "నవీనత్వం" అనిపించుకుంటోంది. రాత్రి కూడా బాగుండటం పూర్వాచార పరాయణత్వం అవుతోంది. అనుభవంలో రుజువయినప్పుడు చెడ్డతనాన్నే

మంచితనంగా సమర్థించుకొని, అందరికీ అందుబాటులో వుండే ఆదర్శాలని ప్రచారం చేసి పగలూ రాత్రి వొకేలా ప్రవర్తించడం నా అభిప్రాయం..."

"మంచి ఆదర్శం అంటే ఏమిటండీ!"

"ఒకరకం ప్రవర్తన నీతా, దుర్నీతా అని అడగకూడదు. అది అనుచరణీయమా, పరిపూర్ణ జీవనానికి తోడ్పడకుండా, మొత్తం మీద చాలామందికి సంతోషాన్ని, ఆరోగ్యాన్ని యిస్తుందా అని ప్రశ్నించాలి" అన్నాడు నిధి.

"ఈ ప్రశ్నలకి అవునన్న సమాధానం వొస్తే దాన్నే నీతి అంటున్నారు. అంచేత మీరు చెప్పినవాటికి, అందరూ అనుకునే నీతికి భేదం ఏముందండీ?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"భేదం చాలా వుంది. నేడు మన సంఘం ఆమోదిస్తున్న నీతిని ప్రతిపాదించినవారు విచిత్రమైన గతించిపోయిన వాతావరణంలో ఉన్నారు. ఈ నీతి, మత సిద్ధాంతాలపైనా, సంఘంతో నిమిత్తం వొదులుకున్న కొద్దిమంది ఋషుల వేదాంత ఘోషపైనా ఆధారపడి వుంది. ఇది తప్పు అనే సాహసం నాకులేదు. ఇది మనకు సరిపడదూ అనగలను. దానికి కారణం యీ నీతి మనం ఆచరణలో పెట్టలేకపోవడమే. పైగా యీ నీతి మనకి మోక్షం యివ్వడానికి వుద్దేశింపబడింది. కాని ఈ లోకంలో వున్న సంతోషాన్నివ్వడానికి వుద్దేశింపబడింది కాదు. మోక్షం యిస్తుందో లేదో ఎవ్వరూ చెప్పలేరు. ఎందుకంటే రుజువు చేసినవారు లేరు.

"ఐతే యిష్టం వచ్చినట్లు తిరిగి సంతోషంగా వుండడం మీ నీతి అన్నమాట" అన్నాడు కృష్ణమూర్తి.

"నా అభిప్రాయాలని చులకన చెయ్యడం చాలా సులభం. కాని వాటిని ఆచరణలో పెట్టడానికి ఎంతో ధైర్యమూ, శక్తి సామర్థ్యాలూ వుండాలి. ఎంతో విజ్ఞానం, సంస్కారం కావాలి. ఇవన్నీ పొందే అవకాశాలు లేక మన సంఘంలో మనుషులు బద్ధకించి వున్నవాటితోనే తృప్తి పడి మోక్షం పేరుచెప్పగుని ఈ ప్రపంచాన్నీ, జీవితాన్నీ వొక జాడ్యంగా వొక పీడకలలాగ భావించి ఎలాగో రోజులు గడుపుతున్నారు. అందుచేత మన సంఘం అభివృద్ధి చెందటం లేదు. మన ఆధ్యాత్మిక విలువల పేరూ, వేదాంతం పేరూ, దైవం పేరూ, మతం పేరు చెప్పగుంటూ, మనుషుల మాట మరచిపోతున్నాం—"

"నిధిగారూ! మళ్ళా వేదాంతంలోకి కొట్టుకుపోతున్నారు" అన్నాడు కృష్ణమూర్తి.

"వేదాంతం అంటే, మన వుద్దేశం, ఎవరికీ జీవితంతో నిమిత్తం లేని పండితుల పుస్తకం అని, నిజానికి వేదాంతం అనేది, "మనం నిత్యం జీవితంలో బ్రతకడం ఎట్లా" అన్న ప్రశ్నకి అందరికి అన్వయించే సమాధానమే. నా యిల్లు నే చక్కబెట్టుకోడం స్వార్థం. అందరిళ్ళూ నా యింటిలాగే చక్కబెడతాను: అనడం రాజకీయవేత్తల పని. అదే వేదాంతం కూడాను—" అన్నాడు నిధి.

కృష్ణమూర్తి, "థాంక్స్" అంటూ లేచివెళ్ళి, పేకాట బల్ల దగ్గర చేరి జోకర్ ఆటలో మునిగిపొయ్యాడు.

నాలుగు మాసాలు గడిచినై. దయానిధి రెండెకరాల భూమి అమ్మి వేశాడు. ఇంటి ఖర్చు తగ్గించాడు. తోటమాలి పనిమానుకున్నాడు. ఊళ్ళోకి సైకిల్

మీదే వెడుతున్నాడు. నెలకి వందకూడా రావడం లేదు. డబ్బిచ్చుకోలేని రోగులవి డిస్పెన్సరీలో పెట్టుకుని వుచితంగా మందులిస్తున్నాడు. డబ్బంతా ఖర్చయిపోతోంది. చాలడం లేదు. మెడికల్ జర్నల్ తెప్పించడం మానుకున్నాడు. ఇప్పుడు తనేదైనా వ్యాసం రాస్తేనే వో కాపీ వస్తుంది. నాలుగు నెలలు తండ్రి డబ్బు పంపించేవాడు. మైసూర్‌లో పక్షవాతం వచ్చి, అకస్మాత్తుగా తండ్రి మరణించాడు. ఆ మిగిలిన ఎకరం అమ్మివేసి, అన్నగారూ తనూ కలిసి, అంత్యక్రియలు జరిపారు. నారయ్య మళ్ళా నిధి దగ్గర చేరాడు.

నవంబర్‌లో కలెక్టర్‌గారి అధ్వర్యాన క్లబ్ వార్షికోత్సవం జరిపారు ఆ సందర్భంలో షేక్స్పియర్ రచించిన "హామ్‌లెట్" నాటకాన్నుండి కొన్ని దృశ్యాలు ప్రదర్శించారు. హామెలెట్ పినతండ్రి భూమిక కృష్ణమూర్తి, హామ్‌లెట్ భూమిక నిధి ధరించారు. క్లబ్బు జనానికి ఆ నాటకం ఆడటం ఇష్టం లేదన్నారు, విషాదాంత నాటకం ఆడవల్సిన సందర్భం కాదది, కన్యాశుల్కంలో కొన్ని దృశ్యాలు – సారంగధర ఆడమన్నారు. నిధి హామ్‌లెట్‌కి తనే పెట్టుబడి పెడతానన్నాడు. ఆఖరికి కన్యాశుల్కంలోంచి కొన్ని, హామెలెట్‌లోంచి కొన్ని దృశ్యాలు ప్రదర్శించారు. హామ్‌లెట్ రక్తికట్టలేదు. ఏ వొకరిద్దరు కాలేజి విద్యార్థులకో తప్ప, అందులో కవిత్వం ఎవళ్ళకీ అర్థం కాలేదు. హత్య చేయబడిన హామ్‌లెట్ తండ్రి దయ్యంగా వచ్చి కొడుకుతో మొరెట్టుకున్న దృశ్యం బాగుంది. కాని, ఒఫీలియాతో హామ్‌లెట్ సంభాషించే ఘట్టంలో నిధి "వోవరాక్టు" చేశాడన్నారు.

హామ్‌లెట్ ఆ ఘట్టాలలో "వున్మాదం" నటించాడనీ, నిజంగా చైతన్యం వున్నవాడే ననీ, ఆ భూమిక ధరించే పాశ్చాత్యనటుల నమ్మకం. ఈ నాటకం కోసం నిధి, హామ్‌లెట్ గురించిన విమర్శలెన్నో చదవడం జరిగింది. ఒఫీలియాతో ప్రేమఘోష సలిపినప్పుడు హామ్‌లెట్‌కి నిజంగా మతిపోయిందనీ, ఆ "వున్మాదం" నటనకాదనీ, నిధి వాదం. క్లబ్బు జనానికి యీ వాదంతో నిమిత్తం లేకపోయింది. దయానిధి హామ్‌లెట్ భూమిక ధరించడం సబబుగానే వుందనీ, "యిప్పుడు మా కర్థమవుతోంది" అని గుసగుసలు ప్రారంభించారు.

1937 ఏప్రిల్ మాసం వచ్చింది. దయానిధి ఎంతో కష్టంమీద డిస్పెన్సరీకి అద్దె ఇవ్వగలుగుతున్నాడు. మందు పుచ్చుకుంటున్న కొద్ది మంది పేషంట్లలో సగం మంది అతనికేమీ ఫీజివ్వరు. వాళ్ళ దగ్గరెట్లా వసూలు చెయ్యాలో అతనికి తెలీదు. ఇంట్లో ఏదో శుభకార్యంచెయ్యాలి అతనేం చెయ్యగలడు? అతనికి పిల్లలులేరు. దగ్గర భార్యలేదు. గృహ ప్రవేశానికి యిల్లుకట్టే తాహతు లేదు. తన పుట్టినరోజు చేసుగుంటే జనం నవ్వుతున్నారని .భయం. ఆ రోగులలో మిగతా సగం ఫీజులు యిచ్చే రకమేకాని, ఏం లాభం, యిచ్చుకోలేరు. కుర్చీలు, బీరువాలు, మంచాలు వేలం వేద్దామని తోచింది. లేకపోతే అప్పు చెయ్యాలి. పేషంట్ల దగ్గర బదులడగటం అతనికి ఇష్టం లేదు. కృష్ణమూర్తి జ్ఞాపకం వొచ్చాడు. ఈ మధ్య వూళ్ళో లేడు. ఏ బొంబాయో పూనాయో వెళ్ళి నాలుగు రోజుల క్రితం ఒచ్చాడుట. కృష్ణమూర్తి డబ్బు గలవాడు అతనికి పరిచితుడే వాళ్ళింటికి వెళదామనుకుంటున్నాడు. ఉదయం తొమ్మిదయింది. పోనీ సాయంత్రం అడిగితే, ఇప్పుడు నిధి క్లబ్‌లో మెంబరుకాడు

ఎల్లా అడగాలో, ఎట్లా మాట్లాడాలో, రిహార్స్ చేసుగుంటుండగా, కృష్ణమూర్తే చక్కా వచ్చాడు. ఇద్దరూ ముందుగదిలో ఓ అరగంట కూర్చున్నారు. తర్వాత కృష్ణమూర్తి వెళ్ళి పోయాడు. కృష్ణమూర్తి అతని పేషంటు. కృష్ణమూర్తి రక్తం సీసాలో తీసుకుని, గిండీ పంపించాడు నిధి. పదిరోజుల్లో రిపోర్టు వచ్చింది. "ప్లస్" గుర్తు వేసి వుంది. ఆ గుర్తు బదులు, మైనస్ గుర్తు వచ్చేవరకూ వారానికో ఇన్జెక్షన్ చొప్పున, కనీసం ఆరుమాసాలైనా ఇన్జెక్షన్ పుచ్చుకుంటే కాని, పూర్తిగా జబ్బు నివారణైందనుకోకూడదని చెప్పాడు అంతవరకూ అతను పెండ్లి మాట తలపెట్టకూడదన్నాడు. కృష్ణమూర్తి సరేనని, వారం వారం వొస్తూ ఇన్జెక్షన్లు పుచ్చుగుంటున్నాడు.

కృష్ణమూర్తి వైఖరిలో మార్పురానందుకు నిధి ఆశ్చర్యపడ్డాడు. అప్పుడప్పుడు రోజ్ని కృష్ణమూర్తి వేళాకోళం చేస్తుండటం అతను సహించలేదు. స్వతహా మనిషి ధోరణే అంత అనుభవం వల్ల మానవుడు జ్ఞానం పొందితే, ఏలూరులో రోడ్లన్నీ వేమనలగా అవును. అతనికి మానవ ప్రకృతి అర్థం కావడం లేదు. యధార్థం తెలుసుకోకూడదు. తెలుసుగుంటే, తట్టుకోలేం అంచేత మతం, దేవుడూ, దయ్యం, పురాణం, వేదాంతంలో మన్ని మనం మోసగించుకోవడం అవసరం. అతనికి నవ్వొచ్చింది కృష్ణమూర్తి మంచివాడు. తన్ను తాను మోసగించుకోవచ్చు. కాని ఇతరులని మాత్రం మోసగించడు. అతన్ని గురించిన యదార్థం మరుగుపరిచే యత్నం చెయ్యడు. కృష్ణమూర్తిలో "పాపం" చేసిన చైతన్యం లేదు. కాని నిజంగా అతను పాపం చేశాడా? కొందరు దొరికిపోతారు. కొందరు దొరకరు. అంతే తేడా. దొరికిపోకుండా వుండటమే సంఘం అవలంబిస్తున్న నైతికదృష్టి; కృష్ణమూర్తిలో పశ్చాత్తాపంలేదు. ఎందుకుండాలి? టైఫాయిడ్ జ్వరాన్నుంచి తేరుకున్న రోగి పశ్చాత్తాప పడుతున్నాడా? అన్ని జబ్బులూ చెడుగే, చెడుగుని రూపుమాపటం డాక్టర్ల విధి. ఇది మంచి జబ్బు ఇది చెడ్డ జబ్బు, అని విలువలు కట్టడం అజ్ఞానం. సంఘం యిట్లాంటి విలువలు కట్టడం వల్లే ధైర్యం లేనివాళ్ళు ఆత్మహత్యకి లోబడుతున్నారు. అది – చెడుగు కృష్ణమూర్తిని చూసి జాలిపడి "ప్రేమించడం" మొదలెట్టాడు కృష్ణమూర్తి ఆనందాన్నీ హాస్యదృష్టినీ ఉత్సాహాన్నీ యీ జబ్బులేమీ చెయ్యలేక పొయ్యాయి. మానవుడి ఆత్మబలం అట్లాంటిది భారాన్ని మొయ్యడం, ఉన్నవారి భుజాలపైననే భారం పడటం సంతోషించవలసిన విషయం.

రెండు నెలలు గడిచాయి. ఆనాడు ఆదివారం. కృష్ణమూర్తి ఇన్జక్షన్కి రాలేదు. సోమవారం చూశాడు రాలేదు. ఇట్లా మధ్య మధ్య మానెయ్యడం ప్రమాదమని ఎన్నిసార్లు చెప్పాడు. ఎందుకు రావడం లేదో? వాకబు చేశాడు కృష్ణమూర్తి వూళ్ళో లేడు. ఏ వూరెళ్ళాడు?

పోస్టు బంట్రోతు ఉత్తరాలిచ్చాడు. ఒకే పెళ్ళి తాలూకువి రెండు శుభలేఖ లొచ్చాయి. ఒకటి కృష్ణమూర్తిది, తన పెండ్లికి రమ్మని పంపిన ఆహ్వానము పెండ్లికూతురు గోవిందరావుగారి కుమార్తె సుశీల. రెండోది, గోవిందరావు మామయ్య పంపిన శుభలేఖ. పెండ్లి కొడుకు కృష్ణమూర్తి వివాహం పదకొండు రోజులుంది. దయానిధికి ఆశ్చర్యం వేసింది. వెఱ్ఱి ఆవేశం వొచ్చింది. వెంటనే గోవిందరావు మామయ్యకి ఉత్తరం వ్రాశాడు. పెండ్లికొడుకుకి సుఖవ్యాధులున్నాయనీ, వ్యాధి

తీవ్రత తగ్గలేదనీ, తగ్గేటందుకు, ఆరు మాసాలైనా పడుతుందనీ అట్లాంటి వానికి సుశీలనిచ్చి వివాహం చెయ్యడం గొప్ప అరాచకమనీ కాబట్టి, ఏదో విధంగా ఈ పెండ్లి ఆపెయ్యవలసిందనీ – ఆ ఉత్తరం సారాశం. మళ్ళా ఏదో జ్ఞాపకం వచ్చి చివర మరో రెండు వాక్యాలు చేర్చాడు. సుశీల వివాహం నిశ్చయం కావడం వివాహం జరగకపోవడం ఇదీ మొదటిసారి కాదని అందరూ ఎరుగున్నదే సుశీల నాకు చుట్టం అంచేత సుశీల బాధ్యత నాకూ కొంత వరకు వుంది. డాక్టరుగా సంఘం పట్లకూడా నాకు బాధ్యత ఉంది. ఈ వివాహం వల్ల ముందు – వారికి పుట్టబోయ్యే సంతానంపై మీరు కాస్త కనికరించి, తగిన చర్య తీసుకుంటారని నమ్ముతున్నాను.

కృష్ణమూర్తికి కూడా వ్రాయాలనుకున్నాడు. కాని దానివల్ల ప్రయోజనం లేదని విరమించాడు. సుశీలకి ఓ ఉత్తరం రాసి చింపేశాడు.

రెండు రోజుల్లో గోవిందరావుగారి దగ్గర నుంచి జవాబొచ్చింది. "కృష్ణమూర్తి చదువుకున్న వాడనీ, ప్రయోజకుడనీ, సుశీల అన్ని విధాలా ఇష్టపడిందనీ, యవ్వనంలో వొడుదుడుకులు వాటంతటవే సర్దుకుంటాయనీ, డాక్టర్‌గా నిధిలో అంత నమ్మకం లేదనీ, తన ఇల్లు ముందు తాను చక్కబెట్టుకోవడం ఉత్తమం" అని ఆ ఉత్తరంలో సారాంశం. చివర మరో రెండు వాక్యాలున్నాయి. "మీకుటుంబం చరిత్ర నీ పెండ్లికి ఎట్లాంటి అంతరాయం కలిగించిందో ఆ రోజుల్లో నువ్వు ఎంత నొచ్చుకున్నావో స్మరించుకో. నువ్వు అన్నీ చూసుకుని వివాహం చేసుకుని భార్య ద్వారా అనుభవిస్తున్న దేమిటి? బావుకుంటున్నదేమిటి? నీకింకా లోకజ్ఞానం లేదు. ఇట్లాంటి వ్రాతలు యిల్లాంటి ప్రచారం ముందెప్పుడూ ఎవరి దగ్గరా చెయ్యకు"

దయానిధి దీనికి మళ్ళా జవాబు వ్రాశాడు. అందులో కొన్ని వాక్యాలు, "నేను అన్ని బాధలూ పడివున్నాను గనుకనే యితరుల సౌఖ్యంకోసం యింత ప్రాకులాడటం. నాకు లోకజ్ఞానం లేకపోవచ్చు. కాని లోకజ్ఞానం గల మీబోటి పెద్దలు కూడా ఇట్లాంటి దుర్నీతిని ఆమోదించడం నాకెంతో దిగులుగా వుంది. కూతురుకు పెండ్లిచేసి అత్తారింటికి పంపటంతో మీ పూచీ ఒదిలిపోతుంది. తరువాత వారి జీవితాలు ఏమైతే మీకెందుకు? ఈ స్వార్థపరత్వం లోకజ్ఞానమైతే నాకిట్లాంటి జ్ఞానం లేకపోయినందుకు విచారంలేదు. ఈపెండ్లి మాన్పించే యత్నం విరమిస్తానని మాత్రం అనుకోవద్దు కృష్ణమూర్తికే వ్రాస్తున్నాను."

అన్నాడు కాని, ఎందుకో కృష్ణమూర్తికి వ్రాసే ధైర్యం అతనికి లేకపోయింది. కాకినాడ డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్‌కి ఓ ఉత్తరము వ్రాశాడు ఈవిషయాలన్నీ తెలియపరుస్తూ, దీనికి మెడికల్ ఆఫీసర్ ఈ విధంగా సమాదానం వ్రాశాడు.

"మీరు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ వివాహం జరగడం–అందులో మీరు కార్యం కూడా ఇప్పుడే జరుపుతారంటున్నారు. చాలా విచారకరమైన విషయం. ఐనా నేను చెయ్య గలిగింది ఏమీలేదు. డిస్ట్రిక్ ఆఫీసర్ దగ్గర్నుంచి హెల్తు సర్టిఫికెట్ ఉంటేనే కాని వివాహం చట్టబద్ధం కాకూడదని యేదేనా శాసనం వుంటే తప్ప మనం ఇందులో జోక్యం కలగచేసుకోడం హాస్యాస్పదం. ఒకవేళ అట్లాంటి శాసనాన్ని ప్రభుత్వం ముందు ముందు అమలు

జరిపినప్పటికీ ఉభయపక్షాలవారూ మెడికల్ ఆఫీసర్‌కి లంచంపోసి దొంగ సర్టిఫికెట్ పొందే అవకాశం వుంటుంది. ఈ పరిస్థితులలో కార్యము ఇప్పుడే జరపకుండా మీరే వారితో మాట్లాడి ఏదో చెయ్యడం మంచిది నేనేమీ చెయ్యలేను."

దయానిధి గోవిందరావుగారికి కనీసం కార్యం మాత్రం ఇప్పుడు జరపకుండా చూడవల్సిందని మరో ఉత్తరం వ్రాశాడు. దానికి అయన జవాబు వ్రాశాడు. వివాహం తప్ప కార్యం జరిపే ఏర్పాటు యిప్పుడు కాని అసలెప్పుడు కాని లేదనీ కొన్ని కారణాలవల్ల ఈ వివాహము ఇప్పుడు జరిపి తీరాల్సిందేనని వ్రాశాడు. ఆ కారణం ఏమిటో కనుక్కుందామని సంకల్పించాడు నిధి. నారయ్యని కాకినాడ పంపించాడు. నారయ్య రెండు రోజులుండి తిరిగి వచ్చాడు అతనికేమీ ఆరా దొరకలేదు. ఇంకా వివాహం రెండు రోజులుంది.

అమృతం భర్త, తనూ అమృతం సుశీల పెళ్ళికి వెడుతున్నామనీ తనూ వస్తాడని ఆశిస్తున్నామని నిధికి ఉత్తరం వ్రాశాడు. వివాహం యింక రెండు రోజుల్లో వుంది పోనీ తనూ వెళ్ళి కృష్ణమూర్తితో మాట్లాడితే? ఏమని మాట్లాడటం? తను మామగారితో ఏం మాట్లాడగలిగాడు? నీ ఇల్లు నువ్వు చక్కబెట్టుకోమన్న గోవిందరావు మామయ్య మాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి. ఆ రోజు గడిచి పోయింది. ఆ మొన్నాడు ఉదయం, పెండ్లికి వెడదామని సంకల్పించాడు. హోల్డాల్ తీసుకుని స్టేషన్ కొచ్చాడు బండి ప్లాట్‌ఫారం మీద సిద్ధంగా వుంది. పది నిమిషాల టైముంది కాళ్ళు దడదడ లాడుతున్నాయి. వొళ్ళంతా చల్లబడింది. జ్వరం తగిలింది. బల్లమీద కూర్చుండి పొయ్యాడు. నుదురు వేడెక్కిపోయింది. శ్వాస బరువుగా వొస్తోంది. గార్డు విజిల్ రైలుకూత రైలు కదలడం జరిగింది. ఒచ్చిన జట్కాబండిలోనే యెక్కి యింటికి వెళ్ళిపోయాడు.

రెండు నెలలు గడిచినై క్లబ్బులో కృష్ణమూర్తి టెన్నిస్ ఆడుతున్నాడు.

"హల్లో డాక్టర్,—వాళ్ళంతా వెడ్డింగ్‌కి మీరొస్తారని చాలా అనుకున్నారు. నేను కూడా డిజ్ అప్పాయింట్ అయ్యాను. బహుశా పేషంట్లతో మీకు తీరుబడిలేక పోయిందేమో" అన్నాడు కృష్ణమూర్తి.

"లేదు లేదు... వాక్కొంచెం వొంట్లో సుస్తీ చేసింది."

"డాక్టర్ ఈజ్ వొన్ పేషంట్—"

నిధి నవ్వాడు, కృష్ణమూర్తిలో ఏ విధమైన మార్పులేదు.

జబ్బు విషయం అడుగుదామనిపించింది. కార్యం మాట అడగాలనిపించింది. అనవలసిన వాక్యాలను ఆలోచించుకుంటుండగానే, కృష్ణమూర్తి మళ్ళా అందుకున్నాడు.

"ఐనా మీరు వచ్చినా, మీరు ఎన్‌జాయ్ చెయ్యలేరేమోలెండి – మీ పెండ్లి విషయం. అవన్నీ జ్ఞాపకం రావచ్చు" అన్నాడు.

నిధి ఆలోచన పరిపరి విధాల పోయింది. అలా అనడంలో కృష్ణమూర్తి వుద్దేశం ఏమిటో? కంఠం సవరించుకుని నిధి మాట్లాడబోయాడు.

"ఐతే చూడండి, మీకు – మీరు –"

"ఫరవాలేదు లేవయ్యా. ఇప్పుడు డబ్బు తొందర ఏమీలేదు. మీ దగ్గర ఉన్నప్పుడే యిద్దురుగాని" అన్నాడు కృష్ణమూర్తి – కాసేపాగి – "పైగా నేను మీకు

ఫీజ్ ఇవ్వాలిగా. ఇప్పుడు మనం బంధువులంకూడాను. ముందు ముందు మీరే నా ఫేమిలీ ఫిజిషన్" అంటూ కృష్ణమూర్తి పేకాట బృందంలో కలిసిపోయ్యాడు.

హోర్టులెస్ స్కాండ్రల్ అనుకున్నాడు నిధి. నిదానించి చూస్తే కృష్ణమూర్తి చేసిన తప్పేమిటి! అతని జబ్బు నిమ్మళించి వుండగూడదూ? వివాహం చేసుకున్నాడు. కార్యంలో తగిన జాగ్రత్త తీసుకున్నాడేమో! చదువుకున్నవాడు, ఆ మాత్రం ఆలోచించుకోడు? కాని యీ ప్రశ్నలకు సమాధానం ఎవరు చెబుతారు? అమృతం చెప్పగలదు. అమృతానికి ఉత్తరం రాయాలనిపించింది వ్రాశాడు. అమృతం భర్తని సంబోధిస్తూ "నేను ఆనాడు జబ్బుచేసి, సుశీల వివాహానికి రాలేక పొయ్యాను. మీరూ, అమృతం, కులాసాగా గడిపారని తలుస్తా. మీరెవరేనా పెండ్లి విశేషాలు వ్రాస్తారేమో అనుకున్నాను. జగన్నాధం ఆ పెండ్లికి ఎందుకు రాలేదో వ్రాశారు కారు. అతను వెళ్ళివుంటే, అన్ని సంగతులూ వ్రాయును. ఇప్పుడేనా మీరు పెళ్ళి వివరాలన్నీ రాస్తే సంతోషిస్తాను" అని వ్రాశాడు. ఈ ఉత్తరం అతనికి తృప్తినివ్వలేదు. లేఖలో జీవంలేదు. చచ్చిపోయిన కలంతో వ్రాసిన ఉత్తరం. దాన్ని చించివేసి ఈసారి అమృతాన్ని సంబోధిస్తూ మరో వుత్తరం వ్రాశాడు.

"– నువ్వూ, నీ భర్తా కులాసాగా వుంటున్నారని తలుస్తా. నన్ను జ్ఞాపకం వుంచుకుని, వివాహానికి ఆహ్వానిస్తూ వ్రాసిన ఉత్తరానికి చాలా కృతజ్ఞుడ్ని; సుశీల పెండ్లి ముచ్చటలు నీ నోటంట వినాలని వుంది. రహస్యాన్ని తిన్నగా శోధించి, సత్యాన్ని విప్పిచెప్పే శక్తి నీకే ఉంది–" ఈ ఉత్తరం అతను పూర్తిచెయ్యలేకపొయ్యాడు. నాలుగైదుసార్లు చదువుకున్నాడు. అతనికి "వుంచుకోటం" "నీ నోటంట" "రహస్యాన్ని"– అనే మాటలు ప్రమాదంగా తోచినై; ఇవి చదువుకుని భర్త ఏమనుకుంటాడో! ఏదో పాపం చేసినవాడల్లే బాధపడ్డాడు. తనలో ఏదో పాపం చేసే సంకల్పం ఉందా? ఆ సంకల్పాన్నుంచి అతను పారిపోవడానికి యత్నిస్తున్నాడా? అతని మనస్సు చెడిపోయింది. పెద్దమంటలో అడవి చెట్లు విరిగిపడుతున్నట్లనిపించింది. ఆ ఉత్తరం చించివేశాడు.

మరో మాసం గడిచింది. ఇప్పుడతనికి ప్రాక్టీస్ బొత్తిగా లేదు ఇంటద్దె రెండు నెలలది యివ్వాలి. అతికష్టంమీద భోజనం గడుస్తోంది. నారయ్యా, రోజ్ వొండిపెడుతున్నారు అప్పుడప్పుడు. మిగిలిన ఎకరం కూడా అమ్మేశాడు. అన్నగార్ని అడగలేడు. గర్వం, అతిశయం, యాచనకి అంగీకరించడం లేదు. అమ్మేటందుకు ఏమీ లేవు. భార్య దగ్గర ఉంటే ఎంత బాగుండును. నగలేనా అమ్మొచ్చు.

క్లబ్బులో అతన్ని గురించిన పుకార్లు కొత్తరూపం దాల్చాయి.

"భార్యని వొదిలేశాట్టగా? కృష్ణమూర్తి పెండ్లాన్ని యిక్కడికి ఎందుకు తీసుకురాడోయ్! బికాజ్, వాడి పెళ్ళానికీ, డాక్టర్‌కీ సంబంధం ఉందిలే మరి – బంధుత్వం ఈజ్ ఈక్వల్ టు బ్యూటిఫుల్ సంబంధం"

"కృష్ణమూర్తి డాక్టర్ దగ్గర ఎందుకు మందు పుచ్చుగోడో చెప్పకో. ఎ క్రాస్‌వర్డ్ ఫజిల్? వీడు ఆర్సినిక్ యింజెక్షనిచ్చి చంపితే?"

"నిధిగారి సతీమణి ఏది? కనుక్కున్నవారికి వెయ్యిరూపాయల బహుమానం"

అదీ పుకార్ల ధోరణి. వెళ్ళటం, యివి వినడం, బాధపడటం తప్పడం లేదు. వినకుండా బాధపడకుండా వుండలేడు. ఆ బాధే తనకి మిగిలిన స్నేహితుడు.

అప్పుడప్పుడు కొందరు క్లబ్బు వ్యక్తులు. ఏదో జబ్బు వొంకని యితని దగ్గరకొచ్చి, బాతాఖానీవేసి, కొంత పరిశోధనా ఫలితాన్ని పొందుదామనుకుని పోతుంటారు.

ఇప్పుడు కృష్ణమూర్తి చాలా భాగం అత్తవారి ఊళ్ళోనే ఉంటున్నాడు. ఎప్పుడేనా "మాచెస్" ఉంటే వొచ్చిపోతుంటాడు. మరో మాసం గడిచింది. గోవిందరావు మామయ్య దగ్గరనుంచి ఉత్తరం వొచ్చింది.

"నిన్నరాత్రి, సుశీల ప్రసవించి చనిపోయింది. శిశువుకూడా. మరణించినది..."

దయానిధికి "కొన్ని కారణాలేమి"టో తెలిశాయి. వివాహం జరిగి ఎనిమిది మాసాలు పూర్తికాలేదు. శిశువు కృష్ణమూర్తికి పుట్టలేదు; తండ్రిగా ఉండే బాధ్యత మాత్రం అతను వహించాడు. దయానిధికి దుఃఖంలో భయమేసింది. సుశీల మృత్యువుకి అతను బాధ్యుడేమో ననిపించింది. తన కోరిక ప్రకారం సుశీల అల్లుకున్న పద్మవ్యూహాన్నించి విముక్తిచేసే శక్తి ఒక్క మృత్యువే. ఏదో బరువుతో విరిగినట్లనిపించింది. కారుద్దామంటే కన్నీరులేని సమయం అది. స్వేచ్ఛగా గాలి పీల్చాడు. జీవాన్ని తీసుకుపోయినప్పుడు, సృష్టి ఏదో ప్రశాంతాన్ని, వికాసాన్ని దిగవిడిచిపోతుంది. పెద్ద కెరటం మహాసముద్రంలోకి నిష్క్రమించేముందు వొడ్డున నురగని దిగవిడిచినట్లు; భయంకరమేఘం వర్షించి, తెల్లబడి పల్చబడి ఆకాశంలో అంతర్ధానమైనట్లు, ఏడ్చి, జుట్టు పీక్కునేటందుకు యిక్కడేముంది? ఇతరులకోసం కన్నీరు కార్చటం సులభం. మనకోసం కావల్సినప్పుడు, కన్నీరురాదు. మూల్గలేని ప్రాణీ నవ్వుతుంది. కాని సృష్టి మూగదై, నిశ్శబ్దంలో జీవిస్తుంది.

రాత్రి పదకొండు గంటలైంది. దయానిధి హేమ్‌లెట్ చదవటం మొదలెట్టాడు. ఆ నాటకాన్ని ఎన్నోసార్లు చదివాడు. కాని యిప్పుడు పూర్తిగా అర్థమైనట్లుంది. అది నాటకం కాదు. మానవత్వాన్ని ఋజువు చేసే అనంత ప్రణాళిక, ఎవరికివారు అందులో యదార్థాన్ని రక్తనాళాలపైన ఋజువు చేసుకోవాల్సిందే.

దయానిధి పుస్తకం మూసేసి దొడ్లో నూతిపళ్ళెంమీద పడక్కుర్చీ వాల్చుకుని కూర్చున్నాడు. ఆకాశంలో మేఘాలు బరువుగా కదుల్తున్నాయి. చెట్లలో ఆకులు మెదలడంలేదు. గాలి దూరంగా పిలుస్తోంది. ఏదో వచ్చి లేపేవరకూ కదలనట్లు చెట్లు నిలిచిపొయ్యాయి. నిధి కళ్ళముందు ఇంద్రధనస్సులా ఏదో మెరిసింది. వేళ్ళతో కళ్ళను తుడుచుకున్నాడు. కన్నీటితో వేలు తడిసింది. ఛ, ఛ... తను ఏడవ కూడదనుకున్నాడు. ఎందుకు దుఃఖం? ఎవరిమీద తనకి కోపం? అన్నింటికి సమాధానం శూన్యం. ఏమీ జరగడం లేదని పడే బాధా, కారణం లేని దుఃఖం — వీటికి అంతంలేదు. సృష్టిని చూసే మానవుడు జాలిపడడం జరుగుతుందా? ప్రపంచంలో అన్నీ మూసుకునే తలుపులు అన్ని తలుపులూ ఒకదాని తర్వాత వొకటి మూసుకుపోతాయి. మనము బైటుండి పోతాం. అంతా చీకటి. దూరంగా ఏదో కిటికీ తెరిచినట్లయింది. కాంతి మెరిసింది. అతను జీవితాన్ని స్పృశించి పట్టుకున్నట్లుంది. విశ్వాన్ని అవులింతతో యిముడ్చుకున్న విముఖత అది. తొందరగా లేచి గదిలో కెళ్ళి, కాగితం కలం తీసుకుని, వ్రాయడం మొదలెట్టాడు. పదహారు రోజులవరకూ బైటకి వెళ్ళకుండా, గదిలో ఏకాంతంగా కూర్చుని, గంటకో వాక్యం చొప్పున వ్రాస్తూ గడిపి, చివరికి ఆ వ్యాసం ముగించాడు. అతనికి ముగింపు

చేతకాదు. ప్రేమకి ద్వేషం ముగింపు. యవ్వనానికి వాంఛ ముగింపు. జీవితానికి మృత్యువు ముగింపు. కాని ఈ వ్యాసానికి ముగింపేమిటి? ఒక్కసారి విశ్వంలోని సౌందర్యవతులైన స్త్రీల శరీరాలని మంటగాచేసి ఆ జ్వాలలో తన శరీరం ఒక్కసారి మండించుకుని, ఎండిన నాలుకా, కాలిపోయ్యే నుదురూ, మరి మెదలని అస్థి పంజరమై, కరిగిన మంచులా ద్రవించని రక్తంతో నిండు సూర్యుని చూడగలిగిన మానవులందరూ, ఆ వ్యాసాన్ని ముగించే యత్నం చేస్తూ, అల్లా వ్రాస్తూ పోవాల్సిందే. ప్రతి యుగంలో మనుషులూ, మరో అంకమో, మరో అధ్యాయమో వ్రాస్తూ ఉండే ఎడతెగని పుస్తకం లాంటిది జీవితం. దానికి ముగింపులేదు. తను వ్రాసిన వ్యాసం వొకసారి చదువుతున్నాడు నిధి –

★ ★ ★

# చీకటి సమస్య

షేక్స్పియర్ రచించిన హామ్లెట్ నాటకం చదివిన వారికందరికీ అందులో ఒక సమస్య ఉన్నదన్న విషయం తెలిసే ఉంటుంది. ఆ సమస్య, హామ్లెట్ నాటకానికి సంబంధించినది కాని, రచయితకి సంబంధించినది కాదు. హామ్లెట్, షేక్స్పియర్ యిద్దరూ ఒకటేనని నమ్మిన విమర్శకులు ఈ సమస్యను పరిష్కరించే యత్నాలు చేశారు. ఇట్లాచేసిన వారు షుమారు అరవైమంది. వీరు, ప్రపంచంలోకి షేక్స్పియర్ గొప్ప రచయితనీ, అతని రచనలో హామ్లెట్ గొప్ప నాటకమనీ అన్నారు. కాని, దాని సమస్య పరిష్కారం కాలేదు. కోల్ రిజ్, ఈ నాటకం గురించి వ్రాస్తూ తన స్వీయచరిత్ర చెప్పుకున్నాడు. గెధే అదేపని చేశాడు. ఇటీవల టి.యస్. ఎలియట్ అనే విమర్శకుడొక్కడూ ధైర్యంచేసి, హామ్లెట్ షేక్స్పియర్ రచించిన వుత్తమ నాటకం కాదనీ; పూర్తిగా పాడైపోయిన నాటకం అనీ, తీర్పు చేశాడు. ఎలియట్ యిట్లా అంటున్నాడు.

"హామ్లెట్ నిండా, రచయిత వెలుగులోకి లాగి కళానుగుణంగా ప్రదర్శించ లేకపోయిన "గొడవ" బోలెడుంది... హామ్లెట్ అనుభవించిన ఉద్రేకానికి సరిపడ్డ పరిస్థితులు బాహ్యప్రపంచంలో లేవు. పడే బాధకీ చూస్తూన్న వాతావరణానికీ మధ్య ఉన్న లోయ పై వొంతెన వెయ్యలేక పోయాడు. హామ్లెట్ తన ఉద్రేకంతో బాధపడినట్లు, షేక్స్పియర్ హామ్లెట్ నాటకంలో బాధపడ్డాడు.

సారస్వతంలో ప్రదర్శించడానికి వీలుకాని కథావస్తువుని షేక్స్పియర్ నాటకంలో తీసుకున్నాడు. షేక్స్పియర్ ఆ బాధని హామ్లెట్ ద్వారా ప్రదర్శించలేకపొయ్యాడు. అంచేత ఈ నాటకం తగులడింది

ఈ సమస్యని పరిష్కరించే ఉద్దేశ్యంతో నేనూ ఈ వ్యాసంలో కొన్ని సూచనలు చేస్తున్నాను. ముందు హామ్లెట్ సమస్య ఏమిటో కొంచెం పరిశీలిద్దాం.

హామ్లెట్ తండ్రి మరణానంతరం హామ్లెట్ తల్లి గెర్ట్రూడ్ భర్త సోదరుడ్ని వివాహమాడుతుంది, రాజ్యపరిపాలన కూడా వారిదే. ఆస్థానంలో మంత్రికుమార్తె ఒఫీలియాని హామ్లెట్ ప్రేమిస్తాడు. ఇట్లా ఉండగా వో నాడు హామ్లెట్ తండ్రి దయ్యంగా కుమారుడికి దర్శనం ఇచ్చి తను తన సోదరునిచే హత్యగావింపబడినాననీ తల్లి కూడా ఇందులో బాధ్యురాలనీ వారిమీద పగ సాధించవలెననీ కుమారుణ్ని శాసించి, అంతర్ధానమవుతాడు! ఆనాటి నుండి హామ్లెట్ మనస్సు మారిపోతుంది. తల్లి వ్యభిచరించిన విషయం తెలియగానే, "స్త్రీ" మీద అతనికున్న గౌరవం పోతుంది. ఒఫీలియా కూడా ఇలాంటి కులటేమోనని భ్రమిస్తాడు. అతన్ని పరిశీలించడానికి. అతని గుట్టు బయటికి లాగడానికి తండ్రిచే నియమించబడిన గూఢచారిణిగా పరిగణించి, ఆమెని తూలనాడి సంపర్కం మానుకుంటాడు. రాత్రీ, పగలు బాబయ్యనీ, తల్లినీ

యే విధంగా సంహరిస్తే కసి తీరుతుందో ఆలోచన సాగిస్తూ, పరాకు ప్రసంగం చేస్తూ, పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. గూఢచారుడుగా ఉంటున్న మంత్రిని హత్యచేస్తాడు. రాజు, భార్య – అతనిది ప్రమాదకరమైన "పిచ్చి" అని భయపడి, దాని నిజాలు తెలుసుకోడానికి యత్నిస్తారు. హామ్‌లెట్ రాజ్యంలో ఉంటే వారికి ముప్పు వాటిల్లుతుందని, అతన్ని దూరదేశానికి పంపుతారు. అతని పన్నాగం తెలుసుకుని, తిరిగివొచ్చి రాజయోధులను హత్యచేస్తాడు. చివరికి పగ సాధిస్తాడు. ఒఫీలియా ఆత్మహత్య చేసుకుంటుంది. తనూ తల్లీ రాజూ అందరూ మరణిస్తారు.

ఇందులో సమస్య ఇది, హామ్‌లెట్ తన చర్యలకి యేవగించుకుని తన తల్లినీ, ఆమె భర్తని చంపడానికి నిశ్చయించుకుని కూడా, ఆ పని ఎందుకు చెయ్యడు? స్వగతాలతో అమాయకులని చంపుతూ ఎందుకు వృధా కాలయాపన చేస్తాడు? ఇదీ ప్రశ్న. దీనికి విమర్శకులు రకరకాల సమాధానాలిచ్చారు. వీటన్నింటినీ మూడు రకాలుగా విభజించవచ్చు.

1. షేక్స్‌పియర్ ఒక పాతనాటకాన్ని ఆధారంగా చేసుకుని ఈ నాటకం వ్రాశాడు; అందులో పగతీర్చుకోవడం తప్ప వేరే కథ పట్టులేదు. కాబట్టి ఆ "పట్టు" "బిగి" ఆపాదించటం కోసం ఈ స్వగతాలు "ఉన్మాదం" "తంతు!" యిరికించాడు అని.

2. హామ్‌లెట్ ఆదర్శజీవి. తన ఆదర్శాలని ప్రపంచానికికూడా ఆపాదించాడు. తన తల్లి చేష్టలు; ఆ ఆదర్శాలని భగ్నం చేసినై. "వాళ్ళు వుంటేనేం, చస్తేనేం?" అనుకుని నిస్పృహ చెంది. కార్యదీక్ష నుంచి విరమించి వేదాంతి అయ్యాడు... అని.

3. నాటకకర్త హామ్‌లెట్ ఇరుక్కున్న వ్యూహాన్ని చూసి జాలిపడి, సానుభూతి ప్రకటించడం వలన ఈ "ఆలస్యం" జరిగింది – అని.

నేను ఇందులో మూడోదానితో ఏకీభవిస్తున్నాను. ఇది కొంతవరకూ ఎలియట్ చెప్పిన వాటికి దగ్గరగా కూడా ఉంది హామ్‌లెట్, తల్లిని అందరు పురుషులలాగే "మాతృదేవత"లా వూహించి, గౌరవించి ప్రేమించాడు. కాని ఆమె భర్త చనిపోగానే మళ్ళా వివాహం చేసుకుంటుంది. ఈ కృత్యంతో హామ్‌లెట్ తల్లిని పూజించలేక పొయ్యాడు. తరువాత భర్త జీవించి వుండగానే భర్త సోదరుడితో వ్యభిచరించిందన్న సంగతి తెలియగానే, ఆమెని "గౌరవించడం" మానేశాడు. స్త్రీని "చాంచల్యమా" అని సంబోధించాడు. చంపడానికి నిశ్చయించుకున్నాడు. ఆమె బ్రతికి ఉంటే తనలాంటి కూతుళ్ళని కంటుందని భయపడి "చంపడం మంచిపనే" అనుకున్నాడు. కాని ప్రేమించకుండా ఉండలేక పొయ్యాడు. తల్లిలోని చెడుగుకి అతీతం అయ్యే ప్రేమ అతనిది. "పోనీ సుఖపడనీ, అనుభవించనీ, ఈనాలుగు రోజులేగా తరువాత ఎల్లాగ చంపుతానుగా. పోనీ పాపం, ఆనందించనీ" అని హామ్‌లెట్ అనుకొని, "ప్రేమకి" తన దాస్యం వొదులుకో లేక కాలయాపన చేశాడు. ఆ ఔదార్యం, ఆ అతీతమైన ప్రేమ హామ్‌లెట్‌లోని ఉత్తమ లక్షణాలు – చివరికి "పాపాన్ని" "చెడుగుని" చూసి భరించి, సహించి, అనుభవించి, అతీతమయ్యే ప్రేమ అతనిది. పాపంలేదు, పుణ్యం లేదు, చెడుగులేదు, మంచి లేదు ఇవి ఐహిక విలువలు; ఆధ్యాత్మిక విలువలు కావు; సంఘంయొక్క ప్రాపకం, ప్రాబల్యంమీద ఆధారపడే

అశాశ్వతమైన విలువలు, కష్టసుఖాలు. రెంటినీ సమంగా అనుభవించిన వ్యక్తికి తీర్పు చేసే అవసరం ఉండదు; ఉండనక్కరలేదు.

ఐతే ఈ సూచనలు సమర్థించేటందుకు నాటకంలో ఆధారాలు ఎక్కువగా లేవు. వీటి ఆధారాలు షేక్స్పియర్ జీవిత రహస్యంలో దాగివున్నాయి. షేక్స్పియర్ తల్లి చర్య షేక్స్పియర్ని బాధించి ఉండొచ్చు. తనకి జరిగిన అన్యాయాన్ని, పదిమందికీ ఎరుకపరిచి, వారిని అపవాదు నుండి రక్షించడం, మహాపురుషుడి లక్షణం. వ్యక్తిగతమయిన విలువలే, ప్రపంచానికి అన్వయించే సూత్రాలుగా మారుతాయి. షేక్స్పియర్, చెడ్డదయిన తన తల్లిని ప్రేమించగలిగాడు. కాని యీ ప్రేమనీ, ఆమెలోని "చెడ్డతనాన్ని" సమన్వయం చెయ్యలేకపోయాడు. శిఖరం ఎక్కి కిందికి చూశాడు – అఘాతం వుంది, తల తిప్పేశాడు. ఈ అఘాతంపై నుంచి అవతలి శిఖరంమీదకి దూకడం ఎట్లా? అదీ అతని సమస్య. చివరికి – తెగించి దూకేశాడు. కాని దూకేముందు అవతలి శిఖరంమీదికి చేరుకోలేనని అతనికి తెలుసు; ఐనా దూకడము అతని విధి; అతని ప్రకృతి. చెడుగుపై దాళ్ళు చెయ్యలేడు; దూకి అతీతుడు కావాలి; అఘాతంలో తనూ తల్లీ తన పాత్రలూ అంతా పడి నశించిపోయారు.

చెడ్డ వ్యక్తులే రక్తికట్టే పాత్రలన్నాడు జాన్ బైలి. వారిని రంగంపైకి వొదిలి ప్రేక్షకులను ప్రేమించమన్నాడు. యెందుకు? "చెడ్డతనం" సాధనంగా చేసుకుని ఆ పాత్రలు "ఆనందాన్ని" సాధించారు. ఆనందాన్ని సాధించడం, శాంతిని పొందడము అవసరంగాని అవి పొందేటందుకు సాధనాలేవయినా ప్రమాదం లేదు. "ఏ విధంగా నయినా సంతోషాన్ని సాధించిన మనుషులను షేక్స్పియర్ ప్రశంసిస్తాడు" అంటాడు సర్ వాల్టర్ రాలె. సంతోషం పొందే యత్నంలో వారు మరణిస్తే విషాదకరమైన పాత్రలై మన సానుభూతిని కోరతారు; గెలిస్తే హాస్యాస్పదంగా మారుతారు. వారు పొందదల్చుకున్న ఆనందం అల్పమైంది కాదు. ప్రాణాన్ని బలిగా కోరుతుంది. వారి ఆశయం వారి మృత్యువు. ఇంజనీర్లు అశ్రద్ధగా కట్టిన ఒంతెన పడిపోవటం లాంటిది కాదు; భూకంపంలో కూలిపోయిన వొంతెనలాంటిది మొదటిదాన్ని విమర్శిస్తాం. రెండోదాన్ని చూసి జడుసుకుని ముగ్ధులవుతాము.

ఈ వ్యాసాన్ని ఎట్లా ముగించాలో తెలియక దయానిధి డ్రాయర్లో పెట్టేశాడు, వారం గడిచింది.

సాయంత్రం నాలుగయింది. దయానిధి క్లబ్బుకెళ్ళాడు. ఈ మధ్య పత్రికలు సరిగ్గా చూడక దేశంలో ఏం జరుగుతుందో అతనికి బాగా తెలీడంలేదు. వెళ్ళి పత్రికలు చూడడం మొదలెట్టాడు. కాని అతని మనస్సు స్థిరంగా వుండక, పదేపదే, వ్యాసం మీదికి వెడుతోంది. దాన్ని మోడరన్ రివ్యూకో, త్రివేణికో పంపాలనుకున్నాడు. అతనికి సారస్వతంలో ప్రవేశంలేదు. విమర్శకుడిగా పైకి రావాలని కూడా అతని సంకల్పంకాదు. అది వ్రాయడంలో అతని బాధ తీరిపోయింది. ఏదో బరువు తగ్గినట్లనిపించింది. అతని విమర్శన చదువుకున్న సాహిత్యప్రియులు నవ్వుతారేమోనని కూడా అనిపించింది. సారస్వతం యొక్క ఉద్దేశం జీవిత సమస్యలకి సమాధానం ఇవ్వడమా? తల్లిదండ్రుల పాపాలు పిల్లలని వెంటాడినప్పుడు, వారేం చేస్తారు? "ఏం చెయ్యాలి?" అన్నదానికి షేక్స్పియర్ సమాధానం యివ్వలేకపొయ్యాడు.

వారిని క్షమించి ప్రేమించమన్నాడా? నీతి లేదనడం లేదు. ప్రాచీన శక్తులు ప్రకృతి– మానవత్వం వీటికి నీతితో నిమిత్తంలేదు. ఈ గోళంపై మానవుడి బ్రతుకు క్షణికం; అశాశ్వతం. నీతి పేరిట కఠిన శిక్ష కన్నీరు జుట్టు పీక్కోవడం ఎందుకో. మహా సముద్రం పొంగిపొరలి; నీతిని అది నెలకొల్పిన సంస్థలని ముంచివేస్తుంది. ప్రకృతి జ్వాలలో మానవుల కట్టడాలు తగులడతాయి. కాలిపోగా మిగిలిన జీవంలేని ముక్కలనుంచి నీరసించిన నల్లపొగ ఆకాశం కమ్ముతుంది.

"ఎట్లా జీవించడం!" అన్నదానికి సారస్వతం సమాధానం ఇవ్వాలంటే అతని విమర్శకి విలువవుతూంది.

ఇతరుల జోలి తనకెందుకు? తన జీవితానికి తాను సమాధానం పడ్డాడు. అతని సమస్య విశదపడింది. విశదపడిన వొస్తువు ఇక మరి బాధించదు. అందులో భయం పోయింది. ఏకాంతంలో అతను తెలుసుకున్న వెలుగు అతన్ని రక్షిస్తుంది. తనూ తనలాంటి వాళ్ళు చేసిన పాపాలను భరించే భారం షేక్స్‌పియర్ మీద వెయ్యడం ఎంత తప్పు? నీ నీడ నీ వ్యక్తిత్వం, నీ చెడుగు, నీ పాపాలు. నువ్వు జీవించి ఉండగానే నశించిపోవడం ఎంత ఆశ్చర్యం? ఎంత ఆనందం.

పత్రికల్లో వార్త ఈ ఆలోచనల్ని అరికట్టింది. రాయలసీమలో కలరా, ప్లేగు చెలరేగి అనేకమంది మరణిస్తున్నారు. అక్కడ సహాయం చెయ్యడానికి వొచ్చిన డాక్టర్ల సంఖ్య తక్కువ. ఎందరో డాక్టర్లు వొచ్చి తోడ్పడితేగాని లాభంలేదు. ఆరోగ్యశాఖవారు చేస్తున్న పనికి డాక్టర్లుకూడా సహాయపడాలని నాయకులు విజ్ఞప్తి చేస్తున్నారు. ప్రజలకి మందులు, బట్టలు, డబ్బు కావాలి. అనంతపురం, కర్నూలు జిల్లాల్లో పరిస్థితులు తీవ్రంగా వున్నాయి. విధికి ఇది చదవగానే అక్కడికి వెళ్ళిపోవాలనిపించింది. వెళ్ళి అక్కడే ఏకాంతంగా వుండిపోవాలి. మరి తిరిగి రాకూడదు. ఈ వూళ్ళు, ఈ తాలూకాలు ఎన్నో జ్ఞాపకం చేస్తాయి. ఇక్కడ మనుషులలో కుళ్ళు, కుట్ర, కుతంత్రం – వీళ్ళ నుంచి పారిపోవాలి.

సోడాల కుర్రాడొచ్చి, "వో కలర్ తీసుకోం"డన్నాడు.

"నాకు కాతా లేదుగా – నేను మెంబర్నికాను" అన్నాడు.

"కాకపోతే ఏం లెండి – ఫరవాలేదు తీసుకోండి" అన్నాడు కుర్రాడు. వాడి కళ్ళల్లో ఎంతో దయ. ఎంతో ఆదరణ. వాడి జీవితం ఎంత మంచిది! హాయిగా ఆట్లన్నీ చూస్తాడు. సోడాలు తాగుతాడు; చీకూ చింతాలేదు. కాని అల్లా ఎంతకాలం వుంటాడు? యవ్వనం వస్తుంది; ఏ పిల్లనో పెళ్ళి చేస్తారు; వాడు ఏ పిల్ల వెంటనో పడతాడు. తగాదాలు; దెబ్బలాట్లు; త్రాగుడు; పెండ్లాన్ని కొడతాడు. పెండ్లాం వాడ్ని విడిచిపోతుంది; వాడూ విధిలాగే ఐపోతాడు. పురుషుడి యవ్వన ప్రశక్తుల్నీ ఆనందాన్నీ హరింపచేసేందుకు ఏ స్త్రీయో సిద్ధంగా వుంటుంది. వాడు మూలగడం, ఆమె కూచుని వినడం: ఆమె మూలగడం, వాడు వినడం ఇంతే వాడి జీవితం?

పేకాట బృందం అతన్ని చూడలేదు. కబుర్లు సాగించారు. ఈసారి కృష్ణమూర్తిని గురించి.

"ఇవాళ రాలేదేం డాప్ జవాన్"

"ఊళ్ళోకొచ్చాడు."

"ఐతే భాయీ, అతని వైఫ్ ఆత్మహత్య చేసుకుందిటగా" మూడు తలకాయలు ఆ కంఠం దగ్గరగా జరిగాయి.

"ఏం లేదు. ఇదివరకే ఆమెకి మరోడితో సంబంధం వుందిట: మూడో నెల అని తెలుసుకున్నారుట – మన కృష్ణమూర్తికి తండ్రిగా వుండేభాగ్యం కలిగింది. మనవాడు నాటకం కనుక్కున్నాడు... ఏం జరిగిందో మనకు తెలీదు ఆత్మహత్య చేసుకుంది. నీళ్ళాడి చనిపోయిందని గప్‌చిప్ చేశారు."

"ఐతే ఆ కాస్త పుణ్యం కట్టుకున్న ధన్యుండెవడోక్కో!"

"బ్యూటీ స్పెషలిస్టు..."

"మేం నమ్మం మాకు నిదర్శనం కావాలి."

"వివాహం ఆపు చేయించమని వుత్తరంరాసి అఘోరించాడు"

దయానిధి ఈ సంభాషణలలో కొంత వినగలిగాడు. సోడా కుర్రాడు "కలర్" కొట్టి యిచ్చాడు.

"నేను ఁబ్బు లివ్వలేను" అన్నాడు నిధి.

"ఫరవాలేదు లెండి – తరువాత చూసుగోవచ్చు – ఇక్కడ తాగే వాళ్ళంతా డబ్బులిస్తే మా అయ్య స్టేషనుకాడ హోటలెట్టును..." అంటూ కుర్రాడు నవ్వుతున్నాడు.

"ఐతే... నీకు నా మీద యింత దయ దేనికిరా?" కుర్రాడు మాట్లాడలేదు.

"మీరు మంచోరండి"

"నేనేం చేశాను?"

"మా పిన్నికి మందిచ్చి బ్రతికించారండి – రాత్రికి భలే ఆటాడుతున్నారండి– సినిమా–పంజాబ్ మెయిల్."

నిధి జేబులోంచి అర్ధరూపాయి తీసిచ్చాడు.

"చల్ మెయిల్‌కి చల్; – మేరే మవులా బులాలో" అని పాడుకుంటూ కుర్రాడు లోపలికి వెళ్ళాడు.

పేకాట బృందం మళ్ళా సాగించింది.

"అబ్బాయ్ – నేనోటి చెబుతాను విను. ఇవన్నీ వంశపారంపర్యం వచ్చే లక్షణాలనుకో. నిధిగారి తల్లి – పెద్దగాథలే–"

"ఏమిటండోయ్... బాంబులు విసురుతున్నారు."

"ఇల్లాంటివి దాగుతాయా బాబూ – ఆవిడ కథానాయకురాలే – అసలందుకనే యీాయనకి సంబంధాలు కూడా రాలేదుట–"

"ఐతే భార్య ఏమైనట్లు?"

"ఇద్దరికీ చెడిందిగా–"

"ఎందుకో –"

"చారిత్రిక పురుషుడు" గుసగుసలు

"విపులీకరించండి."

"కృష్ణమూర్తి పెళ్ళాం ఎవరినీ?"

"కానీవయ్యా"

"అసలు పెళ్ళికి పూర్వమే, లేచొచ్చినదాని కూతుర్ని తగులుకున్నాడు తల్లి ప్రోత్సాహం ఉండేది."

"చిత్రం"

"తల్లి రహస్యాలు కొడుకు దాస్తాడుగా మరి!"

"ఐ.సి."

నిధికి ఆ కుర్చీ ఎత్తి, వాళ్ళమీద గిరవాటెట్టాలనిపించింది. రెండు చేతులలో కుర్చీ కాళ్ళను గట్టిగా పట్టుకున్నాడు. ఆ మాట్లంటున్నది గుమస్తా సోమయ్య. వందరూపాయల కాగితం పైకి తీసి చూపించిమళ్ళా జేబులో పెట్టేశాడు. కోటు విప్పి కుర్చీకి తగిలించి, బైటికి వెళ్ళి ఒచ్చి మళ్ళా ఆట్లో పడ్డాడు. ఇంతలో టెన్నిస్ ఆటగాళ్ళు వచ్చి బల్లల్ని వెనక్కి లాగమన్నారు. కుర్రాడు బల్లల్ని వరండాలోకి యీడ్చాడు. మళ్ళా ఆటసాగించారు. సోమయ్య కోటు గోడకి తగిలిచ్చాడు. నిధి రాయలసీమ వెళ్ళేటందుకు యిప్పుడు వందరూపాయలు కావాలి. సోమయ్య కోట్లోంచి ఆ కాగితం తీసేస్తే సోమయ్యకి మంచి శాస్తి జరుగుతుంది. వరండాలోకి నడిచి వెళ్ళాడు. కుర్రాడు చిమ్నీలు తుడిచి దీపాలు వెలిగిస్తున్నాడు. కోటు కీనీడలో వుంది. పర్సు లాగేయ్యడం అతి సులభం. సోమయ్య కోటు వెతుక్కుంటూ లేచాడు. పేకాటలో నోటు మార్చే అవసరం వచ్చింది. "నా కోటేదిరా?"

"ఇదిగో మీ కోటు—ఇదేనా?" అన్నాడు నిధి.

"అవును – హల్లో – మీరిక్కడే ఉన్నారే – ఎంతసేపైందివచ్చి రండి ఆడుకుందాం అని ఆహ్వానించాడు."

"అరే బ్రదర్ – ఏడవకు నోటు మార్చనక్కర్లేదులే, రా, మనవాడు పంపకం చేస్తున్నాడు."

"ఇహనేం – మన బేస్తు మనకే దక్కుడు"

సోమయ్య పర్సు తనే తీసుకున్నా ననుకుంటాడు. అట్లా అనుకోవడమే తనకి కావల్సింది. తను వాగిన వాగుడికి ఇది శాస్తి అని గ్రహించుకుంటాడు. కాని ఊరుకుంటాడా? రుజువు, పోలీసులు, కోర్టు విచారణ – అదొకరకమైన జీవనం. ఏ రకం జీవనమైతేనేం నైతిక విలువలతో సంఘానికి నిమిత్తం లేనప్పుడు?

కాని సోమయ్య అల్పుడు, సోమయ్య వ్యక్తిత్వంలేని మనిషి... సంఘంలో ఒక రేణువు. సంప్రదాయం కాళ్ళకింద బురద, దులుపుతే వొదల్దు మనం దెబ్బలాడాల్సింది ఆదర్శాలతో, విలువలతో – వ్యక్తులతో కాదు. వ్యక్తులు సిద్ధంగా వున్న నియమాలని ఆచరణలో పెడతారు. దాన్ని ఖండించి ధిక్కరించేశక్తి వారికి వుండదు; ధిక్కరించే... వాడికి సంఘంలో శాంతి వుండదు. నూరు రూపాయలు సోమయ్య – ఖరీదు. బ్రతికి వుండగా – చనిపోయిన తర్వాత, కళేబరంలోని సామానుబజార్లో అమ్మితే, రూపాయి రెండణాల గంధకం, సున్నం.

నిధికి నవ్వొచ్చింది. సోమయ్యని క్షమించి, బైటికి వెళ్ళి పొయ్యాడు. మనిషి బ్రతుకు సరిగా లేకపోతే ఇట్లాంటి పనులు చేయిస్తుంది కాబోలు ననుకున్నాడు వందరూపాయల కోసము ఆత్మని అమ్ముకోవాలా? అట్లా ఎందరో అమ్ముకుంటున్నారు; కొందరు వంద కోసం; కొందరు వెయ్యికోసం. కాని వార్ని చోరులనడం లేదు. వార్ని రావ్‌సాహెబ్

బహాదూర్ బిరుదులిచ్చి గౌరవిస్తున్నాం. ఆ పనే, బీదవాడు చేస్తే దొంగంటున్నాం. భారతదేశంలో ఆత్మవిలువ, రూపాయి అణాపైసల్లో నిర్ణయించవచ్చు.

ఉండి ఉండి, ఆకాశాన మేఘాలల్లుకున్నాయి. రోడ్డుమీద దుమ్ము మొహాన పడుతుంది. నక్కివున్న వర్షం చక్కిలిగింతలు పెట్టినట్లుగా, గాలిలో చలి మెదుల్తోంది. దుకాణాలలో దీపాలు ఆగిపోకుండా ఏవో అడ్డం పెట్టుకుని అవస్థపడుతున్నారు కొట్టువాళ్ళు. కాలువలో దీపాల రంగులు కొట్టుకుపోతున్నాయి. నిధి, ఇంటికి చేరుకుందామని తొందరగా నడుస్తున్నాడు. ఇంటికెళ్ళి తను రాసిన వ్యాసం మళ్ళా చదువుకోవాలి, అందులో ఏవో తప్పులున్నట్లనిపించింది. సవరించాలి. ఈ వ్యాసం ప్రచురిస్తే కల్లుబ్బు వ్యక్తులు చదువుకుని ఏమనుకుంటారో వూహిస్తే భయమేస్తుంది. వారి అనుమానాలు ధ్రువపడుతున్నాయి, క్రొత్త నిదర్శనము దొరుకుతుంది. అతన్ని పరిశోధించేటందుకు ఆ వ్యాసం తోడ్పడుతుంది. తన ప్రత్యేకమైన బాధని వెళ్ళబోసుకోవడము తప్ప, ఆ వ్యాసములో ఉపయోగపడే విలువలేమున్నాయి? అసలెందుకు అతను అది వ్రాయడం? చెడిపోయిన స్త్రీని క్షమించమని సంఘమును కోరడమా? పాపాన్ని శిక్షించక ప్రేమించమనా అందులో సందేశం? బాగున్నవారు వేరు, పట్టుబడని వారే బాగున్నవారు; వీరు దొరికిపోయిన వారిని విలువకట్టి శిక్షించే అర్హత లేదనా? ఏదో బలహీనమైన సమయంలో వాంఛకి లొంగిపోతే యింత ప్రమాదం జరుగుతుందని తెలుసుకున్న స్త్రీ అల్లా చెయ్యలేదని తెలియపరచడమా? ఐనా స్త్రీని మాత్రం ఎందుకు దూషించాలో? పురుషుడిని నిందించరేమో!

వ్యాసాన్ని ప్రచురించే ధైర్యం అతనికిలేదు. నిజం చెప్పినంత మాత్రాన అది ఉత్తమ సారస్వతం అనిపించుకోదు. అందమైన అబద్ధాలాడాలి. వ్యక్తిగతమైన కష్టసుఖాలని, సకల మానవులకూ వర్తించేటట్లు చిప్పా ప్రధానంగా చిత్రించాలి. షేక్స్పియర్ అలా చేశాడు. తను ఈ వ్యాసంలో అల్లా చేయలేకపోయాడు. బ్రతికుండగా నిజం చెప్పే సాహసం అతనికి లేదని నిశ్చయించుకున్నాడు. నిజం చెప్పకపోతే అతను బ్రతకలేడు. తనే తనకి విషాదాంత నాయకుడిలా కనిపిస్తున్నాడు. విషాదాంతనాయకుడికి, "అదో, యిదో – ఏదో ఒకటి చెయ్యి" అన్న సమస్యని పరిష్కరించే పరిస్థితులెదుర్కొంటాయి. ఏదో ఒకటి నిర్ణయించటమే అసాధ్యం; అదే విషాదాంతంలోని సారం.

నిధికి ఆ గాలి, దుమ్ము, మెరిసే చీకటి, అతని ఏకాంతం భయం కలగచేశాయి. ప్రపంచం విశ్వంలోకి ముందుకి సాగిపోతూ, అతన్ని దిగవిడచి నట్లనిపించింది. అతనికి ప్రపంచంతో నిమిత్తములేదు. ఐనా ప్రపంచానికి అతనితో నిమిత్తం దేనికో? అతన్ని పరుగెత్తుకు రమ్మని యాగీచేస్తుంది. రాలేకపోతే, కుంటాడనో, గుడ్డివాడనో పేర్లు పెడుతుంది. అతని హృదయంలో నిశీధిలాంటి, అనంతంలాంటి ఏకాంతం కేంద్రీకరించింది. దాన్ని చూసి జడుసుకున్నాడు. ఎక్కడికి పారిపోతాడు?

తీరాచేసి ఇంటికే చేరుకున్నాడు. పక్కవారింట్లో గడియారము ఎనిమిది గంటలు కొట్టింది, మెల్లెక్కి, వరండాలో కొచ్చాడు. గుమ్మము అవతల బల్లమీద కూర్చుని పూలదండ కడుతోంది అమృతం.

"ఏం బావా – నీ కోసం నారయ్యని పంపాను, కనపళ్ళేదూ. అమృతం పూలని పళ్ళెంలో ఉంచి, దీపాన్ని పైకెత్తి, వూది, పెద్దది చేసింది. ఆ వెలుగులో ఆమె మొహము నిండుగా కనపడింది; జడని విప్పేసి వెంట్రుకల్ని నిలువునా మెలిత్రిప్పి, మెడమీదికి జారుగా వారిగే చుట్టలా చుట్టింది. సూర్యోదయాలని దీక్షగా చూచే పవిత్రమైన నేత్రాలలా, కళ్ళు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి. పాపిడి యిరుప్రక్కలా ఎత్తుగా లేచిన జుట్టు నీడ నుదుటిమీద మెత్తగా పడింది. పెదవులు కలిసినచోట, అర్థచంద్రుడిలా లేచిన బుగ్గల "నీటైన నీడలు పడుతున్నాయి. అంతటి ఠీవి, గర్వం వెనక, కెరటం వెనక అస్తమిస్తున్న సూర్యుడిలా దాగిన హాస్యదృష్టి, కారుణ్యాన్ని కాంక్షించిన ఆ కళ్ళ నిశ్చలత్వము, కనపడని స్థిరత్వం పొందిన ఆ అవయవాల కదలికలో ఆదుర్దా – యిదివరలో ఎప్పుడూ అమృతంలో అతను చూడలేదు.

"ఏం బావా, అల్లా తెల్లబోయి చూస్తావు?" లేచి పళ్ళాన్ని దూరంగా నెట్టి బల్ల తుడిచింది.

"నిన్ను ఆనమాలు పట్టలేదు అమృతం" అంటూ అతను బల్లమీద కూర్చున్నాడు.

"ఏం? అంతలావుగా ఐపోయానుకదూ – మావారు "పాతకలావున్నా" వంటుంటారు. అంటే నన్ను పూర్తిగా మరచిపొయ్యావన్నమాట ఔనా?"

"మరిచిపోవడం కాదు... నువ్విక్కడ ఉంటావని వూహించలేక పొయ్యాను... అంచేత కొంచెం ఆశ్చర్యం వేసింది."

నిధి లోపలికెళ్ళి కుర్చీ తెచ్చి బైటవేసి, తను కూర్చున్నాడు. అమృతం బల్లమీద కూర్చుని, పూలని ముడిమీద అలంకరించుకుంటోంది.

"ఇప్పుడు చెప్పు... ఎప్పుడు రావటం? యెక్కడ నుంచీ, ఎందుకూ..."

పూలని సర్దుతూ, పిన్నుని పళ్ళమధ్య బిగించి మాట్లాడుతోంది అమృతం.

"ఉండు మరీ – ఈ జుట్టులొంగదు" విచ్చలవిడిగా ఎగిరిపోయిన ఆ జుట్టుని అమృతం నాలుగు పిన్నులతో లొంగదీసింది. కొన్ని వెంట్రుకలు మెడచుట్టూ, చెవులమీదా, చెక్కిళ్ళమీదా పడి, వొడ్డున పడేసిన చేపపిల్లలా కొట్టుకుంటున్నాయి.

"అబ్బ ఎంతగాలి! వర్షం వస్తుందా? నువ్వు చాలా చిక్కిపోయావు బావా–" అంది జాలిగా.

"ఏదో వూరికే అంటున్నావు."

"లేదు బావా... చూడు కణతలు పల్చగా ఎల్లాకొట్టుకొంటున్నాయో కళ్ళు లోతుకిపోయాయి" అతన్ని ఎగాదిగా పరీక్షగా చూసింది.

"మనం పెద్దవాళ్ళం అయిపోతున్నాం కదూ..."

"కాలం ఆగుతుందా మరి" గాలికి తట్టుకోలేనట్లుగా అమృతం, పమిట చెంగుని ఒళ్ళోంచి తీసి నెత్తిని కప్పుకుని, కుడి చెవిమీదికిలాగి కళ్ళు, బుగ్గలు చిట్లించి నవ్వుతోంది.

"అన్నాలొడ్డించనా?... ఏమండోయ్; ఒచ్చారే! మీ కోసము బజారంతా వెతిగానే... లేవండి, నీళ్ళు కాగాయి, స్నానం చేద్దురుగాని–" అన్నాడు శంకరం లోపల్నించి ఒచ్చి.

"నారాయణేడి శంకరం?" అంది అమృతం.

"అలా కాలవొడ్డు కెళ్ళాడు."

"బావా! నేను, శంకరం, పాలికాపు నారాయణా అల్లా తెనాలి వెళ్ళి వస్తున్నాం. మావాళ్ళ తాలూకు ఒకరికి పెళ్ళి సంబంధం ఒచ్చింది పిల్లని చూసి ఒస్తున్నాం. మా అత్తగారు యిదివరకే చూశారు. మావారు తీరికలేక రాలేదు. శిస్తు ఒసూలు చెయ్యమని మా పాలికాపునికూడా మాతో పంపారు. పన్లు జరిగినై... దోవలనేకదా. ఓసారి నిన్నుచూసి పోదాము అని వాళ్ళనికూడా దింపాను. ఏది శంకరం. పెండ్లి కూతురెల్లావుంది... చెప్పు" అని యాకరవు పెట్టింది అమృతం.

శంకరం పెండ్లి కూతుర్ని వర్ణించాడు. అమృతం నవ్వుతోంది తన కర్థం కాకుండా నిధికూడా నవ్వడం ప్రారంభించాడు.

"దబ్బున స్నానం చెయ్యిబావా... భోజనం చేద్దాం. బట్టలంతా దుమ్మే... లే, లే" అని తను లేచింది. దయానిధి వెళ్ళి స్నానం చేసి వచ్చాడు. జుట్టు పాపిడి లేకుండా వెనక్కి దువ్వి, బనీను తొడుక్కుని పైన తువ్వాలు కప్పుగుని సిద్ధమయ్యాడు. పాలికాపు నారాయణకి మండువాలో వొడ్డించారు. రోజ్ హోటల్లో భోజనం చేసి, ముందు గదిలో పక్క వేసుగుంది. నిధి, అమృతం, శంకరం భోజనాలు చేశారు. శంకరం, స్నేహితుడితో సినిమాకి వెళ్ళి స్నేహితుడింట్లో పడుకుని వుదయం వొస్తానని బయలుదేరాడు.

"వర్షం వొచ్చేటట్లుగావుంది. ఈ చలిలో సినిమా ఏంచూస్తారూ ఆ స్నేహితుడ్ని తీసుకొచ్చి ఇక్కడే పడుకోరాదూ?" అన్నాడు నిధి.

"టీ తాగితే ఏ చలీ ఉండదు. ఔను శంకరం?" అంది అమృతం.

"ఫరవాలేదులెండి" అంటూ ఏదో గొణిగి శంకరం ప్రయాణమయ్యాడు. నారయ్య, పాలికాపుకూడా సినిమాకి తయారయ్యారు. హాల్లో, డిస్పెన్సింగ్ గదిముందు, పాలికాపుకి బల్లమీద పక్క ఏర్పాటుచేశారు. నారయ్య నిధికోసం మంచం గదిముందు హాల్లోనే వేశాడు. తన చాప చుట్ట మండువాలో వేసుకున్నాడు. ఈ పనులు చేసి వాళ్ళు ముగ్గురూ వెళ్ళిపొయ్యారు.

అమృతం తమలపాకులకి సున్నం రాస్తూ మండువాలోకి నడిచి దొడ్డివైపు చూస్తోంది.

"ఇక్కడ ఎంతో హాయిగా వుంది బావా – అచ్చంగా మావూళ్ళో దొడ్డి యిల్లాగే ఉంటుంది" ఇద్దరూ దొడ్లోకి నూతి పళ్ళెం మీదికి నడిచారు. మేఘాలు చంద్రుడ్ని విడిచి దూరంగా పరుగులెత్తాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు స్వేచ్ఛగా మెరుస్తున్నాయి, ఉండి ఉండి పల్చటి తెల్లమేఘంపొర, చంద్రుడిమీద పెండ్లికూతురు మొదటిరాత్రి సిగ్గుముసుగులో కప్పి, కవ్వించి, తీసేసి తొలిగిపోతోంది. గాలిలో చలి. పదునుపెట్టిన కత్తిలా శరీరాన్ని మభ్యపెడుతోంది. చెట్లల్లో ఆకులు సంగీతం కోసం గొంతులు సవరించుకుంటున్నాయి. చలిని ధిక్కరించినట్లు ఎక్కడో పక్షులు బాధతో ఆనందాన్ని రెపరెప ప్రకటిస్తున్నాయి. తపోభంగ యత్నాన్ని జయించిన ఋషిలా, ప్రకృతి జపం చేస్తోంది.

"ఏం బావా మాట్లాడడంలేదు. కోపం వచ్చిందా?" అంది అమృతం నూతివొరమీద చేతులానించి నీళ్ళల్లోకి చూస్తూ.

నాకు కోపం ఒస్తే ప్రపంచానికి నష్టంలేదు. పైగా నీమీద కోపం దేనికి?

"ఊరికే అన్నాను అయితే బావా, సుశీల నాకో ఉత్తరం రాసింది" తెలుసా?

"తెలీదు"

"అది చాలా విచిత్రమైన ఉత్తరం. అందులో రాసింది తనకేదైనా ప్రమాదం జరిగితే, నువ్వే బాధ్యుడవుట..."

"ఎందుకో?"

"తనకి జీవితంలో సౌఖ్యం లేకపోవడానికి నువ్వు కారణంట నాకేమీ అర్థంకాలేదు, నేను జవాబు రాయలేదనుకో – అబ్బ చలిగా ఉంది" అంటూ కొంగు ఒంటిచుట్టూ గట్టిగా బిగించుకుంది. పసుపు పచ్చరంగుపై ఆకుపచ్చపువ్వుల ఖద్దరు చీర, జబ్బల్ని పట్టుకున్న అంగుళం వెడల్పు జరీగల నల్లరంగు ఖద్దరు రవిక దానిపై కుట్టిన తెల్లపూలు; వెన్నెలలో వింతగా కనబడుతున్నాయి.

"ఐతే బావా, నేనో విషయం అడుగుతాను ఏమీ అనుకోవు కదా?"

"అడుగు అమృతం. నేను స్వేచ్ఛగా మాటాడేందుకు తగినంత చనువు నాకింకెవ్వరి దగ్గరా లేదు. నిన్ను గురించి అన్ని విషయాలూ నాతో చెప్పకోలేకపోవచ్చు నీ దగ్గర నుంచి దాచే విషయాలు నాకేవీలేవు ఈ విషయం నీకు తెలుసు కూడాను."

"నువ్వు ఎంతో దిగులుగా, వింతగా మాట్లాడుతున్నావు. నాకెల్లాగో వుంది బావా."

ప్రతివారి ముందూ ఎంతకాలం నటించగలం అమృతం. ఎప్పుడో ఒకప్పుడు ఎవరిదగ్గరో ఒకరి దగ్గర మన నిజస్వరూపాలు బైటపెట్టక తప్పదు. రహస్యాలని బాధలేకుండా చెప్పకుంటే, విమర్శించకుండా విని, అర్థంచేసుకొని సానుభూతి చూపే వ్యక్తులు కనబడేవరకూ స్నేహితుల కోసం అన్వేషించక మానం. సత్యాన్ని, సౌందర్యాన్ని అన్వేషించడం అంటే నిజంగా ఇదే అర్థం...

"ఏమిటో బావా, మగాళ్ళు రహస్యాలు ఆడవాళ్ళతో ఎందుకు చెబుతారు? ప్రతీ మొగాడూ ఆడదాని ముందర కొంత దాస్తాడు."

"ఐతే, నేను నీతో చెప్పే విషయాలని నువ్వు నమ్మలేపన్నమాట."

"నువ్వు కొన్ని నిజం చెబుతావు. కొన్ని అసలే చెప్పక పోవచ్చు. స్త్రీతో చెప్పకూడనివి ఎన్నో వుండొచ్చు."

"నేను నిన్నెప్పుడూ స్త్రీగా పరిగణించలేదు అమృతం. కన్నీరు కారిస్తే తడిసిపీరైపోయిన స్వప్నకాంతలాంటి దానవు..."

అమృతం నిశ్శబ్దంగా నవ్వింది. అప్రయత్నంగా చెట్టుకొమ్మని కదిపి, ఆకుల్ని వేళ్ళతో విరుస్తోంది కీచురాయి కదిలింది.

"అబ్బ, చలిగా వుంది... జబ్బు చేస్తుంది. లోపలి కెడదాం బావా నాకు వెన్నెట్లో నువ్వు సరిగా కనబడడం లేదు." అంటూ అమృతం మండువాలోకి చేరుకుంది ఇద్దరూ హాల్లోకొచ్చారు. పాతసంగతులు స్మరించుకుంటున్నారు. జగన్నాథం పట్నంలో కాలేజీలో చదువుతున్నాడట. నాగుమణి పెళ్ళిచేసుకుందిట. భర్తకి వాయుడుపేటలో ఉద్యోగంట. తరువాత సుశీల విషయం మాట్లాడుకున్నారు.

"నాకో అనుమానంవుంది బావా – సుశీలకి నీమీద ఉండేదని" అంది అమృతం తనపాదాలకేసిచూస్తూ. నిధికి ఈ మాటలువింటే నవ్వొచ్చింది.

"మీదవుండటం ఏమిటి అమృతం – ప్రేమించింది. అనొచ్చుగా"

"ఏమో అబ్బా, ఎట్లా అనాలో నాకు తెలీదు" అంది మూతివంకర చేసి.

ఫరవాలేదులే – సిగ్గు పడేటందుకు మనం చిన్న వాళ్ళం కాము. సుశీల నన్నేకాదు, ఎవర్నీ ప్రేమించలేదు?

"అసలు ప్రేమించడం అంటే ఏమిటి బావా?"

"ఏమో నాకు తెలియదు. కాపురం చేస్తున్న దానవు నీకెక్కువ అనుభవం ఉండాలి..."

"నాకేం ఉంటుంది పల్లెటూరి మొద్దుని ఏ నీబోటిగాళ్ళో చెబుతూంటే వినడమే..."

"చాలామంది జీవితంలో "ప్రేమ" అనుభవించకుండానే జరిగిపోతుంది. కలలోనూ, పుస్తకాలలోనూ, కళలోనూ ప్రేమని తెలుసుగుని తృప్తి పడాల్సిందే..."

"నువ్వు అంతేనా ఏమిటి బావా?" అంది అమృతం కళ్ళకొనలనుంచీ చూస్తూ.

"ప్రేమని ఆశించడం పురుషుడి ఒంతూ – దాన్ని ఇవ్వడం స్త్రీ ఒంతూ"

మధ్యలో అమృతం అందుకుని –

"ఐతే బావా, సుశీల విషంతాగి చచ్చిపోయిందంటారు. నిజమేనా"

"నిజం కావొచ్చు. భర్త శంకించి వుండొచ్చు, గర్వి ఈ పరాభవం భరించలేక చేసి వుండొచ్చు..."

"ఇందులో నువ్వు చేసిన అపచారం ఏముందీ?"

"ఏమీలేదు. తనస్వార్థాన్ని స్తుతించలేదు."

అమృతం ఆవులించి, కళ్ళని తుడుచుకుని గదిలోకెళ్ళి మంచంమీద కూర్చుంది. పక్కంతా సర్ది తలగడాని వొళ్ళో వేసుగొని, కాళ్ళు ఊగిసలాడిస్తూ, కొంచెం గట్టిగా అడిగింది.

"బావా... నువ్వు మీఆవిడతో కాపరం పెట్టవా ఏమిటి?"

దయానిధి గదిలోకొచ్చి, కుర్చీ వాల్చి కూర్చున్నాడు.

"ప్రేమించిన వాళ్ళు పెళ్ళి చేసుకోలేరు. పెళ్ళిచేసుకున్న వాళ్ళు ప్రేమించలేరు... అదీ ఈ దేశంలో యువకుల చరిత్ర."

"నీవన్నీ చిత్రమైన భావాలు బావా!" అమృతం వికృతంగా వొళ్ళు విరుచుకుని పక్కమీద వొరిగింది.

"అబ్బ పిన్నులు గుచ్చుకుంటున్నై బాబూ..." అని లేచి, పిన్నులను దిండుకింద పెట్టింది.

"నీకు నిద్రొస్తోంది – నే వెళ్ళి పడుకుంటా..." అని నిధి లేవబొయ్యాడు.

"కూచో బావా – ఇల్లా కూర్చుని మనం కబుర్లు చెప్పకోవడం ఎన్నాళ్ళకో. నేను వస్తాను. మనం మీ మామగారి దగ్గరికెళ్ళి, ఇందిరని తీసుకొద్దాం?"

అతనేమి మాట్లాడలేదు.

"బావా, కోమలెక్కడుంది?"

"ఏమో..."

"ఓస్, ఏం తెలియనట్లు మహా? నా దగ్గర ఎందుకు దాస్తావ్?"

"కోమలి కోసం నీ దగ్గర చేసిన బాకీ ఎల్లా తీర్చాలో ఆలోచించవలసినప్పుడే జ్ఞాపకం వస్తుంది. ఆ రోజుల్లో బాహ్య ప్రపంచంలోని ప్రేమకోసం తహ తహ లాడాను."

"ఇప్పుడూ?"

"ఇప్పుడు నాలోని ప్రేమతో సమాధాన పడుతున్నాను."

"నాకేమీ అర్థం కాలేదు."

"నేను వెళ్ళి పడుకుంటా" అని నిధి లేచి వెళ్ళి, గుమ్మం ముందు మడత మంచంపై పడుకున్నాడు. కాసేపు నిశ్శబ్దం, అమృతం పెట్టె తీసిన చప్పుడైంది బట్టల మడతలోంచి కర్పూరం వుండల పరిమళం వేసింది. సబ్బు బిళ్ళల పెట్టెలో రూపాయల గలగల వినబడింది. అమృతం గదిలో ఏం చేస్తోందో! గది తలుపులు వేసుకోమంటే? గాజుల చప్పుడు, దిండ్లని సర్దిన శబ్దం, నిలిపివేసిన ఆవులింత – మళ్ళా నిశ్శబ్దం.

"నిద్ర పట్టిందా బావా?" అని అడిగింది లోపల్నుంచి.

"ఊఁ" అన్నాడు కాని అది అబద్ధం అని అతనికి తెలుసు.

"అబద్ధం" అంది.

నిధికి భయమేసింది. ఈ ఆడవాళ్ళు అన్ని విషయాలూ ఎల్లా తెలుసుకుంటారో చిత్రం అనుకున్నాడు.

"అంటే పడుతో వుంది." అన్నాడు.

"మా జగ్గు అడిగినట్లు, ఆ అవస్థ ఎట్లాంటిదో వర్ణించు బావా" అంది.

"ఓ, కళ్ళు మూతలు పడడం... కుడి కన్ను తెరవడం; ఎడమది ముయ్యడం; కుడిచెయ్యి తలకింద తీసి, ఎడమ చెయ్యి పెట్టడం; వెల్లకిలా పడుకోడం; తరువాత బోర్లకిల పడుకుని, దిండులో మొహం గుచ్చుగోటం..."

అమృతం నిలిపి నిలిపి మసీదులో మృదంగం మోగిస్తే ప్రతిధ్వనించినట్లుగా నవ్వుతోంది.

మళ్ళా నిశ్శబ్దం. పక్కడాబా ఇంట్లోంచి, గడియారం పదకొండు కొట్టింది. పదిక్షణాలలో ఆ నిశ్శబ్దం భగ్నమైంది.

ఆకాశంలో బంగారపు కత్తులని ఎవరో విరిచి పారేసినట్లుగా మెరుపులు... గాలికి ఒక్కసారిగా కిటికీ తలుపులు కొట్టుకున్నాయి, నేలమీద ఆకులు లేచి లోపల పడుతున్నాయి, దీపం నృత్యం చేస్తోంది. భయంకరంగా సిడుగులు దిక్కు తేల్చకుండా మారు మ్రోగుతున్నాయి, గదిలో గోడని కేలండర్ కాగితాలు చప్పుడు చేసి కిందపడ్డాయి. గోడనున్న నిధి తల్లి ఫోటోగ్రాఫ్, కిందపడి పగిలింది. అమృతం లేచి, గాజు ముక్కల్ని పోగుచేసిన చప్పుడవుతోంది. దీపం ఆరిపోయింది.

"నాకు భయమేస్తోంది బావా" అంది.

అతను లేచి అగ్గిపెట్టె కోసం గదిలో కొచ్చి, బల్లమీద తడుములాడుతున్నాడు. మెఱుపుల వెలుగులో కనబడుతుందని నిదానంగా చూస్తున్నాడు. కిటికీ తలుపులు మూసుగున్నాయి. అంతా చీకటి. బైట రొద. అమృతం దీపంమీద చెయ్యిపెట్టి, అబ్బ కాలింది" అని గెంతింది. నిధి చెయ్యి ఆమె భుజంమీద పడింది. ఆ చేతిని

తన మెడని ఆనించి బిగించింది. చెయ్యి తీసేశాడు. వెళ్ళి కిటికీ తలుపులు తీశాడు. అగ్గిపెట్టి; మంచం పక్కన అలమర్లో వుంది, దాన్ని తీసి దీపం ముట్టించాడు. తలుపులు కొట్టుకోకుండా, రాళ్ళు పెట్టాడు వెళ్ళి గదిలో మంచంమీద కూర్చున్నాడు.

"నీకు భయంగా లేదు బావా?" అన్నది అమృతం. నిధి లేచాడు. అమృతం మంచం మీద కూర్చుని, దిండుని వొళ్ళో వేసుగుని కాళ్ళు వూగిసాలాడిస్తోంది. బోర్డర్ లేని పసుపు పచ్చరంగు పల్చటి పట్టుచీర కట్టుకుంది. దానిమీద ఎఱ్ఱరంగు, అంచులేని, సిల్కుజాకెట్టు వేసుకుంది.

"ఇద్దరు చీరలో నిద్రపట్టదు. సిల్కుచీర చలేస్తుంది. ఎల్లా బావా బాగుందా చీర..."

అతని కేసి జాలిగా చూసింది.

"అమృతం..."

"ఎందుకు బావా?"

"యిల్లా ఎందుకు కొచ్చావు?"

"ఏం?"

"ప్రపంచానికి లేని ఆపేక్ష నీకెందుకు?"

"అదేమిటి బావా – ప్రపంచానికి ఆపేక్ష ఎందుకుంటుంది, ఎవళ్ళో వొకరిద్దరికి తప్ప –"

అమృతం కళ్ళు బరువుగా, మెరుస్తున్నాయి. కళ్ళకింద నల్లనీడలు వెన్నెట్లో మెరిసిన మంచిగంధం, ద్రమానులా తీర్చుకున్నాయి విప్పార్చుకుని, ప్రేమతో పదింతలైంది మొహం.

"అమృతం –"

అతనికి ఏమనాలో తెలీడంలేదు. వాక్యాలూ, మాటలు అన్నీ మాయమయ్యాయి.

"ఏం భావ?"

ఉప్పెనలా గాలి గదంతా కమ్మేసింది. కడసారి నృత్యం ముగించి దీపం మూర్ఛపోయింది. అమృతం చేతులు అతని భుజంమీద పడ్డాయి. సముద్రంలో కొట్టుకుపోయే వ్యక్తికి, రబ్బరుబంతి దొరికినట్లుగా, ఏదో శక్తి అతన్ని కిందకి నెట్టేస్తోంది. అతని మంచం పైన కాళ్ళమీద కూలబడిపొయ్యాడు. అంతా చీకటి. అతని కళ్ళు అమృతం వొళ్ళో తెరుచుకున్నాయి. అతని నుదుటిని చలిమంటలా కాల్చింది అమృతం కడుపు. కనురెప్పల్ని, ఆమె వక్షాలు మెత్తగా కోసేస్తున్నాయి. ఆమె రెండు చేతులూ అతన్ని ఎక్కడికో తీసుకుపోతున్నాయి. భరింపరాని సౌందర్యపు వెలుగుతో అతనికి స్పృహ తప్పింది. అమృతం జుట్టుముడి వూడింది. జడంతా అతన్ని కప్పేసింది.... నిశీధిలా కన్నీటి చుక్కలచే చీరతడిసి, అమృతం తొడలు చలితో వేడెక్కుతున్నాయి. ఆకాశం తన వొక్కడి మీద నిశ్చితంగా వర్షిస్తోన్నట్టు, అతని మెడ వెనుక భాగం మీద, కన్నీరు వునికిఉన్న ఇంద్రధనస్సులా ఆవరించింది. "భావా" అంది ముక్కలైన లయకోసం తడుములాడుతున్న కంఠంతో భూమి తిరిగిపోతుంది. స్థలం, సమయం గతులు తప్పాయి. విశ్వమే కదిలిపోతున్నట్లుంది. ఎక్కడికో ఇంకా ఇంకా దగ్గరగా కలిసి వొకరై, అన్ని రహస్యాలన్నీ భేదించి,

అన్ని లోతుల్నీ శోధించి, అన్ని శిఖరాలనీ సాధించి, ఒంటి జీవంగా కొట్టుకుని, విశ్వరహస్యానికి ప్రాణం పోశారు. ఆలోచనా, విమర్శనా, తర్కం, చైతన్యం... అన్నీ. ఉద్రేకాల ప్రవాహంలో కెరటంపై నురుగు కొట్టుకుపోతున్నాయి. దేనికోసమో, రెండు ప్రాణులు సృష్టిశక్తులను కేంద్రీకరించి పెనుగులాడుతున్నాయి... ఎక్కడో అది యదార్థమై వుంటుంది. రక్తం పట్టుతప్పి నిప్పు ద్రావకంలా పార్లి శరీరాన్ని కడిగి పవిత్రం చేస్తోంది, సర్వేంద్రియాలు విడిపోయి జీవక్షణాలుగా శరీరాన్ని మార్చేశాయి. శరీరం అనుభవంతో ఆత్మైపోయింది.

☆ ☆ ☆

ఆ క్షణం సృష్టి నిల్చిపోయింది. ప్రాణం స్థిమితపడింది. నిప్పులో కాలిన మల్లెపూల పరిమళం, అమృతం శ్వాసలో చుట్టేసింది. మెత్తటి బలంతో తడిసి ముద్దయి, ఆనందంతో ఎర్రగా అలసిపోయి సూర్యుడిలోని వేడిమికి కలిగిన మంచుకణమై అమృతం పక్కమీద వాలిపోయింది. ఆ శరీరం అది, ఎవ్వరూ "యిది నాది" అనలేరు. సృష్టి అనాదినించి ఉండిపోయి నిద్రనించి లేచి మరచిపోయిన శరీరం అది.

దయానిధి మంచం మీదనుంచి నేలమీద కూలిపోయ్యాడు.

అమృతం చేతికింద దిండు, కిందికి జారింది. దానిమీద తల ఆనించి కళ్ళు మూశాడు. ఓపిక లేకుండా కురుస్తున్న వర్షం నిలిచిపోయింది. చప్పబడి, నీరసించి ప్రకృతి విశ్రమించింది. విషాదంగా వెన్నెల కిటికీలోంచి వీడ్కోలిస్తుంది. పక్క డాబాలో గడియారం వొంటిగంట కొట్టింది. నిధి లేచి వెళ్ళి, గది గుమ్మం ముందు మంచం మీద పడుకున్నాడు. నారయ్య, నారాయణ సినిమానించి రావడం, పక్క చుట్టలు సర్దుకుని, పడుకోవడం చప్పుడైంది.

దయానిధికి నిద్రపట్టలేదు. లేచి నిలబడ్డాడు. కాళ్ళు నేలమీద ఆనడంలేదు, మరో శరీరంలోకి దూరబడ్డట్లయింది. అమృతం శరీర పరిమళం తనని ఆవరించింది. తువ్వాలుతో మొహం తుడుచుకున్నాడు. గదిలోకెళ్ళి అగ్గిపుల్ల గీసి దీపం ముట్టించాడు. తలుపు చేరేశాడు. అతనికి భయమేసింది. సిగ్గేసింది. తనదే ఆ మొహం, మరో లోకంలో కెళ్ళి, అద్దంలో నీడ చూసుకున్నట్లుంది. అలసి కృశించిన మొహంలో ఏదో కొత్తవికాసం. వెలుగు, ప్రతిభ కనిపిస్తూంది. ఈ కళ్ళతో మళ్ళా ప్రపంచాన్ని చూడడమా! స్వప్నంలో తెరుచుకుని చూడటం నేర్చుకున్న నేత్రాలతో ఈ బాహ్య ప్రపంచాన్ని చూడటమా!

దీపం తీసుకుని మంచం దగ్గర కెళ్ళి పైకెత్తి అమృతం కేసి చూశాడు. సిగ్గేసింది. ఆమెకేసి చూడలేకపోయాడు. అది నిద్రాదేవతే నిద్రపోవడం లాగుంది. దీపం దాచేశాడు. బయట రోడ్డుమీదకి వొచ్చేసి ఆకాశంకేసి చూస్తూ వొంతెనమీద కూర్చున్నాడు. బనీను లోపల మెడ వెనుక ఏదో పట్టుకున్నట్లయింది. తమిడి బయటకి తీశాడు. నల్లటి పొడుగాటి వెంట్రుక, అమృతం జడలోది. అతనికి భయమేసింది. తనకే తను వింతమనిషిలాగున్నాడు. అతని పూర్వపు భావాలు, ఆదర్శాలు, అభిప్రాయాలు... వాటికీ తన నిజతత్వానికి ఎంతటి భేదం వుందో తెలుసుకుంటే అతనికీ భయమేస్తోంది. అతని తత్వం అతనికే తెలీకపోవడం ఆశ్చర్యం. తను ఆ వాతావరణంతో వుండలేడు. అదంతా మైలపడిపోతుంది. సూర్యోదయం

కాగానే అమృతాన్ని ఎట్లా చూడగలడు? అమృతం తన నిజస్వరూపాన్ని తనకి చూపించి, హాయిగా నిద్రపోయింది. ఈ కళ్ళతో ఈ వ్యక్తులనీ, ఈ స్థలాన్నీ చూడలేడు. చంద్రుడే చిత్రంగా కదులుతున్నాడు. పక్కింటి గడియారం రెండు కొట్టింది. లోపలకొచ్చి మెట్లమీద కూర్చున్నాడు. సుశీల చావుకి కారణమైన తను కృష్ణమూర్తికి మందులిచ్చిన తను. అవకాశం వున్నా, కోమల్ని తాకకుండా బైటకొచ్చిన తను, షేక్స్పియర్ సమస్యని పరిష్కారం చేయదలచిన తను...

లోపలికెళ్ళి, చప్పుడు కాకుండా, డ్రాయర్లోంచి, షేక్స్పియర్ వ్యాసం తీసుకొని, బైటకొచ్చి, మెట్లమీద కూర్చోని, నిప్పుపుల్ల వెలిగించి కాగితాలని తగలబెట్టాడు. మళ్ళా లోపలికెళ్ళి, అమృతం పెట్టే తీసి సబ్బుబిళ్ళ పెట్టెని పెళ్ళగించాడు. అందులో రెండువందల ఎనభై రూపాయలున్నాయి. భూములమీద శిస్తు కాబోలు. అంతే? మిగతాది నారాయణ దగ్గరుంది కాబోలు. ఎనభై పెట్టెలో ఉంచి, రెండు వందలు తీసుకున్నాడు. తాళాలగుత్తి దిండుకింద వుంచాడు. అమృతం వెంట్రుక కవరులో పెట్టాడు. తొందరగా హోల్డాలు సర్దుకున్నాడు. అమృతం బరువుగా కదిలి, పక్కకి తిరిగి పడుకుంది. పక్కింటి గడియారం మూడుగంటలు కొట్టింది. ఓ ఉత్తరం రాసి నారయ్య చాపకింద పెట్టాడు. మరో ఉత్తరం రాసి అమృతం గాజు వెనక పెట్టాడు. 'ఋణం తీర్చుకో సాహసించడానికి నేనెవర్ని?' అని అది చదివి ఏమనుకుంటుందో "ఏం వ్రాతలు బావా నీదంతా చిత్రం" అంటుంది కాబోలు. గోడనున్న కోటు తొడుక్కున్నాడు. మరోసారి దీపం పైకెత్తి అమృతం కేసి చూపించాడు. అంత నిద్రపోవడానికి ఎంతటి నిర్మల హృదయమో! కడసారి పవిత్రంలో పవ్వళించిన అమృతం!

దీపం తగ్గించి తలుపులు జేర్లేసి, హోల్డాలు తీసుకుని బైటకొచ్చి గేటు మూసి రోడ్డుమీదికి కదిలాడు. పక్కింటి గడియారం నాలుగుకొట్టింది. బెజవాడ బండికి అరగంట టైముంది. సూర్యోదయం గాదు.

★ ★ ★

# రాళ్ళసీమ

దయానిధి కర్నూలొచ్చి రెండు వారాలయింది. గవర్నమెంట్ హాస్పిటల్ పక్కనే షెడ్‌లో వుంటూ, సైకిల్ ఎరువుచ్చుగుని, మెడిసిన్ బాగ్ తగిలించుకుని, మైళ్ళు మైళ్ళు ప్రయాణం చేస్తూ ప్రమాద వ్యాధులకు గురియైన రోగులకు చేతనైన చికిత్స చేస్తూండేవాడు. అప్పుడప్పుడు తోడి డాక్టర్లతోనూ, హెల్తు ఇన్‌స్పెక్టర్లతోనూ కలిసి భోజనం చేస్తూ, రాత్రికి మళ్ళా కర్నూలు చేరుకునేవాడు. అవసరమైన శవాలని బైటికి తీసుకుపోయి తగలబెట్టేందుకు సాయపడేవాడు. హోటల్ ప్రొపయిటర్ కొన్ని రోజులు తన హోటల్లో వుంచుకొని, వుచితంగా భోజనం పెడుతుండేవాడు. కొన్ని దినాలు వీలులేక రాత్రిళ్ళు వెళ్ళినచోటే వుండిపోయేవాడు.

ఆ వూళ్ళు చిత్రంగా వుంటాయి. మైళ్ళు మైళ్ళు చెట్లే వుండవు. కొంతమేర యిసికనేల; కొంతదూరం రకరకాల రాళ్ళు. అంతా రాళ్ళమయం. కాసేపు గడ్డి నేల మీద తివాసి పరిచినట్లు చిత్రమయిన గడ్డి; తమాషా మొక్కలు. ఆ యిళ్ళు మరీ విచిత్రంగా ఉంటాయి. మూడు రాతిబండలు, మూడు గోడలు, పైన మరో రాయి. అదే యిల్లు. కొన్ని రాళ్ళల్లో దొలిచిన గుహలు, కప్పుగా వేసిన రాతిలో కన్నం వుంటుంది. అందులోనుండి సూర్యరశ్మి సోకితేతప్ప వెలుతురు లేదు. కాలవ, పిల్ల కాలవ, చెరువు, నుయ్యి ఏమీ కనపడవు.

ఆవులు, గేదెలు, గొర్రెలు, ఆ కొండ గుహలలో సత్యాన్ని అన్వేషించే వేదాంతులులా సంచారం చేస్తాయి. ఏ రాతి ప్రక్కనుంచో గాడిద దర్శనం ఇచ్చి, భయపడి పారిపోతుంది. ఎక్కడో నల్లకుక్క కుంటుకుంటూ కదిలిపోతుంది. వాటి యాత్రకి ముగింపులేదు. ఉండి వుండి అన్ని ఆకులూ వూడిపోయి, మొండి కొమ్మలచెట్టు కొమ్మల్ని చాచి అస్థిపంజరం ప్రదర్శిస్తుంది. ఆ చెట్లకి ఆకులే వుండవేమో! ఆకాశంలో గద్దలు యీ ప్రకృతి సంపదకి గస్తీ తిరుగుతుంటాయి. కాకులు, నల్లగోరువంకలు తరుముకుంటూ ఎగురుతాయి. వెళ్ళగా వెళ్ళగా ఎక్కడో ఒక నుయ్యి వుంటుంది. దానికి వరలుండవు; అది మనుషులకక్కరలేదు. చచ్చిపోయిన మనుషులే దానికి కావాలేమో! అవతల ప్రపంచంలో వాళ్ళు అందులో నీళ్ళు సులభంగా తోడుకోవచ్చు. ఆ స్థలంలో సూర్యుడు తీక్షణంగా ప్రకాశించలేడు. ఆ రాళ్ళ వెనక సూర్యాస్తమయం చూస్తే ఏడవాలనిపిస్తుంది.

ఎక్కడా మనుషులే కనబడరు. అది వూరు, నాలుగిళ్ళు – పది గొర్రెలు–మూడావులు–రెండు కోళ్ళు. ఒక ముసలది యెండలో కూర్చుని ఏదో చేస్తుంటుంది. నల్లటిచీర – ఒంటికి చాలదు: సంచుల్లా వేళ్ళాడే చేతులు – తెల్లబడగా మిగిలిన జుట్టు, మూసుకుపోయిన కళ్ళు, విప్పుకొన్న పెదవులు, ఒంగిన నడుం – ఆమె కూడా మనిషి సంతతే. ముసలివాడు రాళ్ళు కొడుతున్నాడు,

కట్టెలు కొడుతున్నాడు. మోకాళ్ళ పైకి పంచి; నల్లటి మొలతాడు; దుమ్ము రంగు పాగా, ఎక్కడా వార్ధక్యమే గాని యవ్వనం లేదు. ఆ మనుషులకి యవ్వనదశే వున్నట్లు తోచదు. రాళ్ళల్లో ఆడుకుంటూ ఆల్చిప్పల్ని ఏరుకుంటున్న కుర్రాళ్ళు కూడా ముసలి నవ్వులు నవ్వుతారు. వాళ్ళ మొహాలలో సంతోషం, చైతన్యం, యవ్వనం, వుత్సాహం ఏమీలేవు. క్షామదేవత సంతానం. ఆకలిదప్పులు, "నన్ను చూడండి" అంటూ వారి స్వరూపాలు దాల్చి పుట్టి చస్తున్నాయి. ఆ ప్రదేశములో ఆ స్థలాలతో మనుషులకి నిమిత్తంలేదు, దైవానికే తప్ప. అక్కడుండే మనుషులు కూడా ఆ స్థలంలోని వారే. వారికి వేరే వునికి, వ్యక్తిత్వం లేదు. అన్నీ రాళ్ళు, వారు కదిలే రాళ్ళు; నిజంగా అది రాయలసీమ కాదు; ఎవరో అన్నట్లు రాళ్ళసీమే!

నిధికి, అనంతచార్యులుగారితో మొదట మునిమాడుగులో పరిచయం కలిగింది. ఆయన పెద్ద కూతురు లక్ష్మీదేవికి జబ్బు చేసిందంటే చూడ్డానికి ఒచ్చాడు. ప్లేగ్ అని తెలియగానే ఆమె మామగారు, భర్త వేరే చోటికి వెళ్ళిపోయారు. తండ్రి ఒచ్చిన రెండు రోజులకే నాలుగు సంవత్సరాలు వయస్సుగల కూతురు యీ ఘోర వ్యాధికి గురియై చనిపోయింది. రాత్రి ఎనిమిదింటికి నిధి, అనంతాచారిగారు ఆ పిల్లని పూడ్చి ఒచ్చేశారు. రాత్రంతా తల్లిని వోదార్చటంలో గడిచింది. రాత్రికి రాత్రి, యిద్దరు కూలీలను తీసుకువెళ్ళి నిధి, రెండు మైళ్ళదూరంలో ఒక పాక లాంటిది వేయించి, తెల్లవారేదాకా ముగ్గురూ అక్కడే గడిపారు. తరువాత నాలుగు రోజులకి లక్ష్మీదేవి భర్త వొచ్చి ఆమెని కర్నూలు తీసుకు వెళ్ళాడు.

అనంతాచార్లుగారిది అనంతపురం జిల్లాలో వజ్రకరూర్‌కి ఆరుమైళ్ళ దూరంలో వున్న న్యాయంపల్లి* అనే గ్రామం. కాంగ్రెస్‌లో చేరి ఎంతో సేవచేసి చుట్టుపక్కల పేరు, పలుకుబడి గలవాడు. ఇటీవల సంచారం తగ్గించి స్వంత పనులు, వ్యవసాయము చూసుకుంటున్నాడు. రాత్రిళ్ళు పురాణకాలక్షేపంచేస్తూ నిశ్చింతగా గడుపుతాడు.

ఆయనది చాలా పెద్ద కుటుంబం. అయినా; భార్యా, నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిల్లు చేశాడు. కాత్యాయని, రాధ పెళ్ళికున్నారు. రాధ ఆఖరిది చిన్నపిల్ల. కాత్యాయనికి పదిహేనోయేడు వచ్చింది. పెద్ద పిల్లవాడు రాఘవుడు, ఇంజనీరింగ్ చదువుతున్నాడు. కడం ఇద్దరూ స్కూల్లో చదువుతున్నారు.

స్థితిపరుడు కాకపోయినా, ఆయన కుటుంబం గుంభనంగా, లోటులేకుండా ఎట్లా గడిచిపోతోందో చాలా మందికి తెలీదు. ప్రజాసేవకుడనీ, పండితుడనీ తాలూకాలో పెద్దమనుషులందరూ ఆయనకేదో యింత ముట్టచెబుతుంటారు.

ఆయన అన్నగారు బళ్ళారిలో పెద్ద వకీలు. కాని వారికీ వీరికీ సంబంధాలు లేవు. అనంతాచారిగారు జైల్లో వున్న ఏడాది చుట్టు పక్కల స్నేహితులు ఆదుకున్నారు కాని, అన్నగారేమీ సహాయపడినట్లు లేదు. ఐనా అన్నగారింట్లో ఏ కార్యం వచ్చినా, ఎవరికి జబ్బు చేసినా, యీయన వెళ్ళి తగినంత సాయంచేసి ఒస్తుంటాడు. ఆయన భార్య రాజమ్మగారి కిదంతా నచ్చకపోయినా, యీ విషయం తేల్చకుండా, భర్తకి

---

* న్యాయంపల్లి వూహించిన గ్రామం.

చాలా అనుకూలంగా వుంటూ, సంసారం గౌరవంగా దిద్దుకుంటుంది. ఆవిడకి యిల్లే ప్రపంచం.

అనంతాచార్లుగారు నిధిని తనతో వచ్చేయ్యమన్నాడు. ఆ జిల్లాలో డాక్టర్ల అవసరం ఎంతో వుందనీ, తన భుక్తికి ఏమీ లోటు ఉండదనీ, తన శ్రేయస్సు కోరేవాళ్ళు స్వంత స్థలంలో ఎవ్వరూ లేనందున అతను యిక్కడే వుండటం మంచిదనీ నచ్చచెప్పి, నిధిని ఒప్పించారు. అనంతాచార్లుగారే కర్నూలు వెళ్ళి పెద్ద కూతుర్ని తీసుకుని నిధితో కలిసి వారం రోజుల్లో న్యాయంపల్లి వచ్చేశారు.

అప్పటికప్పుడే ఆ తాలూకాలో కూడా కలరా పాకింది. అనంతాచారిగారు నిధికి ఓ సైకిల్ సంపాదించి పెట్టారు. దానికి బాగ్ తగిలించుకుని నిధి మళ్ళా పల్లె పల్లెకి తిరిగి పని చెయ్యడం సాగించాడు. ఒక్కొక్క సమయంలో రాత్రిళ్ళు భోజనం లేకుండానే, ఏ పాడుబడిన గుడిలోనో, పేషంట్లతోనో గడపడం జరిగేది. గుడికి దూరంగానే దేవుడి సమక్షాన ఎన్ని శవాలని తగులబెట్టాడో!

ఇరవై రోజుల్లో పరిస్థితులు బాగుపడ్డాయి, నిధికి తిరగడం తప్పింది. అనంతాచారిగారింట్లో ముందు గదిచ్చారు. ఇల్లు అంత పెద్దది కాదు. దొడ్డి మాత్రం చాలా పెద్దది. ఇంటివెనకాల అంతా బైలే.

ముందుగదిలో ఒక పురాతనపు ఈజీ చైరూ, పుస్తకాల బీరువా వున్నాయి. గది చిందరవందరగా వుంటుంది. బీరువాలో పురాణ గ్రంథాలు – రామాయణం, భాగవతం, భగవద్గీత, భట్టి విక్రమార్కుని కథలు, కాంగ్రెసు కార్యక్రమానికి సంబంధించిన గ్రంథాలు ఉన్నాయి. ఉదయం ఇంత కాఫీ తాగటం, సైకిల్ మీద వజ్రకరూరో, చుట్టుప్రక్కల పల్లెకో వెళ్ళి, పేషెంట్లని చూడటం; మధ్యాహ్నం భోజనం, నిద్ర; సాయంత్రం మళ్ళా పనిమీద వెళ్ళటం, రాత్రి పురాణ కాలక్షేపం, లేకపోతే రామాయణాన్ని పఠించటం – యిదీ అతని దినచర్య.

ఒకరోజున దొడ్లో స్నానానికని, వంటింట్లోంచి వెళ్ళబోయ్యాడు నిధి. అనంతాచార్లుగారి రెండో కుర్రాడు శేషు అట్లా వెళ్ళకూడదని చెప్పి, వేరే గదిలోంచి దొడ్లోకి తీసుకెళ్ళాడు. భోజనం కూడా యితనికి ఇవతల గదిలోనే పెడుతున్నారు. ఇతను అనంతాచార్లుగారితో వాదించటం, ఆయన భార్య రాజమ్మని కూకలెయ్యడం జరిగింది. ఇతన్ని వంటింట్లోంచి వెళ్ళనిస్తున్నారు. కాని భోజనం మాత్రం వేరేనే పెడుతున్నారు.

ఇంతలో రెండో అమ్మాయి మాధవి పురిటికొచ్చింది. మాధవి భర్తకి సికింద్రాబాద్‌లో పుగాకు పరిశోధనాలయంలో పని. ఆ అమ్మాయి నెత్తిమీద ముసుగేసుకుంటుంది. ముఖమల్ జోళ్ళుతో కాని ఇంట్లో నడువదు. ఒకటి రెండురోజులు తల్లీ, ఆమే ఘర్షణ పడ్డారు. జోళ్ళు తీసేసింది. కాని ముసుగు తియ్యలేదు. రాజమ్మగారు నచ్చజెపితే, కొంతవరకు అంగీకరించి, "వూఁ" అనే రకంకాని, మొండి పట్టుదల మనిషి కాదు. పూర్తిగా వొప్పుకోకుండా సగం సగం అంగీకరిస్తుంది.

మాధవితో కూడా, కొడుకు "గోపు", బంట్రోతు రెహమాన్, అడబడుచు అండాళమ్మ కూడా వున్నారు. ఎవరికో ఏదో జబ్బు చేస్తూనే వుండేది. నిధి

వారికి మందులిస్తూనే వుంటాడు. బళ్ళారి వెళ్ళి వొంద రూపాయల మందులు తీసుకొస్తానని వారం రోజులు బళ్ళారి వెళ్ళివచ్చాడు నిధి.

క్రితం రాత్రే మాధవి ప్రసవించి ఆడపిల్లని కంది. పురిటిమంచం ముందుగదిలో ఏర్పాటు చేశారు. అనంతాచార్లుగారితో చెప్పి దొడ్లో దూరంగా – అంటే ఫర్లాంగు దూరంలో – మొండిచెట్టుకింద రాళ్ళు పరిపించి, నాలుగు కర్రలు నాలుగు మూల్లా పాతించి, తాటాకూ పూరిగడ్డి వేయించి, చిన్న కుటీరం లాంటిది నిధి ఏర్పాటు చేయించుకున్నాడు. ఆ కుటీరానికి "శాంతి" అని పేరు పెట్టుగుని, తన హోల్డాలు, బేగ్, వో బల్ల, కుర్చీ, రెండు పొడుగాటి నేలమట్టం బల్లలపైన పక్కా, అందులో వేయించుకున్నాడు. అందులో ఒంటిగా వుంటూ భోజనానికీ, కబుర్లకీ అనంతచారిగారింటికెడుతూ కాలం వెళ్ళబుచ్చుకుండేవాడు.

ఒక రాత్రి భోజనంచేసి దొడ్లో చెయ్యి కడుక్కుంటూంటే రాజమ్మ గారికి తేలు కుట్టింది. ఆ చెంబు గిరవాటెట్టి "బాబోయ్ – మండ్రగబ్బ"ని కేకేసి వంటింట్లో పడుకుని ఏడవడం సాగించింది.

దూడలు కాసే కుర్రాడు పిలవగానే నిధి తన లాంతరు, బేగు తీసుకుని చక్కా వచ్చాడు. ఈలోగా అనంతాచారిగారు దొడ్డంతా దీపం తీసుకుని వెదికి, "అసలు తేలే లేదు. ఏ గండుచీమో, దానికింత గొడవేమి"టని భార్యని కేకలేస్తున్నాడు.

రాజమ్మగారు, మొగుణ్ణి కసురుకుని భోరున ఏడవడం సాగించింది. ఆమె చుట్టూ ఆఖరు కుర్రాడు రంగడు, కాత్యాయని, రాధ మూగి చూస్తున్నారు.

హాల్లో నిధి నుంచుని, "లోపలికి రమ్మంటారా?" అని అడిగాడు.

రాజమ్మగారు తెరిపి చేసుకుని నవ్వి, "దబ్బుని మందీ నాయనా, మండ్రగబ్బే!" అన్నది.

నిధి వంటింట్లో కెళ్ళి నెప్పి కనబడకుండా ఇంజక్షనిచ్చాడు.

ఈలోగా హనుమంతప్ప మంత్రగాణ్ణి తీసుకొచ్చాడు. వాడు మంత్రం వేశాడు. రాజమ్మ తెల్లారగట్ట నాలుగింటిదాకా బాధపడుతూ మూలుగుతూనే వుంది.

అందరూ మెల్లి మెల్లిగా పక్కలమీద ఒరిగారు. అనంతాచార్లుగారు ముందువాలో ముసుగుతన్ని పడుకున్నారు. పిల్లలంతా పడుకున్నారు. నిధి మాత్రం ఆవిడ పక్కనే పత్రిక చదువుతూ, వోదారుస్తూ తెల్లవార్లూ జాగారం చేశాడు. మూడింటికి రహమాన్, తనో తేళ్ళ కుటుంబాన్ని రోడ్డుపక్కన బండకింద సాయంత్రం చూశానన్నాడు.

నిధి అతనితో ఈ విషయం ఎవ్వరితోనూ చెప్పొద్దని, రహమాన్‌తో కలిసి వెళ్ళి, వో పెద్ద చూడుతున్న తేలుని తీసుకొచ్చి దొడ్లో రాజమ్మ గారు చెయ్యి కడుక్కున్న చోటున పడేయించి నాలుగింటికి దీపంతో దొడ్డంతా వెదికి తేలుని పట్టుకున్నట్లు అభినయించి, ఆ తేలుని చంపి, రాజమ్మగారికి చూపించాడు. అది మండ్రగబ్బ కాకపోయినా ఆ జాతిదే అని ఆవిడతో చెప్పాడు. దాన్ని చూసిం తర్వాత ఆవిడ బాధంతా తగ్గి, మూలగడం మానేసి, నిధిని మెచ్చుగుని, భర్తని కాసేపు పణిగి నిద్రపోయింది.

ఐదు గంటలవుతోంది. నిధి దొడ్లో గేదెని పాలు పితకడానికెళ్ళాడు. అది సరిగ్గా నిలబడటంలేదు.

ఇంతలో "నెప్పి తగ్గిందా అమ్మా?" అంటూ కాత్యాయని లేచింది. అమ్మ మాట్లాడలేదు. దొడ్లో నిధి గేదెతో పడుతున్న అవస్థ చూసి, దొడ్లో కొచ్చి, గేదెని పలుపుతో పట్టుకొని నిలబెట్టింది. అతను పాలు పితికాడు.

గబగబా వంటింట్లోకి పరుగెట్టి, కాత్యాయని కుంపటి ముట్టించి పాలు కాచి కాఫీ తయారుచేసింది. నిధి రాజమ్మగార్ని లేపాడు. ఆవిడ మొహం కడుక్కుని, "మా నాయనే – ఎంత మంచి కాఫీ!" అని నిధిని మెచ్చుగుంటూ మళ్ళా నిద్రపోయింది. ఇది జరిగిం తర్వాత ఇంట్లో అందరి వైఖరీ మారింది. అందరూ నిధిని ఎంతో ఆప్యాయంగా వారింట్లోవాడిలా చూడటం మొదలెట్టారు.

నిధి, తన పెళ్ళి విషయం రాజమ్మగారితో చెప్పక తప్పిందికాదు. ఆవిడ జాలిపడింది. తను వెళ్ళి తీసుకొస్తానంది. వాళ్ళింట్లోనే కాపరం పెట్టొచ్చునంది. ఇతను నవ్వి వూరుకున్నాడు. అప్పుడప్పుడు నిధి, అనంతాచార్లుగారితో కలిసి గ్రామ పర్యటనం చేసేవాడు. ఆచార్లుగారు సభలలో ప్రసంగించేవాడు. రాత్రుళ్ళు పురాణ కాలక్షేపం చేసేవాడు. కొన్ని సభలలో నిధికూడా వుపన్యసించేవాడు. వీరిని ఎంతోమంది గౌరవించేవారు. చాలామంది స్నేహితులయ్యారు. కొంతకాలం వజ్రకరూర్‌లో వుచిత చికిత్సాలయం పెట్టించడానికి డబ్బు పోగుచెయ్యడంలో జరిగిపొయ్యింది. రాజకీయ రంగంలో ప్రవేశించిన రాజభూషణం, ఆంధ్ర రాష్ట్రం విషయం రాయలసీమలో ప్రచారం చేసే జట్టుతో వొచ్చాడు. నిధి ఎక్కడున్నదీ తెలుసుకుని, అక్కడికొచ్చాడు రాజభూషణం. ఉదయం తొమ్మిది గంటలైంది. అనంతాచార్లుగారు ఏదో వూరెళ్ళాడు. అతనితో రాజమ్మగారే మాట్లాడింది. దూరంగా వున్న పాకలో వుంటాడు, అక్కడి కెళ్ళండంది.

పాకలో నిధి కాళ్ళు స్తంభానికి ఆనించి పడక కుర్చీలో కూర్చున్నాడు. పక్కనే బల్లమీద కూర్చుని కాత్యాయని మందుగ్లాసులు అవీ సర్దుతోంది. మరో పక్కన రంగడు గోలీలాడుతున్నాడు. రాజభూషణం రాగానే కాత్యాయని వెళ్ళిపోయింది.

అనంతాచార్లుగారి కుటుంబం అందరిలోకి బొత్తిగా ఎవరితోనూ మాట్లాడని పిల్ల కాత్యాయని ఇంట్లో ఎప్పుడూ ఏదో పనిజేస్తూనే వుంటుంది గాని, చురుకుగా, చలాకీగా వుండదు. పెళ్ళికాలేదని బెంగని వాళ్ళమ్మ అంటే, రెండురోజులు ఎవ్వరికీ కనబడకుండా, ఏడుస్తూ కూర్చుంది. రాజమ్మగారిని మొగుడు కూకలేశాడు.

నలుగురాడపిల్లల్లోకి కాత్యాయని చక్కందనీ, మంచి మొగుడు వొచ్చి, వాళ్ళ యత్నం లేకుండానే పెండ్లి చేసుకుపోతాడనే, రాజమ్మగారి ధైర్యంమీద అనంతాచార్లుగారు, వివాహయత్నాలు గట్టిగా చెయ్యడంలేదు.

కాత్యాయని లక్ష్మీదేవంత ఎరుపు కాదు. రాధంత నలుపూ కాదు. మధ్యరకం ఛాయ. తల్లిదండ్రులలోని ఆకారాలని మినహాయించి, అందమైన లక్షణాలు కాత్యాయనిలో వున్నాయి. రాజమ్మగారి నల్లగా మెరిసే జుట్టూ, విశాలమైన గుండ్రని బుగ్గలూ, అనంతాచారిగారి "నిమీలిత" నేత్రాలూ, ఎర్రటి చిన్నినోరూ, అన్నీ వచ్చాయి. కాత్యాయని పైపన్ను నోటి చివరిది వూడింది, మాట్లాడినప్పుడు అది కనబడదు.

నవ్వినప్పుడు కనిపిస్తుంది, కాని కాత్యాయని ఎప్పుడోకాని నవ్వదు. "ఈ లోకంలో ఎందుకు పుట్టాంరా బాబూ!" అనుకొన్నట్లు దీనంగా వుంటుంది.

తండ్రి సంస్కృతం చెప్పాడు. లక్ష్మీదేవమ్మ పోరితే ఒక మేష్టార్ని పెట్టి హిందీ చెప్పించాడు. ఇప్పుడు వీలున్నప్పుడల్లా నిధి ఆమెకి ఇంగ్లీషు నేర్పుతున్నాడు. కాత్యాయనికి పాఠం చెప్పడం చాలా కష్టం. ప్రశ్నకు సమాధానం చెప్పదు. తెలిసిందా? అని అడిగితే తల వూపుతుంది.

ఇంట్లోనుంచి కప్పులో కాఫీ తీసుకొచ్చి బల్లమీద పెట్టింది. రంగణ్ణి కేకేసి చెవులో ఏదో చెప్పింది. రంగడు వొచ్చి రాజభూషణాన్ని "ఏమండీ, మీరు సజ్జరొట్టె తింటారా?" అని అడిగాడు.

"మరి గత్యంతరంలేదు; గుర్రాల తిండితప్ప ఏదో వొకటి–" అంటూ నవ్వాడు రాజభూషణం. అక్కడున్న వారెవ్వరూ యిందులోని స్వారస్యాన్ని గుర్తించినట్లులేరు. కాత్యాయని యింట్లోకెళ్ళి, రెండు సజ్జరొట్టెలు తీసుకొచ్చిచ్చి మళ్ళా వెళ్ళిపోయింది.

"ఐతే భాయీ, యీ తిలోత్తమ మూగదా ఏమిటి కర్మ" అని అడిగాడు రాజభూషణం.

"కాదు, కాదు, సిగ్గు."

"సో, అవివాహిత అన్నమాట. ఇహనేం! ఇక్కడ నీ కన్ని ఏర్పాట్లు బాగున్నాయి కనుకనే, నాగరికతని వదిలేసి ఆశ్రమవాసంలో వున్నావు."

"నువ్వలా అనడం నాకిష్టంలేదు రాజా! ఇక్కడమాత్రం నాగరికత లేదా? వీరుమాత్రం మనుషులు కారా?"

"ఇక్కడవుండి, వీళ్ళ వుప్పు తింటున్నావు కాబట్టి, నువ్వు అల్లా వెనకేసుకొని రావడం సమంజసమే – కాని, యిది నాగరికత అనుకోవడం ఆత్మవంచన. వీళ్ళకి వో సంస్కారమూ, వో భాషా, వో కళా – వెనక కృష్ణదేవరాయల టైంలో గొప్పగా బ్రతికామన్న డాబులుతప్ప? వీళ్ళు నిజంగా అడవి మనుషులే! నువ్వెల్లా వుండగలుగుతున్నావో ఆశ్చర్యమే" అన్నాడు రాజా.

"ఇప్పుడేగా, కాత్యాయని చూసి తిలోత్తమ అన్నావు. ఇంతలో ఆవిడ మనిషైపోయిందా?" అన్నాడు నిధి నవ్వుతూ.

"అడవిలో అడవి పుష్పం వుండొచ్చుగా?"

"నీకు రాయలసీమంటే అల్లాటి అభిప్రాయం వున్నప్పుడు, ఇక్కడ ప్రచారం చెయ్యడం ఎందుకు?"

"ఏదో పదిమందితోనూ కలిసి ఒచ్చాను. కాని, నాకు నిజంగా నమ్మకంలేదు. మేం సర్కారువోళ్ళతో కలవం మొర్రో అంటున్నారు. కాని, నా అభిప్రాయం వాళ్ళు కలవకుండా వేరే వుంటేనే మంచిదని. మనతో కలిస్తే, వాళ్ళని మనతో సమానంగా చెయ్యాలంటే, మూడు పుష్కరాలేనా పడుతుంది."

"పోనీ, వాళ్ళని నీతో సమానంగా చేసింతర్వాతనే, ఆంధ్రరాష్ట్రం కావాలను. చిన్న తమ్ముడు చదువుకోలేదు కాబట్టి, ఆస్తిలో వాడికి వాటా ఒద్దనా నీ వాదన?"

"ఆంధ్రరాష్ట్రం ఒస్తేగాని ఈ ఆశయాలు నెరవేరవు అనేగా ఈ గంద్రగోళం" అన్నాడు రాజా.

"ఈ ఆశయాలు నెరవేరకపోతే రాష్ట్రం రాదు. రాష్ట్రం రాకపోతే ఈ ఆశయాలు నెరవేరవు. ఎలాగో ముందు రాష్ట్రం రావాలని నీ వాదం. ముందు ఈ ఆశయం కొనసాగాలని నా సంకల్పం."

"ఐతే దీనికి నువ్వు చేసే కృషి ఏమిటో తెలుసుకోవచ్చా? ప్రక్కన ఇన్‌స్పిరేషన్ వుందిగాబట్టి, నువ్వు కృషిచేస్తే చెయ్యనూవచ్చు" అని రాజభూషణం బిగ్గరగా నవ్వాడు.

"తను 'పని' యిది అనుకోకుండా, నిశ్శబ్దంగా పనిచేసేవాళ్ళవల్లే, ప్రపంచం అసలు కదులుతోంది – దానిమాట అల్లావుంచి, నువ్వు కాత్యాయని నుద్దేశించి అలా హేళన చెయ్యడం నాకిష్టంలేదు."

"హేళన కాదు, నేను నిజంగా అంటున్నాను. ఇన్‌స్పిరేషన్ లేకపోతే నువ్వు పనిచెయ్యలేవు – ఉంటే చప్పుడు కాకుండా, నువ్వన్నట్లు నిశ్శబ్దంగా చేసేస్తావు – సుశీల విషయంలో నువ్వుచేసిన కృషి–"

"ఫూల్–నోర్ముయ్!" అంటూ నిధి స్తంభానికానించిన కాళ్ళను దించి, బలహీనంగా లేచి మంచున్నాడు.

"ఏం, కొడతావా ఏమిటి?" అంటూ రాజా ఒకడుగు వెనక్కి వేశాడు.

"ఈ ధోరణిలో మాట్లాడితే తప్పకుండా కొడతాను."

"అవును, నిజం చెబితే ఎవరు సహిస్తారు? కాని స్నేహితుడ్ని కాబట్టి చెబుతున్నాను. నిన్ను గురించిన యదార్థం నువ్వు తెలుసుకోవడం అవసరమేరా! నీకు వివాహం జరిగిందన్న సంగతి యిక్కడి వాళ్ళకు తెలుసా?"

"తెలుసు."

"సుశీల, నాగమణి, కోమలి, అమృతం, ఇందిర – యిప్పుడు కాత్యాయని."

"గెట్ ఔట్! నో, వెళ్ళిపో–"

"వెళ్ళిపోతాను. సత్యాన్ని నువ్వు దాచలేవు..."

"పో..."

"సత్యం ప్రపంచానికి నోరిప్పి చాటుతుంది. ప్రపంచం నమ్మకపోతే, తనే నీ పీక పిసుకుతుంది" అంటూ, రాజా తొందరగా నడిచి వెళ్ళిపొయ్యాడు. నిధి నీరసంతో మూలుగుతూ కుర్చీలో వాలిపొయ్యాడు.

మలేరియా వ్యాధినించి కొంచెం తేరుకుంటున్న మనిషిని, యీ ఘట్టం కదిపేసింది. తల పగిలిపోతోంది. అద్దంలో తన మొహం చూసుకున్నాడు దట్టంగా గడ్డం పెరిగివుంది; చేసుకోడానికి వోపికలేదు. తోకచుక్కలా రాజభూషణం తన కొత్త ప్రపంచంలోకొచ్చి నిశ్చలత్వాన్ని నాశనంచేశాడు, ఏవేవో జ్ఞాపకాలు. మెదడు అనేది లేకుండా వుంటే బాగుండును. లేకపోతే, మెదడు నెత్తిమీద వొక డిప్పలాగా వుండివుంటే, దాన్ని బైటకిలాగి వుఫ్‌మని వూది, దుమ్ముదుమ్ము తుడిచి బాగుచేసి, మళ్ళా తగిలించవచ్చుకదా! వర్తమానం తప్ప, భూతకాలం, భవిష్యత్తు వుండకూడదు. మనిషికి ఆ రెండు వర్తమానాన్ని నిరంతరం హత్య చేస్తుంటాయి. భూతకాలం తీర్పు చెబుతుంది. భవిష్యత్తు శిక్షిస్తుంది; ఆ రెండింటిని గురించి చింతించి కృశించి శల్యమై, మనిషి వర్తమానంలో ఆత్మహత్య చేసుకుంటాడు.

అల్లా గంటలు గంటలు పడుకొని, కళ్ళు తెరిచాడు. ఆకులు, గడ్డి గాలికి లేచి అతని మొహాన పడుతున్నాయి. మేఘాలు గొర్రెల మందలా పడమటి ఆకాశంలో సూర్యరశ్మిని మేస్తున్నాయి. గడ్డి బయలులాంటి రశ్మి కరిగిపోతోంది. కొండలపై మొండిబండలు కదుల్తున్నట్లున్నాయి. భూమి తపస్సుకి మెచ్చుకుని ఆకాశం సంతసించి వర్షిస్తోంది. రాళ్ళ మధ్య పడే చినుకులు మామూలు వర్షమే, బంగారపు తునకలు కావు; మధువు కాదు; క్షీరం కాదు. కాపరిలా సూర్యుడు; కిరణాల కఱ్ఱలని మేఘాలమధ్య ఝూడిస్తున్నాడు. పక్కకి తిరిగి చూశాడు. కాత్యాయని అవీ యివీ సర్దుతోంది.

"అబ్బో! పెద్ద చినుకులు" అంది ప్రకృతిని సంబోధిస్తూ.

"వానలో తడవొద్దు, నువ్వు యింటికి వెళ్ళు" అన్నాడు నిధి.

"చలి – జబ్బు చేస్తుంది లోపలికిరండి."

"ఫరవాలేదు – హాయిగా వుంది ప్రాణం."

"శాలువా తీసుకురానా?"

"ఒద్దు–"

కాత్యాయని, తువ్వాలు నెత్తిన కప్పుకుని, గబగబా లోపలికెళ్ళింది. రంగడు ఫ్లాస్కు తీసుకొచ్చి గ్లాసులో కాఫీ పోసి యిచ్చాడు.

"అమ్మ రమ్మంటోంది."

"ఫరవాలేదు. యిక్కడ బాగుందని చెప్పు."

వర్షం రాళ్ళమధ్య యిసికలో చారలు చేసుకొని, చిన్న కాలవలా పాకచుట్టూ పాకుతోంది.

"నా కో పడవ చేసి పెట్టరూ?" అన్నాడు రంగడు.

పత్రిక కాగితం చించి, రెండు పెద్ద పడవలు చేశాడు నిధి. రంగడు వాటిని నీళ్ళలో ఒదిలాడు. అవి కొంత దూరం జారి బెడ్డల మధ్య యిరుక్కున్నాయి. వర్షం నిలిచిపోయింది. మేఘాలు వేగంగా విడి పోయాయి. నీళ్ళలో స్నానానికి దిగి చలికి తట్టుకోలేక చేతులు విప్పి కదిలించినట్లు, సూర్యుడి కిరణాలు దూరంగా వ్యాపిస్తున్నాయి. కాత్యాయని యింట్లోంచి వచ్చి వో కవరు అతని కిచ్చింది. చించి చదివాడు. అది జగన్నాథం వ్రాసింది. అందులో ఒకటే విశేషం వుంది – అమృతానికి ఆరో మాసంట!

దయానిధి లేచి తొందరగా పడమటివైపుకు నడవడం మొదలెట్టాడు. సూర్యాస్తమయానికి యింకా రెండు గంటలు పడుతుంది. వర్షం వెలవగానే తలంటు పోసుకున్నట్లు సూర్యుడు పవిత్రంగా ప్రకాశిస్తున్నాడు. ఆ కాంతిలో శరీరాన్ని తడిపి – ఎండబెడితే; పాపం తొలగిపోయి పవిత్రం అవుతుంది శరీరం. ఫర్లాంగుపైన కాలిబాట సన్నగిలి రాళ్ళల్లో అంతర్ధానమైంది. గుట్టల నీడలు చల్లగా నిశ్చలంగా పడుతున్నాయి. ఇసుక కాళ్ళకింద చలితో వొణికిపోతోంది. పిచ్చి మొక్కలన్నీ సంతోషంతో సొమ్మసిల్లిపోయాయి. పక్షులు జాతి నీతిని తిరస్కరించి సూర్యుని వైపు జంటలుగా లేచిపోతున్నాయి. వేడికోసం తపిస్తూ, రాళ్ళు కూడా పడమటి దిక్కుకు దగ్గరగా జరుగుతున్నట్లున్నాయి. గిలిగింతలతో విడిపోయి ఇసుక మాయమైంది –

కాళ్ళ కింద రాళ్ళు నవ్వుతాయి; గడ్డి నిద్రలో శ్వాసలా కదులుతుంది; గుట్టలు, రాళ్ళు, పక్షులు, పురుగులు – అన్నీ సూర్యుడికేసి ప్రయాణం.

గంట నడిచాడు. కాళ్ళు తేలిపోతున్నాయి. గుండెలు బరువెక్కాయి. సగం ఆరిన నల్లరాయిమీద కూర్చున్నాడు. దూరంనుండి పసుపుపచ్చగా కనిపించింది. దగ్గరనుండి చూస్తే అది నల్లరాయే. ఊరుని, జిల్లాని, రాష్ట్రాన్ని, దేశాన్ని వొదిలి పారిపోవచ్చు; కాని తన శరీరంలోంచి ఎట్లా పారిపోగలడు?

జగన్నాథం వ్రాసిన ఉత్తరం మళ్ళా చదువుకున్నాడు. ఆరో మాసంట. కారణం అతనేనని అతని భయం. అమృతం ఏం చేస్తుంది? అమృతం భర్త అమృతాన్ని శంకిస్తాడా? భర్త విడిచిపెడితే అమృతం ఏమవుతుంది? రాజభూషణం ఏమంటాడు? సత్యం తన మాట ఎవరూ వినకపోతే, తనే అతని పీక నులుముతుంది – అన్నాడు. తన పీక తనే నులుముకున్నట్లు జరిగింది. తను ఏలూరు నుంచి వొచ్చి ఐదు మాసాలేగా అయింది? అమృతానికి ఇప్పుడు ఆరోమాసంట. సరిగ్గా ఎన్నో మాసమో ఎవరు నిర్ణయించగలరు? అమృతం అబద్ధం ఆడిందేమో! సత్యం ఎట్లా తెలుస్తుంది? అమృతానికి తన ద్వారా సంతానం కలగకపోతే, ఏమీ ప్రమాదంలేదు; సత్యం తన నోట్లోనే గుడ్డలు కుక్కుకుని చస్తుంది. అంతేనా నీతి? మంచితనం అంటే పట్టుబడని చెడ్డతనమేనా?

తను చేసిన పని మంచిదో చెడ్డదో నిర్ణయించుకోవడం ఎంతకష్టం! ఆ కార్యానికి ఫలితం చూసి ప్రకృతే విలువ కడుతుంది; సంఘం దాన్ని ఆధారం చేసుకొని నిర్ధారణ చేస్తుంది. ఐతే తన అభిప్రాయం ఏమిటి? ఆ పరిస్థితులలో, ఆ వ్యక్తులు అల్లా చేయక తప్పదు. ఏ ఇద్దరు వ్యక్తులైనా ఆ పరిస్థితులలో అల్లా చేసి తీరుతారు. "అహం," "వ్యక్తిత్వం," "స్వార్థం," "నేను అనే చైతన్యం" – అన్నిటినీ నాశనంచేసే మహత్తర అనుభవం. దానికి అతీతం ఐన వ్యక్తులు దేవతలో, మహా ఋషులో కావొచ్చు. కాని మానవులు కాలేరు. "మానవత్వం" మంచిదే. అదొక్కటే మంచేమో కూడా! దాని ఫలితంతో నిమిత్తం ఎందుకు? కాని సంఘానికి ఫలితాలు కావాలి. చిహ్నాలు – బహిర్గత చిహ్నాలు కావాలి. మానవత్వం వున్నవాడు, ఆ కృత్యాన్ని సమర్థించగలడు. అది లేనివాడి విమర్శకి విలువే లేదు. ఆ విధంగా అది "మంచే" అని నిర్ణయించుకున్నాడు. సానుభూతి, ప్రేమ, నిర్మలమైన ఆనందం – ఇవి మహోజ్వలమైన విలువలు. వీటిని అనుభవం ఇవ్వగలిగింది ఇద్దరి వ్యక్తులకు. ఈ విలువలని మానవులందరూ సాధింపగలిగినప్పుడు ప్రపంచం స్వర్గతుల్యం. మానవత్వంలేని మనుషుల క్షేమంకోసం సంఘం ప్రతిపాదించిన "వివాహం" మొదలైన సంస్థలపై తిరుగుబాటుచేసి, తమ మానవత్వాన్ని ప్రకటించినప్పుడు, సాధించలేని వారు సాధించినవారిపై తీర్పు చెప్పి, శిక్ష విధించటం సమంజసమే. శిక్షార్హుల సంఖ్య అతి స్వల్పం. యుగానికి యిద్దరో ముగ్గురో, దేశానికి ఇద్దరో ముగ్గురో! తను చేసిన పని తనకు నచ్చాలి. మంచిదని స్థిరపరచుకోవాలి. అది ముఖ్యంగాని ఇతరుల కళ్ళ ద్వారా చూసి విలువకట్టి వొక కార్యాన్ని ఖండించడం, నైతిక పిరికితనం. దుర్నీతిపరుడు తన్ను తాను విమర్శిస్తాడు.

కాని ఈ ఆలోచనలు విధికి శాంతిని ఇవ్వడంలేదు. ఇవన్నీ తన ప్రవర్తనని సమర్థించడం కోసం తార్కికజ్ఞానాన్ని, భాషని, భావాలని వ్యభిచరింపచేయడంలా తోస్తోంది. "చెడిపోవడం అధునికులు తెలుసుకున్నారనుకోవడం పొరపాటు అది

అనాదినుంచి వుంటున్నదే; కాని దాన్ని సమర్థించి, వీలయితే బహిరంగంగా మెచ్చుకోవడం ఆధునికం; నేటి నాగరికత" అన్న రాధాకృష్ణన్ వాక్యాలు స్మరణకొచ్చాయి. బుద్ధి విచిత్రమైంది. మనం మంచిదనుకున్నా సమర్థించేటందుకు ఎన్నో కారణాలు వెదికిపెడుతుంది. మన ప్రవర్తనకి మన వుద్రేకాలు కారణం. వుద్రేకాలు శరీరాన్నుంచి జనిస్తాయి. ఇంతకీ మంచి చెడ్డల నిర్ణయంకూడా శరీరమే చేస్తుంది. బుద్ధి మరో ప్రపంచంలో వుదయించిన సూర్యుడిలా వృథాగా చూస్తూ కూర్చుంటుంది.

తనలోంచి తాను పారిపోలేడు. తను తన శరీరంలోనే హాయిగా కాపరం ఉండాలంటే మంచి గాలి, వెలుతురు, చోటు వుండాలి. ఇవి లేకపోతే శరీరంతో వుండలేడు, ఇవి లేనినాడు కిటికీలు మూతలుపడతాయి: మెదడు బూజుపడుతుంది. స్వప్నంలో బంధించబడిన అడవి మృగాలైనా వాంఛలు గర్జిస్తాయి. విషసర్పాలు విషం కక్కుతాయి. ఎంతకాలం అల్లా వుండటం? మరణమే శరణ్యం.

నువ్వు నీ శరీరంతో వాదించలేవు. వేదాంతం, తర్కం, నీతి – వీటితో సంఘాన్ని మెప్పించలేవు. ప్రపంచాన్ని నీ వైపుకు తిప్పకోలేవు. నువ్వు ప్రపంచంవైపు తిరగలేవు. నీకు మరణమే శరణ్యం.... అప్రయత్నంగా అతని కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. ఎన్నో జ్ఞాపకాల కారుణ్యాన్ని భరించలేని నేత్రాలు: కన్నీటిని వొదిలేశాయి. భవిష్యత్తులేని భావికాలం దాచలేకపోయిన కన్నీరు ప్రతి బిందువూ నల్లరాతిమీదపడి విడిపోతోంది. అమృతం హృదయం ఆ బిందువులలో భగ్నమైపోతోంది. మృత్యువు కూడా అంతమొందించలేని బాధ.

దూరంగా కాత్యాయని, రంగడు, గొల్ల బాయప్ప తనకేసి రావడం చూశాడు. సూర్యరశ్మికి ఎర్రగా మెరిసిపోతున్న ఎర్రచీరలో కాత్యాయని, కిరణంలాగుంది. కాలి బొటనవ్రేలితో నేలను గీస్తూ కూర్చున్నాడు నిధి. ఏదో గట్టిగా తగిలింది. బొటనవ్రేలితో యిసుకని లోతుగా కెలకడం మొదలెట్టాడు. ఏదో ఎర్రగా కనిపించింది. రంగడు రానే వొచ్చాడు. గుట్టప్రక్కన మొగ్గలేస్తున్నాడు.

"నాన్న మిమ్మల్ని యింటికి రమ్మన్నాడు" అన్నది కాత్యాయని.

"నా కోసం యింత దూరం నడిచి వొచ్చావా?"

కాత్యాయని ఏమీ మాట్లాడలేదు.

"అదేమిటి" అంటూ అతని పాదాలకింద మట్టిని ప్రక్కకుతోసి ఎర్రగా కనిపిస్తున్న రాయిని పెల్లగించడం మొదలెట్టింది. కొంచెం ఆకుపచ్చ రేఖలున్న ఎర్రటి రాయి చుట్టూ పెద్దరాయి. శ్రమపడి దాన్ని ఇద్దరూ పైకి తీశారు. సూర్యుడు కిందికి జారిపోయాడు. కడసారి కిరణాలు రాతి వెలుగుని కాత్యాయని గడ్డం కింద మెరిపించాయి. చిన్న రక్తం గడ్డకట్టిన గాయంలా, కాత్యాయని గడ్డం ఎర్రగా తళుక్కుమంది. సూర్యుడు వేట విరమించి అంబులను పొదిలో దోపుకున్నట్టు, కిరణాలు మాయమయ్యాయి.

"ఏమిటిదీ–?" వింతగా చూసింది కాత్యాయని రాయికేసి.

"కాత్యాయని!" అన్నాడు నిధి. ఆ బలహీనమైన నవ్వును ప్రకృతి తప్ప ఎవ్వరూ గమనించలేదు. రాళ్ళసీమ కూడా నవ్వగలదు. అనుకుంటూ నిధి, ఇంటికి మరలాడు. రాయిని తీసుకుని కాత్యాయని, రంగడు, బాయప్ప వెనకాల బయలుదేరారు.

★ ★ ★

# కాత్యాయని సంతతి

ఎనిమిది మాసాలు గడిచినాయి. ఎనిమిది మాసాలలో న్యాయంపల్లి న్యాయపురంగా మారింది. బొంబాయినుంచి వజ్రాల వర్తకుడు హీరాలాల్ వచ్చి, "కాత్యాయని"కి విలువకట్టాడు. "కాత్యాయని" లేత ఎరుపురంగు వజ్రం. బాగా పండిపోయిన పెద్ద ఎర్ర టొమాటో పండులాగుంటుంది. లోపల ఆకుపచ్చ తీగెలు మెరుస్తాయి. సంధ్యాసమయంలో, పాచినీళ్ళలో కనిపించే ఎర్ర మేఘంలో నీడలాంటి కాంతిగలది.

బెల్జియమ్ దొరిలియాన్ బ్లామర్ఫీ దాన్ని కోసి పదునెట్టి, వజ్రంగా తయారుచేశాడు. ముప్పైతొమ్మిది కారట్ల బరువు కట్టాడు.

న్యాయపురంలో "కాత్యాయని" తొమ్మిదిరోజులుంది. దాన్ని చూడటానికి ఎందరో జనం వచ్చి పోతుండేవారు. ఆ జనంకోసం దుకాణాలు లేచాయి. మోటార్ల మీద, బండ్లమీదా తీర్థప్రజలా వచ్చిపోతున్నారు. ఇదివరకు ఆ చుట్టుప్రక్కల దొరికిన వజ్రాలను గురించి కథలు చెప్పుకున్నారు. అక్కడి పత్రికలు ప్రాచీన వజ్రాల చరిత్రల్ని ప్రచురించాయి.

తరువాత హీరాలాల్ "కాత్యాయని"ని కొనుక్కుని తనతో బొంబాయి తీసుకు పొయ్యాడు. దాని వెలలో మూడోవంతు దయానిధి గవర్నమెంట్ కి యిచ్చివేశాడు. అక్కడ వజ్రాలగని తవ్వించాలనీ, దానికి కావల్సిన సహాయం చెయ్యాలనీ ప్రభుత్వానికి విన్నపం చేశాడు.

ఆ జిల్లాలలో ధనికులు కొందరు ధన సహాయం చెయ్యటానికి అంగీకరించారు. బొంబాయినుంచి ఇంజనీర్లు వచ్చి ఆ స్థలాన్ని పరిశోధించి వజ్రాలు లభ్యమయ్యే ఆవరణ ప్రణాళిక తయారుచేశారు.

మూడు మాసాలలో గనికి కావల్సిన పరికరాలు పైదేశాలనుంచి వచ్చాయి. చుట్టుపక్కల బీదజనానికి పని దొరికింది. నాలుగొందలమంది కూలిపని చేస్తున్నారు. వాళ్ళకి కొంచెం దూరంలో గుడిసెలు కట్టడం జరిగింది, మెకానిక్కులు, ఇంజనీర్లు వో ఇరవైమంది అక్కడే పనికి కుదిరారు.

అన్ని పనులూ అనంతాచారిగారే స్వయంగా చూసుకుంటున్నారు. ఆయన ఇంటికి డాబా వేశారు; చుట్టూ గోడపెట్టారు.

ఇదివరకు నిధికోసం ఏర్పాటు చేసిన "శాంతి" పేరుగల పాక దగ్గరలోనే నిధికోసం ఒక భవనం నిర్మాణం అయింది. ఆధునిక కట్టడపు పద్ధతులలో ప్రావీణ్యం పొందిన నిర్మాతలు దాన్ని సిద్ధం చేశారు. చుట్టూ చెట్లమొక్కలు పాతారు. ముందు, మధ్యగా ఒక ఫౌంటెన్ కట్టారు. కాని అందులోంచి నీరు రాదు. పెద్ద లోతైన నూతులుత్రవ్వి; రిజర్వాయర్లు సిద్ధం చేస్తేకాని నీటివసతి లేదన్నారు. చెఱువు త్రవ్వడం ప్రారంభమైంది.

ఈలోగా మైసూరునుంచి శిల్పి ఛాయప్ప వచ్చి నిధి తల్లిది, రాతి విగ్రహం ఒకటి తయారుచేసి ఫౌంటెన్ మధ్యలో ప్రతిష్ఠించాడు. అక్కడి కట్టడాలలో చూడదగింది ఆ శిల్పం ఒక్కటే నన్నారు. నిశ్చింతగా రోజులు గడిచిపోతున్నాయి.

రాయలసీమలో రాళ్ళు తప్ప మనుషులు లేరనుకున్న నిధి తన అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది. ఎండలో, రాళ్ళల్లో పనిచేస్తున్న ఆ మనుషుల్ని చూస్తుంటే నిధికి ఎంతో ఆనందంగా ఉండేది. నల్లగా కండలు తిరిగి, ఎండలో చెమట్లు కారుస్తూ, నీళ్ళల్లో ముంచిన నల్లరాళ్ళలా మెరిసే శరీరాలతో – ఆ మనుషులు నిజంగా మనుషులేనా? అసలు "మానవత్వం" ఎందులో వుంది? ప్రాణి కదలికలోనా? బండ పనిలోనా? కదలకుండా మెదలకుండా విశ్వాన్ని తిలకించడంలోనా? మానవుడి భాషలోనా? సృష్టిలోనా? అతనికి తెలిసింది కాదు, తెలుసుకునేందుకు అతనికి వ్యవధిలేదు. నిరర్థకమైన ఆలోచనతో కాలం – జీవితం వృథా చెయ్యకుండా ఉండడమే మానవత్వమేమో అనుకుంటుండగా, రాజమ్మగారు అట్టహాసంగా గొడుగేసుకుని కూలీలని గదమాయించే దృశ్యం చూశాడు.

వెనకాలే అనంతచార్లుగారొచ్చి భార్యని కేకలేశారు. ఎందుకో, ఏం లాభమో, ఆవిడ దర్జాగా వుండి, అందరిమీదా అధికారం చెలాయిద్దాం అనుకుంటూ వుంటుంది – ఇంతలో భర్త చక్కా వచ్చి, పరాచికాలాడో, కాస్త కోపంగా మందలించో, ఆవిడ్ని చిన్నబుచ్చుతాడు. నిధికి నవ్వొచ్చింది. వాళ్ళవి ఎంతటి నిర్మలమైన మనస్సులు! ఆరేసిన తెల్లబట్ట లాంటిది వాళ్ళ మెదడు. అనుకున్నదానికి, అన్నదానికీ – ఆలోచనకీ, మాటకీ – చేతకీ, బట్టమీద తడికీ వున్నంతటి సంపూర్ణమైన అన్వయం ఉంది. మేస్త్రీ మరియప్ప చెట్టి నవ్వు మీసాలవెనక మరుగుపడింది. ఆ మనుషులుకూడా నవ్వగలరనుకున్న తర్వాత నిధి మనస్సు మరింత నిశ్చింతగా తయారైంది.

గని తాలూకా పనులన్నీ ఆచారిగారే చూస్తున్నారు. నిధికి తను స్వయంగా చేసుకోవల్సిన పనులు బోలెడున్నాయి. అక్కడ ఒక పెద్ద డిస్పెన్సరీ, రోగుల కోసం గదులు కట్టించడం పని అతనిది. నలుగురు నర్సులనీ, నలుగురు కాంపౌండర్లనీ నియమించాడు. అక్కడికి కష్టపడి రాగలిగిన రోగులకి వుచితంగా చికిత్స ఏర్పాటుంది.

రాజమ్మగారి సలహామీద, అక్కడ ఒక బడికూడా పెట్టించాడు. ఓనమాల దగ్గరనుంచీ నేర్చుకునేటందుకు యిష్టపడ్డ నిరక్షరాస్యులున్నారు. ముగ్గురు మేష్టర్లు నియమించబడ్డారు. ఆచారిగారి రెండోవాడు శేషుకూడా రాత్రిళ్ళప్పుడు మేష్టరే! అనంతాచారిగారి పురాణ కాలక్షేపం వుండనే వుంది.

అందరికీ తీరిక లేకుండా వున్నది. నారయ్య ఆనాడే అమృతంగారి వూరునుంచి తిరిగి వచ్చాడు.

"ఇవి మీకు భద్రంగా యిమ్మన్నారండి" అని తీసుకొచ్చిన చెఱుకు గడలు, తేనెపానకం భద్రంగా మూలగదిలో వుంచాడు. నిధి నారయ్య ద్వారా అమృతానికి యివ్వవల్సిన మూడొందలూ పంపేశాడు.

"డబ్బు తీసుకుందా?" అని అడిగాడు.

"ఎందుకు తీసుకోరండీ, డబ్బు చేదా? ఆవిడ మొగుడు తీసుకున్నాడండి..."

"కాంతారావు అతని పేరు. మొగుడనకూడదు నారయ్యా భర్త!"

"మొత్తానికి మొగుడే కదటండీ!..."

"ఏమన్నాడు?"

"తీసుకుని, 'సరేలే' అన్నారండి!"

"అమృతం ఏమీ అనలేదా?"

"ఏమంటుందండి? ఆవిడ మంచంమీదనుంచి దిగరండి – రేపో మాపో పురుడు కామోల్సు. శానాసేపు నన్ను గుర్తుపట్టలేదండి– ఈ బట్టలూ, వేషం చూసి కామందనుకున్నారండి!" అంటూ నారయ్య బోసిగా నవ్వి, తన తెల్లటి బట్టలకేసి గర్వంగా చూసుకున్నాడు.

"ఈ పంచి ఆరిచ్చిందేనండి! ఇదిగోనండి వుత్తరం" అని నారయ్య వుత్తరం యిచ్చాడు.

నిధికి బోలెడు సందేహాలొచ్చాయి. అవి నారయ్యని అడగాలో, అడగకూడదో తెలిసిందికాదు. ఆ ఉత్తరం అమృతం ఎవరూ చూడనప్పుడు రాసి యిచ్చిందా, తన విషయం మాట్లాడేటప్పుడు యింకా ఎవరేనా వున్నారా మొదలైనవి.

"ఏం నారయ్యా! అక్కడనుంచి ఎప్పుడు బైలుదేరావు?"

"తెల్లరగట్ల."

"ఉత్తరం కూడా అప్పుడే యిచ్చిందా?"

"క్రితం రాత్రేనండి!"

"ఎప్పుడు రాసిందో?"

"నాకేం తెలుసుద్దండీ?"

"ఇంకా ఏమన్నారు?"

"ఏమీ అనలేదండీ– ఇక్కడ వూసులు సెప్పమన్నారండి. ఎందుకో ఆవిడా, మొగుడు వూ తెగ నవ్వులండి..."

"ఎందుకో?"

"ఏటో నాకు మాచెడ్డ తట్టుగాలేసుకొచ్చిందండి."

"చాలా హుషారుగా వున్నారండి!"

"ఊశారేనండి... ఓ. మీగళ్ళు, జున్నులు, ఎన్నవూసలు ఆరికేటండి..."

"నాతో ఏమన్నా చెప్పమందా?"

"ఆరేమీ సెప్పనేదుగానండి. అత్తగారు కాబోసు, ఒక ముసిలామె, మిమ్మల్ని ఆళ్ళవూరికి రమ్మన్నారండి. ఆద్దుగదిగో – దూడ ఇంట్లో దొరబడతా వుంది –" అంటూ నారయ్య కఱ్ఱ తీసుకుని వీధిలో కెళ్ళాడు. దయానిధి మేడమీది గదిలో కెళ్ళి, బల్లదగ్గర కూర్చుని ఉత్తరం చదవడం మొదలెట్టాడు. ఉత్తరం చదవబోతున్నాను గదా అన్న ఆలోచన ఎంతో సంతోషం యిచ్చింది. బల్లమీద అతని తల్లి ఫోటోగ్రాపు ఎదురుగుండా కనిపిస్తోంది. దాన్ని కనపడకుండా అవతలకు తిప్పివేశాడు.

"నారయ్య అన్నీ చెప్పాడు. నువ్వింత వాడవైనందుకు మా అందరికీ ఆనందంగా వున్నది. ఏదో అమాయకుడ వనుకున్నాను. రూపాయణా పైసలుతో సహా, నీకు లెక్కలు బాగానే జ్ఞాపకం ఉంటాయే! డబ్బు తిప్పి పంపించి వేశావు – యిహ వింతటితో మా జోలి అక్కర్లేదనా? ఎప్పుడైనా మా వూరు రాగలవా?

రెండు నెలలు పోయాక ఐనా నువ్వెందుకు కొస్తావులే, మాబోటి బీద ఇండ్లకి. ఎప్పుడో మేమే వస్తాము— జగన్నాథం పరీక్ష పాసయ్యాడు — పై చదువు చదవ నంటున్నాడు. వారం రోజుల్లో రావాలి. ఎప్పుడేనా ఉత్తరం ముక్క వ్రాస్తూ వుండు."

అదీ ఉత్తరం. అతను వూహించుకున్న అమృతం ఆ ఉత్తరంలో ఎక్కడా లేదు. అతనికి తెలిసిన అమృతం కూడా అందులో లేదు. డబ్బు పంపకుండా వుంటే బాగుండునేమో! ఆ డబ్బు విషయం భర్తకు తెలీనివ్వకుండా వుంచాలనుకుందేమో! రెండు నెలలు గడిచాక రమ్మంది — ఎందుకో? ఆలోగా పిల్లాడు పుడతాడు కాబోలు! పిల్లాడని ఎవరు చెప్పగలరు? పిల్ల కాకూడదూ? "మేము" "మాకు" అంటుంది. కాని "నేను" అనదేం? తనకీ లేనిపోని సంశయాలు కాని యీ ఉత్తరం ఏకాంతంగా వున్నప్పుడు రాసింది కాదేమో! అవును. తప్పకుండా అదే కారణం. ఎల్లాగైనా స్త్రీలు చాలా తెలివైనవాళ్ళు. ఎదురుగుండా చూశాడు. తల్లి ఫోటోగ్రాఫు తనకేసి చూస్తోంది — ఎవరు కదిపారు చెప్మా! ప్రక్కకి తిరిగాడు — కాత్యాయని!

"నువ్వేనా దీన్ని కదిపింది?"

ఔనన్నట్లుగా తల పంకించి, నవ్వడానికి యత్నించింది కాత్యాయని.

"ఎవరో వొచ్చారు" అన్నది — ప్రపంచానికొక సందేశం చెప్పినట్లుగా.

"ఎవరు?"

"ఏమో?"

కాసేపు నిదానించి—

"యువర్ వైఫ్" అంది ఇంగ్లీషులో. తన మాటకి తనకే నవ్వొచ్చింది. ప్రయత్నం లేకుండానే శబ్దంచేస్తూ నవ్వింది. ఊడిపోయిన పన్ను రానేలేదు.

నిధి లేచాడు. ఆమె గబగబా క్రిందికి పరుగెత్తుకుపోయింది. అతను లేచి మెట్లు దిగుతున్నాడు తొందరగా. చివరి మెట్టుమీద కూర్చునివుంది కోమలి.

అతన్ని చూసి మెట్లమీద నిలబడి, నమస్కారం చేసింది. అతను అల్లాగే నిలబడిపోయి మాట్లాడలేకపోయ్యాడు. కోమలిలో అతను చూసిన మార్పు ప్రపంచంలోని అనుభవానికొక కొలతబద్ద. గతాన్ని శరీరం అంతటా ముసుగులా కప్పుకుంది. ఛాయ తగ్గింది; మనిషి ఎత్తుగా, లావుగా అయిపోయింది. ముడినిబట్టి జడ పొడుగ్గా లేదని చెప్పవచ్చు. నడుం వెడల్పునిబట్టి అధునిక నాగరికత వైశాల్యం తెలుసుకోవచ్చు. సహజమైన ప్రకృతిలోని చెట్లను కొట్టించేసి, మొక్కలు, గడ్డి పీకించేసి; ఎవరో కార్ఖానాలు నిర్మించినట్లు వుంది. సరస్సులు, నూనె కందకాలు, పుష్పాలు, పనివాండ్ర టీ కప్పులు, ముళ్ళు, కార్మికుల సమ్మెలు, కొండలు, మిల్లు యజమానుల దురంతాలు, మేఘాలు, ఫాక్టరీల పొగ, పక్షులు, తుమ్మెదలు, కీటకాలు ఏమయ్యాయో? రొద, వాసన — మెరుగుపురుగు, ఎలక్ట్రి దీపాలు — ఈ మార్పులకి, పరిణామానికి కోమలి బహిర్గత చిహ్నం. ఆమె చూపులో ఆనాటి చాంచల్యం ఈనాడు లేకంట ప్రపంచాన్ని చూసి విసిగిపోయిన నిశ్చలత్వంతో కళ్ళు మెరుస్తున్నాయి. కనురెప్పలు, దృష్టి ఇతరుల కంటపడకుండా జైలు కడ్డీలుగా

కాపలా వేస్తున్నాయి. అత్తరు తయారుకోసం, ఏనాడో రసాన్ని, అందాన్ని పిండి పారేసిన గులాబి పుష్పం, ఆ నోరు.

"యిల్లారా" అని సంజ్ఞచేశాడు అతను, మెట్లపైకి నడుస్తూ.

కోమలి నవ్వింది - సూర్యోదయంలో వెలవెలబోతున్న నక్షత్రాల లాంటి పళ్ళను ప్రదర్శిస్తూ. మేడమీద గదిలోకొచ్చి, గుమ్మం మీద కూర్చుంది.

"యిల్లా యిల్లా" అని సోఫాకేసి చూపించాడు.

గదంతా నివ్వెరపడి చూస్తోంది.

"స్నానం చేసేవరకూ కనబడకుండా వుండాలనుకున్నా" అన్నది.

"ఏం?"

"రైలుపొగ. నిద్రలేదు. ఒళ్ళంతా ఎల్లాగో - అసయ్యంగా వుంది -"

"నీళ్ళు పెట్టించనా?" అంటూ లేచి వెళ్ళాడు.

ఈలోగా కాత్యాయని కాఫీ కప్పు, ఫలహారం తీసుకొచ్చింది. కోమలి ఆమెకేసి పరీక్షగా చూసింది.

"నీ పేరు చెప్పనా?" అంది.

కాత్యాయని నీరసంగా నవ్వింది. ఇంతలో నిధి వచ్చాడు.

"ఇందిర అనుకుంటున్నావేమిటి?"

"........."

"కాత్యాయని. అనంతాచార్లు అని యీ ఊరే - వారి మూడో అమ్మాయి."

"చెప్పమ్మా. నీ పేరేమిటే?" అంది కాత్యాయన్ని ఉద్దేశించి కోమలి.

"కాత్యాయనీదేవి-"

"అబ్బో., తమాషా పేరే - నా పేరు అడగవేం?"

కాత్యాయని అమాయకత్వాన్ని నవ్వులో దాచేసింది.

"అబ్బో, ఎంత సిగ్గో! పెళ్ళయ్యేదాకా యిదంతా" అంది కోమలి మనస్ఫూర్తిగా నవ్వుతూ.

స్నానానికని కాత్యాయని కోమల్ని కిందికి తీసుకెళ్ళింది. కోమలి బెడ్డింగ్, లెదర్ బాక్సు నారయ్య పైకి తీసుకువచ్చి, గదిలో పెట్టాడు. అందులో వో సోఫా, మంచం, రెండు కుర్చీలు వేశాడు.

"ఎవరండి ఆ వచ్చింది?" అని అడిగాడు.

"చూళ్ళేదా నువ్వు?" అన్నాడు నిధి.

"ఆడామెనంటనే - సూళ్ళా."

"చూస్తావుగా -"

అని నిధి బైటికి వెళ్ళిపొయ్యాడు. కోమల్ని గురించి అనంతాచార్లు గారితో చెప్పాలని సంకల్పం. ఏం చెప్పాలో, ఎల్లా చెప్పాలో ఆలోచించాలి. నిజంగా ఏం చెప్పాలో అతనికే తెలీడంలేదు. అసలు కోమలి ఎవరు అన్న ప్రశ్నకి యదార్థమైన సమాధానం లేదు. సంఘంలో తమ స్థానాన్నిబట్టి, కోమల్ని చూస్తే, అందరికీ తలో విధంగా తోస్తుంది. కోమల్ని ఓ గాజు బీరువాలోపెట్టి, కింద "నేనెవర్ని?" అని రాసిన కాగితం అంటించి, చూసిన వార్ని నిర్ణయించమంటే ఏం జరుగుతుంది?

జ్యోతిష్కుడు చూస్తాడు: "ఈమె చాలా కష్టాలు పడింది. నాలుగు పెద్ద గండాలు తప్పాయి. ఈ జాతకురాలికి ముందుముందు మంచిరోజులొస్తాయి. భర్తవలన ఎన్నో చిక్కులు అనుభవించినా, స్నేహితుల సహాయం వలన అన్నీ సర్దుకుంటాయి. ఈ జాతకురాలికి సంతాన యోగం లేదు" అంటాడు.

కోమలి అతనికి జాతకురాలయింది.

జీవశాస్త్రజ్ఞుడు చూసి: "ఈ ప్రాణి యితర ప్రాణులను సృష్టించలేకపోయింది. సహజమయిన మాతృత్వాన్ని తృణీకరించింది. కాబట్టి యీ రకం స్త్రీకి సంఘంలో తావులేదు. సృష్టికోసం ప్రకృతి తనకిచ్చిన సౌందర్యాన్ని స్వార్థం కోసం ఉపయోగించుకుంది. ఈ జీవికి ఆయుధం శీలంకాదు. శీలం అనే ఆయుధం స్త్రీలకి పురుషులే సమర్పించారు – వారికి స్వతహాలేదు. దాన్ని కొందరు బాగా గుట్టుగా వాడుకోటం నేర్చుకుంటారు. ఈ జీవికి ఈ సహజమయిన ఆయుధంతో నిమిత్తం లేకపోయింది. ప్రకృతి ఈమెకు సౌందర్యం యిచ్చింది. మెదడూ ఇచ్చింది; దానివల్లే యీ జీవి నిరుపయోగమైంది. నేర్చుకోవల్సిన పాఠం – తెలివైన స్త్రీలకి సౌందర్యం కూడా వుండటం సంఘ పురోగమనానికి అనర్థం" అంటాడు.

ఒక వైద్యుడు చూసి: "ఈ రోగి తన ఆరోగ్యం విషయంలో ఆలోచించుకోలేదు. శరీరం మొత్తంగా అంతా మళ్ళా మరమ్మత్తు చెయ్యాలి. బ్లడ్ టెస్టు చెయ్యాలి; మైనర్ ఆపరేషన్ చేస్తేనేగాని. పిల్లల విషయం చెప్పలేం, వైటమిన్ బి.డి.ఎ. (కాంప్లెక్స్) అన్నీ తక్కువే. Obesity is symptomatic of disturbed metapolism. Regular meals only once in the day. గాంధీగారి మందే; మరి గత్యంతరం లేదు. X-Ray రిపోర్టు రావాలి; jungled nerves అల్ ట్రావైలెట్ థిరఫీ అవసరం ఈ రోగికి" అంటాడు.

ఇద్దరు సంఘ సంస్కర్తలు చూసి ఏమనుకుంటారు?

ఒకడు: "సంఘంలో న్యాయంగా నీతిగా సంసారం చేసుకుని సుఖపడే అవకాశం వుండి కూడా యీ వ్యక్తి యీ వృత్తి చేసుకొని చివరికి యీ స్థితికొచ్చింది. సంసార సౌఖ్యానికీ, సంఘ జీవనానికి ఈ వృత్తి ఎట్లాంటి అంతరాయమో మరో నిదర్శనం ఈమెలో వుంది."

మరి ఒకడు: "పోదూ, మహా చెప్పావ్ శ్రీరంగనీతులు! అసలు వివాహం అనేదే చట్టబద్ధమైన వ్యభిచారం. అసలిది లేకపోతే 'వివాహం' అనబడే సంస్థే నిలబడదు. సంసారంలోంచి సెలవు తీసుకోకపోతే ఎవడు బ్రతకగలడు? బ్రతగలిగినా దానికేం విలువ వుంటుంది? కార్యనిర్వహణకు పూనికోని మంచితనం వృధా. ఎంతోమంది యువకుల దుర్భర జీవితాలలోకి ఈమె కాంతి కోణాలని ప్రసరింప చేసింది; అవి స్మరించుకొని జీవిస్తున్న పురుషులు ఎందరో వున్నారు. ఆంధ్రదేశంలో నిజానికి మనం యీవిడ రాతి విగ్రహం చెక్కించి పార్కులో పెట్టాలి."

ఒక కవి: "ఆనాడు చీకట్లను ఛేదించిన యీ నేత్రాలు, ఈనాడు సంఘం చీకట్లో అంధత్వం పొందాయా? సౌందర్యం యవ్వనాన్ని శాశ్వతంగా వుంచుకుంటే నేను గొంతెత్తి పాడను; పచ్చ మబ్బులో మసకగా మెదిలిన మెరుపు కాంతుల ఎర్రనీడలు కదిలిన యీ నేత్ర ద్వయం, కన్నీటిని తేనె బిందువులుగా వర్షించి

మధుర స్వప్నంలో శిలలుగా స్థిరత్వం పొందిననాడు, ఎలుగెత్తి పాడానులే. నేను అడ్డు పెట్టనులే, ఈ కన్నీటి ధారకి-"

ఇంకా ఎందరెందరో...!

"స్త్రీకి పురుషుడితోపాటు సమాన హక్కు లుండాలి. వుంటాయి ప్రజాస్వామ్యంలో. ఈమెకి కూడా రాజ్యాంగ విధానం నడిపే భారం వుంటుంది. జీవించేటందుకు ఈమెకు హక్కులున్నాయి. భావం, వాక్కు, ఆర్థిక స్వాతంత్ర్యం - మీ వోటు నా కర్పించండి-"

"నే కోరినప్పుడు మీరు ఇన్స్యూర్ చేసివుంటే ఎంత బాగుండును! Destitute woman's policy ఈపాటికి mature అవునా?"

"ఈ ముద్దాయి-"

"కొందరు ప్రేక్షకులు..."

"చదువరి అభిప్రాయం ఏమిటో?"

Libido ఇంకా స్థిరత్వం పొందలేదు. Repressions are rendered impotent unless they achieve finality though the unconscious. In this case the balance between the unconscious and conscious plans of activity - moral and physical has been disturbed to the detriment of general psychosis.

ఇట్లాంటి కోమలి తనకేమౌతుందని చెప్పగలదు? బాల్య స్నేహం అవొచ్చు. ఇంతకీ అవతలవ్యక్తుల వైఖరినిబట్టి, సమయానుకూలంగా ఏదో సమాధానం ఇవ్వచ్చు అనుకొని దయానిధి తన బంగళాకి తిరిగి వచ్చేశాడు. స్నానంచేసి కొత్తచీర కట్టుకున్న కోమల్ని గదిలో చూశాడు. ఎడం పక్క పాపిడికి దిగువగా నుదుటిమీద మచ్చను చూశాడు - యిదివరకు లేనిది. ఇది వరకటి కోమల్ని ఈమె ముందు ఊహించుకోలేక పోతున్నాడు. ఆనాటిది విచ్చుకునేటందుకు వికాసం ఒదిలేసిన మొగ్గ, ఈనాడది ఒయ్యారంగా ఒంగిపోయిన పుష్పం. రెక్కల పురుగులు, పక్షులు పుష్పాన్ని ఆస్వాదించిన గుర్తు నుదుటిమీద మచ్చ. ఈ వుపమానాన్ని మనస్సులోనించి నెట్టివేశాడు.

"ఎక్కడనుంచి రావటం?"

"నన్నా?" పరధ్యానంగా మాట్లాడుతోంది కోమలి - "నేనా? అడివిలోంచి."

"అంటే?"

"ఇప్పుడు నా మనసు నిశ్చింతగా వుంది. ఇక్కడ హాయిగా వుంది ఏమీ అడగకండి."

"పోనీ, ఏ వూళ్ళో అడివి?"

"వల్లకాట్లో అడివి - ఏట్లో అడివి -"

"ఏట్లో చేపలున్నాయా?"

"అబ్బో- చేపలు మాట మీకింకా జ్ఞాపకం వుందే - నేను చాలా మారిపోయి, అసహ్యంగా ఐపొయ్యాను కదూ?" అంది అద్దంలో చూసుకుంటూ. "మీరు ఏమీ అసలే మార్లేదు-"

"నేనిక్కడున్నానని నీకెట్లా తెలుసు?" అని అడిగాడు.

"అబ్బో! ఆ మాత్రం తెలుసుకోలేకపోతానా ఏమిటి? పేపర్లో పడింది. అక్కడంతా చెప్పుకుంటమే. మీరు గొప్పవోరయ్యారుగా–"

"అందుకని దబ్బుని తెలిసిందంటావ్?"

"చూశారా – ఇంకా చిన్నప్పటి మాట్లు పోనిచ్చుకున్నారు కాదు. మీరు ఎప్పుడు, ఎక్కడ ఎల్లా వుండేదీ అంతా నాకు వయనమే. ఉత్తరాలు రాశానా? ఇంకా మీరే మర్చిపొయ్యారు నన్ను. అవున్లెండి, నేనెందుకు జ్ఞాపకం ఉంటాను? ఉత్తరానికి జవాబు రాశారా? ఎప్పటికప్పుడు ఒద్దామని వుండేది. కాని ఏమంటారో అని భయం–"

"నీకెందుకు అంత దయ నామీద?"

"ఎందుకో, చిత్రం! రాత్రంతా మిమ్మల్ని గురించి ఆలోచించేదాన్ని నిద్రపట్టదు. ఊఁ – కలలు. ఒక్కసార్థొచ్చి కనబడిపోయారు కారు చూశావా, అనుకునేదాన్ని..."

"నాకు నువ్వెందుకు జ్ఞాపకం వుండాలి?"

"ఏమో! ఓస్. నాకు మీమీదుంటే, మీకు నామీదుండదేమిటి?"

"నీకు నామీద ఏముంది?"

"అబ్బో. చాలా చిలిపివారే! ఏమో అనుకున్నాను. అవునుగాని, ఆ రాత్రి ఒచ్చి, నన్ను చూసి వెళ్ళిపోయారంటగా – నన్ను లేపలేదేం? మొద్దు నిద్రా నేనూ – లేపితే పెళ్ళి చేసుకోమని గీక్కుతింటానని భయం కదూ మీకు? నాకెప్పుడు ఆ గొడవలేదు. అంతా అమ్మ చంపుకుతినేది–" అని జ్ఞాపకము చేసుకుంటున్నట్లుగా నవ్వింది కోమలి.

"మీ అమ్మ ఎక్కడుంది?"

"మా అమ్మకూడా జ్ఞాపకం ఉందే – ఉంది ఎక్కడో చస్తావుంది. డబ్బు పీకులాట్లు – దానికదే రంధి."

"నీకు లేనట్లు మహ" అన్నాడు.

"అట్లాగంటే నాకు కోపం ఒస్తుంది. నాకు డబ్బెందుకు? ఎవళ్ళకోసమని – అంతా అమ్మకేగా!"

మధ్యలో నిధి అందుకున్నాడు.

"అమ్మమీద అంత అపేక్ష వున్నదానవు, ఇప్పుడు అమ్మని విడిచి పెట్టి యిల్లా ఎందుకొచ్చావు?" అని సమాధానం కోసం ఎదురుచూస్తున్నాడు.

"మీ కోసమనే" అని మూతి ముందుకు చాపి కళ్ళు పెద్దవి చేసి గారంగా అన్నది.

"ఓస్, ఎన్నడూ లేంది యిప్పుడెల్లా ఒచ్చిందో?"

"నాకు మొదటినుంచి ఉండేది. కాని, ఎట్లా చెప్పాలో తెలిసేది కాదు. చిన్నతనం. రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు – అస్తమానం కలలో మీరే. మీరూ నేనూ కాలఒడ్డున కూర్చుని చేపలు పడుతున్నాంట–నన్ను మీరు కాలవలోకి గెంటారట. చీరకొంగు గిరవాటేసి బైటకి లాగండని మొత్తుకున్నానట–" ధ్యానంతో దూరంగా చూస్తూ అంటోంది.

"ఇంకా ఎవర్నెవర్ని నాకోసం ఒదిలివచ్చావో!" ఈ వాక్యంతో కోమలి సోఫాలోంచి లేచి అతని దగ్గరగా వెళ్ళి కళ్ళల్లోకి కోపంగాచూసి అటూ ఇటూ పచార్లుచేసి, మళ్ళా ఒచ్చి కూర్చుంది.

"వెనక యిట్లాగే అన్నారు. నేను మళ్ళా ఏదో అన్నాను. లెంపకాయ కొట్టారు" అని అరచేత్తో చెక్కిళ్ళు సర్దుకుంది.

హాల్లో ఎవరో మసలుతున్నట్లు అలికిడైంది. కోమలి గది తలుపులు చేరేసింది.

"నేను మహాపతివ్రతనని మీతో చెప్పడంలేదు."

"నువ్వు చెప్పనక్కర్లేదు. అయిందీ లేందీ నీ వాలకమే చెపుతోంది" అని నిధి గది తలుపులు తెరిచాడు.

"నిజం చెబితే మొగాళ్ళు సహించలేరు."

"పాపం, అనుభవం మీద తెలుసుకున్నావు." దూరంగా వున్న నారయ్యని సంబోధించి – "చూడు నారయ్యా, మేస్త్రీ వెట్టికల్ ఒచ్చాడా? ఐదు గంటలకి అతన్నీ, ఛాయప్ప శెట్టినీ యిక్కడికి తీసుకురా, తవ్వు రేపు ప్రారంభించాలి అన్నాడు."

"ఎవరండి మాట్లు?" అంటూ నారయ్య లోపలికొచ్చి తొంగి చూశాడు.

"కోమలి."

"అబ్బో, యీమెగారు మళ్ళా ఇక్కడి కొచ్చిందే? దోవ ఎవడు సెప్పాడూ అంట?"

"ఏం నారయ్యా, బాగున్నావా?"

"ఏదో నీలాగే నేను వున్నా. ఎక్కడ వుంటుంటం?" అని అడిగాడు.

"ఎక్కడేమిటి, నాకు కొంపా గోడా–"

"నాటకాలు తొక్కడం అయిందేమిటి?"

"ఏం మాట్లు నారయ్యా? నే పెద్దదాన్నయ్యాను, తెలుసా? వెనకటి కోమల్ననుకుంటున్నావా?"

"ఎన్నేళ్ళొస్తేనేం, ఆడ పోకిళ్ళేమవుతాయి?"

"ఇంటికొచ్చినవాళ్ళని, యిట్లాగేటండీ మర్యాద చెయ్యడం; ఎంత భాగ్యవంతులైతేమాత్రం?" అని నిధిని సంబోధించింది.

"ఇప్పుడు నిన్నెవరేమన్నారే వెర్రిదానా – పాతూసు లాడాను" అంటూ వెళ్ళిపొయ్యాడు నారయ్య. నిధికూడా తలుపు దగ్గరగా మూసి హాల్లోకి నడిచాడు. కోమలి మొహాన్ని చేతులమధ్య దాచుకుని, సోఫాలో పడుకుని నిశ్శబ్దంగా ఏడుపు సాగించింది.

ఆ రోజూ, మొన్నాడుకూడా అనంతాచారిగారింట్లో జనం ఒక్కరొక్కరే వచ్చి కోమల్ని వింతగా చూసిపోతున్నారు. నిధి భార్య కాదని తెలియగానే రాజమ్మగారికికూడా చూడాలని బుద్ధిపుట్టి కాత్యాయన్ని తీసుకొని చక్కా వొచ్చింది. సాయంత్రం అయిదు గంటలు దాటింది. కోమలి స్నానంచేసి, తల్లో పూలు అమర్చుకుంటూ డాబామీదకొచ్చి చుట్టుపక్కలంతా చూస్తోంది. దూరంగా కొండ వెనక దిగుతూ సూర్యుడు కోమలి మొహాన్ని ప్రమాదంగా వెలిగించి మాయమయ్యాడు. కడసారి కిరణం ఆమె తల

వెంట్రుకల అలలోంచి ఒడ్డుకు చేరుకుని వెళ్ళిపోయింది. దూరంగా డిస్పెన్సరీ దగ్గర నడుస్తున్న నిధిని చూసింది. షికారుగా ఆ వెంపుకి నడుద్దామనుకుంటోంది. ఇంతలో రాజమ్మగారు డాబామీదికే వచ్చింది.

"రండి, రండి" అంది కోమలి. చిట్టిని కేకేసి, పైకి రెండు కుర్చీలు తీసుకురమ్మంది.

రాజమ్మగారు ఒద్దంది. "నాకీ కుర్చీలు సరిపోవు, హాయిగా కిందే బాగుంటుంది."

తరువాత ఏం మాట్లాడాలో ఎవరికీ తెలీడం లేదు.

"మీ అమ్మాయి కాత్యాయని చాలా మంచిపిల్ల – నా కష్టసుఖాలు కనుక్కుంటోంది – ఇల్లా రా అమ్మా... జడేసేదా? – వుండు పూలెడతాను" అని కోమలి కాత్యాయనిని దగ్గరకి తీసుకుంది.

కాత్యాయని ముందు కోమలి ఎత్తుగా, ఠీవిగా వుంది. రాజమ్మగారి ముందు సన్నంగా నాజూకుగా వుంది. ఈ రెండూ కోమలికి కొంత చనువిచ్చాయి.

"అద్దం, దువ్వెనా తీసుకొస్తా, జడేస్తారా?" అంటూ కాత్యాయని మెట్లు దిగింది.

"నీతో మీ వాళ్ళేవరూ రాలేదా? ఒక్కదానవు ఎల్లా ప్రయాణం చేశావమ్మా!"

"నాకు నా వాళ్ళెవరూ లేరండి–"

"ఏం? మీ అమ్మా నాన్నా లేరూ? నీ విషయం నిధి మాతో ఎప్పుడూ చెప్పలేదే! – పైగా తన కెవ్వరూ బంధువులు లేరంటాడు–" అని సమాధానంకోసం ఎదురుచూసింది.

"ఎందుకు లేరండీ? బోలెడు మందున్నారు. వాళ్ళకి ఆయనంటే గిట్టదు."

"ఏం?"

"వాళ్ళకీ వాళ్ళకీ ఏదో వున్నాయి, నాకు బాగా తెలవదు."

"నీ కెల్లాంటి చుట్టరికం?"

"నాకా?" కోమలి అటూ ఇటూ చూసి, తలకాయ ఒంచుకుంది. చివరికి తెగించి చెప్పింది:

"నన్ను ఆయన పెండ్లి చేసుకుంటా నన్నారండీ!"

"అతనికి పెండ్లాం వుండగానే?"

"ఇప్పుడు కాదు, పెండ్లికాక పూర్వం అనేవారు. మేం కులం తక్కువవాళ్ళం అని, చేసుకోలేదు. అత్తారికీ ఈయనకీ చెడిపోయిందిగా!"

"మరి నీకు అయిందా పెళ్ళి?"

"నేను చేసుకోలా – ఈయనకోసం –"

రాజమ్మగారు అర్థం చేసుకుంది. ఇంతలో కాత్యాయనొచ్చింది, అద్దం, దువ్వెనా తీసుకుని. అప్పటికప్పుడే చీకట్లు కమ్ముతున్నాయి. నిర్మలమైన ఆకాశంలో చుక్కలు చక్కగా పొడుస్తున్నాయి. కాత్యాయని జడ విప్పింది. కోమలి దువ్వుతోంది. రాజమ్మగారు. "పొద్దోయింది వెడతా"నని లేచింది.

"ఈ పూట మా యింట్లో భోజనం చేద్దాం, రండి" అన్నది కాత్యాయని.

"అబ్బో, మర్యాదలన్నీ తెలుసే నీకు? నీకు మంచి మొగుడొచ్చాక, నీ ఇంటికొచ్చి తింటాలే" అంది కోమలి.

"అట్లాగైతే నే వెళ్ళిపోతానంతే."

రాజమ్మగారు కూతుర్ని లేవదీసింది. ఇద్దరూ మెట్లు దిగారు.

"మీరు రండి" అంది కోమల్ని, కాత్యాయని.

"కాసేపుండి ఒస్తాలే."

ఇద్దరూ వెళ్ళిపోయారు. కోమలి చిట్టిని కేకేసి, డాబామీదికి ఒక చాప తెప్పించి వేయించి, పడుకుంది. జడని మెలితిప్పి, దాన్ని దిండుగా పెట్టుకుంది.

ఎవరో వచ్చిన చప్పుడైంది.

"ఎవరు?"

"నేనే!"

కోమలి కూర్చుంది. పమిట గాలికి జారి, చాపమీద పరిచివుంది. "ఇట్లా కూర్చోండి" అని చాపను దులిపింది.

దయానిధి స్నానం చేసి ఒచ్చాడు, తలని తువ్వాలతో తుడుచుకుంటూ.

"దువ్వెన యిలా యియ్యి" అన్నాడు.

అందిచ్చింది. అతను దువ్వుకుంటూ మెట్లు దిగడం మొదలెట్టాడు. స్నానం చేసిన సబ్బువాసన గాలిలో క్షణం మెదిలింది.

"ఇక్కడ కూర్చుని దువ్వుకోరాదూ?" అంది కోమలి.

అతనేమీ సమాధానం చెప్పలేదు. మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

మూడు నిమిషాలు గడిచింది. కోమలికూడా మెట్లుదిగింది.

☆ ☆ ☆

దయానిధి కింద గదిలో సోఫాలో కూర్చుని ఎదురుగుండా అద్దంలో మొహం చూచుగుని తల దువ్వుకుంటున్నాడు. కోమలి వెనకాలే నిశ్శబ్దంగా వచ్చి, "చిట్టి" కలిపిన కాఫీ కప్పులో పోసి తీసుకొచ్చింది.

"ఇదుగో కాఫీ!"

అతను వెనక్కి తిరిగి చూశాడు. పెట్రోమాక్స్‌దీపం వెలుగులో కోమలి మొహం తళుక్కున మెరిసింది. అప్రయత్నంగా అతని మనస్సులో ఆరాటం బయలుదేరింది. పశ్చాత్తాపంతో దీనత్వం అలవర్చుకున్న ఆమె నేత్రాలు, అనుభవంతో పరిపూర్ణత తెచ్చుకున్న ఆమె నిండు అవయవాలు, అతన్ని పాత సౌందర్యపు చిహ్నాల స్మరణ వత్తిడి చేసి ఊపివేశాయి ఇదివరకు అతను చూడని ఒక కొత్త రీవి, ప్రపంచం పిచ్చిని చూసి వెక్కిరించకుండా నవ్వగల నిశ్చల ఔదార్యం చివరికి యథార్థమైన ప్రాచీన స్వప్నంలా గోచరించింది.

"మరి నువ్వో?"

"నేను అస్తమానూ కాఫీ తాగను. తాగితే వొళ్ళొస్తుందటగా!" అని తన పాదాలకేసి చూసుకుని, 'మీకు తెలుసు' నన్నట్లుగా నవ్వింది.

'వస్తేనేం! వయసు మళ్ళేకొద్దీ ఎన్నో మార్పులొస్తుంటాయి. ఆ మార్పులని మనం అంగీకరిస్తాం...."ఇంకా అతని వాక్యం పూర్తి కాకుండానే....

"మరి మీరు మార్లేదేం?" అన్నది.

ఎందుకు మార్లేదు? చూడు, కళ్ళకింద గీతలు, పగలుచూస్తే కనబడతాయి. తెల్లవెంట్రుకలు—ఎప్పుడూ లెక్కబెట్టలేదు."

"నిజంగా యిప్పుడే మీరు ఎంతో బాగున్నారు."

"నీకు నాలో కనిపించిన బాగు నీ మనస్సులో వున్నదేకాని నాలోది కాదు."

"అబ్బో, వేదాంతం మాట్లాడుతున్నారే" అంటూ లేచి అతనికి కప్పు అందించింది. "ఏదీ, ఎన్ని నెరిసిన వెంట్రుకలున్నాయో లెక్కపెట్ట నివ్వండి" అని పెట్రోమాక్స్ లైట్ ఎత్తుగా బల్లమీద పెట్టి, అతని జుట్టుని నిమరటం మొదలెట్టింది.

ఆమె చేతిని తన చేతితో పట్టుకుని కిందికి దించివేశాడు. దించిన చేతిని అరచేతిలో పరిచి, మెత్తగా అదిమి పరీక్షగా చూశాడు.

"ఏం, ముట్టుకోకూడదా?" అని అడిగింది.

"ఆ రోజుల్లో రాత్రి – పగలు నాకోసం తపించిపొయ్యేవారు. యిప్పుడిలాగై పొయ్యారేం? దగ్గిరుంటే తప్ప, దూరంగా వెడితే మొగాళ్ళు మారిపోతారు."

"దగ్గరున్నప్పుడు కూడా దగాచేసే శక్తి ఒక్క ఆడాళ్ళదే కాబోలు!" అన్నాడు.

"నేను మిమ్మల్ని ఏం దగా చేశాను?"

"నీకే తెలుసు."

"అబ్బ, ఎంత నొప్పించే మాటలంటారండీ!" అంటూ మూతి నొంకరజేసి, వెనక్కి జరిగి, అతని కళ్ళల్లోకి లోతుగా చూసింది. "నేనేం చేసేది? అప్పుడు నాకు ప్రేమంటే ఏమీ తెలిసేదికాదు— మిమ్మల్ని చూస్తో కూర్చుంటే చిత్రంగా వుండేది. మీరు నాతో మాట్లాడేవారే కారు— నాకేం తెలుసు?— నన్ను మీరు ఎందుకు పెండ్లి చేసుకోలేదు? ఇప్పుడంతా తల్చుకుంటే, ఏమిటోలాగా, భయమేస్తుంది."

"ఇప్పుడంతా తెలిసిపోయిందా?"

"ఓ. నాకు తెలుసు ప్రపంచం ఎల్లాంటిదో; ప్రేమంటే ఏమిటో. నా మనస్సులో ఏముందో మీకు ఎట్లా తెలుస్తుంది?" తలవొంచి, దిగులుగా అతనికేసి చూసింది. అప్రయత్నంగా చేత్తో, జడని విప్పుకుంటోంది.

"ప్రేమంటే ఎల్లాంటిదో చెప్పు"— అన్నాడు, కొంచెం నవ్వుతూ.

"నాకు చెప్పడం తెలీదు. అదొకలాగుంటుంది. మీరు వెనక అదొకలాగ చూసేవారే! ఎప్పుడూ మీరూ నేనూ కలిసి వుండాలనిపిస్తుంది. మీరు నా దగ్గరగా ఉంటే చాలు – ఇంకేమీ ఒద్దు. మీరు లేకుంటే నే బ్రతకగలనా? అమ్మో!" అని తలని అతని భుజంమీద ఆనించి కళ్ళు మూసుకుంది.

కోమలి తన చెయ్యిమీద గడ్డం అనించి సోఫా మీద ప్రక్కకి తిరిగి వొరిగింది. కిరసనాయిలు తక్కువై, పెట్రోమాక్స్ దీపం సన్నగిల్లుతోంది. దాని "షేడ్" మీద పురుగులు కొట్టుగుంటున్న చప్పుడుతప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. కోమలి కళ్ళలోంచి కన్నీరు చుక్క అతని ఎడమ మోచెయ్యిమీద పడింది – బాధతో

వేడిగా తొణికిన కన్నీరు, అతను ఆమె మొహాన్ని తన భుజంమీదనుంచి తొలగించి, లేచి, "చిట్టీ!" అని కేకేస్తూ, పెట్రోమాక్స్ దీపం తీసుకుని ముందు హాల్లోకి నడిచివెళ్లాడు.

☆ ☆ ☆

వారం గడిచింది. ఇంటిపనులని కోమలి చూసుకుంటోంది; వంట కూడా తనే స్వయంగా చేస్తోంది. దినచర్య యధావిధిగా జరిగిపోతోంది. భోజనానికి తప్ప, నిధికి పగలల్లా పనులలోనే బైట తిరగడానికి సరిపోతోంది. రాత్రిళ్ళు తనూ, నారయ్య కింద వరండాలో పడుకుంటారు. కోమలి పైన తన గదిలోనే పడుకుంటుంది; మెట్లముందు చిట్టిగాడి పక్క వుంటుంది. అప్పుడప్పుడు కాత్యాయని, రంగడు కోమలికి సాయంగా పడుకుంటారు. కోమలికి పగలు పొద్దుపోయేది కాదు. గవ్వలు, పచ్చీసు, వైకుంఠపాళి — వీట్లతో కొన్ని రోజులు కాలక్షేపం చేసేవారు. తరువాత కోమలి రెండు రాట్నాలు తెప్పించి వడకడం ప్రారంభించింది.

ఓసారి, అనంతాచారిగారింట్లో జరిగిన నాటకంలో కోమలి తనకి తెలీకుండా నాయిక ఐంది. రాజమ్మగారి కోర్కె ప్రకారం. నిధి కోమలితో కలిసి, ఆచారిగారింటికి భోజనాని కెళ్ళాడు. రాజమ్మగారు, కోమలి కొక్క దానికీ బైట ఆకులో వడ్డించి మిగతావాళ్ళకి హాల్లో పీటలు వేసింది. తనని హీనంగా చూడటానికే భోజనానికి పిలవడం అనుకుని, కోమలి విడిగా భోజనము చెయ్యనని వెళ్ళిపోయింది. అనంతాచార్లుగారు, రాజమ్మగారు వాదించుకున్నారు. ఆఖరికి రాజీ జరిగింది. ఈఒక్కసారేనా; అందరూ కలిసి కూర్చోవాలని నిర్ధారణ జరిగి, నిధిని వెళ్ళి పిల్చుకురమ్మన్నారు. కోమలి చరచరా వెళ్ళి నిధి తల్లివిగ్రహం ముందు, ఫౌంటెన్ గుట్టమీద కూర్చుంది. అక్కడి కొచ్చాడు దయానిధి.

"అందరం కలిసి తిందాం, రా!" అని ఆహ్వానించాడు.

కోమలికళ్ళు వర్షాన్ని బిగపెట్టి నిలుపుకున్న నల్లమేఘాలలా ప్రమాదంగా మెరుస్తున్నాయి—

"నేనిక్కడ ఉండటం ఇష్టం లేకపోతే వెళ్ళిపొమ్మనండి. వెళ్ళిపోతాను— అంతేకాని ఇట్లా మీ స్నేహితులతో చెప్పించి పరాభవించనక్కర్లేదు" అంది.

"నేను వాళ్ళతో నిన్ను భోజనానికి పిలిపించి పరాభవించండని చెప్పాననా నీ వూహ?" అని అడిగాడు.

"లేకపోతే వాళ్ళెందుకూ నన్ను పిలవడం? నా తమాషా అంతా తెలుసుగుని యాగీ చేద్దామనేనా?"

"వాళ్ళకెందుకుంటుంది నీ మీద పగ?"

"మీకే తెలియాలి. మీ లోటుపాట్లు తెలుసుకుని మిమ్మల్ని లోకువకడుతున్నారు వాళ్ళు. నన్ను మీరే గౌరవం చెయ్యందే, వాళ్ళెందుకు చేస్తారు? వారూ, మీరూ కలిసి అన్యోన్యంగా వుండకుండా మధ్య నేనెందుకు, వెళ్ళిపోతాలెండి!" అంటూ కోమలి చీరకొంగులో మొహాన్ని కప్పేసుకుంది.

"వాళ్ళెంత మంచివాళ్ళో నీకేం తెలుసు? బ్రాహ్మల కుటుంబాలలో ఆచారం నీకు కొత్తా? దేశం అంతా చూసినదానవు. వీళ్ళింకా నయం, నచ్చచెబితే

పరేనంటారు. నిన్ను తీసుకురమ్మన్నారుగా, లే– అందరం కలిసి తిందాం!"

"మీరెళ్ళి తినండి– నాకీపూట ఆకలిగా లేదు."

"కోపం వచ్చిందా?"

"నాకు కోపంవస్తే ఎవరికి లెక్క?"

"నేను బాధపడటం నీకిష్టమా?"

"————"

"మాట్లాడవేం?"

చీరకొంగు దించి, మసగగా నవ్వింది కోమలి.

"ఏం?"

"అమ్మో మీరు బాధపడితే నే చచ్చిపోనూ?" అంటూ గుండెమీద ఐదు వేళ్ళూ పరుచుకుంది.

"మరయితే లేచిరా–"

"లేవతీండి–" అని అతని రెండు చేతులూ దగ్గరగా లాక్కుని, మెడ వెనక్కివేసి. శరీరాన్ని వూపి లేచి నిలబడింది.

కోమలి లేవగానే, రెండు చేతులూ హొదిలేసి దులుపుకున్నాడు. కరీంసాహెబ్, కాత్యాయని దీపం పుచ్చుకొని వొచ్చారు.

"మా అమ్మ రమ్మంటూాంది" అంది కాత్యాయని.

"వొస్తున్నాం" అన్నాడు నిధి.

భోజనాలు నిశ్శబ్దంగా జరిగిపోయాయి.

ఇది జరిగింతర్వాత కోమలి బాహ్య ప్రపంచంలో కొంచెం ఉత్సాహం చూపుతూ, గని తవ్వేచోటికి, హాస్పిటల్ వేపుకీ షికారుగావెళ్ళి అవన్నీ చూస్తూ తనూ ఏదో పనిచేస్తూ వుండేది సాహసించి. మొదట్లో అందరికీ కోమలి వింతగా తోచింది. ఎడారిలో మోటారులాగా, అడవిలో సూటు వ్యక్తిలాగా, తరువాత ఆ వాతావరణంలో ఒక ముఖ్యమయిన అలంకారంలాగా కలిసిపోయింది కోమలి. ముఖ్యంగా హాస్పిటల్ వాతావరణంలో కోమలి బాగా అతికిపోయింది. రోజూ నిధితో కలిసి, రోగులందర్నీ చూసేది. టెంపరేచర్ పరీక్ష చేసేది, "చార్టు"లో గుర్తులు పెట్టేది; రోగులను నవ్వించి సంతోషపెట్టడానికి యత్నాలు చేసేది. వాళ్ళ కష్టసుఖాలన్నీ ఆదరంతో వినేది. వాళ్ళకోసం ఒక రీడింగ్ రూమ్, బోలెడు పత్రికలూ ఏర్పాటు చేయించింది. అందులోకి గ్రామఫోన్ తెప్పించింది.

తనే స్వయంగా పత్రికలూ, పుస్తకాలూ చదివి వినిపించేది. ప్రతి రోగి మంచం దగ్గిరా, వో "ఫ్లవర్ వేజ్" పెట్టించి, వాటిల్లో పూలు తనే పెట్టేది ప్రతిరోజూ. అప్పుడప్పుడు పొరుగూళ్ళనించి జనం వొచ్చి యీ దయానిధి ఆశ్రమాన్ని చూసి పోతుండేవారు. విరాళాలియ్య సంకల్పించినవారికోసం వో డబ్బీ ఏర్పాటు చేశారు. అభిప్రాయాల కోసం విజిటర్స్ బుక్ కూడా పెట్టించాడు.

ఆనాడు ఆదివారం. సాయంత్రం నాలుగయింది. నిధి పనిమీద బళ్ళారి వెళ్ళి రెండు రోజులయింది. ఆ సాయంత్రం రావాలి. పనివాండ్రకి సెలవురోజు, వాళ్ళంతా ఆ రాత్రికి జంగం కథ పెట్టించడానికి ఏర్పాట్లలో వున్నారు. అన్నీ

ఒకసారి తనిఖీచేసి రావాలన్న సంగతి జ్ఞాపకం వొచ్చి కోమలి అప్పుడే నిద్రనుంచి లేచి, మొహం కడుక్కొని, కొత్తబట్ట లేసుకుని, టీ తాగి, షికారుకి బయలుదేరబోతూంటే, "చిట్టి"గాడు "ఎవరో ఒచ్చారండీ!" అన్నాడు. గబగబా కోమలి మెట్లు దిగింది. వరండాలో కుర్చీ మీద కూర్చున్నాడు రాజభూషణం. అతన్ని చూసి తెల్లబోయి, అప్రయత్నంగా వో అడుగు వెనక్కే నిలచిపోయి, "ఎవరికోసం?" అని పలుకరించింది.

అతను ఆమెకేసి పరీక్షగా చూస్తున్నాడు.

"ఆయన ఊళ్ళోలేరు, తరువాత రండి" అంది.

"నీకిక్కడ నీళ్ళూ, తిండీ సరిపడ్డాయన్నమాట— బంతిపువ్వులా ఉన్నావు. ఐతే, నేను ఆయన కోసమే వొచ్చానని ఎందుకనుకున్నావు?" అన్నాడు రాజభూషణం.

"అవేం మాటలు?"

"ఏం, తప్పా?"

"ఇక్కడికెందుకొచ్చావు?" అని కోమలి మెట్లమీద కూర్చుని చేతులు నలుపుకుంటోంది.

"నా స్నేహితుడి కోసం వచ్చాను! నీ కోసం కాదులే."

"నాకోసం వస్తే ఏం జరుగుతుందో జ్ఞాపకం ఉండే ఉంటుందిలే."

"ఇప్పుడు కొట్టిస్తావా ఏమిటి నన్ను? కాసేపు క్రాస్ ఎగ్జామినేషన్ చెయ్యనీ. అక్కడ రాజాగారి దీపం ఆరిందికాబట్టి ఇల్లా ఒచ్చావా? దీపం ఎక్కడుంటే అక్కడికి పురుగులు చేరుకుంటాయన్నాడు వేమన్న."

"దీపం వొక్కటేకాదు, బురదలోనూ వుంటాయి దోమలు."

"చిత్రోత్తరానికి టోపీలు దించి చప్పట్లు కొడుతున్నాం" అని రాజభూషణం చప్పట్లు కొట్టాడు.

కోమలి చప్పట్లుకొట్టి "చిట్టి"ని కేకేసి, ఆచారిగారి శేషుని, కాత్యాయన్ని తను దబ్బున రమ్మంటున్నానని తీసుకురమ్మని పంపింది.

"నిజంగా తన్నిస్తావా ఏమిటి, అందర్ని రమ్మంటున్నావు?"

"గుమ్మడికాయల దొంగవు కాబట్టి, నువ్వు అల్లా అంటున్నావు."

"ఈ ఎడారిలో ఒయాసిస్‌లా కనిపించావుగాని, ఈ ప్రాణి నాలుక మీద వో టీ చుక్క పోద్దూ...."

లోపలికెళ్ళి టీ కప్పు తీసుకొచ్చి యిచ్చింది కోమలి. అతను తాగుతూ అన్నాడు, "బైదిబై, కాత్యాయనన్నావు – వెనక నే చూసిన కాత్యాయనన్న మాట. మీ నిధిగారి ప్రాణ స్నేహితురాలు. అతని హృదయ వీణకి తీగ. క్లియోపాత్రా to the fallen Antony."

"మీకెట్లా తెలుసు ఆ అమ్మాయి?"

"నేను సమాధానం చెప్పను. ఐతే, కోమలీ! ఎవళ్ళు ఎన్ని మాటలన్నా వొక్కటిమాత్రం సత్యం. ఆంధ్రదేశంలో నీ అంతటి అందమైన స్త్రీని నేనింతవరకూ చూళ్ళేదు. ఫిలిం డైరెక్టర్లు ఆత్మహత్యలు చేసుకోకపోవడం ఆశ్చర్యమే."

"ఇట్లాంటి మాటలంటే నే వూరుకోను; ఇన్నేళ్ళొచ్చాయి, నీకెప్పుడొస్తుంది బుద్ధి?"

"ఓసి పిచ్చిదానా! స్త్రీలపట్ల బుద్ధిని కోల్పోడంకంటే వేరే జ్ఞానోదయం ఎక్కడుందీ పురుషుడికి? Men become wise only when they are fooled by women."

"నువ్విలాంటి మాటలంటే వెళ్ళిపోతాను. నిధిగారి ముందు నా గొడవ ఎత్తకు సుమా!"

"ఎత్తకుండా వుంటాను. ఏమిస్తావ్? ఒక్కరాత్రి నీతో గడపనిస్తావా?"

"ఛీ, పో దుర్మార్గుడా! మీ స్నేహితుడు, నిధిగారు నన్ను ప్రేమించారు తెలుసా?"

"నిన్ను ఎవడు ప్రేమించలేదో చెప్పు?"

"నా కాయన తప్ప యింకెవరూ లేరు."

"ఓహో! నీ జీవిత గ్రంథంలో కొత్త ప్రకరణం ప్రారంభించావన్న మాట? ఆంధ్రదేశమంతా పంచుకున్న సౌందర్యంలో నాక్కూడా కాస్తంత పడెయ్యకూడదూ అని అడిగాను."

"నే నట్లాంటి వృత్తి ఎప్పుడూ చెయ్యలేదు, తెలుసా? అదే పెట్టుకుంటే లక్షలు గణిద్దును. నువ్వు బలవంతం చేస్తే ఏం జరిగిందో అప్పుడే మరిచిపొయ్యావా?"

"మరచిపోలేదు కాబట్టే వచ్చాననుకో. నేను మీ నిధిగారితో అవన్నీ చెబుతానని భయపడొద్దు" అన్నాడతను.

"చెప్పేటందుకు ఏమున్నాయ్? పాతవన్నీ వూహించుకుని బాధపడతారేమోనని భయం నాకు, అంతే!"

"అవునులే, అతని పాత గొడవలు నీకు తెలీనట్లు నటిస్తూ వుండాలి. ఉందనుకుంటే ఉందీ, లేదనుకుంటే లేదు – ఏమంటావ్?" అని కన్ను మెదిపాడు, రాజభూషణం.

"నేను మరొకరి భార్యనై ఉంటే వన్నిల్లా లోకువ కడుదువా?"

"సరే, ఆ మాటకొస్తే; నాకు భార్య లేదు, ఏటిఒడ్డున యిల్లు కడదామంటే ఇక్కడ ఏరూ లేదు" అని మరోసిగరెట్టు ముట్టించి–

"ఊరికే తమాషాకంటున్నాను కోమలీ! నువ్వేం అనుకోకు."

"తమాషా చేస్తే ఏం చేస్తానో తెలుసుగా నీకు?"

"ఏముంది? గిల్లుతావ్, రక్కుతావు – లేక కరుస్తావ్! ఆ విధంగానైనా, సినిమాలో విలన్‌లా నిన్ను తాకడం జరుగుతుందిగా? అందుకనే సినిమాలో హీరోకంటే విలన్‌వేషం కోసం జనం ఎగబడతారు."

ఇంతట్లోకే కాత్యాయని వచ్చి, యితన్ని చూసి భయపడి నిలబడిపోయింది. కోమలి ఆమె దగ్గరగా వెళ్ళి భుజంమీద చెయ్యి వేసింది.

"ఇప్పుడే వస్తాం" అంటూ ఇద్దరూ వెళ్ళిపోయారు.

రాజభూషణం ఒక్కడూ బట్టలూ, అవీ సర్దుకుని పేపర్ చదువుతూ కూర్చున్నాడు. కాసేపు చదివి తోచక బయటకొచ్చాడు. అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. దూరంగా వస్తున్న నిధినిచూసి ఎదురెళ్ళాడు. ఇద్దరూ కలుసుకుని మళ్ళా ఇంటికొచ్చారు.

"ఎలక్షన్ లొస్తున్నాయి. కాన్‌వాసింగ్‌కి బయలుదేరాను; అంటే ఉత్తచేతులతో రాలేదులే. క్షామ నిధికి విరాళాలు తీసుకునే వచ్చాను. నువ్వు సహాయం చెయ్యాలి" అన్నాడు రాజభూషణం, అతనికో సిగరెట్ ఇస్తూ.

నేను కాల్చనన్నట్టుగా సంజ్ఞ చేసి, కోటు విప్పి కూర్చున్నాడు దయానిధి.

"నీకీ జిల్లాలంటే ఇష్టంలేదుగా, ఎందుకొచ్చావు?"

"రాజకీయాలకి, నా ఇష్టాఇష్టాలకి సంబంధం ఏముంది? నా అభిప్రాయం మార్చుకోలేదు, వీళ్ళకి సంస్కారంలేదు, భాషలేదు, సారస్వతం లేదు, నాగరికతలేదు....."

"అంటే – నువ్వు అనుకున్నట్లుగా వారి కవి లేవు అంటే నేను ఖండించను. మన జిల్లాలలో వుండే కుళ్ళు, దగాకోరుతనం, అసహనం, కుట్ర, డాబుసర్లు, సోమరితనం, పట్టింపులు ఇక్కడలేవు. అవి ఉండడం నీ ఉద్దేశంలో నాగరికత లేకపోవడం. వీరి నాగరికత–"

"అబ్బాయి, నువ్వు వీళ్ళ మధ్య ఉంటూ ఇట్లా అంటూ ఉండకపోతే, తంతారని భయం చొప్పున అంటున్న మాటలుగాని, నీ అభిప్రాయాలకీ, నా అభిప్రాయాలకీ భేదంలేదు."

"భేదం ఉంది. నాకిదే నచ్చింది గనక, నే నిక్కడే వుండిపోవడానికి సంకల్పించాను."

"ఉండిపోవడానికి కారణాలు నాకు తెలియకపోలేదు."

"అంటే?"

"ఇక్కడుండే ఆదివాసులకి నీ వెనకటి జీవితం తెలవదు కాబట్టి–"

ఇంకా వాక్యం పూర్తి కాకుండానే నిధి అందుకున్నాడు–

"అవునూ – నా చుట్టుపక్కలవున్న వాతావరణంలో సమత్వం పొందటంలో తప్పేముంది?"

"ఏముంది? ఆ వాతావరణం పాడవుతుంది" అని బిగ్గరగా నవ్వాడు.

నిధికి కోపం వొచ్చినట్లు కళ్ళమీదికి రెప్పలు చటుక్కున జారాయి.

"రాజా! నీకూ నాకూ వెనక ఈ విషయంలో కలహం జరిగింది. నిన్ను వెళ్ళిపొమ్మన్నాను. నామీద దయతల్చి వెళ్ళావు – సంతోషించాను. మళ్ళీ ఇప్పుడు ఆ మాట నా నోటంట అనిపించడం భావ్యంకాదు."

"నీ శ్రేయస్సు కోరేవాళ్ళల్లో నేనూ వొకణ్ణి గనకనే యిల్లా రావడం జరిగింది. వొక్క కోమలే కాదు–"

"కోమలి సంగతి నీకెల్లా తెలుసు?"

"నీలాగే పాత చుట్టం!"

"కోమలి!"

"ఏం, మహా పతివ్రత అనమంటావా?"

"నువ్వు?"

"ఏం? ఏకపత్నీవ్రతుణ్ణి ఎల్లాను కాను – అసలు నాకు పత్నే లేదుగా!"

"నాతో చెప్పడంలో నీ ఉద్దేశం?"

"ఏముంది? శ్రేయస్కామిని కాబట్టి 'జాగ్రత్త' అంటాను. ఎందరో మహానుభావులయ్యారు. నువ్వు ఆఖరు ఆసామీ కావడం ఇష్టం లేదు నాకు –" అని రాజభూషణం లేచి, వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

అతను ఎనిమిది గంటల రైలుకెళ్ళాలి. మళ్ళా వారం రోజుల్లో వొస్తానని ప్రయాణమయ్యాడు. బండికూడా వచ్చింది.

"కోమలితో నువ్వు మాట్లాడావా?"

"ఓ!"

బండి కదిలింది.

దయానిధి స్నానానికెళ్ళాడు. లాల్చీ, పైన తువ్వాలూ వేసుకుని బయట వరండాలో కొచ్చాడు సూర్యుడు కొండవెనక్కి జారాడు. ఏదో వింత చూడ్డంకోసం అన్నట్లు నల్లమేఘాలు, పడమటి వెలుగు వైపుకి కదుల్తున్నాయి. చాప దించుకున్న పడవలా, అన్ని వస్తువులూ తమ నీడలని లాగేసి, చీకటి స్వరూపాలని బైటపెట్టాయి. జేబులో కాగితాలు, ఉత్తరాలు వోసారి చూసి, వాటిని ఉండచుట్టి అవతలకి గిరవాటెట్టి, తూర్పు వెంపుకి చరచరా నడిచి వెళ్ళిపోయాడు.

దయానిధి వెళ్ళింది జీవితాన్ని సృజించడానికి. ఆ చీకట్లో ఎక్కడో జీవిత రహస్యం దాగివుంటుంది. దాన్ని పట్టుకోవాలి. అతన్ని గురించి అతనికి అనుమానాలు, సందేహాలు లేవు. నేలమీద నడుస్తూ, అనుకోకుండా నీళ్ళల్లో దిగనట్లుగా వుంది. ఈత చేతనైతే కాని నీళ్ళల్లో దిగలేదు. దిగితేకాని ఈత రాదు. ఏమిటో, ఈ ఉపమానాలకి అర్థం ఏముంది? పోనీ, జీవితం ఒక కుండలాంటిది. కాలం, వ్యక్తులు అందరిచేతా తలో చుక్కా పోయిస్తుంది. ఇంక ఒక్క చుక్కపడితే కుండ నిండుకుంటుంది. ఆ సాయంత్రం ఆ చుక్క ఎవరో పోసినట్లుంది. నీళ్ళా? కుండా? ఏది యదార్థం? చీకట్లో కాలికి కుండపెంకు తగిలింది. అది శ్మశానమా? తూర్పు కొండ వెనక చంద్రుడు, కొమ్ముల మధ్యనుంచి కనబడే ఎద్దు మూపులా కదుల్తున్నాడు. నీటికుండని మృత్యువు పగలకొడుతుంది. ఆ నేలమీద అన్నీ కుండపెంకులే. ఎందరెందరో రాజులు, రాణులు విహారాలు చేసి, జీవించి నింపుకున్న కుండలని మృత్యువు తన్ని ముక్కలు చేసింది. ఆ పెంకుల జీవితగాథ అది. ఏమిటో ఉపమానాలకి అర్థం లేదు.

అనుమానం, ప్రశ్న, సంశయం, అసంతృప్తి, వాంఛ, ద్వేషం, రాగం – యివేవీ కుండలో నీటిని కదపని సమయం అది. రాళ్ళమధ్య కూర్చున్నాడు. అన్నీ రాళ్ళు, రాళ్ళకింద మారిపోయిన నీటికుండలు, ఎండకిమాడి, "నిప్పు నిప్పు" అని కేకలు వెయ్యవు. వానకి తడిచి "చలి చలి" అని భావగీతాలు పాడవు. చంద్రుడ్ని చూసి గానం చెయ్యవు. వాటికేమీ అక్కర్లేదు కాని అవి అక్కడ లేకపోతే ఏదీ లేదు. అట్లాంటిది అతని హృదయం – ఏడవాలనిపించదు. నవ్వాలనిపించదు. అతనితో దేనికీ ఎవ్వరికీ నిమిత్తంలేదు. కాని అతనక్కడ లేకపోతే ఒక శూన్యం ఏర్పడుతుంది. కాలం, స్థలం, పరిమాణం, మార్పు, తను..... అన్నీ ఏకమై తాత్కాలిక యదార్థం.... దాన్ని ఎవరు స్పృశించగలరు?

ఎవరో స్పృశించారు. కుండలో నీటిని ఎవరో కెలికారు. బాధతో కుండ తొణికిసలాడింది. స్థలం, పరిమాణం మారింది. కాలం గతులు వెతుక్కుంటోంది. మార్పు కొనసాగుతోంది. తను తనైపోయి వెనక్కి తిరిగితే కోమలి!

"ఒక్కదానవు, చీకట్లో ఎందుకొచ్చావు?"

"మీరుండగా చీకటెందుకుంటుంది?"

"అసలెందుకొచ్చావు?"

"మీకోసం –" అతని భుజంమీద తన కుడిచెయ్యి ఆనించి ఆ చేతిమీద తల ఆనించింది కోమలి. గాలికి చీరకొంగు లేచి, అతని ముందు రెపరెప కొట్టుకొంటోంది. సూదిలో దారంలా అతని నడుం చుట్టూ చల్లటి వేడి పెనవేసుకుంది! సౌందర్యం క్షణంలో బలిసి బరువెక్కి అతన్ని ఊపుతోంది. కుండలో నీళ్ళు కదులుతున్నాయి. అవి ఒలికిపోకుండా నిలుపుకోవాలి. ఎవరి శరీరాన్నో ఎవరో ముట్టుకుంటుంటే తను దూరంగా వుండి వారించడంలాగుంది అది పెనుగులాట.

"కోపమా?" అంది.

"......"

"నేనేం చేశాను...?" గడ్డం పట్టుకుని ఆమెవెంపుకి తిప్పుకుంది.

అతను చూస్తూనే వున్నాడు. కాని, ఆమె కనిపించడం లేదు. మేఘాలలోంచి వస్తున్న ధ్వనులలా, నిశ్శబ్దం నిట్టూర్చింది. కోమలి కంఠంలో, ప్రేమతో పెగిలిన కంఠం అది. భాష స్వరూపం తెలీక, హృదయం ధ్వనిస్తోంది. సముద్రం లోతులో జరిగిన చప్పుడు. ఎవరో నక్షత్ర మండలంలో విన్నట్లుగా వుంది.

"ఎందుకు కోపం?" ఏదో పిచ్చి ప్రశ్న అడిగాడు. సమాధానం కోరని పిచ్చి ప్రశ్న.

"నేను చెడ్డదాన్ని, మీతో బాగా వుంటాను. అవన్నీ తల్చుకోకండి. నే నప్పుడు పుట్టలా. నాకు తెలీకుండా అవన్నీ జరిగాయి. ఇప్పుడన్నీ తెలుసు నాకు. మీ దగ్గరే వుండనియ్యండి.... లేకపోతే చచ్చిపోతాను!"

చెరువులో చేపలు కదిలిన పరిమళం శ్వాసలో అతన్ని మొహాన్ని కాల్చింది. పెరిగి పెరిగి పెద్దవయి, విశ్వరూపం దాల్చిన ఆ రెండు పెదవులూ అతన్ని కప్పివేసి శూన్యం చేశాయి. ఆ నోరు, తుంపరగా జనించి, నురుగై, కెరటమై, గుండమై, నీటిలోయై, మహా సముద్రమై అతన్ని ముంచివేసింది. ఎందరి రక్తమో ప్రవహించి, ఆర్పివేస్తున్న మంటల రంగు పెదవులమీద తరతరాలుగా ఎల్తబడి, భవిష్యత్తులో వాడిపోయిన రోజాపుష్పం ఆ నోరు.

"మీరన్నీ మరిచిపొండి. జమీందారుగారి దగ్గరున్నప్పుడు ఆయన వచ్చి నన్ను బలవంతం చేశాడు. మీ స్నేహితుడ్ని అన్నాడు. మీ దగ్గిరకి తీసుకొస్తానన్నాడు. నేను ఒప్పుకోలేదు. రక్కాను. పారిపోయి జమీందారుగారితో నేను మంచిదాన్ని కాదని చెప్పాడు. ఆయన కొట్టేవాడు, తన్నేవాడు. ఒకరోజున పెద్ద దెబ్బలాట జరిగింది; మిమ్మల్ని గురించే! ప్రేమించానని చెప్పాను. ఆయనకి కోపం వచ్చింది. ఆయన తన్నాడు నన్ను. సంచిలోంచి బయటకి తీసి ఆయన డబ్బు మొహాన్న కొట్టాను. ఆయన బూటు తీసి కొట్టాడు. నా వొళ్ళు మండింది. కొన్ని నగలన్నీ బీరువాలోంచి తీసి ఆయనమీద పడేశాను. మీద కొచ్చాడు జమీందారు.....

పూలతొట్టి విసిరికొట్టాను. నుదురు పగిలింది చచ్చినాడికి. పారిపోయి, మా అమ్మదగ్గర కెళ్ళిపొయ్యాను. అమ్మకీ నాకూ రోజూ దెబ్బలాట్లే– అట్లకాడుచ్చుకొని అమ్మ నెత్తిన కొట్టింది, లేచ్చక్కా వచ్చా మీ దగ్గరకి."

కోమలి చిత్రించిన భయానక దృశ్యాలని వూహించుకున్నాడు, దయానిధి. అతనికి కోపంలేదు. ఈర్ష్యలేదు. గమ్యస్థానంలేని జలపాతంలా కారుణ్యం పొంగుతోంది, అతని హృదయం. అందరూ పంచుకోవడం వల్లనే వస్తువులు, స్థిరత్వాన్ని కోల్పోయి నశింపవుతాయి. సౌందర్యం, ఆనందం, విచారం పంచుకోవడంవల్ల కృశిస్తాయి. భక్తులుకూడా మతాన్ని పంచుకుని దైవాన్ని హత్యచేశారా అనిపిస్తుంది. తన సర్వస్వమూ సంఘానికి పంచిపెట్టి, తన నిజ వ్యక్తిత్వాన్ని తెలుసుకున్నది కోమలి. ఎందరెందరో తమ పెదవులకు పట్టిన బూజులు ఆమెకు రాసి దులుపుకున్నారు. ఎందరెందరి స్వప్నాలనో యదార్థంచేసి, తనలో యదార్థాన్ని రహస్యంగా స్వప్నం చేసుకుంది కోమలి. ఆ కృత్రిమ స్వేచ్ఛా జీవనం వదిలేసి, మళ్ళా తన దాస్యం ఎందుకు అభిలషిస్తోంది? ఆమెకి ఏం కావాలి? పురుషుడి ద్వారా తప్ప, స్త్రీ తన స్వేచ్ఛ సాధించుకోలేదు కాబోలు! తన స్వేచ్ఛకోసం అతన్ని బానిస చేస్తానంటోంది.

"నీకా జీవితంపైన అసహ్యం పుట్టిందికదా, మళ్ళా అదే నా దగ్గర కావాలంటా వెందుకు?" అని మొహాన్ని పక్కకి తొలగించి కళ్ళలోకి చూశాడు. ఎందరి పురుషుల రహస్య జీవితాలనో బంధించిన ఆమె శిరోజాలు, గాలిలో ముళ్ళుడ్డాయి. ఉద్రేకంతో కళ్ళు మెరసి మూతలు పడ్డాయి.

"ఛఛా – నేను పోకిరిదాన్ని గాను – కాని, నేను మిమ్మల్ని యెంత ఎక్కువగా ప్రేమించానో, మీకు తెలియపర్చడం ఎట్లాగ?" అంది కోమలి.

"ప్రేమలో ఎక్కువ తక్కువలుండవు. నువ్వు ఒక వ్యక్తిని ప్రేమిస్తావు. లేక ద్వేషిస్తావు. అంతే–"

"ఎట్లా చెప్పాలో నాకు తెలీదు. జ్ఞానం వచ్చాక, ప్రేమంటే ఏమిటో తెలిశాక, నాదంతా మీకిచ్చివేస్తే నా ప్రాణం స్థిమితపడుతుంది."

"ఇచ్చేటందుకు నీ దగ్గర ఏముంది?"

"అంతా మీ కోసమే అట్టే పెట్టుకున్నాను. నాకు మరి ఎవ్వరితోనూ నిమిత్తంలేదు. మీకు నేను తప్ప ఎవ్వరూ పనికిరారు, నాకు తెలుసు–" అంటూ అతని నడుంచుట్టూ చేతులు బిగించి, అతని ఒళ్లో వాలిపోయి, మెడని చేతుల్తో బంధించి చంద్రుడికేసి చూస్తూ ఏడ్వసాగింది.

"నీ శరీరంతో తప్ప నాకు నీతో పరిచయంలేదు. ఆ శరీరం నీకిప్పుడు లేదు, నాకు నువ్వు పరాయిదానవు – తెలుసా?"

"ఇది ఒట్టిది – నేనెంత అందంగా వుండగలనో మీరు వూహించుకోలేదు. నాతో సంబంధం లేదు గనుకనే నన్ను మీరు ప్రేమిస్తారు, అంతే!"

"అలాంటప్పుడు సంబంధంతో యిప్పుడు ఆ ప్రేమని యెందుకు పాడుచేసుకోవడం? మనం యిల్లాగే, పరాయివాళ్ళలా, అపరిచితులుగా వుంటే ఎంత బాగుంటుంది, వూహించు" అని కిందికి వాలిపోయి తలను పైకి తీసుకున్నాడు. కన్నీరు అతని బొటనవ్రేలిమీద ధారలా పడుతోంది.

ఏడ్చేందుకు యింత కన్నీరు ఎక్కడ దాచుకుందో!

"మీరు నన్ను ప్రేమిస్తాననండి – ఇంకేమీ అడగను. నా జన్మధన్యం అవుతుంది– నేనీ సంతోషంతో చచ్చిపోతాను."

"చూడు కోమలీ! నాకు ప్రేమంటే యేమిటో యింతవరకూ తెలిసింది కాదు. అందరిలాగా, శరీరవాంఛనే ప్రేమనుకుని, నన్ను నేను దగా చేసుకోలేను. ఇతరులు ఎవ్వరితోనూ ఏ ఒక్కరితోనూ పంచుకోలేనిది నా ప్రేమ. అదొక దృష్టి – జీవితం అంతటినీ, తుదీ మొదలూ, ముందూ వెనకా, అన్నింటినీ దూరంగా చూసి అర్థంచేసుకుని ప్రపంచంపై ఒక చూపు, నా ప్రతి మాటని, భావాన్ని, చర్యలనీ, ఆ దృష్టి పురిగొల్పుతుంది. నీతో స్నేహంవల్ల ఆ దృష్టి పోతుంది – నీ కేమన్నా అర్థమౌతుందా? పోనీ నీ వుద్దేశంలో ప్రేమంటే ఏమిటి?"

"ఓ యబ్బ, ఆ మాత్రం అర్థంకాదా! నాకన్నీ తెలుసు. మీరొక్కరూ ఎక్కడో సన్యాసిలాగా వుండిపోతానంటారు. దానివల్ల ఏమిటి ప్రయోజనం? ప్రేమంటే – ఇద్దరూ, వొక్కరిలాగుండి కలిసి సంతోషపడి, యితరులకి సహాయపడి, వారినికూడా సంతోషపెట్టడం. మనం ఒకళ్ళకి ఒకళ్ళు తన్మయత కలిగించుకుంటాం. అప్పుడు ధైర్యంగా, బలంగా, సరదాగా వుంటుంది. ఆ టైంలో ఎన్నో మంచి పనులు చేస్తాం. చూశారా, నాకెంత బాగా తెలుసో!"

లేచి కూర్చుంది కోమలి.

"ఐనా ప్రేమంటే నాకేం తెలుసు? చూడండి, గుండెలెల్లా కొట్టుకుంటున్నాయో! శరీరం వేడిగా, మీ కోసం. అసలదంతా ఎందుకు?" అని అతని నోటిని తన పెదవులతో నొక్కేసింది.

"ఇదేనా ప్రేమంటే? ఈ పని ఎంతమందితో, ఎన్నిసార్లు చేశావో?"

"అది వేరు, యిది వేరు – అసలు మీరు మనిషే వేరుగా! వాళ్ళంతా పశువులు – మీరు దేవుడు."

"దేవుడ్ని పూజించాలి కాని, ముద్దెట్టుగుంటారా?"

"ముందు ముద్దు, తర్వాత పూజ–"

మీదికి ఎగబ్రాకుతున్న శరీరాన్ని వెనక్కి నెట్టివేశాడు నిధి. సముద్ర ప్రవాహానికి యెదురీదే శక్తిగల శరీరం, వర్షించి కొండ శిఖరాన్ని కరిగించివేసే వేగంగల మేఘంలాంటి శరీరం, వికసించిన పుష్పాన్ని మళ్ళా మొగ్గని చెయ్యగల విచిత్రమైన శక్తిగల ఆ శరీరం యీ అల్పమయిన ప్రేమకోసం ప్రాకులాడి, నశించడం విషాదంగా తోచిందతనికి. ఆమె నోటిమీద తన అరచేతిని నొక్కి–

"వొద్దు కోమలీ! నా ప్రేమని పంచుకుని పాడుచెయ్యకు – నాకు మిగిలింది ప్రేమ ఒక్కటే" అన్నాడు.

"నాకేమీ వొద్దు. వూరికే మీతో యెప్పుడూ యిల్లా ఉండనివ్వండి, సరేనా?"

"సరే – ఐతే యింకేమీ చెయ్యకూడదు నన్ను–" అంటూ అతను లేచాడు. "కోపం రాదుకదా– మీకు ఎవరేనా వున్నారా?" అని అతని చెయ్యి పట్టుకొని లేచి నిలబడింది.

"ఉన్నట్టుగా వున్నానా?"

"ఏమో, నాకేం తెలుసు, మీ లోపల ఏముందో? నామీద యిష్టం లేకపోతే నేనల్లా అనుకోకూడదా?"

"నాకు ఎవరిమీదేనా వుంటే, నీకు నామీద పోతుందా?"

"పోదు. 'అయ్యో పాపం' అనుకుని వూరుకుంటా. మిమ్మల్ని వేధించుకుని తినను."

"ఎవరున్నా లేకపోయినా, నాకు భార్య వుందిగా?"

"ఆమె యిక్కడ కెందుకు రాదు?"

"వొస్తే, నువ్వు యిక్కడుంటావా?"

"ఎందుకుండను? ఇద్దరం హాయిగా అక్కచెల్లెళ్ళలాగుంటాం."

"నీ కందులో ఏం సుఖముంది?"

"మీతో వుండటమే—"

ఇద్దరూ నడవటం సాగించారు, నిశ్శబ్దంగా. కోమలి ముళ్ళనీ గతుకుల్ని తప్పుకున్నప్పుడు అతని భుజం పట్టుకుని నడుస్తోంది.

"ఇందిరకి నిన్ను నే వుంచుకున్నానని అనుమానం — నీకు తెలుసా?" అని అడిగాడు.

"అయ్యో, ఖర్మ — నా గొడవే మీ కక్కర్లేదు. చూశారా ప్రపంచం ఎట్లాగనుకుంటుందో నేను మీ కోసం పిచ్చిదాన్నయిపొయ్యానుగాని, ఎందుకు రాదు ఆవిడ? మీ కిష్టంలేదా?"

"జబ్బుగా ఉందిట! మామగారుత్తరం రాశారు. నన్ను వొచ్చి చూడమన్నారు."

"అయ్యో పాపం — ఏం జబ్బు? నేను కూడా వొచ్చేదా?"

"క్షయ. మామగారు, 'రావ్ బహద్దూర్' రాకుండానే రిటైరయ్యారు. నన్ను పాతవన్నీ మరచిపోయి, క్షమించమని రాశారు. మొన్న మందుల నిమిత్తం వో వెయ్యి పంపించాను."

"మనం వెళ్ళి చూసొద్దామా?"

"నువ్వొస్తే జబ్బు యింకా యెక్కువవుతుందేమో!"

"పోనీలెండి —" మళ్ళా మాట్లాడటం మానేసింది.

"నన్ను ప్రేమించానంటావు — మాటిమాటికి కోపం వస్తే ఎట్లాగ? ప్రేమించ కుండా పరాయిదాన్లా వుంటే కోపాలూ, తాపాలూ — ఈర్ష్యలూ, బాధలూ ఏమీ వుండవు."

"అవన్నీ వుంటేనే బాగుంటుంది నాకు. అవి లేకపోతే బైరాగినే— బైరాగి బ్రతుకు నాకొద్దు."

మళ్ళా నిశ్శబ్దం — దూరంగా మేడ వెన్నెలలో తెల్ల మేఘంలా మెరుస్తోంది.

"ఐతే అమృతంగా రెక్కడున్నారు?" అని అడిగింది.

"అమృతంగారు—"

కోమలి నవ్వింది. పడిపోబోతూ అతని భుజాన్ని గట్టిగా పట్టుకుంది.

"అబ్బో, మీకింకా జ్ఞాపకం వుందే — నాకప్పుడు నోరు తిరిగేది కాదు, బాగున్నారా?"

"నీ దగ్గర ఆ యాభై రూపాయలూ, వడ్డీతో సహా వసూలు చెయ్యమంది."

"అంటే—?"

"జ్ఞాపకం లేదూ? ఆ రాత్రి వొచ్చి, నిన్ను నిద్రలేపకుండా దిండు కింద డబ్బెట్టి వొచ్చేశాను. ఆ డబ్బు అమృతం దగ్గరుచ్చుకున్నదే."

"ఆవిడ చాలా మంచిది – ఆవిడ లేకపోతే, మీరు నా దగ్గరకే వచ్చేవారు కారు – ఔనా ? నల్లగా వున్నా, మనిషి భలే ఎత్తుగా, గుండ్రంగా, దర్జాగా వుంటుంది."

"నీకు తెలుసా? అమృతానికి ఆడపిల్ల" అన్నాడు.

"నిజంగా! ఆవిడకే?"

"అవును, జగన్నాధం ఉత్తరం రాశాడు. కొవ్వూరులో గోదావరొడ్డున పాకేసుకుని, హాయిగా ఆశ్రమంలోలా వుంటున్నాడట. వొచ్చి చూడమన్నాడు."

"అబ్బో – అప్పుడే, భలే చిలిపల్లరి చేసేవాడు. నన్ను చెర్లోకి తోసేసి చొక్కా తొడుక్కోవడానికిచ్చాడు. ఏం చేస్తున్నాడు? పెళ్ళయిందా?"

"లేదు – కూలివాళ్ళకీ, బీదవాళ్ళకీ ఊరికే చదువు నేర్పుతున్నాడట. అదే ఉద్యోగమట...."

"సుశీలగారు చచ్చిపోయిందటగా – పాపం!"

"స్త్రీలని నమ్మకూడదు."

"ఓ యబ్బ – నాకు చెప్పకండి – మొగాళ్ళే వాళ్ళ గొంతుకలు కోస్తారు. సల్లంగా కబుర్లు చెప్పి, వాళ్ళ పని కానిచ్చుకున్న తర్వాత యిదెల్లా సచ్చిందీ వాళ్ళకి పట్టదు."

"స్త్రీలకు ప్రేమించటం చేతకాదని గ్రహించుకుని, మొగాడు చివరికి వాళ్ళ సంపర్కం వొదులుకుంటాడు."

"ఎప్పుడు? అన్నీ ఐనాకనా? ఏ కడుపో కాలో వొస్తే వాళ్ళకేం?"

"చెంపలేసుకో – అట్లాంటి మాట్లనొచ్చా?" అన్నాడు నిధి. కోమలి వేసిన ప్రశ్నతో; అమృతం అతని వ్యూహంలో కదిలి వ్యాపించింది.

"అవును, మీరనొచ్చా అట్లాంటి మాటలు? అస్తమానం ఆడాళ్ళని తిట్టిపోసి, శాపనార్థాలుబెట్టే మొగాళ్ళకి, అస్తమానం ఆడోళ్ళసంపర్కమే కావాలి. స్త్రీలని తిట్టడం, మళ్ళా స్త్రీల చుట్టూ తిరగడం–"

"ఊఁ" అని గర్జించి – మందలించాడు నిధి.

ఇంటికి చేరుకున్నారు. కోమలి గబగబా మెట్లెక్కి మేడమీద కెళ్ళిపోయింది. దయానిధి ముందువాలో కుర్చీలో కూర్చున్నాడు, "అమ్మ" విగ్రహం కేసి చూస్తూ. స్త్రీ జాతిపై అతని నమ్మకం పోయినందుకు "అమ్మ" కారణం అనుకున్నాడు. క్షణం అపచారం చేస్తే వారి సంతతి యిలాగై పోతుందని తెలుసుకోగలిగితే, ఏ స్త్రీయేనా అపచారం చేస్తుందా? "అమ్మ" స్త్రీత్వానికి ఒక చిహ్నం. ఆ చిహ్నం ఒక నల్లటి తెరగా తన దృష్టిని మరుగుపరుస్తుంది. ఆ తెర ఎక్స్‌రేలాంటిది. బయట రక్తం, మాంసం, మెదడు, ఊహ, ఆదర్శం, జ్ఞానంగల స్త్రీలున్నా లోపల్నించి యితనికి కనబడేది అస్థిపంజరమే. అతని అనుభవాలని ఆత్మవంచన లేకుండా తరచి

చూసుకుంటే, స్త్రీలని ఆదర్శవ్యక్తులుగా పరిగణించేటందుకు తగిన ఆధారాలు లేవు. ఏది యధార్థం? తన ఎక్స్‌రే దృష్ట్యా బయటి మాంసం, రక్తం, మనుషులా?

"మా నాన్నగారు భోజనాలైం తర్వాత రమ్మన్నారు."

పక్కకి తిరిగి చూస్తే కాత్యాయని!

"ఎందుకు?"

"ఏమో – ఏదో పనుందట. ఎవరో వచ్చారు బళ్ళారినుంచి."

"సరేలే – అలాగే వస్తానని చెప్పు."

కాత్యాయని వెళ్ళబోతూ, నిలిచిపోయి.....

"నాకు పాఠం చెప్పడం మానేశారు–" అన్నది.

"ఏం చెయ్యను? తీరికలేదు. రేపు చెప్తాగా. వారంరోజుల్లో మేష్టారు వస్తోంది. నేను పాఠాలు మరిచిపొయ్యాను సుమా!"

కాత్యాయని అమాయకంగా నవ్వి వెళ్ళబోయింది.

ఈలోగా ఉత్తరాలకట్ట విప్పి చూసుకున్నాడు. అమృతం పిల్లకి అన్న ప్రాశన రమ్మని ఆహ్వానం. మరో పది నిమిషాలలో నారయ్య వచ్చి అనంతాచార్లుగారు దబ్బున రమ్మన్నారని చెప్పాడు. వెంటనే నిధి వాళ్ళింటికి వెళ్ళి, అక్కడే భోజనం చేసి, వ్యవహారాలు మాటాడుకొని, తిరిగి ఇంటికొచ్చేటప్పటికి, రాత్రి పదకొండు దాటింది. క్యాంపుకాట్ వరండాలో కీడ్చుకొని పడుకున్నాడు, నక్షత్రాలకేసి చూస్తూ. కనబడే నక్షత్రం ఆ స్థానంలోంచి కదిలిపోయినా, అక్కడే ఉన్నట్లు మెరుస్తుంది. అంతటి విశాలమైన విశ్వంలో యీ అల్పుడైన మానవుడికి యింత అశాంతి ఎందుకో? లేక, విశ్వం అంతటి విశాలమైందని గ్రహించుకోడానికి మానవుడి మనస్సు, ఊహ యింకెంత విశాలమైందిగా ఉండాలో!

అమృతం ఆడపిల్లకి అన్నప్రాశన! అతనికి భయమేసింది. పసిపాప తన గుండెల్లో మెదిలి ఏడుస్తున్నట్లుగా ఉంది. అనుమానంతో భయంతో శరీరం పీక్కుపోతోంది. సృష్టి తన రహస్యాన్ని ఛేదించమని సవాల్ చేసింది. సంతానం ఇంత సులభమా? సృష్టికి మనుషులు రాగద్వేషాలతో నిమిత్తం లేదు. లేక ఉందా? స్త్రీ ఒక చెట్టులాంటిది; చూస్తోండగానే, ఎదిగిపోయి, మానులు చాచుకుని ఆకులు, మొగ్గలు, ఫలాలు తెచ్చుకుంటుంది. ఆ నీడలో ఎవడో యాత్రికుడు నిలబడి, సేద తీర్చుకుని, దాని శ్వాస పీల్చి, ఆ ఫలాన్ని కొరికి, ఒక్కసారి కదిపిపోతాడు. ఏదో చప్పుడవుతుంది. వెనక్కి తిరుగుతాడు. అప్పుడే పండు కిందికి రాలింది. అమృతాన్ని కదిపింది తనే. ఎట్లా తెలుస్తుంది – వెళ్ళి చూస్తేగాని, అతనికి మతి పొయ్యేటట్లుంది.

ఆలోచనలతో మెదడు వేడెక్కిపోతోంది. ఏవో రెండు, మెత్తటి చల్లటి చేతులు నుదుటిమీద వొత్తుతున్నాయి. వాటిని తొలగించి పైకి చూశాడు.

"ఇందాక అల్లా అన్నందుకు కోపం వచ్చిందా?" అంది కోమలి.

అతనేమీ మాట్లాడలేదు. పిల్లల విషయం కోమల్ని అడుగుదామనుకున్నాడు. కాని, ఆ ప్రశ్నని దిగమింగేశాడు.

"ఇంకెప్పుడూ అన్ను, క్షమించండి" అంటూ, అతని నుదుటికి ఆనించిన ఆమె చేతులని తొలిగించివేశాడు.

"నేనింక మిమ్మల్ని వేధించను, హాయిగా పడుకోండి" అని లేచి వెళ్ళిపోయింది కోమలి.

నిధి వొంటిని నిద్రాదేవి వరించింది. తపస్సు చేస్తున్న "భయం" అనే ఒక ఋషిని, "ప్రశాంతం" అనే కన్యక తన నాట్యంచేత భంగపరిచింది. కనురెప్పలకి కట్టిన దారాలని, నిద్రాదేవి నక్షత్రానికి ముడి వేసింది.

మండు వేసంగిలో, ఏప్రిల్ ఇరవైయోతేదీని ఆంధ్రరాష్ట్ర కమిటీ వారు కడపలో సభ చేశారు. ఆ సభకు అనంతాచార్లుగారు, దయానిధి కూడా వెళ్ళారు. దత్త మండలం జిల్లాలనుండి, ఎందరో నాయకులు, పెద్దలు, సభ్యులు వస్తారు. వారందరి పరిచయం పొందడం అవసరమని, ఆచారిగారి ప్రోత్సాహం మీద, నిధి అక్కడికి రావడం జరిగింది. అతన్ని ఎలక్షన్‌లో నిలబెట్టి నెగ్గించి, పెద్దవాడ్ని చెయ్యాలని ఆచారిగారి సంకల్పం. కాని, అతనేమీ ఉత్సాహం చూపడంలేదు. ఐనా, వెళ్ళక తప్పిందికాదు.

సాయంత్రం ఐదుగంటలవుతోంది. రెండు మూడ్వేలందల మంది జనం మూగారు. ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. మూడో ఉపన్యాసకుడు రాజభూషణం, పది వాక్యాలు మాట్లాడింతర్వాత, జనంలో కలకలం బయలుదేరింది.

"–ఈ జిల్లాలలో కొందరి మతం, ఆంధ్రరాష్ట్రం అక్కర్లేదనీ, దాని అవసరం వారికి కనబడలేదనీ, అసలు రాష్ట్రం ఏర్పడకుండా చెయ్యడానికి వారు కృషి చెయ్యడానికి అభ్యంతరం లేదనికూడా. వారు అలా అనడంలో ఆశ్చర్యంలేదు. ఎందుకంటే, ఆంధ్ర రాష్ట్రోద్యమం సర్కారు జిల్లాలలో బయలుదేరింది. ప్రతి ఉద్యమంలోనూ, సారస్వతోద్యమం కానివ్వండి, మరే ఇతర నూతన ఉద్యమం లేవదియ్యాల్సి వచ్చినా, సర్కారు జిల్లాలవారే ముందంజ వేసేది. వారే మార్గదర్శకులు. రాజకీయ, ఆర్థిక, కళా, సాంఘిక అభ్యుదయానికి పునాదిరాళ్ళు వేసింది వారు. ఆంధ్ర నాగరికతని భద్రపరచింది వారే. అంచేత వాళ్ళేదో బాగుపడి గొప్పవాళ్ళయిపోతున్నారని, మిగతా జిల్లాలవారు అసూయపడి వెనక్కి తగ్గి, వారి అభివృద్ధికి అంతరాయం కల్పించడంలో ఆశ్చర్యంలేదేమో! నాకీ జిల్లాలతో పరిచయం లేకపోలేదు. కారణాలేమైతేనేం, ఇక్కడి ప్రజ హీనస్థితిలో ఉంటున్న సంగతి అందరికీ తెలిసిందే. కట్టుకునేందుకు బట్టలేదు. తినేటందుకు తిండిలేదు, తిండి, బట్ట లభ్యం చేసుకుని, తీరికగా ఉంటూ, ప్రాణం నిలబెట్టుకునేందుకు ఉపకరించే వాటిని సాధించటమే నాగరికత. అవే కళలు, మతం, శృంగారం, ఆధ్యాత్మిక విలువలు. తిండీ, బట్టాలేని ఈ బీద ప్రజలకి ఆ నాగరికత అలవడాలంటే వారి యీర్ష్యలని పట్టింపులనీ దిగమింగి సర్కారు జిల్లాలవారితో ఏకమై రాష్ట్రం కోసం కృషి చెయ్యడమే కర్తవ్యం."

కొందరు చప్పట్లు కొట్టారు. వారిని మరికొందరు మందలించారు. మాటా మాటా అనుకున్నారు. గంద్రగోళమైంది. కొంచంసేపటికి అలజడి తగ్గింది. మళ్ళా మొదలెట్టాడు.

"ఉదాహరణకి.....నేను మొన్న రాఘవ శ్రేష్టిగారింట్లో దిగాను. నాకు నవ్వొచ్చింది. యింట్లో నాలుగు భాషలేనా విన్నాను. ఒకరు తెనుగు మాట్లాడతారు;

ఒకరు సంస్కృతం, మరిఒకరు కన్నడం! అత్తగారు తమిళం మాట్లాడుతుందిట! నైజాం సరిహద్దుల దగ్గర వుండడం వల్ల కాబోలు - అందరికీ కొద్దో గొప్పో హిందీ కూడా వచ్చే వుంటుంది. వీరికి మాతృభాష లేదేమో అనిపిస్తుంది. ఒక పత్రికా సంపాదకుడు, గాని; గొప్పగాయకుడుగాని, చిత్రకారుడు గాని, కవిగాని, రాజకీయవేత్త గాని, ప్రతిభాశాలిగానీ, ఎవర్నైనా మనం ఎరుగుదుమా? వీరు తెలివి తక్కువవారనను. తెలివితేటలు బైటపడి రాణించే ఆర్థిక, సాంఘిక, పరిస్థితులు ఏర్పడలేదు. అవి ఏర్పడాలంటే మాతో కలవడమే సాధనం. మాతో కలవండని ప్రాధేయపడుతున్నామని బిగిస్తారేమో! ఎవర్నైనా ఏదేనా కోరితే, వారు చెట్టెక్కడం మానవ లక్షణం. ఆ పక్షంలో మేం భయపడి మా వుద్యమం విరమిస్తామనీ, ఆంధ్రరాష్ట్ర రథం కదల్దనీ కలలోకూడా భ్రమించవద్దని విన్నపం. వీరిని మినహాయించి, మిగతా వాళ్ళమే రాష్ట్రం సంపాదించుకొని తీరతాం......"

వాక్యం పూర్తికాకుండానే ప్రజలు అతన్ని ఆపుచెయ్యమని అల్లరి చేశారు. అతను చేసిన సవాల్, అక్కడి పెద్దలకికూడా కష్టంగా తోచింది. మధ్యలో ఒకాయన నిలబడి "నాకు మాట్లాడే అవకాశం యివ్వండి" అని అధ్యక్షుడ్ని కోరాడు. జనం చప్పట్లు కొట్టి ఆయన్ని ఉపన్యాసవేదిక మీదికి తీసుకెళ్ళి నిలబెట్టారు. ఒకాయన లేచి ఆ ఉపన్యాసకుడ్ని పరిచయం చేశాడు.

"వీరి పేరు తిప్పేస్వామి. వీరు కర్నూలు కార్మికుల సంస్థకి కార్యదర్శిగా ఉంటున్నారు. పనివాండ్ర కనీసపు వేతనాల ప్రణాళిక తయారుచేశారు. అంతకంటే వేరే చెప్పనక్కర్లేదు" అని కూర్చున్నాడు.

తిప్పేస్వామి యిల్లా ప్రారంభించాడు:

"నేను ఈ సాయంత్రం మాట్లాడాలని వచ్చుండలేదు. ఇంతకు ముందు చెప్పినాయన చాలా జోరుగా సాగిస్తుంటే బండికి బ్రేక్ వేద్దా మనిపించింది. ఆ ఛాన్సు ఇచ్చినందుకు అధ్యక్షుడికి కృతజ్ఞతాపూర్వక వందనాలు.

మా సర్కారు మిత్రులు - క్షమించండి. సర్కారు జిల్లాల మిత్రులు ఈ కరువు సమయంలో క్షామనిధిగా ఐదువేలు రొక్కం యిచ్చినమాట వాస్తవం. దానికి వారికి మేం కృతజ్ఞులం. యిట్లాంటి కరువు సంభవించడానికి మా తెలివితక్కువతనమే కారణం అన్నట్లుగా వారు మాట్లాడటం విన్న మీ అందరికీ నవ్వొచ్చిందంటే ఆశ్చర్యంలేదు. ఎందుకంటారా? కలరా, ప్లేగులు, వుప్పెనలు, వరదలు, వానలు పడక పంటలు నాశనం కావడాలు - యివన్నీ సర్కారు జిల్లాలలో కూడా వుండటం అందరికీ తెలిసిందే. ఐతే! వారు మమ్మల్ని చూసి జాలిపడటం వారి ఎక్కువతనాన్ని చూపెడుతుంది కాబోలు! వారికి సంభవించే యిక్కట్లని చూసి సంతోషించి జాలిపడుతున్నాననుకోకండి.

నాగరికతను గురించి వారేదో సెలవిచ్చారు. నేను అనాగరికుడ్ని గనక నాకది అర్థం కాలేదనుకోండి! తిండీ, బట్టా వున్నవాళ్ళకే ఈ నాగరికత అనే జాడ్యం పడుతుందని వారి ఉద్దేశ్యం కాబోలు! వారి జిల్లాలలో జమీందార్లు తిండి బట్ట వున్నవారలే. వారు నాగరికులా? కార్మికులను, కర్షకులను, కౌలు కిచ్చిన వాళ్ళనీ పీడించి - వూటీ, సిమ్లా, బొంబాయిలలో త్రాగుడు, జూదం, స్త్రీ లోలత్వంతో ఆ డబ్బంతా తగలెయ్యడం నాగరికతా? మహానుభావులు, గొప్పవాళ్ళు చాలామంది

బీదవాళ్ళేనని చరిత్రచదివిన వారికి తెలుస్తుంది. బీదతనమే వారి కృషికి కారణం అంటాను. పూర్వీకులు కష్టపడి సంపాదించిన సంస్కారాన్ని, నాగరికతని తగలెయ్యడంములో ప్రధానస్థానం సర్కారువారిదే..... క్షమించండి– సర్కారు జిల్లాల వారిదే! నేను మొన్న బెజవాడ రైల్వేస్టేషన్‌లో ఒక హాస్యరచన గ్రంథం కొని చదివాను. దాన్నిబట్టి అక్కడి జనం ఎట్లాంటివారో తెలుసుకొన్నాను. డబుక్కులు – వారు దాన్ని కోతలంటారు. యీర్ష్య, సోమరితనం, ఆరంభ శూరత్వం, కుళ్ళు, దగా, మోసం, స్వార్థపరత్వం – యివి వారి జాతీయ లక్షణాలంటే, నా మిత్రులు బాధపడతారు. ఆ గ్రంథం హాస్యరచనకాదు– విషాదగీతం. అది చదువుకొని వారు ఏడవడానికి బదులు నవ్వుతున్నారంటే నాకు ఏడవాలనిపిస్తోంది.

ఈ జిల్లాలలో కవులు లేరట. మా రీడింగ్ రూమ్‌కొస్తే, నలభై పేజీల గ్రంథం వుంది. అందులో నూటతొంభై మంది కవుల పేర్లున్నాయి. చిత్రకారులు లేరట – కీర్తిశేషుడు వెంకట్రావు పేరు ఈ చర్చలోకి దింపటం నాకిష్టంలేదు.

ఇక ఆంధ్రరాష్ట్రం మాట. మేం రాష్ట్రం వొద్దనటంలేదు. మేం దానికి తగం అన్నట్లుగా ఆ జిల్లాలవారు మాట్లాడతారు ఎందుకో? మా ప్రాజెక్టులు ఫలించి, ఆర్థికంగా సమానత్వం తెచ్చుకున్న తర్వాత రాష్ట్రం అవశ్యం తెచ్చుకుంటాం. ఈత రానివాడిని అవతలొడ్డుకి తీసికెడదామంటే యిద్దరూ మునిగిపోతారు.

మా సర్కారు మిత్రుడు – క్షమించండి – సర్కారు జిల్లాల మిత్రుడు రాఘవ శ్రేష్టిగార్ని గురించి వ్యక్తిగతంగా మాట్లాడాడు గనక. ఆ హక్కు నేను చలాయించుకుంటాను. ఇక్కడికి 90 మైళ్ళ దూరంలో న్యాయంపల్లి గ్రామంలో ఒక సర్కార్ల వ్యక్తి వున్నాడు. ఆయన డాక్టర్. ఇక్కడికి ఫకీరుగా వచ్చాడు.ఈ రాళ్ళసీమలో వజ్రం దొరికింది. లక్షాధికారయ్యాడు. వజ్రాలగని త్రవ్విస్తున్నాడు. హాస్పిటల్ పెట్టాడు. ఆ సిరిసంపద మాదిగాక సర్కారు జిల్లాల వారిదా? రాఘవశ్రేష్టిగారింట్లో నాలుగు భాషలున్న విషయం మీరు విన్నారు. సర్కారు డాక్టర్‌కి – క్షమించండి, సర్కార్ జిల్లాల డాక్టరుకి నలుగురు భార్యలున్నారని వినికిడి"

జనంలో గోల బయలుదేరింది. అధ్యక్షుడు ఆయన్ని నిలిపివేసి కూర్చోమన్నాడు. బలవంతంగా అందరూ ఆయన్ని కిందికి దించి తీసుకుపొయ్యారు. అక్కడ అమర్చిన రెండు గ్యాస్‌లైట్లల్లో వొకటి ఆరిపోయింది. ఉపన్యాసకుల వేదిక దగ్గరిది మాత్రం వెలుగుతూనే వుంది. ఇంతలో నిధిని వేదికపైకి రమ్మనమని ఎవరో పిలిచారు. నిధికోసం ఆచారిగారు అటూ యిటూ చూశాడు. ఎక్కడా కనిపించలేదు. అప్పుడు అనంతాచారిగారు 'ఆయన ఒంట్లో బాగుండలేదని, అంచేత మాట్లాడే స్థితిలోలేడనీ' సర్దిచెప్పి, శ్లోకాలు, వుపమానాలు, గీతావాక్యాలు చదివి; సర్కార్ జిల్లాల వారికి, దత్తమండలం వారికీ ఐక్యం వుండాలంటూ ఉపన్యసించి సభికులను రంజింపచేశారు.

దయానిధి వెంటనే కార్లో యింటికి వొచ్చేశాడు. రాత్రి పన్నెండు గంటలు కావొస్తోంది. నిశ్శబ్దంగా మేడమీదికి నడిచి వెళ్ళాడు. నారయ్య హాల్లో గుర్రెట్టి నిద్రపోతున్నాడు "చిట్టి" మండువాలో పడుకున్నాడు. పక్కగదిలో కోమలి పడుకుంది. సన్నగా దీపం వో మూల వుంది. కిటికీ లోంచి నిశ్శబ్దంగా, చల్లటివెన్నెల కోమలి మంచంమీద పడింది. మెడలో నగలు లేకపోవడంవల్ల ఆమె కంఠం

గుండ్రంగా, మెత్తగా కనబడుతోంది. వెన్నెల ఇంద్రజాలాన్నుండి తప్పించుకోవాలని, రహస్యమయిన శ్వాసతో రొమ్ములు లయతో లేచి పడుతున్నాయి. వికసించడం మరిచిపోయిన ఎర్ర మందారం మొగ్గల్లా కళ్ళు మూసుకున్నాయి. కోమలి అందం అనంతం; క్షణక్షణానికి; రోజు రోజుకీ, యుగయుగానికీ అభివృద్ధి పొందే సౌందర్యం అది. వయస్సు చక్కదనంలోని చాంచల్యాన్ని తొలగించి మార్దవాన్నీ, గాంభీర్యాన్నీ యిచ్చింది. జీవితంలో రాపిడిగా యవ్వనంలో వుండే కుటిలత్వాన్ని తొలగించి, వైరాగ్యాన్నిచ్చింది.

అతను ప్రక్కన సోఫాలో కూర్చున్నాడు. పర్వతం ఎక్కి శిఖరం చేరుకున్నట్లుగా వుంది. ఆమె ప్రక్కన కూర్చోడం. వెన్నెల వాతావరణాన్ని కోమలి ఉనికి ప్రశాంతంలో బంధించి వేసింది. గోళం మరి తిరగదు అతనికి ఆమెని తాకాలని లేదు; మందారం రేకులని విప్పి వికసింప చెయ్యాలనీ లేదు. ఆమె గతం ఊహిస్తే భయమేస్తుంది. తిప్పేస్వామి ఉపన్యాసం ఆమె కంఠంలో వినబడుతోంది. ఎన్నో ముళ్ళు, ఎన్నో కీటకాలు ఆ శరీరాన్ని మైలపరచాయి – ఏమీ తెలీనట్లు యిక్కడ ఆత్మ నిద్రపోతుంది. అతనిలో ఒక కోరిక జనించింది;– ఆమె కంఠాన్ని తన రెండు చేతులతో పట్టుకుని; నులిమి, ఆ సడలిపోని సౌందర్యంతో చంపివెయ్యాలని! అది ఒక వ్యసనం లాంటిది; ఒక తృష్ణ; బడబాగ్ని, శిఖరం కూలి సముద్రాన్ని ఎండింపచేసే ప్రాచీన శక్తి అది. అతని కోర్కెలు, తీరని వాంఛలు, యదార్థంకాని కలలు, అనుసరించలేని ఆదర్శాలూ, అంతరంగికమూ అన్నీ కోమలిలై నిద్రిస్తున్నాయి. ఆమెని చంపితే హత్యకాదు; ఆత్మహత్య. ప్రపంచంలో మరి "చెడుగు" ఉండదు. అమ్మలు, అమృతాలు, దయానిధులు వుండని సంతోషమయ ప్రపంచం. ఆ సంకల్పంతో పెద్ద పోరాటం సాగించాడు. అధో లోకంలోని క్రూరమృగాల వేట అది. బాల్యంలో బంధించబడ్డ జంతువులు సంకెళ్ళు త్రెంచుకుని స్వేచ్ఛా విహారానికి గర్జిస్తున్నాయి. లోపల అధికారం, అఘాతం, చీకటిలోయ మృగాల సంచారం, ఆకాశంలో తలుపులు తెరుచుకున్నాయి. అతను చూసి, దిగివచ్చి మధ్య నిలబడి పెనుగులాడుతున్నాడు.

సోఫా మంచానికి దగ్గరగా లాగి కోమలికి అడుగు దూరములో కూర్చున్నాడు ఎవరో హృదయంలోని ఆలయపు తలుపులు తెరిచారు. కోమలిపై అతనికున్న ద్వేషం, చంపాలన్న కోర్కె, వెనక్కి ప్రయాణం చేసి, జన్మస్థాపన వెతుక్కుంటోంది.

అమ్మపై ద్వేషంగా మారిన తన సహజ ప్రేమ వాటి జన్మస్థానం. ఆ దృశ్యం నిజంగా జరిగిందా? లేక తను వూహించిందా? తన తండ్రి, తల్లిని పీక పిసుగుతున్నట్లు అతనెక్కడో – ఎక్కడో చూశాడు. తన ఆదర్శాలని, అందాన్ని, స్వప్నాలని ఎవ్వరో పీక నులిమి చంపిన దృశ్యం అది. అమ్మ మాత్రం యధార్థం; జగత్తంతా మాయ. ఆ సత్యాన్ని ఎందుకో పీక నులిమి హత్య చేశారు. హంతకుడు మృత్యువాత పడ్డాడు. తను ఎవర్ని చంపడం? అందం, ఆదర్శం, స్వప్నం అన్నీ అమ్మని చూసి నేర్చుకున్న కోమలినా తను చంపడం?

ఆలయంలో గంటలు మ్రోగాయి. ఆ ధ్వనిలో తిప్పేస్వామి కడపటి వాక్యాలు గిరగిరా తిరుగుతున్నాయి. తెర చినిగి జారింది; ఆకాశం అంతా ఒకే తెరచిన

తలుపు; మొగ్గలే లేవు. అన్నీ వికసించిన మందారాలే. వెన్నెల మేఘాల సంకెళ్ళు విప్పుకుంది; వాతావరణం స్వాతంత్ర్యం తెచ్చుకుంది. కోమలి అతన్ని అధోలోకాన్నుంచి విముక్తిచేసి; సత్యసామ్రాజ్యానికి రాణీ అయింది. ఆమెను ముట్టుకోకూడదు.

మూలనున్న దీపం తెచ్చి పెద్దదిచేసి; ఆమె మొహం వైపు చూశాడు.

అప్రయత్నంగా తన కుడిచెయ్యి అతని చెయ్యి మీద వేసింది: "అబ్బో; అంతా తెలుసు" అన్నట్లుగా నిద్రలో నవ్వుతోంది. క్షణం వెలుగు చూశాడు.

ఆమె కుడిచెయ్యి అతన్ని శోధిస్తోంది– అతని బుజంకోసం ఉద్దేశింపబడిన ఆ అరిచెయ్యి దాని దగ్గరకే చేరుకుంది. అప్రయత్నంగా ఒళ్ళు విరిచి, గీర్వాణంగా సింహాసనం మీద కదిలి సౌందర్యాన్ని దిక్కులకు నెట్టివేసింది రాణి. చెయ్యి దీపాన్ని కొట్టింది. దీపం కిందపడి చప్పుడైంది. తటాలున లేచి కూర్చుంది.

"మీరా!....ఎప్పుడొచ్చారు? ఎందుకు లేపలేదు?" ఏవో మసగ ప్రశ్న ఆవులిస్తూ అడిగి, అతన్ని మంచంమీదికి లాక్కుంది.

"కోమలీ! నీకు తెలుసా? చిత్రం జరిగింది" అని అడిగి, ఆమె చేతులని తొలగించి, పాదాలదగ్గర కూర్చున్నాడు.

"ఏమిటి?"

"నాకు నలుగురు భార్యలున్నారని యిక్కడ మనుషులు చెప్పుకుంటున్నారు."

"అందులో చిత్రం ఏముంది? అందరు మొగాళ్ళూ అంతేగా! చేసుకున్న పెళ్ళాలు కారనుకోండి! మొన్న రాజమ్మగారు చెప్పింది – ఇక్కడ చాలామందికి యిద్దరు పెళ్ళాలుండటం మామూలేట! ఓస్, యింతేనా?" మొహం ప్రక్కకి తిప్పి తలగడవేసి నవ్వింది.

"దాని అర్థం నీకు తెలుసా?"

"ఆ! ఎందరు పెళ్ళాలుంటేనేం? ప్రేమించడం ఎప్పుడూ ఒకర్నేగా! నేనంతేగా–"

"ఈ విషయం విన్నతర్వాత నీకు; నా మీద అసహ్యం వేయలా?"

"వేయలా – మిమ్మల్నింకా, యిదిగా ప్రేమిస్తున్నాను."

"నాకు నా మీదే అసహ్యం వేస్తోంది. నా మనస్సు నిజంగా ఎల్లాంటిదో తెలుసుకున్నవారెవ్వరూ నన్ను ప్రేమించరు."

"నాకు తెలుసు – అందుకనే ప్రేమిస్తాను కూడా" అంది కోమలి. అతడు లేవబొయ్యాడు.

"ఉండండి – గాజు పెంకులు తీస్తాను" అంటూ కోమలి లేచి, అతన్ని పక్కగా నడిపించింది. ఇద్దరూ బైటికి వచ్చారు. అతను గబగబా మెట్లెక్కి పైడాబామీదికి వెళ్ళాడు. కోమలికూడా వెనకాలే వెళ్ళింది. వారి రహస్యాలు వినేందుకన్నట్లు వెన్నెల వారి దగ్గిరిగా వచ్చి విశాలంగా తొంగిచూస్తోంది. చంద్రుడు మచ్చని మేఘంలా రహస్యంగా దాచుకున్నాడు.

"నాకు ప్రేమించబడే అర్హత పోయింది కోమలీ –"

"నేను బ్రతికివుండగా పోదు–" అని అతని భుజంమీద తలకాయ ఆనించింది. వేడి నిట్టూర్పు వెన్నెలలో చల్లబడింది. ఆమె కళ్ళల్లోకి చూస్తే విశ్వాసానికి అవతలొడ్డు కనిపించింది. అతను అవతలకి అడుగు వెయ్యలేదు.

"మనం స్నేహంగా వుండగూడదూ?" అన్నాడు.
"ఉన్నాంగా—"
"ఇంత దగ్గరగా కాకుండా వుండలేమూ?"
"ఇంతకంటే దగ్గరగా ఎవ్వరూ వుండలేరు."
"శరీరాలు లేని ఆత్మలమైతే ఎంత బాగుండును!" అన్నాడు.
"ఆత్మలు విడివిడిగా వుంటాయి. ఒక్క శరీరాలే దగ్గరగా కలిసివుండేది—"
"నీకెవరు చెప్పారు?"
"నేనూ చదువుతున్నాను భగవద్గీత."
"నీ కర్థమౌతోందా?"
"ఓ—అసలది నాలాంటివాళ్ళకోసమే వ్రాశారు ఎవరో."
"అంటే?"
"ఏమో, నాకు తెలీదు. చదువుతున్నప్పుడు అదంతా నిజంగా ఉంటుంది. పుస్తకం మూసేస్తే ఏమీ వుండదు."
"అట్లాంటప్పుడు నువ్వెందుకూ ప్రేమించడం?"
"ప్రేమ పవిత్రమైంది—"
"ఓస్!"
"నిజం."
"మరి నా మీద కోరికెందుకు?"
"అది మనస్సుకి, ఇది శరీరానికి— అద్దైనా మీరు కాబట్టి."
"అలా వద్దు — అసలు కోర్కెలే వద్దు — ఇద్దరం యిలాగే స్నేహంగా వుందాం. ఏం? శరీరాల స్నేహం ద్వేషంగా మారుతుంది. ఆత్మలని చంపేస్తుంది—"
"అబ్బో — అంత లాగ నేనుండలేను."
"మరి ఆ అలవాటు వదుల్చుకోవాలి. అది యోగం, తపస్సు."
"అంటే..."
"కష్టం కాదు? ఎప్పుడూ, చచ్చిపోయ్యేదాకా అలాగే—?"
"ఆ!"
"అమ్మో—ఒక్కసారికూడా వద్దు. ఒక్కసారి. మళ్ళా వద్దు."
"అట్లాచేస్తే మనం అందర్లానే ఐపోతాం. అట్లా చెయ్యకపోవడంలోనే వుంది అందం. జీవితం వింతగా వుంటుంది. బ్రతుకుమీద విసుగు పుట్టదు. గొప్ప గొప్ప పనులు చెయ్యొచ్చు" అన్నాడు.
"అట్లాగైతే మీరెవరిలాగో వుంటారు, కొత్తగా వుంటారు" అన్నది.
"అలా వుంటేనే తమాషాగా వుంటుంది చూడు, నీ ముఖంతో నాకు పరిచయం వుంది కాని, శరీరంతో లేదు. మనం రోజూ చూసే వాటినీ, బాగా ఎరుగున్న వాటినీ ఆదరంతో చూసి ప్రేమిస్తామా? అట్లా చెయ్యం. రోజూ వుండేదే — యింతేగా అనుకుని అసహ్యించుకుంటాం. కాని, తెలీనిదాన్నీ, కొత్తదాన్నీ తెలుసుకుందామని శోధిస్తాం — ఆ పరిశోధనే ప్రేమంటే. ప్రియుడు ప్రియురాల్ని ఎంతవరకూ ప్రేమిస్తాడు? — ఆమె పరిచయం దొరికి, భార్యగా చేసుకునేవరకూ. అంతే! తర్వాత, వాళ్ళు మామూలు మొగుడూ — పెళ్ళాలలాగా కీచులాడుకుంటారు, పిల్లలు

పుడతారు. మళ్ళా వాళ్ళ శరీరాలు కొత్తవవుతాయి. ఐనా వాటిని సహించలేరు. ఆమె పిల్లాడిని ప్రేమిస్తుంది. అయ్యో, నన్ను మరిచిపోయిందే అని మొగాడు ఏడ్చి ద్వేషిస్తాడు. అలాగే చిత్రకారుడు అందాన్ని ప్రేమిస్తాడు. ఎంతవరకూ? అది తన రంగు ద్వారా పటంలో లభ్యమయ్యేవరకూ. అందాన్ని బంధించిన తర్వాత, అతను బాహ్య ప్రపంచానికి దాస్యం చేస్తాడు. కవుల విషయం అంతే – 'సత్యాన్ని' మాటలలో బంధిస్తారు. సత్యానికి దగ్గరగా రావడమే కవిత్వం. భక్తుడు దైవాన్ని అన్వేషిస్తాడు. జీవితం అంతా ఒక అనంతమైన అన్వేషణ. జీవిత రహస్యాన్ని శోధించడం, రహస్యం తెలుసుకున్న తర్వాత, అన్వేషణ మానడు. అర్థంకాక అన్వేషణ మానెయ్యడం జరుగుతుంది. అలాగే మనం ఒకరికొకరు అర్థం కానంతవరకూ, శరీరాలు పరిచయం కానంతవరకూ ప్రేమించుకుంటాం."

అతను మాట్లాడుతుంటే, ఆమె అతని కళ్ళలోకి నిశ్చింతగా చూచింది. మెదడులో మెదల్దం మరిచిపోయినా ఊహలు పీడిస్తున్నాయి. మెదడు గుండెల దగ్గరగా వెళ్ళినట్లయింది. కోమలికి అదొక వింత అనుభవం. కోమలి తన్మయంతో అతన్ని బిగించేసి, నేలమీదికి కూలి, అతన్ని కిందికి లాగేసింది.

ఆమె పడుకుంది, అతని తొడపై తల ఆనించి ఆకాశం కేసి చూస్తూ. ఆమెలో మరి కోరిక లేదు. ఊహని కలవరపెట్టే కొత్త అనుమానాలే అన్నీ.

"ఐతే, జీవిత రహస్యం అంటే ఏమిటి?" అని అడిగింది.

అతనికి నవ్వొచ్చింది.

"చూశావా– నీచేత ఈ ప్రశ్న అడిగించేటట్లు చెయ్యడమే జీవిత రహస్యం!"

"పోండీ – మీదంతా వేళాకోళం. చెప్పకపోతే, పోనీలెండి. నేనే కనుక్కుంటా–"

"తప్పకుండా.నిద్రపో, స్వప్నంలో కనబడుతుందిలే–" అని అతను కూడా వెన్ను వాల్చాడు.

"నే కనుక్కున్నా రహస్యం మీరే–"

అని మత్తుగా నవ్వి నిద్రలో చూపు తెరిచింది – తెల్లారింది. సూర్య కిరణాలు చెవుల్లో గిలిగింతలెట్టి వారిని లేవగొట్టాయి.

★ ★ ★

# ఆకులు రాలడం

నెల గడిచిన తర్వాత, ఇందిరకి జబ్బు తీవ్రరూపం దాల్చింది. నిధిని వెంటనే రమ్మనమని టెలిగ్రాం వచ్చింది. శీతాకాలం, చలిరోజులవి. టెలిగ్రాం చూసుకుని దయానిధి మేడమీద గదిలో కొచ్చాడు. కోమలి రాట్నం వడుకుతోంది. అతను తొందరగా సామాన్లు సర్దుకున్నాడు.

"టపా చూసుకున్నారా? యిందాక వచ్చాయి—" అంటూ ఉత్తరాలకట్ట అతని కిచ్చింది.

అందులో ఒకటి రొమాంటిక్ సీను దగ్గరనుంచి – అందులో కొంతభాగం:

"నాకు నిన్ను చూడాలనుంది. నేను వస్తాననడం, మళ్ళా రాలేకపోవడం, నీకూ, నాకూ మామూలై పోయింది. ఈసారి వస్తున్నానని రాస్తే నువ్వు నమ్మలేవేమో, గొల్లవాడు తోడేలు కథలో మాదిరి. ఐనా హిందూదేశం యింత పెద్దది కావడం, భారతీయుల దౌర్భాగ్యం అనుకుంటా. దేశం వైశాల్యమే ఈ దేశం యొక్క అభివృద్ధికి అంతరాయం అనుకుంటా. ఒక్కరోజు చూడకపోతే సూర్యుడు అస్తమించడనుకొనే బాల్య స్నేహితులు, నెలలు సంవత్సరాలు కలుసుకోకుండా ఎవరి ఇళ్ళల్లో వాళ్ళే బంధించబడి, జీవితం ముగిస్తారేమో! చిన్నప్పుడు అంతా ప్రేమ, స్వేచ్ఛ, వెలుగు. రోజులు గడిచిన కొద్ది వెలుగు సన్నగిల్లుతుంది. జైలు కడ్డీల నీడలు పొడుగవుతుంటాయి. బాల్య స్నేహాలు, శృంగారంతో కొట్టుకునే హృదయాలు, ఒక్కటొక్కటే విడిపోయి; జారిపోతాయి. ఒక్కరొక్కరే చెట్ల ఆకులు మాదిరి రాలిపోతారు. జనసమూహంలోంచి ఏకాంతంలోకి నడవడం లాంటిది. నా ఉద్యోగం, నా కుటుంబం, నా పిల్లలు, నా ఊరు, నా దేశం, నా మతం – యీ 'నా'లో మానవుడు బంధించబడతాడు. 'నా' లేకుండా వుంటే ఎంత బాగుండును? ఇల్లాంటి ఎన్నో నీతో మాట్లాడుకోవాలనుంది. రేపు సాయంత్రం బండికి వస్తున్నానంటే నవ్వకు సుమా?"

ఆ వుత్తరం చదువుకుని, సర్దిన పెట్టెని ఒక మూలగా నెట్టివేసి, సోఫాలో కూర్చున్నాడు. కోమలి సోఫా వెనకాలకొచ్చి అతని, బుజం మీద చెయ్యి వేసింది.

"నన్నుకూడా తీసుకెళ్ళరూ, ఇందిరని చూస్తాను" అన్నది.

"నేను వెళ్ళడం లేదు. రేపు ఒక స్నేహితుడొస్తున్నాడు."

"ఎక్కువగా వుందిటగా, వెళ్ళకపోతే బాగుండదు. స్నేహితుడికి రావద్దని టెలిగ్రాం ఇవ్వండి."

"ఐనా, నేను వెళ్ళి చేసేదేముంది?"

"అదేమిటి అలాగంటారు? పెళ్ళాంకి ప్రాణం మీదికి వచ్చినా వెళ్ళి చూళ్ళేదని, మిమ్మల్నే అంటారు—"

"ఇప్పుడనడంలేదు గనకనా?"

"పైగా, నా మూలాన్నుంచి అంటారు, తెలిసిందా?"

"నువ్వు నాతో కూడా వస్తే ఇంకా ఏమనుకుంటారో అని భయం లేదూ నీకు?"

"ఉందనుకోండి – నేను ఇట్లాంటి వాటికి అలవాటు పడ్డదాన్ని – తెగించినదాన్ని."

"నేనూ అంతే–"

"నే నొచ్చి ఆవిడకి సంరక్షణ చెయ్యాలని వుంది."

"నిన్నూ నన్నూ చూస్తే, జబ్బు మరింత ఎక్కువయి, అప్పుడే కళ్ళు మూస్తుంది. ఏ స్త్రీ మరో స్త్రీని హర్షించదు."

"ఏంమ్మాటలండవి? ఆడదాని మనస్సు మీకు బొత్తిగా తెలీదు. పోనీ మీరు రేపు వొద్దురుగాని, ఈలోగా నేనూ, నారయ్యా వెళ్ళిరామా?"

ఇంతలో మెట్లమీద అడుగుల చప్పుడైంది. ఐదారుగురు పనివాళ్ళు, మేస్త్రీ నెట్టేకల్ తొందరగా లోపలికొచ్చి "ఇట్లారండి" అని సంజ్ఞ చేశారు. దయానిధి, కోమలి గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళారు. ముందు వరండాలో నారయ్య చాపమీద పడుకున్నాడు. భుజాలమీది రెండు పెద్ద గాయాలు, నెత్తిమీద చిన్నగాయం తగిలాయి. రక్తం కారుతోంది. తొందరగా బాగ్ తీసుకొచ్చి నిధి చికిత్స చేస్తున్నాడు.

"సోమప్పగాడి పనండి" అన్నాడు మేస్త్రీ.

"ఏం?" అని అడిగింది కోమలి.

"మీరేం సెప్పక్కర్లే, మీ పన్లమీద మీరుపొండి" అని నారయ్య మూలిగాడు.

నారయ్య పెద్దంగా రెడ్డిమీద అరుస్తాడు. ఓసారి పనికాడ అంగీ ఇప్పమంటుంటాడు నారయ్య. నే ఇప్పేది లేదంటుండాడు రెడ్డి. అవలికి నారయ్య లెగిసి పోయుండడు. రెడ్డి సోమప్ప నీ దేంది నువ్వో కూలోడివని యాడ్ని గదమాయించినోరు. ఈడు, ఆళ్ళని అరిసి, తంతాననుండడు. అదిక్కాబోసు, తన్నుండొరు."

కోమలికి ఈ కథ యేమీ అర్థంకాలేదు. తెల్లబోయి నిధికేసి చూస్తూ నిలబడింది. మరో పనివాడు సింగప్ప చెప్పడం మొదలెట్టాడు:

"ఈ పీకులాట దుడ్డుకాడొచ్చుండది అయ్యలారా! అయ్యవారితో సెప్పి, రెడ్డి బత్తెంలో బొట్టి తగ్గస్తానదుండడు నారయ్య. ఇది ఇనంగానే సోమప్పకి సివమెత్తింది. మారెమ్మ లేదండి సామే, రెడ్డితో పరాచికాలాడుతుంది అని నారయ్యకి పట్టలేదండయ్య. వోరా దాని జోలికి పోవద్దని నారయ్య పెద్దగా అరిసి ఏరు చేసుండడు. నారయ్యకీ, మారెమ్మకి యేందో వుందని రెడ్డి లెగసినాడు. మారెమ్మని, రెడ్డి ఒకాడనే ఒద్దని, యేరేరుంగా తొవ్వండని నారయ్య డొకాయించినాడు, మారెమ్మ సోమప్పతో సెప్పకుంది. అది రెడ్డికి కన్నెర. ఇద్దరు ఏకమై మెత్తగా తన్నుండొరు."

ఈ కథ కూడా కొమలికి పూర్తిగా అర్థంకాలేదు, వాళ్ళని కేక లేశాడు. నలుగురు పనివాళ్ళు జారిపొయ్యారు.

గిరి గుప్పన్న మాత్రం మిగిలాడు దీనంతటికి కారణం అతను చెప్పడం మొదలెట్టాడు:

"ఇదంతా అల్ల కర్నూలు సాముండడే, అడెక్కించిన బిస."

"కర్నూలు స్వామెవరు?" అన్నాడు నిధి.

"ఆడా, యీాడా గుంపుల్లో ఎగడి ఏదో సెప్తుంటాడు. ఆ మద్దిన మీరు యీాడలేరు. సామీ కర్నూల్ లో మీటింగు చేసుండడు. ఎన్నోళ్ళుని రమ్మని డబ్బుకే యిస్తే, నేపోయుంటిని. ఆడు, దుడ్డు బాగా యిస్తేగాని, పనుల్లో కెళ్ళొద్దని, యినుకిచ్చిండాడు రెడ్డికి సివమెత్తింది. నారయ్య దుడ్డు కోయిస్తానంటుండడు అయ్యవోరితో చెప్పి, యీాణ్ణి ఏస్కోవాలెహె అని సోమప్పతో సెప్పి, మారెమ్మ సాకుమీద బాగా తన్నుండరు."

తన బాధ్యత తీరిపోయినట్లు, అతను కూడా వెళ్ళిపోయాడు. మూడు కథలు విన్న తరవాత నారయ్యని, వాళ్ళు ఎందుకు కొట్టారో నిధికి బోధపడింది. నారయ్య మాట్లాడడం మానేశాడు. కట్లు కట్టింతర్వాత నిధి లోపలికి వచ్చేశాడు.

"మీ కేమన్నా బోధపడిందా?" అని అడిగింది కోమలి.

"నారయ్య రెడ్డిమీద అధికారం చలాయించబొయ్యాడు. మారెమ్మతో రెడ్డి సరసాలాడడం నారయ్యకి నచ్చలేదు. తిప్పేస్వామి పనివాండ్రని ఎక్కువ జీతాలకోసం సమ్మె చెయ్యమని ప్రోత్సహించాడు. ఇవన్నీ కారణంగా, రెడ్డి, సోమప్ప కలిసి, నారయ్యకి పారం చెప్పారు. ప్రజాప్రభుత్వం ఎట్లాగుంటుందో కాస్త రుచి చూపించారు."

"ఐతే మీరెళ్ళరూ?"

"ఎట్లా వెళ్ళను?"

మాట్లాడుకుంటుండగా ఇందిరకి మరీ తీవ్రంగా వుందని మరో టెలిగ్రాం వచ్చింది. తనే చూడ్డానికి వస్తున్నానని శ్రీనివాసరావుకి నిధి టెలిగ్రాం యిచ్చి ప్రయాణం కట్టాడు. సాయంత్రం బండికి, మధ్యాహ్నం రెండు దాటింది. స్టేషన్ కి బండికోసం కబురుచేశాడు నిధి. ఈలోగా అనంతాచార్లుగారు చక్కావచ్చాడు. ఆయన్ని చూడగానే కోమలి లోపల గదిలో కెళ్ళిపోయింది. తలుపు వెనక నిలబడి, వారి సంభాషణ వింటోంది.

"మొన్న దేవరకొండలో మళ్ళా గంద్రగోళమైంది. విన్నావా?" అన్నాడు అనంతాచార్లుగారు.

"చూచాయగా తెలిసింది."

"మళ్ళా మీ రాజభూషణమే అల్లరిపడ్డాడు. మీటింగు ముగిసిం తర్వాత గుండప్పగారింట్లో భోజనాలు ఏర్పాటయ్యాయి. అక్కడ పెద్ద వాదం జరిగింది. గుండప్పగారికి ఇద్దరు భార్యలు. ఇతను ఆయన్ని ఆక్షేపిస్తూ మాట్లాడుతున్నాడని అనుమానపడి, గుండప్ప, సర్కార్ల వాళ్ళకి నీతి, మర్యాద లేదని జాడించేశాడు. ఆ ఘర్షణలో నీ పేరొచ్చింది. కోమలి పేరుకూడా ఎత్తినట్లు నాకు గుర్తు—"

"గుండప్పగారి ఫిర్యాదు ఎట్లాంటిది?"

"ఏముంది? ఏవో అనవసరపు ఉద్రేకాలు తెచ్చుకొని, మాటా మాటా అనుకోడం, పెండ్లిలేకుండా పరాయి స్త్రీతో ఉండటంకంటే ఇది మెరుగు అంటాడు. భార్యని ఇతరులు అపహరించకుండా కాపాడుకోడమే పెండ్లని రాజభూషణం అన్నాడు. దానిమీద ఆయన రెచ్చిపొయ్యాడు. కొట్టుకునేందుకు సిద్ధపడ్డారు. నేను అడ్డంపడి సర్ది చెప్పాను. నన్ను మట్టుకు వొదిలారనా?"

"ఏం?"

"ఏముంది? తుంటర్లు! కాత్యాయనికి పెండ్లి కావడం కష్టం అంటాడు గుండప్ప. పోన్లే, మా అమ్మాయి విరాగినిగానే ఉంటుందిలే, నీకెందుకన్నాను. ఇంతకీ రాజభూషణం ఆ రాత్రే, మా ఎవళ్ళకీ కనబడకుండా వెళ్ళిపోయాడు. ఈ రెడ్లు, పాపం, నారయ్యను చావదన్నారు— చూశావా?"

"అవును, మరి నారయ్యదే తప్పనుకుంటా" అన్నాడు నిధి.

"ఏడిశారు వెధవలు! ఒళ్ళు పొగరెక్కి ఇద్దర్నీ పనిలోంచి తీసేయాల్సిందే—" అన్నాడు ఆచారిగారు.

"దానివల్ల సమస్య పరిష్కారం కాదు. అంతకీ కారణం ఏదో ఉంటుంది. దాన్ని తొలగించాలి. మీకేమన్నా తెలుస్తోందా?"

"నాకేమీ కనబడ్డం లేదు."

"జాతివైరం, సరిహద్దుల కొట్లాట – బీదలకి, ధనికులకి నిరంతరం జరిగే యుద్ధం. ఆర్థిక సమానత్వం వుంటేగాని మానవుడు అందరినీ సమానంగా ప్రేమించడం నేర్చుకోడు."

"సోషలిజమ్ రావాలనా నీ వూహ?"

"నా వూహ కాదు. దయాదాక్షిణ్యాలు, ఔదార్యం, ప్రేమ— ఇల్లాంటి విలువలకీ, భౌతిక సంపదకీ అంతటి దగ్గర సంబంధం ఉంది. ఉత్తమ ఆధ్యాత్మిక జీవనం అన్నింటినీ త్యజించి చీకూ చింతలేని యోగికే సాధ్యం అవుతోందిగాని, కుటుంబీకుడికి సాధ్యపడటం లేదని మీకు తెలియంది కాదు. అందరూ యోగులు ఎల్లానూ కాలేరు. కారు; కాకూడదుకూడానేమో! అంచేత, అందరికీ సమాన భౌతిక సంపదని సమకూర్చడంతప్ప గత్యంతరం లేదనుకుంటా. దాన్ని సోషలిజమ్ అనండి; మరోటనండి."

"అవన్నీ గాలిలో మేడలు కాని, జరిగేపనా? జరిగినా; మనిషికి కావల్సింది తిండీ, బట్టా— అంతేనా?"

"అంతే అనను. అవి లేందే, ఇంకేవీ రావంటాను అంతే! ప్రభుత్వం, ద్వీపాంతర వాస శిక్షలో వున్న వాళ్ళకి, తిండీ, బట్టా సమానంగా ఏర్పాటుచేస్తుంది. ప్రేమ, ఔదార్యం ఆధ్యాత్మిక చింతన మనం వాళ్ళల్లో చూడొచ్చు. ఉత్తమ గ్రంథాలు జైళ్ళల్లో వ్రాయబడినవే – బట్టని విసర్జించిన వ్యక్తి న్యూడిస్టు కాలనీలో మోక్షం పొందుతాడేమో చెప్పలేను కాని, తిండిని విసర్జించి మోక్షం పొందిన జీవిని ఎవ్వరూ చూడలేదు."

అనంతాచార్లుగారు ఆలోచనలో పడ్డా, ఏదో ప్రశ్న అడగడానికి సందేహిస్తున్న వాడికిమల్లే వున్నారు. రెండు మూడుసార్లు ఆ ప్రశ్న నోటిదాకా వచ్చింది. ఐనా దిగమింగేశారు; మరోప్రశ్న తెగించి అడిగేరు:

"పోనీ, మనిద్దరం వెళ్ళి నీ భార్యని తీసుకొద్దామా?"

"జబ్బుగా వుందట. ఇప్పుడే వెళుతున్నా, చూడ్డానికి. తవ్వు ఇరవై అడుగులేనా పూర్తయినట్లు లేదు."

"వారంలో అవుతుంది— పనివాళ్ళు పల్చబడకపోతే."

"గని తవ్వించడం విరమిద్దామా అని ఉంది."

"ఇంతవరకూ వచ్చి, ఇప్పుడు మానెయ్యడం ఎందుకు? ఆ పనులన్నీ నేనే చూస్తాలే. నువ్వెళ్ళి, నింపాదిగా ఉన్న తరవాత తీసుకురా."

ఇంతలో, కోమలి రొట్టెముక్కలు, పంచదార పళ్ళెంలోవేసి కప్పుతో పాలు తీసుకొచ్చి, ఆచారిగారి ముందు బల్లమీద పెట్టింది. ఆమెని చూడగానే ఆచారిగారు కుర్చీలో కదిలాడు.

"నేను కూడా వస్తానంటున్నానండి."

"ఇక్కడ ఒక్కదానవు వుండనక్కర్లేదులే. మా ఇంట్లో ఉందువు గాని" అన్నాడు ఆచార్లుగారు.

"నా మూలాన మీకూ్కడా కష్టం ఎందుకు కలగాలి?"

"కష్టం ఏముంది?"

"కష్టం కాకపోతే, పోనీ నింద. కాత్యాయనికి పెండ్లయితే, ఎవ్వరికీ బెంగ వుండదు."

ఆచార్లుగారు ఏమాట్లాడలేదు; పాలు తాగేసి, వెళ్ళొస్తానంటూ వెళ్ళిపొయ్యాడు.

"పాపం, నారయ్యని వదిలి వెళ్ళనా?" అన్నాడు నిధి.

"నే చూస్తాలెండి, ఏం భయం లేదు. డాక్టర్లు, నర్సులు యింత ముందున్నారుగా!" అంది కోమలి.

ఇంతలో బండి వచ్చింది. కోమలి పెట్టి, బెడ్డింగు బండిలో పెట్టింది నిధి నారయ్య దగ్గరకెళ్ళాడు.

"సులువుగానే ఉంటుంది. మీరెళ్ళి రండి. కోమల్ని తీసుకెళ్ళమోకండేం" అంటూ నీరసంగా అన్నాడు నారయ్య.

"లేదు, ఒక్కణ్ణే వెడుతున్నాను."

"అసలు తగువంతా దానిమూలకంగానే వచ్చిందండి."

"ఏం?"

"ఆళ్ళ కూతలకేం గాని, ఆ రెడ్డి, కోమల్ని గురించి ఏటేటో అనబొయ్యాడు. మూతిమీద ఒక్కటంటించాను. దాన్ని ఆళ్ళకాడికి, యీాళ్ళకాడికీ పంపి నేనూ మీరు డబ్బు గణిస్తున్నా మన్నారండీ, తొత్తు కొడుకులు. నాకు సీదరేసి వుతిగానండి. ఇట్టా సేసినారు ముండాకొడుకులు. లెగనీండి, మక్కలిరగదంతాను."

"నారయ్యా! మన పరిస్థితులు సవ్యంగా లేనప్పుడు, లోకులు అనేకం అనుకుంటారు. అవి నిజం కానప్పుడు, మనం కోపగించుకోటం దేనికి? మంచితో వాళ్ళని జయించాలిగాని, పగ సాధిస్తే సర్వనాశనం అవుతుంది."

"ఈ నా కొడుకుల్తో మంచేటండి? ఏ ఎండకి ఆ గొడుగేనండి."

"సరేలే – పడుకో. "

"ఏం భయంలేదు, వెళ్ళిరండి."

నిధి వెళ్ళి బండిలో కూర్చున్నాడు.

కోమలి నిలబడి, బండిలోకి వొంగి, అతని చేతులు పట్టుకుని, కళ్ళల్లోకి జాలిగా చూసింది.

"దబ్బుని రావాలి."

"ఎన్ని రోజులవుతుందో ఏం చెప్పగల్ను?"

"మిమ్మల్ని చూడకపోతే వుండలేను. నేనూ వచ్చాస్తా రేపో మాపో. కోపగించుకోకండేం?"

"నారయ్యని వదిలే!"

"ముసిలాడిది దుక్క శరీరం, చావడు" అని నవ్వింది.

"వచ్చేటప్పుడు అమృతంగార్నీ, ఆవిడ తమ్ముడినీ, అందర్నీ తీసుకురండి."

బండి కదిలింది, కోమలి పడబోయి, వెనక్కి తుళ్ళిపడి, బండి సందు తిరిగేదాకా చూస్తూ నిలబడింది. దూరంగా ఎర్రచీరలో, చిన్న చుక్కలాగై ఎండలో కలిసి మెఱిసి, మాయమైంది కోమలి.

☆ ☆ ☆

స్టేషన్‌కి ఎవ్వరూ రాలేదు. బండి దిగి మామగారింట్లో అడుగు పెట్టేటప్పటికి సాయంత్రం నాలుగైంది. ఇంట్లో మనుషుల సందడి లేదు. పనిమనిషి ముందువా ఊడుస్తోంది. మధ్యలో నిలబడి "ఎవరికోసమండీ?" అని అడిగింది. నిధికి ఏం సమాధానం చెప్పాలో తెలిసిందికాదు. ఎవర్నీ వరసలెట్టి పిలవడం అలవాట్లేదు. బెడ్డింగు బల్లమీద పెట్టించి, అరుగుమీద పచార్లు చేస్తున్నాడు. ఇంతలో ఏడెనిమిదేళ్ళ వయసుగల కుర్రాడు అతని దగ్గరగా వచ్చి "ఆ బల్లకింద నా బొంగరం ఇరుక్కుంది, తీసిపెట్టరూ?" అన్నాడు.

"ఎవరమ్మా నువ్వు?"

"మాధవయ్యగా రబ్బాయిని, మీరెవరు?"

"ఇందిర తమ్ముడివా?"

"ఊఁ, నా బొంగరం తియ్యరూ?"

అబ్బాయి మొహాన్నిబట్టి ఇందిరని ఊహింప యత్నిస్తున్నాడు నిధి. బల్లకిందికి పాకి, కర్రతో ఇవతలకి లాగాడు. దాంతోపాటు చచ్చిన ఎలకకూడా ఇవతలికొచ్చింది.

"నే నెవర్నో ఎరగవా?"

"ఉహూఁ" అంటూ తలపంకించి, బొంగరంతో రోడ్డుమీదికి నడిచాడు కుర్రాడు.

"అయ్యగారు లోపలుండారు, రమ్మంటుండారండి" అన్నది పనిమనిషి. లోపలిగదిలో చాపమీద గోడకి జార్లపడి కూర్చున్నాడు మాధవయ్యగారు. మొహం చేతుల్లో దాచుకుని కాళ్ళమీద ఆనుకుని చతికిలబడ్డాడాయన. ఇతన్ని చూడగానే—

"ఆఁ ఎవరు – ఆఁ" అంటూ నివ్వెరపడి చూస్తూ, ఒక్కసారి లేచి, ముందుకు గెంతి, "వచ్చావా, వచ్చావా" అంటూ నిధిని వెర్రిగా కౌగలించుకుని, కళ్ళమ్మట నీళ్ళురాకుండా అతని భుజాన మొహం నొక్కి వుంచాడు.

"ఇంకా నువ్వే బతికించావు. మమ్మల్ని దేవుడు ఏట్లోకి నెట్టేశాడు" అంటూ కూలబడి, విశ్శబ్దంగా బాధపడుతున్నాడాయన.

"ఇందిరేది?" అన్నాడు నిధి మొహం అవతలకి తిప్పేసుకుని.

బాధపడుతున్న వాళ్ళ మొహాలు చూడటానికి అలవాటుపడ్డా, అతనికి ఇదో వింత అనుభవం. ఈ దృశ్యంలో అతనికి బాధ కనపడలేదు కాని, ఒక అవాంతరాన్ని తొలగించేటందుకు, మరో అవాంతరాన్ని ఆహ్వానించినట్లుగా ఉంది.

"విన్ను పోగొట్టుకున్నాను – శాస్తి జరిగింది. కర్మఫలం వూరికే పోతుందా?"

ఏవేవో అంటూ మాధవయ్యగారు కూర్చున్నవాడు లేచి, తొట్రుపాటుతో పచార్లు చేస్తూ, పైన తువ్వాలు వేసుకుని నిధిని తీసుకుని, బైటికి నడిచాడు. ఇద్దరూ నడవడం మొదలెట్టారు. నిధి మాధవయ్యగార్ని పరకాయించి చూశాడు. జీవితం ఆయన్ని ఎత్తునుంచి లోయలోకి గిరివాటెట్టింది. కాలం ఆయన్ని మళ్ళా లేవదీసి, పైకి గిరవాటెట్టింది. ఐనా పైన వుండే అర్హత పోగొట్టుకున్న వ్యక్తికిమల్లే పదే పదే లోయలో పడి, గాయాలు తగిలించుకున్న మనిషి. పైన రెండు పళ్ళు లేవు; వెంట్రుకలు బుర్రవేడికి తట్టుకోలేక వూడిపడ్డాయి. ఊడడానికి వోపికలేని తెల్ల వెంట్రుకలు నెత్తినే ఆశ్రయించుకున్నాయి. చర్మం ఎముకల్ని పట్టుకునే శక్తిలేక జారిపోయి, నీళ్ళమధ్య రాతిగుహలో జారి వేల్లాడే వృక్షజాలం మాదిరి, నిలబడి వుంది. శరీరం లోపల చూడొచ్చు, వినొచ్చు ననిపించేటట్లుగా ఉంది.

ఊరవతల చెఱువుగట్టుకి చేరుకున్నారు. దూరంగా పాక, ముందు పందిరి కనిపిస్తున్నాయి. ఊరు తగలబడుతున్నట్లు, పాక వెనుక పడమటి ఆకాశాన్ని సూర్యుడు కాలుస్తున్నాడు. దూరంగా ఆవులమంద కదుల్తోంది. పక్షులు వాటి నిస్సత్తువకి వెక్కిరించినట్లుగా, వెన్నంటి గుంపులుగా లేచి, చెఱువులో పడుతున్నాయి.

"ఊళ్ళో ఉంచడానికి వీల్లేదన్నారు. ఏ శానిటోరియమ్‌లోనూ ఖాళీలేదన్నారు. ఏం చెయ్యను? ఇక్కడ ఏర్పాటు చేశాను" అన్నాడు మాధవయ్యగారు. పాక వెనుక, ఒక ముసలావిడ గిన్నెలు తోముతోంది.

"మా వదినగారు. పాపం, ఆవిడే రాత్రి, పగలూ–"

మంచంపైన మిగిలిన ఇందిర పడుకుని ఉంది. పక్కనవున్న ట్రంకు పెట్టె లాక్కుని మంచం ప్రక్కన కూర్చున్నాడు దయానిధి. వికృతంగా నవ్వింది ఇందిర. అస్థిపంజరం, ప్రక్కకి కదిలింది–చెయ్యి ఇవతలకి తీసింది – ఆ చర్యలో శిశువు జన్మించిన ఆశ్చర్యం వుంది.

"కదలకు – బెడ్‌సోర్స్" అంటూ బయట నిలబడి మాధవయ్య గారు అరుస్తున్నారు.

అతనికేసి నిశ్చలంగా చూసింది ఇందిర. ఎవరో ఎక్కడికో లాగేస్తున్న చూపులని, బలవంతంగా ఒక్కసారి లాగి నిలబెట్టింది. అన్ని శక్తులూ, కంఠంలో ఒక్కసారిగా ప్రజ్వరిల్లాయి. గుండెల్ని కాసేపు కొట్టుకోవడం ఆపుచేసి శబ్దరూపం దాల్చిన అత్యంత శక్తుల ఆర్భాటం అది.

"వచ్చారా?–"

ముసలమ్మగారు యీ దృశ్యం చూడలేక లోపలికెళ్ళి ఏడవటం సాగించింది.

"ఇక్కడ పారేశారు నన్ను–నన్ను వదిలి వెళ్ళకండేం?" అని వోపికలేక ఇందిర కళ్ళు మూసింది.

దయానిధి మనస్సు నిశ్చలంగా వుంది. చుట్టూ శిఖరాలు కరిగి, కదిలి పడిపోతున్నాయి. నదులు జన్మస్థానానికి ఎగ్రబాకుతున్నాయి. నేలమీద పడిపోయిన ఆకులు పైకిలేచి చెట్లని కలుసుకున్నాయి. ఇంత అనిశ్చలమైన వాతావరణంలో తనొక్కడే స్థిరంగా, ప్రశాంతంగా వున్నాడు. అతనిలో వుద్రేకం లేదు, బాధలేదు, బెంగలేదు, దిగులులేదు.

ఇందిరతో కలిసి సూర్యోదయ సౌందర్యంతో అవులించలేదతను; చందమామ చల్లటి అందంలో నిద్రలో ప్రేమతో కదల్లేదతను. నక్షత్రాల కనుసన్నలకి కామంతో వణకలేదతను; చల్లటినీళ్ళ పులకరింతలతో సొమ్మసిల్లలేదతను; గుండెలూ గుండెలూ విశ్వగానంతో మేళవించి కలిసి కొట్టుకోలేదు. అన్ని నదులూ కలసిపొయ్యే మహాసముద్రంలాంటి ప్రేమ ప్రవాహంలో వారి రక్తాలు వేరు వేరుగానే ప్రవహించాయి. సృష్టికోసం పెనుగులాడటం నేర్చుకుని అమాయకపు ప్రాణాలపిచ్చి ప్రశాంతం అతన్ని ఆవరించింది.

పాటలు, పద్యాలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, ప్రార్థనలు – ఎన్ని చేసినా, చందమామ అంతకంటే ఎక్కువగా ప్రకాశించదు. గాలి అంతకంటే జోరుగా వీయదు. కెరటాల సంఖ్య పెంచుకోలేదు సముద్రం. ప్రేమించదు మానవ హృదయం. సుఖపడటం నేర్చుకోని వాళ్ళకి బాధపడటం చేతగాదు.

మళ్ళా ఇందిర చూస్తున్న లోకంలో తలుపులు తెరుచుకున్నాయి; కళ్ళు తెరిచిందా–

"నన్ను ఎప్పుడూ వదిలి వెళ్ళకండేం?" శరీరంలోంచి విడిపోయిన చెయ్యి అతని చేతిని ప్రమాదంగా స్పృశించింది. చేతి చర్మం తిరగేసినట్లుంది. ఇంకా ఈ పెనుగులాట ఎందుకో! ఎవరి కోసమో– ఈ గుండెలు కొట్టుకోవడం ఎందుకో! చర్మాలని పట్టుకొని పీక్కుతినడాలెందుకో! ఈ లోకంలో ముసుగుని మరో లోకంలో తెరుచుకొన్న ఆమె నేత్రాలకి ఈ చీకటిలో దాగుడుమూత లెందుకో!

ఏమనాలి? ఏం చెయ్యాలి? అతనికి తెలీడంలేదు. లేచి బైటికి వచ్చాడు. పడమటి ఆకాశపు మంటలో పడి సూర్యుడు దగ్ధమైపోయాడు. నుసై మేఘాలు కొట్టుకుపోతున్నాయి. ప్రకృతి బాధతో చీకటైంది. పాకచుట్టూ పెనవేసుకుని గాలి మూలుగుతోంది. టెలిగ్రాఫ్ స్తంభంపై కాకి ఏకాంతంగా ఏడుస్తోంది. ఎవరికోసమో లోపల్నుంచి "నాన్నా!" అని పెద్దకేక వినబడింది.

"చూడు నాయనా!" అంటూ మాధవయ్యగారు నిధిని లోపలికి గెంటాడు. "వెళ్ళిపోతారా?" అని ఇందిర రెండు కళ్ళని ప్రశ్నార్థకంగా త్రిప్పి, చూపు నిలబెట్టి వేసింది. అది మృత్యువు జీవాన్ని అడిగిన ప్రశ్నని అతనికి తెలుసు. అతని చేతిని పట్టుకుని వూపింది. ఆ పడవకి లంగరి అందదు; ఏ శక్తీ దాన్ని నిలబెట్టలేదు. మృత్యువుని స్పృశించాడు. జీవంయొక్క కడసారి మాధుర్యం అతని చేతుల్లో తన్నుకులాడింది.

సృష్టి రహస్యాల్ని అతను శోధించినట్లయింది. అతని హృదయం ప్రశాంతమైన వెలుగు వాహిని, సుఖదుఃఖాలని విసర్జించి, ఉద్రేకాలకి అతీతమైన మహత్తర చైతన్యం అతన్ని ఉత్తమ మానవుడ్ని చేసింది.

లోపల ముసలమ్మ; బైట మాధవయ్యగారు, ప్రపంచానికి అర్థమయ్యే ఏడుపు సాగించారు. ఏడ్పులో గాంభీర్యం, పరిపూర్ణత వుంది. దానికి అంతరాయం వుండకూడదు. మానవుడ్ని జీవితానికి కట్టి పడేసేది కన్నీరు. అది అంత్యాలున్నది కన్నీరాకటే దానికి అతీతమయ్యాడు దయానిధి.

మానవ జీవితాన్ని కన్నీటి బిందువుగా మార్చి, అరచేతిలో ఉంచుకొని, దాన్ని పరీక్షగా చూసి కరిగించి వేసే సమయం అది. ఆ కన్నీటి బిందువులో కలిసిన ఎన్నో ప్రేమ వాహినులు; ఎన్నో నవ్వు అలలు; మనిషినీ, మనిషినీ బంధించిన తుంపరుల గొలుసు. యవ్వనంలో వేడెక్కి వార్ధక్యంలో మంచుగడ్డయి, మృత్యువులో పరమార్థం పొందిన కన్నీటి బిందువుకి అర్థమేలేదా? లేదు. కన్నీటికి అర్థం లేదన్న తలంపుకి కన్నీరు తప్ప, కన్నీటికి వేరే అర్థం లేదు.

కర్మకాండంతా తనే జరిపాడు. ఇందిర మహా యిల్లాలన్నారు; పుణ్యం చేసుకుని పునిస్త్రీ చావు చచ్చిందన్నారు. పిల్లలు లేకపోవడం మెరుగన్నారు. అతన్ని మళ్ళా పెళ్ళిచేసుకోమన్నారు పెద్దలు. శవాన్ని తగులబెట్టి నడిచి వచ్చిన కాళ్ళతో పెండ్లిపీటలమీద కూర్చోమన్నారు చితికి అగ్గిపుల్లగీసిన ఆ చేత్తో, అగరొత్తులు ముట్టించమన్నారు.

ఆత్మశాంతికోసం అర్థంలేని ధ్వనులు చేసిన ఆ నోటితో గదిలో బాటసారి చెవులో ప్రేమమంత్రం పఠించమన్నారు. ఈ మనుషులు గోని బస్తా మనుషులు. ఏ బస్తా ఖాళీగా వుండకూడదు. అందులో పుష్పాలు వెయ్యాలి; లేకపోతే రాళ్ళు వెయ్యాలి; కట్టెలు వెయ్యాలి. ప్రతివాణ్ణి ఆ బస్తాలో దిగేసి; చెట్టుకొమ్మకి వ్రేలాడతీస్తారు.

ఐదువేలు కట్నం అన్నారు; పదివేలన్నారు; ఎవరి పీకకో తాడు కట్టి నులపమన్నారు; అందుకు లంచం ఐదువేలు – అందమైన, గుండ్రని మృదువైన అమాయకపు పీకలు. అతను రైలు ఎక్కేదాకా అంటూనే వున్నారు; అతన్ని సెకండు క్లాస్‌లో కూర్చోబెట్టి, పక్క పెట్టెలో కొంత దూరం వరకూ ప్రయాణం చేశారు పెద్దలు. వారిని తప్పించుకొని బైట పడ్డాడు. ప్లాట్‌ఫారంమీద ఆడాళ్ళ పీకలుచూసి భయపడ్డాడు. టికెట్ యిచ్చేసి ఒంటెద్దుబండి కట్టించుకుని గోదావరి రోడ్డుకేసి పోనీమన్నాడు.

గోదావరి గట్టమ్మటే నాలుగు మైళ్ళు వెళ్ళింతర్వాత దయానిధి, జగన్నాథం ఆశ్రమానికి చేరుకున్నాడు. తొమ్మిది గంటలైంది. గట్టుకి ఫర్లాంగు దూరాన, పల్లంలో, ఒక పెద్ద పూరిపాక, రెండు మూడు చిన్న గుడిసెలు వున్నాయి. ముందు రెండు పెద్ద చెట్లు చల్లటి నీడల్ని వేస్తున్నాయి. వెనక గడ్డివామి, రెండు మూడావులు, దూడ గంతులేస్తూ మేస్తున్నాయి. ఒడ్డున సగం నేలపైకి లాగిన పడవ, కర్రకి కట్టివుంది.

నిధి బండిలోంచి తన బెడ్డింగు దించి, బండివాడికి డబ్బులిస్తుండగా దూరంగా లోపల్నించి ఒక సన్నటి పొడుగాటాయన పరుగెత్తుకుంటూ వచ్చాడు. మధ్యపాపిడి, పక్కలకి అణిచి దువ్విన పొడుగాటి వెంట్రుకలు సన్నగా ఒత్తుగా లేచిన ముక్కు, కొంచెం బైటికి వచ్చే కింద పెదవి, తెల్లటి వదులు ఖద్దరు పైజమా, బొత్తాలు లేని కంటిమెడ లాల్చీ, పైన తువ్వాలు, ఎడంచేతిలో పొట్టికర్ర—ఆ వ్యక్తి జగన్నాథం!

"రుగావబా, రుగావబా–" అన్నాడు, పూర్తిగా బొంగురు కాని కంఠంతో. యవ్వనంలోని ఆ బలత్వం ఇంకా ఆ కంఠంలో వుంది.

నిధి వెనక్కి తిరిగాడు. జగన్నాథం రెండుచేతులూ అతని మెడ చుట్టూ వేసి కౌగిలించుకుని, "రుగావబా, కిళ్ళున్నావ, కిళ్ళున్నావ..." అన్నాడు. ఆర్చిలా అమర్చబడ్డ నల్లటి కనుబొమలు అతని కళ్ళకి ఒక తీవ్రత నిచ్చాయి. ఆ తీవ్రత ఉద్రేకంతో చలించింది.

"తమిళం నేర్చుకుంటున్నావా?" అన్నాడు నిధి.

"మా పాఠశాలలో చేరినవారై, శిష్యత్వం స్వీకరించి, వోనామా లభ్యసించొచ్చు. లైక్ మై లైఫ్ – నా జీవితం లాగా, నా భాషయున్ గూడ తలకిందులైందని, గ్రహించరేల రుగావబా!" అన్నాడు. ఇద్దరూ కసిగా నవ్వుకున్నారు. అతని రెండు చేతులు పట్టుకుని కళ్ళల్లోకి చూశాడు నిధి. పక్కున నవ్వాడు.

"ఓస్–మనమూ చెయ్యగలం" అంటూ జగన్నాథం కూడా పక్కున నవ్వాడు. అట్లా ఇద్దరూ నిలిపి, నిలిపి నాలుగైదుసార్లు అర్థం లేకుండా నవ్వుకున్నారు. బండివాడు తెల్లబోయి పక్కున నవ్వి ఎద్దుని హుషార్ చేసి, ఈల వేసుకుంటూ, బండిని తోలుకుపొయ్యాడు.

"కర్ర తీసుకొచ్చావ్, కొడతావా ఏమిటి?"

జగన్నాథం చేతిలో కర్రని పైకెత్తి దానికేసి చూస్తూ –

"A dog hath a bone to lick
A girl hath a flower to pick
The King hath a bed to fall sick
But a Lord of the Word" (అంటే జగన్నాథ్) has only a stick.

మదీయ జీవగర్ర – జ్ఞాపకం వుందా? జీవము+కర్ర–అగామసంధి The staff of my life-

ఏ కొండకోనల మడిసియుంటిరి? ఏ సీమ దాగియుంటిరి?– యిన్నినాళ్ళు చెప్పండి–" అని కర్రని రెండుసార్లు గాలిలో విదిల్చాడు.

జగన్నాథం తువ్వాలుతో పొగాచుట్టి బెడ్డింగ్ నెత్తి నెట్టుకుని, "ఆర్యా! స్వాగతం, సుస్వాగతం,– తదీయ రాకచే– యక్స్కూజ్ బాడ్ గ్రామర్–మదీయగృహంబు–ఫ్యూర్లీ ఫర్ ది సేక్ ఆఫ్ రైమ్ పావనం బయ్యె–దయచేయుడు–లేదా–ది గుడోల్డు మిడీవల్ ట్రెడిషన్ – శ్రీ శ్రీ శ్రీ మహో, మహో, తత్ ఓం, ఓం, ఓం–శ్రీ శ్రీ శ్రీ–బహుపరాక్–" అంటూండగా యిద్దరూ నడిచి ఇంట్లోకి చేరుకున్నారు.

ఇంకా నలుగురు కుర్రాళ్ళు చెట్లకింద చాపలమీద కూర్చుని చదువుకుంటున్నారు వాళ్ళు లోపలికొచ్చారు ఒకబ్బాయి నిమ్మరసం నీళ్ళల్లో పోసి, పంచదార కలిపి తీసుకొచ్చాడు. ఈలోగా జగన్నాథం తువ్వాళ్ళు తీసుకొచ్చాడు.

"స్నానంబాచరింతమా?"

"ఓ, ఐతే నీ ఆశ్రమానికి ఏం పేరెట్టావ్?"

"ఈ పుణ్యభూమిని ఆశ్రమం అనడం పాపమని గ్రహించండి స్వామీ! ప్రపంచంతో నిమిత్తం లేని వారి కీడ తావు లేదు – టు యూస్ నారయ్యాస్ లేంగ్వేజ్ ఫర్ చేంజ్

– సంఘంలో ఉండవల్సినవారికి ఇక్కడ మార్గం చూపుతాం. అజ్ఞానాంధకారంలో వున్న నిరక్షరాస్యులకీ–ప్రబంధశైలి మహాత్మా–జ్ఞానం కలిపించి, వెలుగు చూపుతాం–"

"ఆ సంకల్పం ఉన్నవాడవు. వూళ్ళో వుండక ఈ నిర్జన ప్రదేశంలో ఎందుకు?"

"అంతరాయం లేకుండా కార్యనిర్వహణ కొనసాగించడానికి 'కాలవర్షం'–ఇంతకీ బావగారూ, మనలో మనమాట– పొట్టకూటికోసం, ఉద్యోగం కోసం అడ్డమైనవాళ్ళ లెగ్సు పట్టుకోటం నాకిష్టం లేదు. చేతకాదు. కొన్నాళ్ళు ఆ అవస్థలన్నీ పడ్డాను. ఎవడో మనకి ఉద్యోగం యిచ్చేదేమిటి, మనమే ఇద్దాం అనుకుని, అట్టే ఆలోచించితే బుర్రలో కెరటం వచ్చింది, ఈ అజ్ఞానంలో పడ్డాను. – bye the bye - 'అజ్ఞానం' అన్నది మీరింతకు పూర్వం 'ఆశ్రమం' అని వ్యవహరించినారే దాని నామాంతరం. Why so you may ask."

ఒడ్డుకు చేరుకున్నారు. నీళ్ళలోకి దిగారు.

"ఇది మన జీవితనౌక. నావ, సుకుమార డింగీ సాయంకాల విహారానికి–" అని జగన్నాథం, ఆ పడవమీదికి ఎక్కి అందులోంచి నీళ్ళల్లోకి దూకి, ఈది స్నానం చేస్తున్నాడు.

ఒళ్ళు తుడుచుకుని, చెట్టుకింద కూర్చున్నారు.

"ఐతే బావగారూ, ఇందిర పోయిందటగా?"

"అవును."

"జీవితం చిత్రమైంది సుమండీ! మనిషి అడ్డు తగలకపోతే జీవితం సమస్యలని అదే పరిష్కారం చేస్తుంది."

"అది పరిష్కారంల కాదు, సమస్య లేకుండా చెయ్యడం పరిష్కారం ఎట్లాగ వుతుంది? సమస్య లేకపోవడం మృత్యువు చిహ్నం అయితే. జగన్నాథం, నీకు పెండ్లాంతో కాపురం జేసే యీడొచ్చింది."

"ఎవరి పెండ్లాంతో మహాత్మా? వుడ్ హౌసియన్ జోక్ – నాకు స్త్రీలు అర్థంకారండి – వాళ్ళతో నిమిత్తం కనపళ్ళేదండి – బొమ్మలతో మాదిరి, వాళ్ళతో ఆడుకోవాలనిపిస్తుంది. కాని, ఏ ఒక్కరితోనూ ఫర్ ఆల్ టైమ్ ఉండటం అంటే భయం అండి. నా వుద్దేశ్యం – మొదటి మనిషికి తోచక ఇదవుతుంటే కాలక్షేపానికి 'స్త్రీని' సృష్టించుకున్నాడని నా అనుమానం – హాల్డేన్‌కి ఉత్తరం రాసి కనుక్కోవాలి."

"నీకు వాంఛ–"

"Say, Passion."

"అదే – పోనీ – లేదు నీకూ?"

"ఏమీ పనీపంగు లేనివాడి కవస్నీని – చేతినిండా పనుంటే అదో పెద్ద బాధకాదు – టేక్ మై లైఫ్ – ప్రొద్దున్నే లేస్తాను. గోదావరిలో స్నానం చేస్తాను. స్వయంగా పాలు పితుకుతాను – తరువాత మొక్కలు, తోటా చూసుకుంటాను. అన్నం వండుతాను – మధ్యాహ్నం పత్రికా పఠనం, చదరంగం, పారాలు చెప్పడం – సాయంత్రం, తేలికైన తేయాకు డ్రింక్. ఇండియన్ టీ – దెన్ బోట్ షైర్ – రోయింగ్ ఎ గ్రేట్ ఎక్సర్‌సైజ్ – నైట్‌ని, చెట్టుకింద వో పాతికమంది పోగవుతారు.

Unwept, unsung, unknown, unhonoured
One, two, three
Timeless waters of Godavary.
Swallowed Jagannath's mystery.
And flowed into the sea of Eternity.
But కాని Who is the boatman? నావికుండెవడు?
The wealth of kindness,
Dayanidhi
He the boatman made a childish mess.
Of loving humanity
with kindness killed,
With burning passion, chilled,

అయ్యో, మనం కేవలం వూరికే వుండటం ఒక్క ఆంధ్ర దేశానికీ ఒక్క భారత భూమికి కాక జగత్తంతకీ నష్టం అనవొచ్చు. మన పద్యాలు ఒక్క తెలుగు ఆంగ్లంలోగాక నార్వీజియన్ భాషలో కూడా తర్జుమా కాబడే దినం దగ్గరలో రానున్నది. అన్ని హక్కులూ దయానిధివి. వలయువారు కేర్ ఆఫ్ కోమలి. నాగమణి గ్రంథమాల, తప్పొప్పుల పట్టిక సుశీల. టిప్పణి నారయ్య, ఆఖరి కూర్పు, వెయ్యిప్రతులు, వెల – తెలుసుకోలేరు"

తరువాత జగన్నాథం సంగీతం మొదలెట్టాడు. ఇసుక తిన్నెమీదికి చేరుకున్నారు.

"నీ జాబితాలో అమృతం పేరు వదిలేశావేం?"

"మీకు కోపం వచ్చినట్లుంది. తమాషాకన్నాను."

"నాకేమీ కోపం లేదు. ఐతే, నేనొక టడుగుతాను చెప్పు."

"సెలవియ్యండి."

"నువ్విల్లా చిత్రంగా మాట్లాడతావెందుకు? స్వభావమా తెచ్చి పెట్టుకున్నదా?"

"తెచ్చిపెట్టుకునేది ఏదీ లేదు."

"ఎప్పుడేనా నువ్వు నువ్వుగా వుంటావా?"

"నేను నేనుగా వుండే అవసరం, పుస్తకాల్లో మనుషులకి తప్ప మామూలు లైఫ్‌లో మనుషులకి రాదు. ఒస్తే వాళ్ళు చస్తారు!"

"ఇప్పుడు మాట్లాడుతున్నట్లుగా ఎప్పుడూ ఎందుకు మాట్లాడవు?"

"ఇట్లా మాట్లాడితే ఎవ్వరూ లైక్ చెయ్యరు."

"నీ సంభాషణంతా ఒక్క నటనన్న మాట!"

"అసలు జీవితమే నాటకరంగం; మనం అందరం పాత్రలం; సంభాషణ నటనెందుకు కాకూడదు? నటుడు నటించడం మానేసి, తన నిజ స్వరూపం ప్రదర్శించి గొడవలు మొదలెడితే, ప్రేక్షకులు ఏం చేస్తారని మీ వూహ? అందుకనే భర్తృహరి ఏమన్నాడంటే – భర్తృహరి గాడి స్పెల్లింగ్ రాదండి–"

"ఇస్, మళ్ళా మొదటికొస్తున్నావు–"

"ఆయన హృదయ ద్వారంబుల్ మూసి, చిల్లుపడ్డ డోలువలె – అర్ టు వెరీ ది మెటఫర్, – తల్లిపాలు తాగిన పాపవలె – వూరకుండెను."

"కేర్ ఆఫ్ కోమలి అన్నావు కదా, నీ ఉద్దేశ్యం?"

"... ... ..."

"చెప్పు నిన్నే – అబ్బో, కోపం కాబోలు!"

మళ్ళా ఇద్దరూ పడవెక్కి, ఒడ్డుకు తోసుకొస్తున్నారు.

ఆ రాత్రి భోజనం చేసి, చెట్టుకింద మంచాలు వేసుకున్నారు. దయానిధి అప్పుడన్నాడు:

"కోమలి నాతో వుంది – తెలుసా? అందుకనే కేర్ ఆఫ్ కోమలి అన్నావనుకున్నాను."

"నా జీవిత రహస్యాన్ని ఛేదించేవరకూ మీరు నిద్రపోరనుకుంటాను. కోమలి పేరెత్తారంటే, నేను నిష్కారణంగా పొయిట్రిలోకి దిగిపోతాను.

Where are thou roaming

O, Komali!

In the wasteful valley

Of poisoned honey?

In the arms of strong stupidity?

వండ్రఫుల్ గరల్. భావకవిత్వంమీద వ్యాసాలు దంచేస్తున్నారీమధ్య ఆంధ్ర కవిపుంగవులు, కోమలి ఫోటోగ్రాఫ్‌కింద వీళ్ళంతా సంతకాలు పెడితే సరిపోదు."

"నిన్ను చూడాలి. తీసుకురమ్మంది. నువ్వు నీళ్ళల్లోకి గెంటావట. రానీ తగిన శాస్తి చేస్తానంటోంది."

"చప్పనే ఆంధ్రరాష్ట్రం వస్తుందని బెంగకాబోలు–"

"అంటే?"

"ఏదో అన్నాను పోనిస్తురూ, చంపక–"

ఇంతలో వో పదిమంది చదువుకోడానికొచ్చారు. వాళ్ళతో కలిసి జగన్నాధం యింట్లోకెళ్ళిపోయాడు తెల్లారింది. బండి వచ్చింది. నిధి ప్రయాణం కట్టాడు.

"నువ్వు తప్పకుండా రావాలి సుమా!"

"తప్పకుండా వస్తాను – కోమలికివి నా మాటలుగా చెప్పండి –

"ఏ వూరనున్నయున్, నీ సల్లటి తలంపే, గాడ్పుని వడగండ్లు సేయవా?

ఏదీ హార్మోనిష్టూ! బిలహరిలో నాలుగున్నర–

ఏ మందలో చేరినా

ఏకాకివై, అలిగి ముగ్గెట్టంత

నోసుకోవి, నీ బ్రతుకుతెరువు

సూసుకో. వొయ్యారమైన–

అబ్బె, ఈ పూట రావడం లేదండి – ది రీజన్ యీజ్ పద్యంగా మొదలెట్టి పాటలోకి దిగాను – ఎనివే – దీపావళి కొస్తాను – మా అమృతాన్ని చాలా చాలా అస్కానని చెప్పండి–"

బండి దూరంగా వెళ్ళి పోయింది.

దయానిధి అమృతంగారి వూరు చేరుకునేటప్పటికి సాయంత్రం ఐదు గంటలైంది. సామానులు స్టేషన్‌లో పెట్టేసి ఒక్కడూ ఊళ్ళోకి నాలుగు మైళ్ళు బండిమీద ప్రయాణం చేశాడు. బండి వంతెన దగ్గర నిలిచింది. బండివాడు అమృతంగారింటికి గుర్తులుచెప్పి వెళ్ళిపోయాడు.

దయానిధి చీకటిపడేవరకూ ఊళ్ళోకి వెళ్ళదలచుకోలేదు. దూరంగా కుడివైపున పొలాలు కనిపిస్తున్నాయి. పొలాల్నించి అందరూ యిళ్ళకొచ్చే సమయం అది. అమృతం భర్త కాంతారావు ఎదురౌతాడేమో ననిపించి నిధి ఎడంవైపు చెఱువుకేసి నడవడం సాగించాడు.

జగన్నాథం నవ్వినప్పుడూ, తల తిప్పుతూ దెప్పినప్పుడూ అతనిలో ఎక్కడో అమృతం ఛాయలు కనిపించినట్లు నిధికి గుర్తొచ్చింది. ఎవ్వరూ చూడకుండా, అతనొక్కడూ, అమృతం కూతుర్ని "రహస్యంగా" చూసి వెళ్ళాలని సంకల్పం.

అందరికీ తెలిసేటట్లుగానే వెళ్ళి, బహిరంగంగా ఎందుకు చూడకూడదూ అని ప్రశ్నించుకుంటే సమాధానం లేదు. అందులో ఒక నిగూఢమైన, రహస్యమైన ఆనందం ఉన్నట్లుంది. అది ఎవరితోటీ చెప్పుకోవడానికి వీల్లేనిది. ఇతన్ని చూసి అమృతం సిగ్గుతో తలొంచుకుంటుంది, పిచ్చి సంతోషంతో పారిపోతుంది.

"ఎందుకొచ్చావు బావా? నువ్వు శాశ్వతంగా నా దగ్గరే ఉంటావు. నిన్ను పంచుకున్న ఫలితం బావా, ఈ పిల్ల" అని, తొట్టిలోకేసి చూసి అంటుంది కాబోలు! ప్రపంచానికి అర్థంకాని ఆనందంతో అమృతం మూగదై బాధపడుతుంది. ఆ అమృతం బాధని ఏకాంతంగా చూడాలి. ఆ పిల్ల ఏడ్పులో, అనాదినుంచి మానవుడు రహస్యంగా పడిన తపన వినబడుతుంది.

పుణ్యంలాగే పాపం కూడా అమరత పొందుతుంది కాబోలు! "నే నెవర్ని?" అని ఆ పసిది వేసే ప్రశ్నకి ఏ వేదాంతి సమాధానం చెప్పగలడు? "ఆత్మ" "పరమాత్మ" "విశ్వరూపం" "సృష్టి రహస్యం" "జీవాత్మ" అంటారా? లేక – "అంధత్వం" "చీకటి" "అజ్ఞానం" "పశుత్వం" పోనీ; సాధారణ భాషలో "గోడలు దూకడం" "తలుపు సందులో" "ముసుగు" "మోసం" "మంచంకింద" – అంటారా? "కారాగారం" "కోర్టుతీర్పు" "హత్య" "ద్వీపాంతర వాసం" అంటారా? జన్మాంతరవాసం కాబోలు! తలుచుకుంటే కవిత్వం వస్తుంది:

"గుళ్ళను, గోపురాలను, గులకరాళ్ళను –
ప్రేమ ప్రవాహం కరిగించిందీ –
రక్తమైన గట్టు చేరింది –
రాత్రంతా అడవిలో ధ్వనించింది.
ఉదయాన ఊపిరికోసం, పసిదై ఏడ్చింది.
ఇదే అనుభవాన్ని ఆధునిక కవి ఏవిధంగా చెప్పగలడో!
కాళిదాసుకేం తెలుసు కావమ్మ సొగసు!
స్విచ్ నొక్కు, సెకండ్ షోకి పోదాం.
ఆమె "జూలియట్"

అతను "మజ్ను"
ఫైనల్లీ, "పోలియస్, బెర్ జరీ" –
టాక్సీలో సన్నటి నడుం "క్లోజప్"
భవభూతికేం తెలుసు ఆ షోల్డర్ బ్లేడ్ సొంపు? –
జుట్టంతా రేగింది, గ్రామ్‌ఫోన్ పెట్టు వాటన్స్,
రాత్రి టోపీ వోవర్టీన్ బిగుతైంది
క్లియోపాత్రా లిప్‌స్టిక్‌కి బదులు
ఎంకి చెంగతో తృప్తిపడదాం!
శకుంతల "కాసియో" కిచ్చిన కర్చీఫ్
బెరి బెరి బెర్నార్డ్‌షాకి తెలీదు; బుచ్చమ్మ విడోడ్ బ్రెస్టులో
భర్తృహరికీ తెలీదు మా గాంధీ అన్నాడంటే–
పొలిటికల్ స్టంట్ – పొమ్మన్నారు"

ఈ భావాలు ఊహలో తిప్పుకుంటూ నిధి చెఱువు గట్టున కూర్చున్నాడు అలలు మెల్లిగా గట్టుమీద ఊపిరి తీసుకుంటున్నాయి మట్టిలో వేడిగాలి, పైకి వెళ్ళలేక భూమినే ఆవరించుకుంది పొడుస్తున్న చుక్కల ప్రతిబింబాలు, చెఱువులో పడ్డాయి. ఎడ్లు నీళ్ళు తాగడానికొచ్చి తామరాకుల్ని కెలికేశాయి

వాడు కాంతారావుగారి పాలేరు కాడుకదా! ఐనా తన కెందుకంత భయం? అమృతం ఉందిగా, చమత్కారంగా ఏదో సర్ది చెప్పకపోతుందా? అంచేత వీధి గుమ్మాన బహిరంగంగా, వెళ్ళడం మంచిది తను చాలా గొప్పవాడు, ధనికుడు – తనని ఎవరేమనగలరు? డబ్బుంటే ఫరవాలేదు. ఎన్నింటినేనా కప్పేస్తుందన్న వేమన పద్యం జ్ఞాపకం రావడంలేదు

ఆకాశం నిర్మలంగా వుంది చంద్రుడు కూడా లేడు నక్షత్రాలు ప్రశాంతంగా మెరుస్తున్నాయి. మేఘాలన్నీ పడమటి ఆకాశంలో స్నానానికి దిగి మునిగిపోయినట్లు మాయమయ్యాయి ఎక్కడో వో పక్షి నేనూ ఉన్నానంటూ అరుస్తోంది పిల్లలు కర్రకి మేకు దిగేసి, ఇనప చక్రాలని దొర్లించుకుంటూ పోతున్నారు

జనం పల్చబడ్డారు, సందడి తగ్గింది అతనికి ఆకలేస్తోంది వొంతెన దగ్గర కిల్లీ దుకాణం దగ్గరకొచ్చి, రెండరటిపళ్ళు తిని, సోడా తాగాడు. ఎనిమిది దాటుతోంది. అమృతంగారింటి సందులోకి చేరుకున్నాడు

"అబ్బీ, కాంతారావుగారి ఇల్లు ఏదీ?" అని అడిగాడు, గడ్డిమోపు తీసుకెళుతున్న ఆసామీని. "అమృతంగారిల్లు–" ఆసామీ కాసేపు నిదానించి, "అద్దుగదిగో, – ఆ మూలగా వున్న మేడేనండి కామందు కాంతయ్యగారిల్లేనాండి?" అని ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

అది విశాలమైన సందు; అన్నీ మట్టిగోడల ఇల్లు; పాకలు, దూరంగా ఖాళీ లాంతరు స్తంభం ఒరిగివుంది. కాని వెలగడంలేదు, అక్కడంతా స్థలమే ఎదురుగా, పసుపుపచ్చ మేడ వుంది.. అదే అమృతం గారి మేడ.

దయానిధికి వీధిగుమ్మంలోంచి బహిరంగంగా వెళ్ళే ధైర్యం లేకపోయింది. ఇంటిముందునుంచి నడిచి వీధి చివరకి చేరుకున్నాడు. ఆ వీధిలోంచి అమృతం

చెరువునుంచి నీళ్ళబిందె తీసుకుని ఎన్నిసార్లు నడిచిందో! వెనకాల సందులో కెళ్ళేటందుకు మరో దోవలేదు; ఇంటిచుట్టూ పచ్చగోడ కాపలా కాసింది.

గోడమీద గాజుపెంకులు గుచ్చివున్నాయి. పాపం, ఏ నల్లటి రాకుమారుడో అర్ధరాత్రి గోడదూకి దొడ్లో ఉయ్యాల ఊగుతూన్న అమృతాన్ని ఎత్తుకునిపోకుండా కాబోలు? గోడచుట్టి దొడ్డివైపుకి వెళ్ళాడు. తలుపుంది. తలుపు సందులోంచి లోపల దొడ్డంతా కనిపిస్తోంది పెద్ద పెద్ద చెట్లు, మొక్కలు, వసారాకి మెట్లు. కాగు, గంగాళం, నూతిపళ్ళెం బాదంచెట్టు... పెద్ద తలుపు సందే!

మనుషుల అలికిడిమాత్రం లేదు. "కీ" ఇవ్వడం మరిచిపోయాడు కాబోలు – రిస్టువాచీ సాయంత్రం నాలుగింటికి నిలిచిపోయింది. లోపల భోజనాలు చేస్తుంటారు కాబోలు! కాంతారావు పొలాన్నుంచి వచ్చాడా? అమృతం గుళ్ళోకి వెళ్ళిందేమో! అంతగా అతన్ని చూసి "ఇదేమిటి?" అని డిగితే, "ఇదే వీధి గుమ్మం అనుకున్నాను" అంటాడు.

ఎవరో : "సామాన్లేవి?"

అతను : "రైల్లో వదిలేశాను."

ఎవరో : "ఇప్పుడేం రైలుంది?"

అతను : "అంటే... అంటే..."

(నవ్వి) అమృతం : "బావ మధ్యాహ్నం రైల్లో వచ్చాడు. అత్తయ్యా, బావకి తిన్నగా ఇంటికొచ్చే అలవాట్లేదు. దోవలో ఆగుతూ వింతలు చూస్తూ నడిచి వచ్చి ఉంటాడు – కదు బావా?"

ఎవరో : "ఈ ఊళ్ళో ఏం వింతలుంటాయే? నీది మరీ సోద్యం!"

అమృతం : "మీకు తెలీదత్తయ్యా... బావకి ప్రతిదీ వింతగా తోస్తుంది – తొట్టిలో మన పాపాయిలాగ, కదూ?"

అంటూ పాపాయి బుగ్గ గిల్లుతుంది.

అప్రయత్నంగా అతని చెయ్యి తలుపుమీద ఆనింది, తలుపు కిర్రుమని జరిగింది. తీసే ఉందన్నమాట! గబుక్కున చెయ్యి తీసేసి తలుపుని దగ్గరగా మూశాడు. అమృతం దొడ్లోకి రాకుండా ఉంటుందా? వచ్చినా, దూరాన్నుంచి తను గుర్తుపట్టగలదా? అత్తగార్ని అమృతం పిలిస్తే, ఇంకేమన్నా ఉందా? దొడ్డి చాలా పెద్దది. కుడివైపున గడ్డివామి కనబడుతోంది. దూడ మెదుల్తోంది; పేడకంపు. ఏ అర్ధరాత్రో అమృతానికి నిద్రపట్టక వసారాలోకొచ్చి బాదంచెట్టుకింది కూర్చుని నక్షత్రాలకేసి చూస్తూ ఉంటుంది. అతన్ని చూస్తుంది.

అమృతం : ఎవరది?

అతను : నేను.

అమృతం : బావా! నువ్వా? – (ఏడుస్తుంది)

అతను : ఎందుకు ఏడ్పు?

అమృతం : బావా! నీకు తెలుసు, ఘోరం జరిగింది. నీ దగ్గర ఉండే సాహసం లేదు. నిన్ను వొదిలివుండే గుండెకాదు, నేను బ్రతకను బావా!

అతను : నన్ను మరచిపో అమృతం! అది చెప్పడానికే వచ్చాను.

అమృతం : నీలా సులభంగా మరచిపోలేను బావా! మరిచిపోయిన నాడు, యీ అమృతం విషం కాదూ! నిన్ను మరిచి స్త్రీత్వాన్ని కోల్పోతానా?... (కొంగు నెత్తిన కప్పుకుని, మల్లెపూలు వూడదీసి పారేసి అతని భుజాలని కన్నీటితో తడిపేస్తుంది.)

అతను : ఎక్కడికి అమృతం?

అమృతం : నిశీధిలోకి—

అతను : నేను రానక్కరలేదా?

అమృతం : జ్ఞాపకాలు లేని ఈ మనుషులతో నాకు నిమిత్తంలేదు. ఎక్కడో గుండె రాయి చేసుకుని సముద్రంలో కెరటాలమధ్య శిలగా మారతాను — బావా!

అతను : మరి నీ పాపాయి? ప్రపంచానికి ఆ పాప జ్ఞాపకాలేనా సంతతి—

అలా మాట్లాడుతుంది కాబోలు అమృతం! ఊహించుకుంటే అతనికి నవ్వొచ్చింది. భయమేసింది. స్త్రీలు ఎంత సాహసమేనా చేస్తారంటారు పెద్దలు. స్త్రీలు ప్రేమ లేకుండానే, పిల్లల్ని కనగలరు! మహాయిల్లాలులూ కాగలరు, ఖ్యాతి గడించగలరు. చరిత్రలో అమరత గడించగలరు.

వారే కనక నిజంగా ప్రేమించగలిగితే, ఇంకేమన్నా వుందా? సంఘం తారుమారవుతుంది. ప్రపంచం తలక్రిందులవుతుంది. ఆకాశం నెత్తిమీద పడటం లాంటిది — దాన్ని వారించి మోసే పురుషుడు యీ జగత్తులో ఉన్నాడా? భారత స్త్రీ ప్రేమించకపోవడం — నిజంగా మంచికే. చరిత్రలో యుద్ధాలైనా తగ్గుతాయి. గాంధీగారు నిశ్చింతగా నిద్రపోవచ్చు.

ఎంతకాలం తను అలా నుంచోడం! ఎంతో సిగ్గుగానూ చిన్నతనంగానూ వుంది. తనకెందుకు చూడాలన్న ఉబలాటం? అమృతానికి లేని చింత తనకెందుకు? అదుగో, ఎవరో వసారాలో కొచ్చినట్లున్నారు, అదుగో ఆమెయే అమృతం! తలుపునెట్టి లోపలికొచ్చాడు. చేతుల్లో విస్తళ్ళకట్ట దూరంగా గోడవతలకి గిరవాటెట్టి, వెనక్కి తిరిగిచూసి — "ఎవరు?" అంటూ మెట్లుదిగి—

"బావా! దా, దా,—" అన్నది.

"ఉస్" అన్నాడతను, చూపుడువేలు నోటిమీద ఉంచుకొని. "బిగ్గరగా మాట్లాడకు — నే వచ్చినట్లు యెవరికి..."

ఇంకా అతని వాక్యం పూర్తికాకుండానే అమృతం సంతోషంతో నవ్వుతూ, "భలే వాడివే! యింట్లోకిరా, యిదేం చిత్రం — అత్తయ్యా, బావ వొచ్చాడు" అని ఇంటివైపుకి తిరిగి బిగ్గరగా కేకేసింది.

"బండి పొద్దుపోయింది కాబోలు. లోపలికి రా, బావా!" అంటూ దొడ్డితలుపులు మూసి, గడియెట్టింది.

ఇంతలో అత్తగారు వసారాలో కొచ్చింది.

"ఎవరదీ? దీపమేనా పెట్టారుకారేమర్రా?" అన్నది.

"మా నిధి బావండత్తయ్యా! రైలు ఆలస్యమైంది. పాపం, వీధి గుమ్మం తెల్సిందికాదు. రా బావా, మా అమ్మాయిని చూద్దువుగాని..."

ముగ్గురూ లోపలికి వెళ్ళారు.

"కాంతారావుగారేరి?" అన్నాడు నిధి.

"నరసయ్య మేష్టారింటికి పేకాట కెళ్ళారు. చూశావా మా యిల్లు – నీకేం – నువ్వు జమీందారయ్యావు. మేం కనిపిస్తామా – నీ బంగాళా బాగుంటుందంటగా – నన్ను తీసుకెళ్ళి చూపించకూడదా ఏమిటి?" అంటోంది అమృతం.

స్నఫ్ కలర్ చీర చిందరవందరగా కట్టుకుంది. చీర బిగించిన ముడికీ, చుక్కల జాకెట్టుకీ మధ్య కడుపు మడత దీపం వెలుగులో కనబడుతోంది.

అమృతం ఎదిగింది; పెద్ద ఆరిందాలాగుంది. జడంతా వూడి చుట్టలుచుట్టలుగా మెడలమీద నుంచి జారింది; మధ్య మధ్య దుద్దులరాళ్ళు తళుక్కున మెరుస్తున్నాయి.

"నా బంగళాని నీకెవరు వర్ణించారు?"

"ఓ యబ్బ, మేం ఎంత పల్లెటూళ్ళో వున్నా మాకన్నీ ఆమాత్రం తెలియవా ఏమిటి? చూశావా, అత్తయ్యా! నేను చెబుతుండేదాన్నే – ఆ బావ – చెయ్యిగ్గడలంటే మహా ఇష్టం."

"అలాగా! మావాడు నీ దగ్గర కొస్తానంటూ ప్రయాణం కడుతుంటాడు. మంచివాడు గనక, ఆపేక్షపడేవాడవు గనక – పాపం, జ్ఞాపకం వుంచుకుని నువ్వే వచ్చావు. అలా వుండాలి నాయనా, చుట్టరికాలంటే" అంటూ ఆవిడ దీపంబుడ్డితో ఏదో సవరిస్తూంది.

"నా మనవరాల్ని చూద్దువుగాని ఇట్రారా..."

"ఇట్లారా బావా!" అంది అమృతం.

ముగ్గురూ పక్కగదిలోకి నడిచారు. అమృతం దీపం ఒత్తి పెద్దది చేసి, తొట్టిలోకి చూపించింది. అందులో చిన్నపిల్ల! అమాయకంగా కళ్ళు మూసుకుని పడుకుంది. పిల్ల నల్లగా ఉంది. మొహాన అక్కులు చుక్క ఉంది. ఒంపులు తిరిగిన లేతజుట్టు నుదుటిని కప్పేసింది. ఎవరి పోలికో అతనికి తెలీడం లేదు. అత్తగారు, తనే స్వయంగా కన్నట్లు, గర్వంగా చూసి, పిల్ల బుగ్గని తాకి...

"ఒసే గడుగ్గాయి పిల్లకానా! బాబయ్యొచ్చాడే. వజ్రం దొరికిందే – ఆ జమీందారు బాబయ్య నిన్ను చూడాలనొచ్చాడు... బాబయ్యకి వజ్రం దొరికింది, మాకు నువ్వు దొరికావు..." అన్నది.

ఆవిడెలా కనుక్కుందో!

"అత్తయ్యా, అచ్చంగా బావ పోలిక కదూ?"

అతని గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. ఇదేమిటి, యిలా నిర్భయంగా అనేస్తుంది? అతన్ని కదిపివేసిన మహత్తర అనుభవం తనకి జరిగినట్లుగానే ప్రవర్తిస్తుంది. అమృతం వంకాయల బేరం తెగింపుకాక, కూరల మనిషిని పొమ్మన్నట్లు– అంత చులకన!

"చూడండి – దాని కళ్ళు, నోరు అంతా బావ పోలికే"– అన్నది అమృతం, అతని కళ్ళల్లోకి వయ్యారంగా చూస్తూ.

"పెద్దయితేగాని పోలికలు బయటపడవు, బాబయ్యల పోలికలు రాకుండా పోతాయా మరి" అన్నది అమృతం అత్తగారు.

"ఏ వేళైందో, భోజనం వడ్డించు" అంటూ అత్తగారు వంటింట్లోకి నడిచింది.

"ఎలా వుంది బావా, నీ కూతురు?" అన్నది అమృతం.

"నిజంగా నా కూతురేనా?" అని అడగాలనిపించింది తనకి. ధైర్యం తెచ్చుకుని, గొంతు సవరించుకున్నాడు. "ఐతే, అమృతం...నన్నో అనుమానం బాధిస్తోంది–" అని మాటలు వెదుక్కుంటున్నాడు.

"నేనూ, వారూ మీ వూరెందుకు రాలేదనేనా? సరే, మంచివాడివేలే, మమ్మల్ని రమ్మన్నావా ఏమిటి?" అని లోపలికెళ్ళి చెంబుతో నీళ్ళు, తువ్వాలు, సబ్బుపెట్టె తీసుకొచ్చింది.

ఇంతలో కాంతారావొచ్చాడు. అందరూ భోజనానికి కూర్చున్నారు.

అమృతం స్నానంచేసి, పల్చటి తెల్లచీర, తెల్లజాకెట్టు, తల్లోపూలు సింగారించుకొని వడ్డన కొచ్చింది. "బావ"కి ఏవేవి ఇష్టమో కనుక్కుంటూ జాగ్రత్తగా వడ్డిస్తోంది.

"అన్నగారు రావడంవల్ల మాకు పిండి వంటలూ, పెరుగూ తగిలాయి"అన్నాడు కాంతారావు నవ్వుతూ.

"మీది మరీ సోద్యం. ఎప్పుడూ పెరుగు మొహం ఎరగనట్లు చెబుతున్నారు. బావ నిజం అనుకుంటాడు కూడాను" అన్నది అమృతం.

అందరూ నవ్వుకున్నారు. ఇంతలో పిల్ల యేడ్చింది. అమృతం లోపలి కెళ్ళింది. భోజనాలయ్యాయి.

అమృతం తమలపాకులు చిలకలు కట్టి; వక్కలు; యాలకులు ఒక డబ్బీలో పోసి తీసుకొచ్చింది నిధికి. వీధి అరుగుమీద పక్క వేశారు. జగన్నాధం కబుర్లు, అనంతాచార్లుగారి కబుర్లు కాసేపు చెప్పుకున్నారు.

ఇంతలో అమృతం కూడా భోజనం చేసి వచ్చింది. కాంతారావు చుట్ట ముట్టించి, నీళ్ళు తీసుకొని అవతలికెళ్ళాడు.

"అబ్బ – చుట్టకంపు, ఛస్తాం" అంది అమృతం పెద్ద యిదిగా. ఇందిర పోయినందుకు విచారం ప్రకటించింది. కాసేపు మౌనంలో పడ్డారు ఇద్దరూను.

"ఐతే, బావా! కోమలి నీదగ్గరే ఉంటోందిటగా?"

"అవును, నీకెవరు చెప్పారు?"

"ఆమాత్రం తెలీకుండా ఉంటుందా, నువ్వు మమ్మల్ని మరచి పోతావేమోగాని..."

"మీ ఆయనకి కూడా తెలుసా?" అన్నాడు.

"తెలీదనుకుంటాను. నాతో ఆ విషయం యెప్పుడూ అన్లేదు."

"కోమల్ని పెండ్లి చేసుకుంటావా?"

"నాకేం తెలుస్తుంది?"

"అసలు నీకా సందేహం యెందుకు కలిగింది?"

"చిన్నప్పటి స్నేహం... నీ దగ్గరే ఉంటోందంటే...చేసుకుంటావేమో అనుకున్నాను" అంది. అమృతం, కళ్ళు కిందికి దించేసి.

"చేసుకోమంటావా?"

"ఏమో...?"

"చేసుకోదగ్గ మనిషేనంటావా?"

"మనుషులు ఎప్పుడూ ఒకేలాగుంటారా, ఇప్పుడేమన్నా కుదురుగా వుందేమో!"

అతనికి నవ్వొచ్చింది అమృతం ఆ మాట అనడం. అత్తగారి రాకవల్ల వారి సంభాషణ నిలిచిపోయింది. అమృతం అత్తగారు ఇందిర పుట్టింటివారి పుట్టుపూర్వోత్తాలు స్మరించడం మొదలెట్టి, "ఇందిరకి చెల్లెలుందిటగా! పెళ్ళీడుకొచ్చిన పిల్లట – నువ్వు చేసుకోకూడదా నాయనా!" అన్నది. "ఇంతకీ ఎవళ్ళెవళ్ళకీ రాసుందో" అనుకుంటూ "నిద్రొస్తోంది" అని లేచి లోపలికెళ్ళింది.

"నేను కూడా ఏమన్నా మారానా బావా?" అంది అమృతం.

"ఏమో, నాకేం తెలుస్తుంది."

"పోదూ, నీదంతా చిత్రం. చెప్పకూడదా యేమిటి? కొంచెం లావయ్యాను గదూ?" అంటూ తన వంటికేసి చూసుకుంది.

మంచినీళ్ళకి మెట్లమీది కూజాకోసం వంగినప్పుడు జాకెట్లోంచి రొమ్ములు బరువుగా కదలడం కనిపించింది.

"నువ్వేంది శరీరం మార్చా?" అన్నాడు నిధి పెదవి చప్పరిస్తూ.

"ఇంకేరకం మార్పుందేమిటి? అబ్బో...నువ్వు బలే ఇదయినవాడివే, నీకు రావాలి ఆ మార్పులన్నీ."

"అంత కంగారుపడతావెందుకు అమృతం? ఇంతకీ, నిన్నడగవల్సిన ప్రశ్న మర్చేపోయాను. అసలు నేనందుకే ఇక్కడికొచ్చాను."

"బావా! అడుగు కాని; నువ్వు యేదో కొంపంతా మునిగేటట్లు పెద్ద ప్రమాదంగా మాట్లాడతావు. ఏమిటి బాబూ, ఆ సందేహం?"

"ఐతే, మీ అమ్మాయి..."

అతని వాక్యం పూర్తిచేసే అవకాశం లేకపోయింది. కాంతారావొచ్చాడు. కాసేపు వజ్రాల కబుర్లు చెప్పుకున్నారు.

"నీకు నిద్రొస్తే నువ్వెళ్ళి పడుకో"అన్నాడు కాంతారావు.

"బావకీ నిద్రొస్తూంది. అదిగో, కళ్ళు మూసుకుపోతుంటే–" అన్నది అమృతం.

పావుగంటలో కాంతారావు, అమృతం లోపలి కెళ్ళారు. తలుపు గడియపడింది. దయానిధి పక్క సర్దుకొని పడుకున్నాడు.

"ఇంకా యేమన్నా కావాలా బావా?" అంటూ అమృతం గడియతీసి బయటకొచ్చింది.

"ఏమీ అక్కర్లేదు."

"కావలిస్తే లేపేం" అని, గుమ్మం మీద చూస్తూ నిలబడింది అమృతం.

"చెప్పు, నీ సందేహం ఏమిటో" అని అడిగింది రహస్యంగా.

కాంతారావు ఇంతలో, "అబ్బ, నిద్రపట్టడం లేదండీ లోపల. మరో చుట్ట తగలేస్తాను" అంటూ బయటకొచ్చి, చుట్ట ముట్టించి అరుగుమీద కూర్చున్నాడు.

"నే వెళ్ళి పడుకుంటా–వచ్చేటప్పుడు తలుపు వెయ్యండీ!" అని భర్తతో చెప్పి, అమృతం తలుపులు జేరవేసి లోపల కెళ్ళింది.

నిధికి నిద్ర పట్టేసింది. మళ్ళా అరగంటలో లేచాడు. ఇంట్లో గడియారం పాడైంది కాబోలు – ఆరు గంటలు కొట్టింది. అమృతం వో రాత్రి వేళ బయటకు వస్తుందని అతని నమ్మకం. అరగంటలు, గంటలూ గడచిపోయ్యాయి, అతనికి

నిద్రపట్టలేదు. అప్రయత్నంగా అతని దృష్టి తలుపు మీదికి వెడుతోంది. అమృతాన్ని భర్త హస్తాలలో ఊహించి బాధపడ్డాడు. తన కెందుకో అంత బాధ? దూరంగా ఉన్నప్పుడు ఎన్ని వూహించుకొన్నా వాటిల్లో బాధలేదు. దగ్గరగా వున్నప్పుడే. ఆరుగజాల దూరంలో అమృతం తన బరువైన సౌందర్యాన్ని భర్తకి అప్పగించేసింది. అతని ఉనికి ఆమెను యేమాత్రమూ కలవరపరిచినట్లు లేదు స్త్రీలు చిత్రం. వారు లోనవుండే మనోవ్యధలు, అవస్థలు, తికమకలు బయటకి ప్రకటించరు. లేక, ఇవన్నీ పురుషుడి ప్రత్యేకమయిన జాడ్యాలా? వాళ్ళకి వ్యక్తిత్వం వున్నట్లులేదు. శరీరాలపైన అభిమానం. "ఇది నాది. దీన్ని ఫలానా వారికే అప్పగిస్తాను" అన్న పట్టుదల వున్నట్టు కనిపించదు. ఎవరో ఒకరు తమని కోరి అన్వేషించడంలోనే వారి తృప్తి వుంటుంది! ఏమిటో, తను ఇలా అనుకోడానికి ఆధారాలేమున్నాయి? కోమలి ఇవన్నీ తప్పని రుజువు చెయ్యడంలేదూ? స్త్రీలకి వ్యక్తిత్వం లేకపోతే; కోమలికి మాత్రం ఎలా వచ్చింది?

తలుపు చప్పుడైనట్లనిపించింది. లేచి మంచం మీద కూర్చున్నాడు. ఏమీలేదు. పక్కింట్లో తలుపులు కాబోలు! కోడి కూసింది. అతను నీరసంతో కళ్ళుమూశాడు. తెల్లారిపోయింది. జనం అటూ ఇటూ తిరుగుతున్నారు. పాలేళ్ళ సందడి, పాచిమనిషి అలికిడి, అమృతం అత్తగారు దగ్గుతూ మాట్లాడడం, అమృతం ఇతన్ని లేపడం అన్నీ జరిగిపోయాయి.

"ఏం బావా, నిద్ర బాగా పట్టిందా?" అని అడిగింది.

"ఆహా—"

"మొహం అలా బరువుగా వుందేం?"

ఆమె మొహంలోకి చూశాడు. కళ్ళకింద నలుపు నిద్రలేని అలసటని చూపింది.

"కొత్తచోటికి వెడితే నిద్రపట్టదు కదూ?" అంది అమృతం.

ఆనాడు అమృతం అలిసి మంచంమీద పరున్న దృశ్యం జ్ఞాపకాని కొచ్చింది. అతనికీ నవ్వొచ్చింది. మనుషులు అనుకునేదానికీ, అన్నదానికీ ఎక్కడా సమన్వయం వుండదు సంభాషణంతా ఒక నటన, ఊహిస్తే ఇలా ఉంటుంది:

అమృతం : నీకు నిద్ర లేనట్లుంది. చోటు కొత్త (నన్ను గురించి ఆలోచించడం మూలాన)

అతను : బాగా పట్టింది. (అసలు కళ్ళు మూయందే!)

అమృతం : నాకు మొద్దునిద్దరట్టింది. (తెల్లవార్లూ నేనూ, ఆయనా సరసాలు.)

అతను : ఓస్, నేను నమ్మను. (నన్ను గురించి ఆలోచిస్తూంది కాబోలు!)

అమృతం : ఫో, కొంటే! (ఏం చెప్పను బావా, నా బాధ. ఎవరికీ అర్థంకాదు.)

అలా జరుగుతుంది సంభాషణ—లోపలొకటీ, బైటొకటీ! నిజాలకి చోటు లేదు. సత్యానికి వ్యవధి లేదు.

మొహం కడుక్కున్నాడు. కాఫీ తీసుకొచ్చింది. స్నానం అయింతర్వాత విధి ప్రయాణం కట్టాడు. కాంతారావు అన్నాడు:

"అన్నగారూ, నేను సంతకెడుతున్నాను. నా బండిలో రండి, స్టేషన్ దగ్గర దిగబెడతాను."

"పోనీ బావా, వో నాలుగు రోజులపాటు మా ఇంట్లో వుండకూడదా యేమిటి?– అట్లాగైతే–మీ ఊరు రాము– అంతే?" అన్నది.

"ఈసారొచ్చినప్పుడు తప్పకుండా వుంటాను!" అన్నాడు.

"మళ్ళా మళ్ళా మా ఊరు వస్తావా యేమిటి?– ఏదో పొరపాటుని వచ్చావు కాని."

"పోనీ, నువ్వూ మీ ఆయనా నాతో రాగూడదూ?" అన్నాడు నిధి.

"ఆకుమళ్ళ హడావిడి తగ్గుతుంది నెలరోజుల్లో– అప్పుడొస్తాంలెండి" అన్నాడు కాంతారావు.

"పగలు చూద్దువుగాని అమ్మాయిని, రా" అంది అమృతం. కాంతారావు, నిధి గదిలోకి వెళ్ళారు.

"బావ పోలికంటుంటే కాదంటున్నాడండోయ్!" అన్నది అమృతం. కాంతారావు నీరసంగా నవ్వాడు. నిధి పిల్లకేసి పరీక్షగా చూశాడు గాని, ఎవరి పోలికో నిర్ణయించుకోలేకపొయ్యాడు. అమృతం పోలిక తెలుస్తూనేవుంది. మిగతా సగం తనా, కాంతారావా? ఐదారేళ్ళు పోతేనేగాని బయటపడదు.

ఎడ్లబండి సిద్ధమైంది. కాంతారావు, దయానిధి అందులో కూర్చున్నారు. అమృతం పసుపుపచ్చ పట్టుచీర, పెద్ద కుంకుంబొట్టు, నల్లటిరవిక వేసుకుని మెట్లమీద నిలబడింది. నిట్టూర్పుతో ఆమె రొమ్ములు లేచి పడుతున్నాయి. వాటిమధ్య చీర నాలుగు మడతలుపడి, నిండైన ఆకృతి తీర్చిదిద్దింది. "తెలుసునన్నట్లు" అమృతం నవ్వింది. అత్తగారు పిల్లని ఎత్తుకొచ్చి కోడలి చేతికిచ్చింది. అమృతం పిల్లని ఎత్తుకుని – "బాబయ్య వెళ్ళిపోతున్నాడు...గుడ్ మార్నింగ్ పెట్టు" అని పిల్లచెయ్యి వూపించింది.

"గుడ్ మార్నింగ్ కాదు, గుడ్‌బై అనాలి" అని కాంతారావు సరిజేశాడు...

"ఏదో ఒకటిలెండి – బావకి ఏదన్నా కోపంరాదు... మీరు మరీ నేర్చుకున్నారు, మాజగ్గుని చూసి–" అన్నది.

"జగ్గు అంటే, వూరుకున్నా? జగన్నాధం అనాలి" అన్నాడు నిధి. అందరూ నవ్వుకున్నారు.

"గుడ్‌బై – చైల్డు ఆఫ్ క్రియేషన్." అన్నాడు నిధి, చెయ్యిఊగిస్తూ.

"అబ్బో, మా అమ్మాయితో ఇంగ్లీషు మాట్లాడేస్తున్నావే, నువ్వే తీసుకెళ్ళి దానికి చదువు చెప్పించెయ్యి."

"సరేలే, ఆ భూతకిని లోపలికి తీసుకెడుదూ" అని భర్త విసుక్కున్నాడు.

"అదేమిటండి?– మాదొరసాన్ని పట్టుకుని భూతకంటారు చెప్ప బావా ఆయనకి, ఏవనాలో ఏవనగూడదో–"

బండి కదిలింది.

"ఉత్తరం ముక్క రాస్తుండే–" దూరంగా చెయ్యి వూపుతోంది, పిల్లతో కలిసి, "అడ్రెసు మావార్నడుగు–"

తరువాత మాటలు వినబడలేదు. బిందెలతో వెడుతున్న అమ్మలక్కలు అమృతం కేసి వింతగా చూసి వెడుతున్నారు. కడపటిదృశ్యం బండి మలుపు తిరిగింది.

★ ★ ★

# చివరకు మిగిలేది!

దయానిధి ఇంటికి చేరుకునే టప్పటికి సాయంత్రం ఆరుగంటలైంది. అతని రాక తెలియగానే పాతికమంది పనివాళ్ళు ఇంటిదగ్గర అతని చుట్టూ మూగారు. పని వాండ్రు సమ్మెచేసి రెండు రోజుల నుంచి పనిలోకి రావడం మానేశారన్న వార్త చెప్పారు. క్రితం రోజునే వజ్రకరూర్‌లో పెద్ద సభ చేసి, అందులో సర్కారువారు వారి జిల్లాల కొచ్చి చేస్తున్న అన్యాయాలన్నీ యేకరువెట్టి, వారికి సహకారం ఇవ్వకూడదని తీర్మానాలు చేశారు. దాని ఫలితంగా పనివాళ్ళు సమ్మెచేశారు. దీనికి కారణం ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు.

అనంతాచార్లుగారిని కూడా వెలివేసినట్లు చూస్తున్నారుట. కొన్ని కారణాలు తెలుస్తూనే ఉన్నాయి. నారయ్య రెడ్డిని చేసిన శాస్తి; కోమల్ని గదమాయించడం; అనంతాచార్లుగారు కోమల్ని వెనకేసుకొచ్చి సమర్థించటం; నిధికి అస్పష్టమైన గతం. రాజభూషణం ఆ జిల్లాల అనాగరికతను గురించి చేసిన ప్రచారం – యివి కొన్ని.

గనికోసం పెట్టుబడి పెట్టిన ధనికులు, లాభాలు కనబడక పోవటం చూసి, యిదంతా యేదో దగా, ఇంద్రజాలం అని శంకించి, డబ్బు విషయం చికాకు చెయ్యడం జరుగుతూనేవుంది. హాస్పిటల్‌కి సంబంధించిన వ్యక్తులు మాత్రం స్నేహభావంతోనే ఉన్నారు.

క్షీరప్పగారు ధనికుడు. ఆయనకి గనిలో వాటావుంది. ఆ మధ్య జబ్బు చేసి, నిధి ఆరోగ్య మందిరంలో చేరాడు. అసిస్టెంట్ నాగేంద్రరావు ఇన్‌జెక్షన్లు అవీ ఇస్తూనే ఉన్నాడు. మూడు రోజుల క్రితం క్షీరప్పగారు చనిపోయారు. ఆయనకి విషం ఎక్కించి చంపారని పుకారుపుట్టి కొంత అల్లరి జరిగింది. క్షీరప్పకి ఎక్కువగా వుండి కబురంపినప్పుడు అసిస్టెంట్ వెంటనే రాకుండా నర్సు తాయారమ్మతో కార్లో షికారెళ్ళాడని ఫిర్యాదు చేశారు. అసిస్టెంటు తిరిగి వచ్చేలోపల, క్షీరప్ప కాలంచేశాడు.

సమయానికి అక్కడ లేకపోవడం పెద్ద అపచారం అని కోమలి అసిస్టెంటు మీద కేకలేసి, నిధితో చెప్పి ఉద్యోగం తీయించి వేస్తానని బెదిరించిందట. అసిస్టెంటు "నీకేం హక్కుంది నువ్వెవతవి?" అని చెడామడా తిట్టేశాడుట. కోమలి ఏమీ చెయ్యలేక యేడుస్తూ కూర్చుందట. ఆ మొర్నాడు అసిస్టెంట్ "ఇదుగో పుండాకోర్ ఉద్యోగానికి రాజీనామా" అని కాగితం కోమలి మీద గిరాటెట్టి అడ్డం తగిలిన అనంతాచారిగారిని – "నీకూతురి కింక పెండ్లి కాదులే" అని వెళ్ళిపోయాడుట. అతను కూడా శత్రుపక్షం చేరి నిధి గతాన్ని గురించి యాగీ చెయ్యడం సాగించాట్ట. ఇన్ని జరిగాయి నిధి వూరెళ్ళిన వారం రోజుల్లోనూ.

నారయ్య గాయాలు నయమైనా నీర్సంగా లేవలేని స్థితిలోనే వున్నాడు. అతన్ని చూడగానే అంత్యకాలం సమీపించిందని, నిధికి తెలిసిపోయింది. పనివాళ్ళు యిళ్ళకి

పొయ్యారు. నిధి స్నానంచేసి హాల్లోకి వచ్చాడు. నారయ్య పక్కన కాత్యాయని, రంగడు కూర్చుని ఉన్నారు.

"ఎల్లా వుంది నారయ్యా?"

"అట్లాగే వుందండి – నాలుగు రోజుల్లో నింపాదిగా వుంటుందండి. మనకి జైలు సరిపడదు. లేచి దుక్కలా తిరగాలి, యీళ్ళ పొగర్లు అణచాలి."

"ఇంకా నీజోరు తగ్గలేదు..."

"ఆ రెడ్డిగాణ్ణి అఖరు చెయ్యకపోతే సూడండి – ఏంటనుకున్నారో నా తడాకా."

"తప్పు నారయ్య – నువ్వు పెద్దవాడివి. నెమ్మదిగా, వోర్పు– నేర్చుకోవాలి. మంచిమీద మనుషుల్ని బాగుచెయ్యాలికాని, పగ సాధించి కాదు –"

"ఈ నీతులు పశువులకాడ పనిసెయ్యవండీ – ఈ బుల్లమ్మ వుసురోసు కుంటుండారు. నా యెదంగాళ్ళు..." అంటూ నారయ్య కాత్యాయన్ని చూసి బోసిగా నవ్వాడు.

"పడుకో, పడుకో..."

"మానాన్న ఊర్నుంచి వచ్చారు" అంది కాత్యాయని

"రాత్రి భోజనం చేసి వస్తాను – పొద్దవుతోంది, నువ్వింటికెళ్ళు" అన్నాడు నిధి. కాత్యాయని మొహంలో అమాయకత్వం నిరుత్సాహంగా మారింది. అతని కేసి దిగులుగా చూసి వెళ్ళిపోయింది. కాత్యాయని చిక్కిపోయింది. ఏదో చెప్పరాని దిగులు – ఎవ్వరికీ అర్థంకాదు.

మేడ మీదికెళ్ళి ఉత్తరాలు చూసుకున్నాడు. అందులో ఒకటి శ్రీనివాసరావు దగ్గర నుంచి, రెండో మహాసంగ్రామం ప్రారంభమైంది. భారతదేశం కూడా ఇంగ్లండుతోచేరి, యుద్ధం ప్రకటించింది. ప్రభుత్వానికి కాంగ్రెసుతో బేరాలాడేటందుకు వ్యవధిలేక కాంగ్రెస్‌ని సంప్రదించకుండానే, దేశాన్ని యుద్ధ మేఘాలతో చీకటిచేశారు. ఏ ఉద్యోగం దొరికినా చాలురా భగవంతుడా అనుకొనే యువకులు వేలకివేలుగా యుద్ధంలో చేరిపోతున్నారు. గాంధీగారి మాట వినిపించుకోకుండా, యుద్ధానికి వెళ్ళిన యువకులలో శ్రీనివాసరావొకడు. రొమాంటిక్ సీనూ హిట్లర్ మీదికి కత్తినూరడం నిజంగా హాస్యాస్పదం. డేహరాడూన్‌లో ట్రైనింగ్ ముగిసిన తర్వాత, ఇరాక్ వెడుతున్నాట్ట. పాడుకుంటూ, గంతులేస్తూ కోమలి చక్కా వచ్చింది.

గాలికి కదిలిపోయిన చింతచెట్టు లాగున జుట్టంతా రేగింది. వాన వెలిసింతర్వాత, ఆకుల నుంచే నీళ్ళబొట్లు రాలినట్టు, స్నానం చేసిన తడి చీరని వొంటికి పట్టించింది. నీటి చుక్కలు మెడ మీది జడ లోంచి పడుతున్నాయి సృష్టి రహస్యాన్ని కనుక్కున్న పరిశోధకుడులా కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి; కళ్లు బహిర్గతం చేసిన ఆనందాన్ని పెదవులు దాచలేక పోతున్నాయి.

"ఏం కోమలీ, చాలా హుషారుగా వున్నావు"

"ఎందుకో చెప్పుకో – చూశారా నా చొరవ – ఎందుకు చెప్పుకోండి–" అంటూ చూపుడువేలు పైకెత్తి కదిల్చింది.

"ఏమో!"

"ఓస్, తెలీనట్టు మహా – దొంగ మీరు – " కాసేపు నిదానించి "అండి" "మీరు" అని గౌరవంగా అనబుద్ధికాదు, మర్యాదగా పిలిస్తే ప్రేమలేనట్టు – ఏమిటో దూరంగా, ఎవళ్ళవోఁ పరాయి వాళ్ళతో మాట్లాడి నట్లుందండీ – ఎందుకో, అవునా దయామయా – "

"దూరంగా... పరాయివాడనేగా..." అన్నాడు.

"అట్లాగంటే కోపం వస్తుంది – చెంప మీద కొట్టబుద్దేస్తుంది. ఉండండి. కసిగా వుంది, హుషారంతా చంపేస్తున్నారు " అని అతని దగ్గరగా వొచ్చి, బుగ్గని గట్టిగా నలిపి, ఎడం చేత్తో లెంపకాయకొట్టి ముక్కు మొన పట్టుకుని వూగించింది.

"అగు అగు – తెగించి, విప్లవం చేస్తున్నావు హుషారుకి కారణం ఏమిటో – ?" అన్నాడు.

"కారణమా? నిజంగా చెప్పాలా? "

"ఊఁ"

"ఇది!" గట్టిగా అతని నుదుటికి పెదవుల్ని తగిలించింది.

"మనం అనుకున్నదంతా వారం రోజుల్లో మరచిపోయావా ?"

"లేదు. అదంతా గుండెల్లోవుంది. చూడండి – " అని అతని చేతిని తీసుకుని ఆమె రొమ్ములమధ్య ఆనించింది.

"ఎప్పుడూ విచారంగా, దిగులుగా ఉండా లేమిటి ? – అప్పుడప్పుడు కులాసా, హుషారు లేకపోతే ఏం బాగుంటుంది –" అని అతని మెడని పెన వేసుకుని, వూపిరి పీల్చకుండా మొహాన్ని రొమ్ములతో కప్పి వేసింది. అతను దూరంగా గెంటేశాడు.

"బలత్కారం, రాక్షసం ప్రారంభించా వేమిటి ?"

"నాకీ ఒక్క రోజూ లైసెన్స్."

"ఏం కథ?"

ఆ ప్రశ్నకి సమాధానం ఏం చెప్పగలదు ? ఆకలి ఆమె కళ్ళల్లో గుడ్డ లిప్పుకుని గంతులేస్తున్నట్టుంది.

ఆమె పాదాల కింద, అనుభవం ఇసిక కణాలుగా జారిపోతోంది. శరీరం చేస్తున్న దౌర్జన్యానికి, ఆదర్శం తట్టుకోలేక, తుఫానులో కదిలి పోతున్న గడ్డిపోచలాగై, అతన్ని పట్టుకుంది. అతనికి లంగరి.

"మళ్ళా మనం చచ్చిపోతాం – ఈ నాలుగు రోజులేగా –"

"స్త్రీలకి జ్ఞాపకాలుండవు కాబోలు – ఎప్పటికప్పుడు కొత్తే"అన్నాడు ఏదో స్మరించుకుంటూ.

"నాలా ఇంకెవ్వరూ వుండరు – మీకే తెలుస్తుంది?"

"మొగాడు జ్ఞాపకాలతో కాలక్షేపం చేస్తాడు – గతం, భవిష్యత్తు లేని జీవితం, ఎంత బాగుంటుంది; ఇలా స్నేహితులు మాదిరి వాంఛలు అనుమానాలు, పీడింపులు లేకుండా వుండకూడదూ? ప్రశాంతమైన నీటిని ఎందుకు కెలికివేస్తావు? నీ సౌందర్యాన్ని నాచేత హత్య చేయిస్తావు. తర్వాత నిన్ను త్యజిస్తాను. ఆ విషాద అనుభవం మన కొద్దు–" అన్నాడు విధి.

అతని ఒళ్ళో తలకాయ పెట్టుకుని, ఏడవడం సాగించింది కోమలి. ఆశ, యదార్థం కావడం కోసం సాగిస్తున్న ఏడుపు అది.

ఈ శరీరాలు, ఒకళ్ళని చూసి ఒకళ్ళు అసహ్యించుకోడానికి ఉపయోగిస్తాయి. సంపూర్ణమైన యేవగింపు లేకుండా, "మృత్యువు" అంటూ వుంది. సృష్టిలో మృత్యువు లేకపోతే ఈ సంసారాలు, ఈ సంఘ జీవితాలు, దేశీయతా వాదాలు, అంతర్జాతీయత వొక క్షణంలో పటాపంచలై పోతాయి; శక్తులు నశింపై పోయిన శరీరం, అంత అసహ్యంగా వుంటుంది. అందరి మనస్సులూ ఒకటై, అందరి ఆత్మలు ఒకటై ప్రపంచం ఏకమై పోవాలంటే, శరీరాలని త్యజించి దూరంగా ఏకాంతంగా వుండాలి–"

"ఎందుకు అసలు ఏకం కావడం? ఆనందంలేని బ్రతుకు ఎందుకు? మీరు చెప్పింది నిజమైతే అసలు మగా, ఆడా ఎందుకు? – తప్పు, అంతా తప్పు – భ్రమ–" అంటూ అతని మోకాళ్ళ మీద కోపంతో గుద్దింది! కోమలి శరీరంలో చలిమంట వుంది. అందులోకి అతన్ని తోసేస్తోంది. జ్వాలలా ఆమె సౌందర్యం అతన్ని చుట్టుకుంటోంది తర్కం, జ్ఞానం, ముందు – వెనక చూపు – ఏదీ ఆ మంటని చల్లార్చలేదు. ఆమె జడని అతని చేతిలో పట్టుకుని మొహాన్ని పైకి లేవతీసి చూశాడు. సూర్యాస్తమయాన పశ్చిమ ఆకాశంలో మేఘంలా కళ్ళు ఎర్రంగా అయ్యాయి. కళ్ళకింద నలుపు చీకటిలో ఎగబ్రాకుతోంది. ఒడ్డున పడ్డ చేపలా, పెదవులు ఒణికి పోతున్నాయి.

"నాకు తెలుసు – మీరిం కెవర్నో ప్రేమిస్తున్నారు" అన్నది.

"అది నీ ప్రేమకి అంతరాయం కాదుకదా ? మన శత్రువులకీ ఈ చందమామే వెన్నెలిస్తోందని, చందమామని మెచ్చుకోడం మానం" అన్నాడు.

"అమృతంగారా? "

అతనికి నవ్వొచ్చింది.

"ఇంకా–? వుండు, ఎవరో వచ్చినట్టుంది – కాత్యాయని కాబోలు" అన్నాడు.

"ఇంకా – కాత్యాయనా?"

నిధి కోమల్ని ఒక్క లెంపకాయ కొట్టి, తోసేసి లేచాడు. కాత్యాయని తలుపులు తీసి, వారిద్దరూవున్న దృశ్యాన్ని చూసి, తలుపులు మూసి వెళ్ళిపోయింది. నిధి బయటికి నడిచి మెట్లకింద ఆమెని కలుసుకున్నాడు.

"నారయ్య మూల్గు ఎక్కువైంది మా నాన్నగారు వచ్చారు."

ఇద్దరూ తొందరగా కిందికి వెళ్ళారు. నారయ్యకి జ్వరం ఎక్కువైంది. బాధపడుతున్నాడు. నిధి ఇంజక్షన్ ఇచ్చాడు. నారయ్య చూస్తూ పడుకున్నాడు. గాని మాట్లాడలేకపోతున్నాడు. అనంతాచారిగారు నిధిని దూరంగా వరండాలోకి తీసికెళ్ళాడు. అతను లేని వారం రోజుల్లోనూ జరిగిన అల్లర్లను గురించి చెబుతున్నాడు. సర్కారుజిల్లాలవారిపై అక్కడ వారికి ఉండే వైషమ్యాన్ని అరికట్టేందుకు ఏదైనా మార్గం చూడాలన్నారు. ఒక సభ ఏర్పాటు చేసి, వారి ఉద్దేశాలు బైటపెట్టి వాళ్ళని మంచి చేసుకోటానికి నిర్ణయించారు. వారి కోపానికి గురికావడానికి అతను చేసిన తప్పు ఏమిటో నిధికి అర్థం కాలేదు. అతన్ని సర్కారు జిల్లాల వాడని అనడం కూడా

న్యాయం కాదు; తను అక్కడ స్థిరపడిపొయ్యాడు గనక, వారిలో వాడిలాగే ఎందుకు భావించరో తెలీడం లేదతనికి. ఈర్ష్య, అసహనం – అతని సంపదని చూశా? అతను వారికి చేస్తున్న ఉపకారాన్ని చూశా? వాడెవడో వచ్చి మన్ని బాగు చేసేది ఏమిటి" అనా? అనంతాచార్లుగారు గూడా సరియైన కారణం చెప్పలేకపోతున్నారు. స్వార్థం, జాతీయత కింద మారడం కాబోలు అన్నారాయన. ఇతరుల దృష్టిలో, వారి సమానత్వం ఋజువు చేసుకోవడమో! ఆచారిగారు చదవమని ఓ ఉత్తరం ఇచ్చారు. నిధి చదువు కున్నాడు.

"... యీ పరిస్థితులలో కాత్యాయనికి వేరే సంబంధం చూసుకోడం మంచిది. మీకు సంబంధాలు వెదుక్కునే అవసరంకూడా లేదనుకుంటాను. మీకు అప్తులు, ఈ విషయాలలో ఆదుకునేవారు వుండనే వున్నారు. ఇందుచే మీకు కలిగిన చీకాకుకి చింతిస్తున్నాము. క్షమింప ప్రార్థన..."

అది పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుంటున్న ప్రభంజన మూర్తిగారు రాసిన లేఖ. మొదట్లో వారి కుర్రాడికి కాత్యాయన్ని చేసుకోడానికి ఒప్పుకుని తరవాత వ్రాసిన ఉత్తరం అది.

"ఇట్లాంటి పరిస్థితులలో నేనిక్కడ నుంచి మరోచోటికి వెళ్ళిపోవడము మంచిది అనుకుంటాను " అన్నాడు నిధి.

"తెలీనివాళ్ళు అనేకం అనుకుంటారు. మన కర్తవ్యం మనం మానకూడదు. అట్లా భయపడి, యీ లోకంలో ఎంతకాలం బ్రతకగలం? నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడాయన ఖచ్చితంగా–

"నాతో స్నేహంగావుండి నన్ను ఆదరిస్తున్నారు కాబట్టి, నా మీద వుండే కోపమంతా మీ మీదికి తిప్పినట్లు కనిపిస్తోంది. నా మూలంగా మీకే ఇబ్బందులు రావడం నాకిష్టం లేదు" అన్నాడు నిధి.

ఇంతలో కోమలి భుజాన తువ్వాలును వేసుకొని గబగబా వారి ముందు నుంచి నడిచి వెళ్ళింది. నిధి ఆమె వెళ్ళడం చూస్తూనే ఉన్నాడు. అనంతాచారిగారు మళ్ళా ప్రారంభించారు.

"నీకు నేను చెప్పదగ్గవాణ్నీ కాదు అయినా, పెద్దవాణ్నీ గనక ఏదో సలహా ఇవ్వాలనిపిస్తుంది."

"తప్పకుండా"

"భార్య పోయింది – ఇంకా వయస్సులో వున్నవాడవు, బోలెడుకార్యాలు సాధించాలి. నువ్వు మళ్ళా వివాహం చేసుకోవడం మంచిది" అన్నాడు, ఆచారిగారు.

నిధికి భయం వేసింది. "కొంపతీసి, కాత్యాయన్ని చేసుకోమనడు కదా!"

"నాకా ఉద్దేశం పుట్టలేదు. ఆ అవసరం కూడా కనిపించలేదు" అన్నాడు నిధి.

"ఇలా పెండ్లిలేకుండా, వూరికే కలిసి వుండటం లోకులకి నచ్చదు."

ఆచారిగారు కోమలిని మనస్సులో పెట్టుకుని అన్న మాటలని నిధికి తెలుస్తోనే వుంది.

"నిర్బంధ స్నేహంలో నాకంత నమ్మకం లేదు."

"కావచ్చు. కాని సంఘం హర్షించదు. సంఘానికి బహిర్గత చిహ్నాలు కావాలి."

"అలాంటి చిహ్నాలు వున్నప్పుడు కూడా నన్ను సంఘం క్షమించింది కాదు. సంఘాన్ని గౌరవించే అవసరం నాకు కనబడలేదు. మరణించిన వారిని కూడా, సంఘం తిడుతూనే ఉంటుంది. ఫలానా జిల్లా వాడిని— అని రాజకీయంగా ద్వేషించింది సంఘం; ఫలానా తల్లి కొడుకుని అని నైతికంగా హింసించింది సంఘం..." అంటూ అప్రయత్నంగా; ఫౌంటనులో అమర్చబడ్డ తల్లి రాతివిగ్రహం కేసి చూశాడు నిధి.

అవన్నీ ఆచారిగారితో చెప్పకున్నందుకు నిధి విచారించాడు. ఆచార్లగారు వోదారుస్తూ అతని భుజాన్ని తట్టాడు.

"నారయ్యని చూసొస్తాను" అని ఆచారిగారు లోపలికెళ్ళారు. నిధి తల్లి విగ్రహందగ్గరికి వెళ్ళాడు. విగ్రహం కుడిచెయ్యి విరిగింది మొహాన పైనుంచి కిందివరకూ పెద్ద పగులుంది. ఎవరో అతని ఆయువు పట్టుమీద కొట్టిన దెబ్బ అది. ఆపని ఎవరు చేసింది?

గేటుదాటి అవతలికి నడిచాడు. ఎక్కడికో దూరంగా నడిచివెళ్ళి పోతోంది కోమలి; కోపం వచ్చింది కాబోలు, మళ్ళా తిరిగిరాదు? ఏదేనా అఘాయిత్యం చేస్తుందా? అటుకేసి నడవడం సాగించాడు. ఆకాశం నిర్మలంగా ఉంది; చంద్రుడు లేడు; మేఘాలు లేవు; నవ్వుల దుప్పటి కప్పకున్నట్లుంది భూమి; మందంగా వీస్తోంది గాలి. ఊరు, చెట్టు, పుట్ట అన్నీ దాటాడు "నీకు ఎవ్వరూ లేరు." పాట జ్ఞాపకం వచ్చింది. అవన్నీ తాటి చెట్లు. ఏకాంతాన్ని భంగం చెయ్యకుండా నిశీధి ఏర్పాటుచేసిన ఫారా వాళ్ళలా తాటిచెట్లు ఫర్లాంగు దూరంలో వుంది కోమలి.

"కోమలీ" అని కేకవేశాడు అతని కంఠం అతనికే చిత్రంగా తోచింది. కొత్తగా ఎవరి కంఠంలాగో వినిపించింది "జాగ్రత్త"అంటూ భయంకరంగా తాటిచెట్లు ఆకులు గర్జించాయి. కీచురాయి కూతమానింది. అదిరినట్లుగా నక్షత్రాలు మినుకు మనడం మానుకున్నాయి. గాలి రాలేక నిట్టూరుస్తోంది. కోమలి వెనక్కి చూడదు; భూమి అనుకుని ఆకాశంలోకి నడుస్తున్నట్లుంది.

తొందరగా నడిచి ఆమె దగ్గరకి చేరుకున్నాడు. మట్టిలో రాళ్ళని తోసేసి, కూలబడిపోయింది కోమలి. అతను చతికిలబడ్డాడు. అతని ఒళ్ళో తువ్వాలు కప్పి దాని మీద మొహం ఆనించి ఏడుస్తోంది — చల్లబడిన రక్తపు చుక్కలు.

"ఎందుకు?"

"........."

"కోపమా—?"

"........."

"చూడు మరి"

"నా కోసం ఎందుకొచ్చారు?— మీరు వెళ్ళిపోండి ...నేను రాను—రాను."

"ఉస్ — ఊరుకో నక్షత్రాలు జడుసుకుంటాయి. నిన్ను యింకెప్పుడూ కొట్టను క్షమించు" అన్నాడు.

"నేను ఒక్కసారి కొడతాను" అని అతన్ని కోమలి మెత్తగా లెంప మీద కొట్టింది.

"తీరిందా అలక! ఏవేవో మనస్సుని బాధిస్తే, అకారణంగా కోపం వచ్చి, ఆ విధంగా బైటపడుతుంది" అన్నాడు నిధి.

"నన్ను క్షమించండి – కష్టపెట్టే మాటలు అన్నాను – అబద్ధం అని నాకు తెలుసుండి కూడా–"

"నీకూ నాకూ క్షమాపణ లేదు. కోమలీ– మనంతట మనం కలుసుకోలేం; సంఘం మనని విడదీయలేదు"

కోమలి కళ్ళు పెద్దవి చేసి, మూతి, సున్నాలాచుట్టి, అతని జుట్టులో చేతులు పోనిచ్చి, కిందికి నెట్టేసి, అతని కంఠం మీద తన బుగ్గని ఆనించింది.

"ఇలాగే వుండి, ఇక్కడే చచ్చిపోతాను" అంది కోమలి.

"పొద్దవుతోంది–లే, వెడదాం. ఆకలెయ్యడం లేదూ ?"

"నిన్ను కొరుక్కుతింటాను."

"ఇంకేం మిగల్దు, మళ్ళా ఆకలేస్తే–"

"మళ్ళా వెంటనే బాగుచేసేస్తా–"

"చెడిపోయిన వస్తువు బాగుపడటం లేదు సృష్టిలో. వున్న దానికి విలువలేదు. అది ఎవరికీ అక్కర్లేదు " అన్నాడు.

"ఎవళ్ళకీ అక్కర్లేదు ? దేవుడికి కూడా?"

"నువ్వు దేవుడివా?"

"ఓ– దేవతని–"

ఆమె శరీరం పొంగిపోయి, రాతి మీద భగ్నమైన కెరటం తుంపరల లాగ విడిపోయింది మనిషంతా జీవుడై మృత్యువుని వెతుక్కుంటోంది.

"నేనేమీ చెయ్యను, ఊరకే పడుకుంటాను."

గుండెలు కొట్టుగోడం వినిపిస్తోందతనికి, రక్తం ప్రాకులాట తెలుస్తోంది. నాళాల నృత్యం చూస్తున్నాడు. నక్షత్రాలు తీవ్రంగా మెరుస్తున్నాయి. తాటిచెట్లు నిద్రనుంచి లేచాయి; కీచురాయి సంగీతం ప్రారంభించింది. ప్రకృతి స్వప్నంలోంచి లేచింది...యధార్థాన్ని చూసి, జడుసుకుని కళ్ళుమూసింది.

కోమలి ఆ అనుభవంతో మానసికంగా ఎదిగిపోయింది. జీవితంతో సంపర్కం చాలించుకుని ఏకాంతంలో వార్ధక్యం పొందింది.

"చూశారా–మిమ్మల్ని ఏమీ చెయ్యలేదు. నాకా మాత్రం తెలీదా?"

"ఇలా వుండగా ఎవరేనా మన్ని చూస్తే ఏమీ జరగలేదంటే నమ్ముతారా?"

"నమ్మరు. వాళ్లు ఎలాగా అనుకోడం మానరు గనక, మనం ఏమీ చెయ్యకుండా వుండటం ఎందుకనిపిస్తుంది నాకు " అన్నది.

"అదే పొరపాటు– నిజమైన ప్రేమకి, మానవుడు నిర్మించిన సరిహద్దులుండవు. ఉంటే అది ప్రేమే కాదు."

"ఐతే మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారన్నమాటే – నాతో ఇన్ని రోజులు ఎందుకు చెప్పలేదు? చెబితే వేధించుకు తినకబోదును కదా––"

"చర్చిస్తే మిగలని దీ ప్రేమొక్కటే..."

కాసేపు నిశ్శబ్దంలో పడ్డారు... రెండు కెరటాలు కొట్టుకొని, సుడిగుండంతో కలుసుకున్నట్లు ... కళ్ళల్లోకి చూసుకోడం. వెర్రిగా నవ్వుకోడం... అంతే వారి ప్రేమ ఎన్నెన్నో కొత్తవి అవగాహన అవుతాయి. గతాల అస్థిపంజరాలు నశిస్తాయి; భవిష్యత్తు ముందుకి సాగి మాయమైపోతుంది. దూరాలు, లోతులు, శిఖరాలు...అన్నింటికీ ప్రతిచోటునుంచి, ప్రతిపక్షం నుంచీ, వారే కేంద్రమౌతారు. క్షణం వెలుగుని చూశారు. ఉద్రేకానికీ, ఊహకీ, ముందు వెనకలకీ, కాలానికీ, స్థలానికీ అతీతమైన జీవజ్ఞానం.

లేచి నడవడం సాగించారు. చెయ్యి చెయ్యీ పట్టుకుని... ఆ నడక కాలం చివరికి; స్థలం చివరికి పరమావధిలేని అన్వేషణ; గమ్యస్థానంలేని యాత్ర. అవన్నీ భ్రమలు, ఊళ్ళోకి చేరుకున్నారు. నిశీధి దట్టమై తన్ను చూసి జడుసుకుని, నక్షత్రాలని క్రిందికి దించుకుంది. ఆ నాలుగు తాటి చెట్లమధ్య నిలబడి ఆకాశంకేసి చూస్తున్నారు. కోమలి చెట్టుకి జార్లపడింది. అతని నడుంని తన చేతులతో బిగించి.

"ఆయాసంగా వుందా?"

"నాకేం ఆయాసం? అప్పుడే యింటికొచ్చామని బెంగ" అని నీర్సంగా నవ్వింది.

"ఉట్" మని ఏదో చప్పుడైంది. వెనక్కి తిరిగి చూశాడు. తాటిచెట్టుకి ఒక కత్తి అతన్ని దూసుకుపోయి గుచ్చుకొని వ్రేళ్ళాడుతోంది. అటూఇటూ చూశాడు. దూరంగా పొదలు; మరీ దూరంగా గుడిసెలు. మనుషుల అలికిడి లేదు. కత్తిని బయటకి లాగి పరిశీలించాడు. అది కత్తికాదు; పొడుగాటి చాకు – దానిమీద "వ" అన్న అక్షరం చెక్కబడి వుంది. ఆ చాకు ఎవరిదో అతనికి తెలుసు.

"అదేమిటి?" అన్నది కోమలి చాకుని తీసుకుని చూసింది. "ఎవళ్ళో పొగరమోతు చచ్చినాళ్ళు –"

"పాపం. ఎవరో మనని మేలుకోమంటున్నారు" అన్నాడతను.

"అరెస్టు చేయాల్సిందే... యింక వూరుకోకూడదు" అన్నది.

"మనుషుల్ని, సంస్థల్ని, దేశాలని, అన్నింటినీ ఎదుర్కోవచ్చు, అన్నింటినీ జయించవచ్చు. అన్నిటినీ... ఒక్క అకారణ ద్వేషాన్ని తప్ప..." అన్నాడు నిధి.

మళ్ళా నడవడం సాగించారు.

"నువ్వు డాక్టర్ని డిస్‌మిస్ చేశావుటగా?"

"అవును. రోగి మందులేక చస్తావుంటే, వాడికి నర్సుతో షికార్లేమిటి?" అంది.

"అవును. మరి నారయ్య చస్తూవుంటే, మనం షికారుకు రాలేదు, అల్లాగే అతనూను" అన్నాడు.

"మీరింత మంచివారు గనకనే. వాళ్ళింత నెత్తినెక్కుతున్నారు."

"స్వచ్ఛంగా 'మంచి' అనేది లేదు. ఎవళ్ళో ఒకళ్ళకంటె 'మంచి' ఉండొచ్చు."

నడక తొందరగా సాగించారు. గనుల దగ్గరికి చేరుకున్నారు. గనుల పల్లాలు, తవ్వులు కనిపించడం లేదు. పెద్ద గనులు మూడు రాళ్ళతో మట్టితో, పూడ్చబడి వున్నాయి.

"ఇదేమిటి?" అంది కోమలి.

"ప్రేమ ఆరునెలలు తీసుకున్న పనిని ద్వేషం రెండు గంటలలో చేసింది."

అతనికి నవ్వాలో ఏడవాలో తెలిసింది కాదు. మానవుడి ద్వేషం, క్రూరత్వం, పశుత్వం యెట్లా వుంటుందో చూడగలిగాడు. అతను ఆ మానవజాతికి చెందినవాడే. తనని తాను ఎట్లా ప్రేమించుకోగలడు? తనని తాను ప్రేమించుకోలేని వాడికి యితరులని ప్రేమించే అర్హత ఎల్లా వుంటుంది?

ఇంటికి చేరుకున్నారు. 'అమ్మ' విగ్రహం చెయ్యి వూడిపోయి బీటతో అట్లాగే వుంది, తలకాయ వూడి వుంటుందనుకున్నాడు, కాని అల్లా లేదు. హాల్లోకి చేరుకునేటప్పటికి రెండు గంటలయింది. అరుగుమీద తువ్వాలుతో దులుపుకుని పడుకున్నాడు. లోపల్నించి నారయ్య మూలుగు వినబడుతోంది. దూరంగా మూల "చిట్టి" చాపమీద పడుకున్నాడు. దీపం తన్నుకులాడి ఆరిపోయింది. కోమలి నీడ పక్కనే గోడని చేర్లబడి పక్కన ఒరిగిపోయింది. ఆ ఇద్దరూ తమ తమ ఏకాంత భవనాలలో బంధించబడి, ఒకర్ని ఒకరు నిద్రలో చూసుకుని, దగ్గర్నుండి కలుసుకోలేమే అని విశ్వలంగా ఏడుస్తున్నారు.

ఆ సూర్యుడే ఉదయించాడు. ఆ కిరణాలే వారి నేత్రాలని మాధుర్యంలో మత్తెక్కించి మేలుకొలిపాయి. చుట్టూ జనం పోగడ్డారు, రాత్రి జరిగిన దురంతానికి కారకులెవరో అంచనాలు వేస్తున్నారు. నేరారోపణ చేస్తున్నారు, జిల్లా మెజిస్ట్రేట్ కూడా వచ్చాడు. అసలు గనులే లేవనీ. వాటి పేరు చెప్పుకుని, రాయలసీమ ప్రజల్ని మోసంజేసి, ఒక సర్కారు జిల్లా వ్యక్తి, ఇష్టం వచ్చినట్లు అమాయకపు ప్రజలపై అధికారం చలాయిస్తున్నాడని మేజిస్ట్రేట్‌కి ఆకాశరామన్న పేరిట పిటిషనులు వస్తే వాటి నిజానిజాలు తెలుసుకుందామని, ఆ ప్రభుత్వోద్యోగి చక్కా వచ్చాడు. ప్రణాళికలు పరిశీలించాడు. ఇంజనీర్లని పరామర్శించాడు. గనులు వూడిపోయి వున్నాయి. ఫిర్యాదులు, విచారణ, శిక్షణ... సాక్షులు అంతా పూర్తయి, మేజిస్ట్రేట్ ప్రభుత్వం వారికి పంపడానికి రిపోర్ట్ తయారయ్యేటప్పటికి మధ్యాహ్నం రెండు గంటలైంది. మేజిస్ట్రేట్ ఆ పిటిషన్‌లలో యదార్థం లేదని దయానిధి తలపెట్టిన కార్యం న్యాయబద్ధమైందని వ్రాసి పంపించాడు.

ఈ వార్త వజ్రకరూర్‌లో పాక్కింది, అక్కడ ఒక పెద సభ చేశారు. మేజిస్ట్రేట్ అనంతాచారిగారి స్నేహితుడనీ, అయన మొహమాటాన ప్రభుత్వంవారు న్యాయంగా విచారించక, తగిన చర్య తీసుకోవడం మానివేశారనీ, వారు నిశ్చయించి, సభలో ఉపన్యాసాలు చేసి గవర్నర్‌గారి దగ్గరకు వో "డెప్యుటేషన్"ని నిర్ణయం చేసుకున్నారు. వారు గవర్నర్‌కి నివేదించుకోదలచిన అంశాలు:

1) ఆంధ్రరాష్ట్రంలో విషయంలో సర్కార్ల వారితో ఏకీభవించలేము.
2) తమకి ప్రత్యేక రాష్ట్రం వుండాలి. అది ఇవ్వలేని పక్షాన ఆర్థిక, జాతీయ సమానత్వం సమకూర్చే అవకాశాలు ప్రభుత్వం వెంటనే కలిగించాలి.
3) ఇతర జిల్లాల వ్యక్తులకు ఈ జిల్లాలలో పారిశ్రామిక సావకాశాలుండగూడదు.
4) ఉద్యోగాలు, కళాశాలల్లో "సీట్సు"... వీటిలో ఇతర జిల్లాల వారికి ప్రవేశం వుండకూడదు.

ఈ తీర్మానాలు సమగ్రంగా లేవని కొందరు పెద్దలు నిర్ణయించి సమయోచితంగా – "ప్రధాన స్థానం రాయలసీమ వారికే ఉండాలి. వారు లభించనప్పుడు ఇతర

జిల్లాలవారిని తీసుకోవచ్చు" అన్న సవరణ చేశారు. కడపలో ఒక కాలేజీ వెంటనే పెట్టాలి. దానికి ప్రిన్సిపాల్‌గా మళయాళీ కాని, తమిళ సోదరుడు గాని, సర్కార్ జిల్లా వ్యక్తిగాని అవకూడదు" అని మరో తీర్మానం ఆ సభలో అనంతాచారిగారూ, నిధి కూడా ఉన్నారు.

"ఇంకా నయం. ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు కనీసం మనిషై ఉండాలని సంకల్పించనందుకు సంతోషించవల్సిందే —" అన్నారు అనంతాచార్లుగారు అక్కడ ఉపన్యసిస్తూ. అక్కడి జనానికి యిదివరకు ఆచారిగారి పైన ఉన్న గౌరవం యిప్పుడు లేదు. ఆయన ప్రసంగం ఎవరూ వినే స్థితిలో లేరు.

సభ ముగిసింది — జనం పల్చబడ్డారు. చీకటి పడుతోంది. నిధి దూరంగా అరుగుమీద కూర్చున్న నరసయ్యగారి దగ్గర కెళ్ళాడు.

"ఈ చాకు మీదే ననుకుంటాను. మీ వాళ్ళెవళ్ళైనా గనుల దగ్గర పారేసుకునుంటారు" అని చాకు తీసి నరసయ్యకిచ్చాడు.

నరసయ్యదానికేసి పరాకాయించి చూశాడు.

"అవును — వాదే మా తమ్ముడు, పారేసుకున్నాడేమో" అని చాకును తీసుకున్నాడు.

నిధి, ఆచార్లుగారు ఇంటికి చేరుకున్నారు.

"ఇవాళ అందరం మా యింట్లో వుండకూడదూ!" అన్నారు ఆచార్లుగారు. సరేనన్నాడు. కాత్యాయన్ని పంపి, కోమల్ని ఆచారిగారింటికి తీసుకురమ్మన్నారు.

అనంతాచారిగారు వీధిలో మడత మంచం వాల్చుకుని కూర్చున్నారు, నరసయ్య ఇద్దరు పోలీసులూ వచ్చి ఎదురుగా నిలబడ్డారు. తక్షణం ఆచారి గార్ని తీసుకు రమ్మనమని మేజిస్ట్రేట్‌గారి దగ్గరనుంచి "సమ్మన్స్" వచ్చింది.

"అంతర్జంటా? ఉదయం రాకూడదూ?" అని అడిగారు ఆచార్లు గారు.

"ఇప్పుడే రమ్మన్నారు."

ఆచారిగారు, యింట్లోకెళ్ళి కోటు, కండువా వేసుకుని కర్ర తీసుకొని, మళ్ళా ఉదయమే వస్తానని చెప్పి, కార్లో ఎక్కి వెళ్ళిపోయారు.

దయానిధి ఏమీ పాలుపోక, రోడ్డుమీద నడుస్తూ పోతున్నాడు. దూరంగా వంతెన మీద కొందరు వ్యక్తులు కూర్చుని మాట్లాడుకోడం వినబడుతోంది అతనికి.

"ఆ నిజలింగప్పగాడి కన్ను దానిమీద పడింది. దాన్నెప్పుడో లేవదీసుకుని కొట్టుకపోతాడు."

"అయ్యవోరి పెళ్ళాం కాదంటగా..."

"అరమ్మా ఇదే మాదిరిట — బల్ల కట్టుకుని సంపాదించిన డుడ్డే..."

"అమ్మ బుద్ధులే కొడుక్కీ వచ్చాయా..."

నిధికి ప్రపంచం శ్మశాన భూమిగా కనబడుతోంది. ఆ చీకట్లో ఆ రొదలో.

అక్కడ నుంచి వచ్చేద్దామనుకున్నాడు. కాని ఇంకా ఏం చెప్పకుంటారో నన్న కుతూహలం వదలలేదు. ప్రపంచంతో నిమిత్తం వదులుకోలేదు స్వార్థం. మళ్ళా కంఠాలు విన్పిస్తున్నాయి.

"సర్కారోళ్ళు అందరూ అంతేరా – అళ్ళకి ఆడోళ్ళ భాగోతమే – అళ్ళు పోతేగాని శని వదుల్దు. మీటింగులో తీర్మానం అయిద్దిగా–"

"నిధిని – స్వార్థం వాళ్ళలోకి నెట్టి వేస్తోంది. తను తన గౌరవం తన ఆత్మ, తన ఆదర్శాలు, తన జాతి; తన దేశం, తన ప్రపంచం – అన్నీ ఒక్కసారి ప్రేరేపించి, శక్తిలాగై, రంగంలోకి నెట్టేశాయి. భయం, సిగ్గు మొగమాటం, ఔదార్యం అన్నీ ఏమయ్యాయో!"

"నేను నిజంగా మీకు చేసిన అపకారమేమిటో చెబుతారా? బ్రతిమాలుకుంటాను" అన్నాడు గుంపులోకి వెళ్ళి. ఆ వ్యక్తులు తెల్లబొయ్యారు.

"మిమ్మల్నే మన్నాం – మేం వేరే మాట్లాడుకుంటున్నాం" అన్నాడు వాళ్ళల్లో పెద్దమనిషి.

"మీరనుకునే వన్నీ నాక్కూడా అన్వయిస్తాయి. వాటిని అబద్ధం అని రుజువు చేయ్యలేను. నా తప్పు నాకు తెలియపరిస్తే మహోపకారం చేసినట్లు" అన్నాడు.

ఎవ్వరూ సమాధానం చెప్పరు.

"నేను సర్కారు జిల్లాలవాడిననా మీకోపం?"

సమాధానం లేదు.

"మాట్లాడరేం?"

నిశ్శబ్దం.

ఎవరో సకిలించారు.

"అదే ఐతే, రేపు ఉదయమే, నేను వెళ్ళిపోతున్నాను."

నిశ్శబ్దం

"నాకు పెండ్లి కాలేదనా? – రేపు ఉదయమే పెండ్లి చేసుకుంటాను" ఎవరో నవ్వారు.

"నవ్వులాట కాదు. మీరెవరో నాకు తెలీదు. అనేకుల మనస్సులలో వుంటున్న భావాలని మీరు బైటికి విపులంగా వెళ్ళబుచ్చారు. మీ మధ్య నేను వుంటున్నాను గనుక, మీతో సమాధానపడడం నా విధి, మీరేది కోరితే అది చేస్తాను. ఆస్పత్రి, గని, భవనం, స్కూలు, లైబ్రరీ – అన్నీ మీకు వప్పగించేస్తాను."

"రాష్ట్రం" అన్నారెవరో.

"నాకు రాష్ట్రం" అక్కర్లేదు. మనందరం స్నేహంగా, సుఖంగా వుండటం కావాలి. వద్దని ప్రచారం చెయ్యమంటే నేచేస్తాను. మాట్లాడరేం?

అంతా నిశ్శబ్దంగా వుంది.

"ఎవరో మా అమ్మ విషయం ఎత్తారు మీలో. నేనేం చెయ్యను? మా అమ్మ చచ్చిపోయింది, చచ్చిన వాళ్ళని నేనేం చెయ్యను?"

ఒక్కసారి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి; కంఠం పగిలిపోయింది. ఆపుకోలేక, నిధి బిగ్గరగా ఏడుస్తూ, "చచ్చిపోయింది" అనుకుంటూ, పిచ్చివాడిలా నడిచి వచ్చేశాడు. దూరంగా ఎవరో ముక్కు చీదుకుని నిట్టూర్చారు.

ఆచారిగారింట్లో దీపం మసగ్గా కనబడుతోంది. అంతా చీకటి. ఇంకా అతనికి ఏడ్పు రావడం లేదు. కన్నీరంతా ఎండిపోయింది; శ్మశానంలో భూతాలతో

ప్రసంగం చేసి వచ్చింతర్వాత. ఇంక గుండెల మీద భయం తాండవించలేదు, బరువుని సముద్రంలోని ఉప్పునంతా పీల్చేసింది — కన్నీరింక ఉప్పగా ఉండదు.

"రంగ"డొచ్చాడు.

"మరేమోనే; మా అమ్మ ఏమందో చెప్పుకోండి—" అని అతని చెయ్యి పట్టుకుని లాగుతున్నాడు.

"ఏమంది?"

"చెబితే ఏమిస్తారు?"

"నేనివాళ చచ్చిపోతాననుకో — పోయేలోగా నీ కేదేనా కావాలంటే ఏం కోరతావు?"

"ఒక్క రూపాయి."

"ఓస్ ఇంతే కదా — యిస్తా. —"

"ఏమీ లేదు. అమ్మ భోజనానికి రమ్మంది" అన్నాడు రంగడు.

"రూపాయిస్తాను. ఎప్పుడూ ఏడవకేం?" అన్నాడు నిధి.

రంగడు గంతులేస్తున్నాడు.

"అమ్మ చచ్చిపోయినా ఏడవకూడదు" అన్నాడు నిధి.

"ఇంటికి చేరుకున్నారు."

కోమలి వచ్చింది ఎన్నడూ లేంది. ఆ రాత్రి నల్ల చీర కట్టుకుంది. జాకెట్టురంగు తెలీడంలేదు. తల్లో గులాబీలు, మల్లెపూలు, దవనం అన్నీ ఎత్తుగా పెట్టుకుంది. రాణీ అత్తవారింటి కెడుతోన్నట్లుంది.

"పొద్దుపోయింది — ఎక్కడ తిరుగుతున్నారు?" అన్నది.

"నారయ్య కెలా వుంది?"

"అలాగే వుంది; మూల్గడం లేదు. గొడవలన్నీ ఒదిలిపొయ్యాయా"

అతనేమీ మాట్లాడలేదు. భోజనాలు చేశారు. రాజమ్మగారు దిగులుగా వుంది. ఎవ్వళ్ళూ ఎక్కువ మాట్లాకుండానే భోజనాలు కానిచ్చారు.

దయానిధి తువ్వాలు భుజాన వేసుకుని వీధిలోకొచ్చాడు.

"కోమలీ — " అని పిలిచాడు.

వచ్చింది.

"అలా నడుద్దామా?"

"ఓ"

రాజమ్మ గారితో చెప్పి వచ్చింది. కాత్యాయని తనూ షికారొస్తానని బయలుదేరింది.

"ఒద్దమ్మా చీకట్లో — మేం షికారెళ్ళడంలేదు" అన్నాడు.

"పోనీలెండి" అంటూ కాత్యాయని కోపం ప్రకటించి లోపలికెళ్ళి పక్కలెయ్యటం మొదలెట్టింది.

"నా మీద ఇంత దయ కలిగిందేం ఇవాళ?" అన్నది కోమలి.

"కోమలీ — నాకు మనుష్యులన్నా సంఘం అన్నా ఇంతవరకూ భయం వుండేది. ఇవాళతో ఆ భయం పోయింది."

"నేనుండగా మీ కెందుకూ భయం?" అని అతని చెయ్యి పట్టుకుంది; ధైర్యం సూచిస్తూ కనుబొమ్మలు ఎగరేసింది. "ఏం జరిగిందేమిటి?" అని అడిగింది.

"నేను వెలుగుని చూశాను, శ్మశానంలో."

"అవేం మాట్లండి – నాకు భయం పుడతావుంది."

"నమ్ముతావా? మానవ హృదయంలో ద్వేషం ఎందుకుంటుందో కనుక్కున్నాను."

"మీకు నా మీదెందుకుందో కూడా?"

"వేళాకోళం కాదు – నిజం."

"ఎందుకో చెప్పండి."

"చెప్పనా?"

"ఊఁ"

"తనకేం కావాలో తెలీనప్పుడు మానవుడు ద్వేషిస్తాడు."

"అంటే?"

"ఏం కావాలో తెలిస్తే ఆ వస్తువుని ప్రేమించి, దాన్ని పొందటం కోసం యత్నిస్తాడు. అది తెలీనప్పుడు హృదయంలో మిగిలేది ద్వేషం."

"మీకు నేను కావాలని మీకు తెలీదన్న మాటేగా!" అంటూ, తను వేసిన ప్రశ్న తెలివైందని సూచిస్తూ తనే నవ్వడం సాగించింది. "కొందరికి ఏమీ అక్కర్లేదనుకోండి. వారి మాటేమిటి?"

"అక్కర్లేదని తెలుసుకుంటే కూడా ద్వేషం వుండదు" అన్నాడు.

రాళ్ళమీద కూర్చున్నాడు. ఆకాశంలో చంద్రుడు లేడు. గాలి చలికి వొణికిపోతోంది. విధి తలని కోమలి తన ఒళ్ళో పెట్టుకుంది. పసిపాపై పోయ్యాడతను. "మీకు వెలుగు కనబడితే నాకు వెంట్రుక కనబడింది" అన్నది కోమలి.

"అంటే?"

"ప్లేట్లు సర్దుతుంటే ఒక కవరు దొరికింది. దానిలో చూస్తే ఒక సన్నటి పొడుగాటి వెంట్రుక దొరికింది. – నన్ను నేను కనుక్కున్నాను"

"అదేమిటి!"

"నాదేగా – తీసి దాచుకున్నారు – మనిషినే వుండగా మీకిం కేం కావాలి?"

అది అమృతందని చెబుదామనుకున్నాడు. కాని దానివల్ల ఏం ప్రయోజనం? సంతోషం యిచ్చిన భ్రమని తుంచెయ్యడం దేనికి?

"అది నీదనే నమ్మకం ఏమిటో?" అన్నాడు....

"నాకేం కావాలో నాకు తెలుసు. అంతేకాదు, మీకేం కావాలో కూడా నాకు తెలుసు. అనుమానం వుంటేగా సందేహానికి – నాలో ద్వేషం లేదు–"

అంటూ అతని తలని గట్టిగా అదిమి తన పెదవుల్ని తగిల్చింది. ఆనాటి చేప పిల్లలు పెద్దవయి చెఱువులలో కదిలినట్లు వింత పరిమళం అతన్ని ఆవరించింది.

"ఇంక లోతుకి దిగొద్దు – మునిగిపోతాం" అన్నాడు నవ్వుతూ.

"పొండి అట్లాగైతే" అని అతన్ని గెంటేసింది. అతని తల మట్టిలో పడింది. చెయ్యి పట్టుకుని లేవబోయ్యాడు. లేవనీకుండా అతన్ని తోసేసింది. లేచి పట్టుకుని

కొట్టబోయ్యాడు. చక్కలిగింత లెట్టి, తప్పించుకొని పారిపోయింది. తరుముకుంటూ వెంటబడ్డాడు.

"నన్ను పట్టుకోలేరు—"

పరుగెత్తుకుంటూ యిద్దరూ యింటికి చేరుకున్నారు.

"ఈ ఉత్తరాలొచ్చాయట – మీకిమ్మంది అమ్మ" అని "రంగడు" రెండు కవర్లు తీసుకొచ్చి యిచ్చాడు. నిధికి నిద్రస్తోంది. బద్ధకంగా ఆవులించి కవర్ని దిండు కింద పెట్టుకుని పడుకున్నాడు. అందరూ నిద్రపోతున్నారు. గడియారం పదకొండు కొట్టింది.

ఎన్నడూ లేంది ఆనాడు వారికి వెంటనే నిద్రపట్టేసింది. ఎవరో ఇంట్లో యేదో సర్దడం, తడమడం, తలుపులెయ్యడం – శబ్దాలు వినబడుతూనే వున్నాయి. మళ్ళా నిశ్శబ్దం. నిధికేదో చిత్రమైన కల – తను సూర్యగోళంలోకి వెళ్ళిపోతున్నట్లు, సూర్యుడులోంచి పెద్ద పెద్ద మంటల నాలుకలు అతన్ని దగ్ధం చెయ్యడానికి లేస్తున్నట్లు; – ఆ దృశ్యం, భూమిలో వున్నవారు చూసి, "అయ్యో" అని ఏడ్పులు సాగిస్తున్నట్లు భయంతో పక్కకి తొంగిచూశాడు. కోమలి జడలో పూలు ఎర్రగా మంటలలో మెరిసిపోతున్నాయి. కళ్ళు తెరిచి చూస్తున్నాడు. అది స్వప్నం కాదు, యదార్థమే – ఎవరో రోదిస్తున్నారు. పిల్లల ఏడ్పులు, మంటలు, చప్పుడు ఆచారిగారిల్లు కాలిపోతోంది.

ఇల్లు, పాక – అంత తగులబడుతోంది, జనం లోపలికి పోయి, సామానులు ఇవతలికి గిరవాటెడుతున్నారు. ఆ జ్వాలలోకి కోమలి మెరుపు తీగెలా వెళ్ళిపోయింది. చుట్టుపక్కల జనం పోగయి, నీళ్ళు పోసి ఆర్పుతున్నారు. ఆవులు, దూడలూ ఏడుస్తూ పోతున్నాయి. అతనూ లోపలికి వెళ్ళాడు, సామానులు బైటికి గిరవాటెడుతున్నారు. పిల్లలందర్నీ బైటికి తీసుకొచ్చారు. అతను మళ్ళా లోపలికెళ్ళాడు. కోమలి కోసం అగ్నిజ్వాలలు కోమలై, అతన్ని చుట్టేశాయి. అతను పిలిచాడు – "కోమలీ" అని, మంటలు సమాధాన మిచ్చాయి – 'నిధీ' అని, మధ్య దూలం విరిగిపడింది; అతన్ని పక్కనుంచి ఎవరో గెంటి వేశారు; దూలం పడింది; దానికింద తగులడుతున్న చీర, కోమలి చెయ్యి వున్నాయి. ఆ దూలంతో పెనుగులాడి, కోమల్ని యివతలకి లాగి బయట కొచ్చాడు. కోమలికి నుదుటిమీదా, చేతిమీదా దెబ్బలు తగిలాయి మాటలేకుండా పడిపోయింది.

జనాన్ని, సామాన్నీ నిధి తన భవనంలోకి చేరవేస్తున్నాడు. కోమల్ని స్తంభాని కానించిన బండిలో ఎక్కించి, ఇద్దరు సాయంపట్టి, ఆ బండిని ఇంటివైపుకి లాక్కెళ్ళారు. ఆచారిగారి కుటుంబం అందరూ మేడమీదికి చేరుకొన్నారు. కోమలి వున్న బండిని, గేటు దగ్గర నిలిపి, నిధి అటూ ఇటూ తిరుగుతున్నాడు. తప్పకోసం తెప్పించిన యంత్ర పరికరాలు నాశనమై పొయ్యాయి. గనులు పూడ్చబడ్డాయి. వజ్రం మీద వొచ్చిన సిరి, సంపదా, అతా ఆహుతి ఐంది. తనకున్న బంధనాలు తెగిపోయ్యాయి. సంకెళ్ళు వూడిబడ్డాయి. తనింక స్వతంత్రుడు – స్వేచ్ఛా జీవి; గుండె – బరువుతో పగలడం లేదు బరువుగా నడిచి గేటు దగ్గర కొచ్చాడు.

ఏదో మిగిలింది – అంతా నాశనం గాలేదు. పైకి చూశాడు – తల్లి రాతి విగ్రహం – విరిగి పడిపోయింది – పాదాలు మాత్రం మిగిలాయి. "అమ్మయ్య" అనుకున్నాడు. ఇప్పుడతనికి పరిపూర్ణ స్వతంత్రం. అయ్యో ఇది వొక్కటె మిగిలిపోయిందే! అని ఏడవక్కర్లేదు.

నారయ్య తిట్టుతో, దీవిస్తో లేవబోయ్యాడు. అతన్ని పడుకోబెట్టి కోమలికి కట్టుకట్టి చికిత్సచేసి, నెత్తికి దిండ్లుపెట్టి – ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చి గబగబా ఆచారిగారింటికి పరుగెత్తుకు పొయ్యాడు. ఇంటి ముందు మంచాలు అలాగే వున్నాయి పక్క, దుప్పట్లు ఇవతలికి లాగాడు – దిండ్లు వూడదీశాడు. వాటికింద, రాత్రి చదవకుండా వొదిలేసిన, రెండు కవర్లు దొరికాయి. మంటల వెలుగు బోలెడుంది. మొదటి కవరు చించి చదివాడు.

"అయ్యా, నేను మీకు జ్ఞాపకం వుండే వుంటాను. వైకుంఠంగారబ్బాయిని. మా నాయనగారు నెలక్రితం పక్షవాతంవల్ల స్వర్గస్థులైనారని వ్రాయుటకి చింతిస్తున్నాను. వారు చనిపోయేముందు. నాకో కవరు వప్పగించి, దానిని మీకు పంపమన్నారు. దుఃఖసముద్రములో మునిగి నేను ఇన్ని రోజులూ ఆలస్యం చేసినందుకు క్షమిస్తారని తలుస్తాను. మా తండ్రిగారి కోర్కె ప్రకారం, ఆ కవరు ఇప్పుడు వేరే పంపుతున్నాను. అందినదీ, లేనిదీ వెంటనే వ్రాయించకోరతాను.

ఇట్లు,
జనార్దనం"

ఆ రెండో కవరు చించాడు నిధి. అదులో వొక ఉత్తరం, మరొక బుల్లి కవరూ ఉన్నాయి. ఆ ఉత్తరం చదివాడు.

"దయానిధీ, నువ్వు కొన్ని సంవత్సరాల క్రితం జీవితానికి అర్థం ఏమిటని ప్రశ్నించావు. అప్పుడు నీకు ఏ సమాధానం చెప్పినానో గుర్తులేదు. ఏదేనా చెప్పివున్నా, అది నిజమైన సమాధానం అయి వుండదు. ఇప్పుడు సమాధానం నాకు దొరికింది. నువ్వు నా ప్రియశిష్యుడవైనందున ఆ రహస్యం నీకు చెప్పివేయడమే నా విధి. ఆ ప్రశ్నకు సమాధానం ఇందులో పంపుతున్న చిన్న కవర్‌లో వుంటుంది. అది నువ్వు రుజువు చేసుకున్నదీ, లేనిదీ, తెలుసుకునేటంత వరకూ నేనూ జీవించి వుండను. దైవకృప అట్టిది.

ఇట్లు,
వైకుంఠం"

ఆత్రుతతో ఆ చిన్ని కవరు చించి చూశాడు. అందులో ఏమీలేదు – ఉత్త ఖాళీకవరు – జీవితానికి కర్థం లేదన్నమాట!

మంటల అందం చూస్తూ, జనం నిలబడ్డారు. కొందరు ఆర్పడానికి యత్నాలు చేస్తూనే వున్నారు. నిధి తన మేడవైపుకి నడిచి వెళ్ళిపోయాడు. కింద వరండాలో రాజమ్మగారు, పిల్లలు ఏదో తడుముతూ కూర్చున్నారు.

"మీ రందరూ పడుకోండి" అన్నాడు నిధి.

రాజమ్మగారు నిశ్శబ్దంగా ఏడ్పు సాగించింది.

"ఇదంతా నా మూలాన జరిగింది" అన్నాడు.

అవిడ ఏమీ మాట్లాడలేదు. అరగంట గడిచింది. రాజమ్మగారు "ఆయన ఊళ్లో లేకపోవడంవల్ల యిలా జరిగింది" అంటూ పిల్లల్ని తీసుకుని పైకి నడిచింది.

నిధి, ఒక్క ఉత్తరం రాసి కిటికీలో పెట్టి గేటుదగ్గర బండి దగ్గర కొచ్చాడు. కోమలి అతన్ని నీరసంగా పిలిచింది. ఆమెను బండిలోంచి దింపారు. చేతికి మాత్రం బలమైన గాయం తగిలింది. ఆ చేతిని తన భుజం మీద వేసుకున్నాడు. నిధీ, కోమలీ మెల్లిగా నడవడం సాగించారు.

"ఎక్కడికి యీ చీకట్లో?" అంది కోమలి నవ్వడానికి బాధ పడుతూ.

"ఎక్కడికో తెలిస్తే, యికనేం?... జీవితం నిరంతర యాత్ర..." గమ్యస్థానం లేదు. నడవగలవా నువ్వు—?

"ఓ" అని మూతి సున్నాలా చుట్టి, జుట్టు వెనక్కి తోసుకుని అతని భుజాన్ని బిగించి పట్టుకుని తొందరగా నడవడం సాగించింది. ఇళ్ళు, మనుషులు వెనకపడ్డారు. తాడిచెట్లు నిద్రలో లేచి అవులించి పక్కకి జరిగి మళ్ళా పడుకున్నాయి — కాపలా కాసేటందుకు ఏమీలేక.

వెనక్కి తిరిగి చూశాడు. తీరాచేసి వాళ్ళు ఒక ఫర్లాంగే నడిచారు. దూరంగా మేడముందు, గేటుదాటి ఎవరో యువతలి కొచ్చి, తమకేసి నడుస్తున్నారు. వెనక ఎవరో నడిచి, ముందు నడిచేవారిని నిలిపి, — ఇద్దరూ మళ్ళా వెనక్కి వెళ్ళిపోయిన దృశ్యం చూశాడు నిధి. ఎవరో అతనికి తెలిసింది.

రాళ్ళు, గుట్టలు, పొదలు, కాలిబాట ఆవలిగట్టు, పుట్టలు — అన్నీ దాటి కొండలదగ్గరికే చేరుకున్నారు —

అంతా చీకటి. కాలం ఎంతైందో ఎవరికీ తెలియదు. పైనా, కిందా — అన్నీ నక్షత్రాలే. తన సిరి, సంపదా "కాత్యాయని" — అన్నీ కోటి వజ్రాలై, ఆకాశాన అలంకరించాయి, — ఎవరికీ అందకుండా — ఎవరూ నిర్మూలం చెయ్యకుండా, వెనకా ముందూ, ఎడమా, కుడి — అంతటా చీకటి, నక్షత్రాలు విశ్వమంతా వాటిలో ఒక చిన్న నక్షత్రం సృష్టిలా వికసించి విశ్వమంతటా వ్యాపించింది, అంతా తమదే — కాని చెయ్యి చాస్తే ఏదీ అందదు. అన్నీ తమరివే — కాని నోరిప్పి పిలిస్తే, ఏదీ పలకదు.

రెండుకొండల మధ్యనుంచి నడిచి అవతలకి చేరుకున్నారు — అవలంటూ లేని అవతల నడిచి నడిచి; నడిచి నడిచి, నడిచి నడిచి — మళ్ళా అక్కడికే జేరుకోటమా! అంతేనా విశాల ప్రపంచం. అదేనా అనంత జగత్తు? ఇదా ఎడతెగని జీవిత రహస్యం!

కోమలి గడ్డిలో వాలిపోయింది.

"ఇక నేను నడవలేను బాబు... ఇక్కడ పడుకుందాం"

చీర కొంగు వుండకింద చుట్టి తలకింద పెట్టుకుని కోమలి పడుకుంది.

ఎవరో "నిధిగారు" అని బిగ్గరగా కేకవేసినట్లు వినిపించింది. కొండమధ్యనుంచి వెనక్కి చూశాడు. దూరంగా ఎవరో కదులుతున్నట్లుగా కనిపించింది. "అయ్యగోరూ" అన్నది ఆ కంఠం గబగబా వెనక్కి నడిచాడు.

నారయ్య పడిపోయాడు.

"నా పనై పోయిందండి – మీకెందుకూ పనికిరాకుండా వున్నాను. మీరు భద్రంగా వుండండి... మీరు..."

నారయ్య మరి కదలడు.

నిధి దూరంగా నడిచి, కొండపక్క పెద్ద దిమ్మమీద పడుకుని అకాశంకేసి చూస్తున్నాడు. ఆనాడు కాలవగట్టు, యీనాడు కొండలమధ్య అదే ఆకాశం. అవే నక్షత్రాలు అతను ఎంత దూరం వచ్చినట్లు? ఎంత సేపు అయినట్లు? స్థలం, కాలం తనూ – యీ మూడింటిలోనూ, ఏది యదార్థం? ఆ బండి మీద పడివున్నది ఎవరు? చివరకి మిగిలిందేది?

తన జీవితం పాడుచేసుకున్న వ్యక్తి యితరులనేనా బాగుచేద్దామని సంకల్పిస్తే, అన్నీ పేచీలే. తన జీవితం బాగుచేసుకున్న వ్యక్తికి ఇతరుల జోలి అక్కర్లేదు. ఇతరులు బాగులేకపోతేనే తను బాగుండటం అనేది జరుగుతోంది. అసలు మంచి చెడ్డల విలువలు నిర్ణయించేది ' యితరులు.ఒకరి "కంటె" ఒకరు మంచి, కాని అసలు "మంచి" అంటూ ఎక్కడుందీ? ఎక్కడో వుండాలి లేకపోతే "కొంచెం మంచి" "యింకా మంచీ" ఎలా వస్తాయి? మంచికి కావల్సింది మూడు; ప్రేమా, ధనం, కీర్తి. మొదటిది యవ్వనంలో, చివరిది చివరలో, రెండోది ఎప్పుడూ కావల్సింది. రెండోది వుంటే, మొదటిదీ; చివరదీ యిట్టే లభ్యమౌతాయి అనాలి. కాని అతనికేం కావాలో అతనికి తెలీక, ఇప్పుడతనికి ఏమీ అక్కర్లేదు!

ప్రేమా!

నీరసించిన నరాలు, కాలే నుదురూ, ఎండిన నాలుకా... దానికోసం దగాలు, స్నేహాలు? మనస్సులు కలబోసుకోటం; గుండెలు విడిపోటం, కుట్రలు, నాటకాలు.

మబ్బు మేఘాలు, కెరటాల తుంపర, పువ్వు వికసించటం, సంధ్య మంచులో నదీ, మేక అరుపు; పిల్లల ఆట, కుక్క విశ్వాసం; పిల్లల కేకలు, వేసంగి వాన; మొక్క మొలిచిన వయ్యారం, ఎండిన ఆకు వైరాగ్యం; దాహమేస్తే మంచినీళ్ళు త్రాగడం, – ప్రియురాలి లేతపెదవులు – అదా ప్రేమ!

ధనమా!

భవనాలు, కార్లు, బాంక్ పుస్తకాలు, రెండు కళ్ళమధ్య పరాయి స్త్రీ రొమ్ముల బరువు, వేడిశ్వాస మధ్య వుక్కిరిబిక్కిరి కావడం, అందరి మీద అధికారం, తనకి తనే దాస్యం, నలుగురు యువకులు నాలుగు కుక్కలు; పారేసిన విస్తళ్ళ కోసం తన్నుకులాడుతుంటే, కారులో కళ్ళు మూసుకుని కూర్చోడం – తన జాగిలాన్ని వాళ్ళ మీదకి ఉసికొల్పడం – అదా ధనం!

కీర్తా!

ఏమో, ఉపన్యాస వేదికల మీద మహానుభావుడు – వంటింట్లో మృగం, గ్రంథాలలో గొప్పవాడు, పడగ్గదిలో జంతువు, రోడ్డుమీద ప్రజాసేవకుడు, ఇంట్లో సర్వాధికారి; పదిమందిలోనూ మహాపురుషుడు ఏకాంతంగా దౌర్భాగ్యుడు.

అతను జయించిన పరదేశాలన్నీ మహా రాజ్యాలయ్యాయి, అతని స్వదేశం శ్మశానమైనది. అతన్ని ప్రేమించిన స్త్రీలందరూ రాణులయ్యారు; అతను

ప్రేమించింది అడుక్కు తింటోంది. గడ్డిపోచ బంగారు కణికయింది; పిచ్చి పుష్పం మణి, మట్టి వెన్నెలయింది; కణికలు, మణులు, వజ్రాలు, వెన్నెలమంట కలిశాయి. శరీరాన్ని ఎందరెందరో పంచుకున్నారు; కీర్తిని కాజేశారు. ప్రేమని విషం పోసి హత్యచేశారు. సౌందర్యం జుట్టు విప్పుకుని యవ్వనాన్ని కౌగిలించుకుని యేడ్చింది. శాంతం అహానికేసి తల పగలగొట్టుకుంది. దయని పగ పొడిచింది. మతాన్ని విజ్ఞానశాస్త్రం పూడ్చేసింది. దైవాన్ని దేవాలయంలో బంధించారు. మంచితనం సింహాసనమెక్కి ప్రాణం విడిచింది. మోహం నాగరికత నడుంని సాగేసింది. నాగరికత రోజూ కార్లకిందా, రైళ్ళకిందా, విమానాలలోంచి దూకుతూ ఆత్మహత్య చేసుకుంటోంది. "మనం" ముక్కలై "నువ్వు" "నేనూ" అయి ఉత్తర దక్షిణాలకి ప్రయాణం చేసింది. వారూ, వీరూ ఎవరో కొందరు. వాకరు, మీరూ, ఎందరు? – ఏమో? "అందరూ" మాత్రంలేరు.

అన్నీ ప్రశ్నలే – సమాధానం లేదు.

ఎందుకు, ఎక్కడ, ఎప్పుడు, ఎట్లా, అందుకా? ఎవరు? ఏది? ఏరి? ఎన్ని?

ఇందుకు, ఇక్కడ, ఇప్పుడు, ఇట్లా, ఇందుకు, వీరు, ఇది, ఇదిగో ఇన్ని – లేవు చుట్టూ నవ్వులు, మధ్యలో ఏడ్పు, అంతటా ఆనందం లోపల కేంద్రంలో బాధ; అంతటా వెలుగు మధ్య చీకటి, పైనా కిందా, ఎడమా కుడీ, దైవం, మధ్య మృగం, అన్నీపోయాయి; అంతా అయింది; చివరికి మిగిలింది తను.

సంఘాన్ని మార్చలేడు? మనుషుల్ని మార్చలేడు. మారిస్తే బాధ? పగ? యుద్ధం. తనతో తను సమాధాన పడాలి. అది ఈనాటికి సాధించాడు. ఒక ప్రశాంతత, పవిత్రమైన మహత్తర ఆనందం అతనిలో ఉద్భవించింది. అది బాహ్యప్రపంచంలో లేదు. మంటని చల్లార్చే మంచు కణాల ప్రవాహం అతని హృదయం. పిచ్చి ప్రపంచాన్ని దయతో దూరంగా వుంచే ఔదార్యం. మతాన్ని, దైవాన్ని, మనుషుల్ని తోసేసి సంతృప్తి చెందే ఆధ్యాత్మిక దృష్టి తనలో కడసారి యదార్థం.

తన్ను తాను పరిపూర్ణంగా చూశాడు. ఎంత చిత్రం! ఎంత దగా! ఎంత భ్రమ! తనలో తాను సమాధానపడి. తన్ను స్వీకరించి, కౌగిలించుకుని ఏకమయ్యాడు. ఇప్పుడు ప్రపంచాన్ని అంగీకరించొచ్చు. తన్ను తను తృణీకరించినవాడు ప్రపంచాన్ని అంగీకరించలేడు. ప్రపంచం ముందుకు కదిలిపోతోంది. అనంత సృష్టి అన్ని గోళాలు కదిలిపోతున్నాయి. సూర్యుడు వెనక్కి వెళ్ళిపోతాడు. చంద్రుడు చుక్కవుతాడు. సర్వ సముద్రాలూ గడ్డ కడతాయి. పుష్పాలు ముడుచు కుంటాయి. ప్రాణులు చచ్చిపోతాయి. భూగోళం మంచు ఎడారయి అనంతంలో అర్థశూన్యంగా తిరుగాడుతుంది. మానవుడి స్వప్నాలు, ఆశలు, వాంఛలు విషాదగీతాలు, విజయరోదన అన్నీ – అన్నీ, హరించిపోతాయి, సర్వనాశనమవుతుంది.

ఈ జీవితాని కర్థం ఎందుకుండాలో! అర్థం లేదనే తలంపులో నిరుత్సాహం, బాధలేవు. కొత్తబలం, వికాసం, దృఢనిశ్చయం వుంటాయి. పునాదులు తవ్వాలి; భవనాలు లేవనెత్తాలి. సెలయేళ్ళు మహా నదులు కావాలి. విత్తనాలు చల్లాలి మహారణ్యాలు సృష్టించాలి. మానవుడిః కావల్సింది మతాలు, దేవుళ్ళు, మొక్కుబళ్ళు, రాజకీయాలు కావు: మానవుడికి కావల్సింది దయ – కొంచం, కాస్త ఐనా చాలు.

తూర్పు ఆకాశం నిద్రమత్తులో కన్నుతెరిచి ఆవులించింది. రెప్ప పైకి లేచిన తెల్ల వెలుగు ఆకాశంలో నాలుక చాచి పాకుతోంది. నక్షత్రాలని దగ్గర తీసుకుని తనలో కలుపుకుంటోంది, వెలుగు.

కోమలి మరో నక్షత్రమై మెదులుతోంది. కోమలితో, ఎక్కడో మరో క్రొత్త జీవితం ప్రారంభించాలి. ఉదయభానుడు కిరణంతో చక్కలిగింతలు పెడితేనే లేచి నవ్వే పెళ్ళికూతురు కోమలి. సృష్టంతా మేలుకొల్పులు పాడితేనే లేచే కోమలి, ప్రపంచంలోని ప్రేమంతా తనే దాచేసుకుని, అమాయకంగా పడుకున్న కోమలి.

అనాడు. గోదావరీ తీరాన జగన్నాథంతో పడవప్రయాణం; వర్షం వెలిశాక కాత్యాయనితో కొండల మధ్య నాట్యం చేసిన సంధ్యా కాంత – అర్ధరాత్రి అమృతం శరీరంలో ఎర్రటి శక్తి, కదిలి కార్చివేసిన మత్తు సౌందర్యం; పంజరంలో చిలక, గిరవాకొట్టిన పంజరం – పెళ్ళి సరదాలు – స్వామీజీతో తర్కం. ఇంకా ఇంకా వెనక్కి, నాగమణితో బండిలో – చెరువు గట్టున పొలాల్లో తడిసిన బట్టలతో పరుగులెత్తిన కోమలి – పడవలో తలమీద కొంగు కప్పుకుని అమృతం – ఇందిర వేలికి తగిల్చిన ఉంగరం – ఇంకా ఇంకా వెనక్కి, తలుపు సందుల పరంపరలు – టౌన్‌హాలు – శ్మశానంలో అమ్మ – మొదటికి – కాలవగట్టున యిప్పటిలా ఏకాంతంగా గడ్డిలో పడుకొని అతను వేసుకొన్న ప్రశ్న "జీవితానికి అర్థం ఏమిటి?" ఈనాడూ అదే ప్రశ్న.

చివరికి మిగిలింది. దాని సమాధానం కాదు; సమాధానం తెల్సుకునేటందుకు తను చేసిన యత్నాల జ్ఞాపకాలు – తనతో తాను సమాధానం పడటం – అది మిగిలింది.

-: అయిపోయింది :-

★ ★ ★